# ఆంధ్రమహిళ



దీపావళి సంచిక

**DEEPAVALI**




శ్రీ లక్షులమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూటు ప్రారంభోత్సవమున
ప్రధాని రామస్వామి రెడ్డియార్ గారు







గాంధీజయంత్యుత్సవసందర్భములో సభ విద్యార్థినుల
ఝండావందనము

# జూపిటర్ వారి

## దీపావళి కానుక

# మోహిని

## (కీలు గుర్రం)

రసవత్తరమైన కథావస్తువు..........
అడుగడుగున హాస్య సంఘటనలు...
మాయా గుర్రపు చిత్ర విచిత్రములతో
అలరారే మహత్తర చిత్రం..........

**వి.యన్.జానకి. మాధురి దేవి**
**బాలయ్య**








పూర్ణా రిలీస్

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్, మచిలీపట్నం

(స్థాపితము—1925)

జీవిత భీమాతోపాటు—అగ్ని ప్రమాదము, మోటారు, నౌకా మొదలైన
ఇతర భీమాలకుకూడ, మంచి ఆకర్షణీయములైన ఏర్పాట్లుగలవు.

1947 లో పూర్తి చేసిన జీవిత భీమా వ్యాపారము 1½ కోట్లు. ఆస్థులు ఒక కోటికి మించినవి. 1947 వాల్యుయేషన్ బోనసు సాలుకు 1000కి రు. 8 లు. ఏజంట్లకును పట్టాదార్లకును చాలా సౌకర్యములుగలవు. వివరములకు మాకుగాని, మా ఇతర ఆఫీసులకుగాని వ్రాసిన బడయగలరు.

—: మా ఆఫీసులు :—

ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు, జంషెడ్‌పూర్, శికింద్రాబాద్, అనంతపూర్, ఎర్నాకులం (కొచ్చిన్), బెల్‌గాం, బెంగుళూరు, బర్హాంపూర్ (ఒరిస్సా), బెజవాడ, గుంటూరు.

ధూర్జటి సుబ్రహ్మణ్యం
ఎం. ఏ., ఎ. ఐ. ఎ., యఫ్. యస్. యస్.
కార్యదర్శి.

## 'విక్టరు తైలము'

(తామర నాశని)




తామర, తీట, పొడలు మూడు పూతలతో కుదిరి చర్మము శుభ్రపడును. చాల ప్రశస్తముగా పనిచేయును. మంటపెట్టదు. అనేక వేలు విక్రయము

డబ్బి 1కి 0-8-0. 9 డబ్బీలవరకు పోస్టేజి పాకింగు 0-12-0

విక్టోరియా డిపో, నార్తు మాడవీధి,
మైలాపూరు, మద్రాసు 4.

## శుభవార్త

ఔషధములు, ఆపరేషనులు, ఇంజక్షనులతో నిమిత్తము లేకుండా సమస్త వ్యాధులు నివారణ గావింపబడును. వివరములు కోరువారు రు. 0-8-0 పోస్టు బిళ్లలు పంపిన ఆశ్రమ నివేదిక పంపబడును.

శ్రీ యోగాశ్రమము,
మునులతోట
(వయా) రేపల్లె,
గుంటూరు జిల్లా.


MY AMRUTANJAN
నాది
నాది
నాది
నాది
నాది
నాది
There are Millions of "MY'S" in that MY,
Applied to the 46 year old "Pocket Doctor" of INDIA.

# ఇండో కమర్షియల్ బ్యాంకు లిమిటెడ్.

| | | |
|---|---|---|
| అనుమతి పొందిన మూలధనము | .... | రు. 25,00,000 |
| జారీచేసి, చందా వేయబడిన మూలధనము | .... | రు. 21,25,000 |
| చెల్లించబడిన మూలధనము | .... | రు. 18,75,000 |
| రిజర్వు ఫండు | .... | రు. 10,00,000 |

మద్రాసులోని ఆఫీసులు :

నేతాజీ సుభాసు చంద్రబోసు రోడ్ : త్యాగరాయనగర్ : మైలాపూర్ :
పెరియమెట్ : ట్రిప్లికేన్ :

బ్రాంచీలు :

| | | |
|---|---|---|
| అంబాసముద్రము. | మాయవరము. | తెంకాశి. |
| అంబూర్. | మధుర. | తిరునల్వేలి పట్టణము. |
| అనకాపల్లి. | మారుటేరు. | తిరునల్వేలి జంక్షన్. |
| చిదంబరము. | నాగపట్టణము. | తిరుచిరాపల్లి. |
| చిత్తూరు (కొచ్చిన్). | పాల్ఘాట్. | తూతుకుడి. |
| కడలూర్. O. T. | పరమకుడి. | వేదారణ్యం. |
| కడలూర్. N. T. | పుదుక్కోట. | వెల్లూరు. |
| ఈరోడ్. | రామనాడ్. | విజయపురము. |
| కాంచీపురము. | షియాలీ. | విల్లుపురము. |
| కారైకుడి. | తాడేపల్లిగూడెం. | విరుదునగర్. |
| కుంభకోణము. | తంజావూరు. | విజయనగరము. |

నిర్ణీత డిపాజిట్లు

ఒక సంవత్సరమునకు ... సాలుకు $2\frac{3}{4}$%- చొప్పున.
రెండు సంవత్సరములకు ... సాలుకు 3%- చొప్పున వడ్డీమీద తీసుకొనబడును.

సేవింగ్సు బ్యాంకు డిపాజిట్లు :

రు. 5/-లు మొదలు రు. 5/-లకు సరియగు గుణిత సంఖ్యగల మొత్తము రు. 10,000/-లవరకు యుండు రోజు వారి నిల్వలమీద సాలుకు $2\frac{1}{2}$% వడ్డీ యివ్వబడును.—వారములో రు. 250/-లు మించని మొత్తము చెక్కు ద్వారా తీసుకొన వచ్చును.

నెలసరి డిపాజిట్లు :

నెల 1కి రు. 1/- గాని దానికి సరియగు గుణితసంఖ్యగల మొత్తముగాని, 47 మాసములకు లేక 90 మాసములకు తీసుకొనబడును.

క్యాష్ సర్టిఫికెట్లు :

3 సంవత్సరములకు, 5 సంవత్సరములకు క్యాష్సర్టిఫికెట్లు యివ్వబడును.

అప్పులు - ఎడ్వాన్సులు :

బంగారము, గవర్నమెంటు ఋణపత్రములు, పప్పుదల పొందిన వాటాలు, మరియు వాణిజ్య వస్తువుల హామీ మీద యివ్వబడును.

యస్. యన్. యన్. శంకరలింగ అయ్యర్,
మేనేజింగు డైరెక్టరు.

## శ్రీ లక్షలమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్

### ఆంధ్రమహిళాసభ

ఇంగ్లీషు టైపురైటింగునందును, షార్టుహేండునందును స్త్రీలకు తర్ఫీదు నిచ్చుటకు ఆంధ్రమహిళాసభలో తరగతులు ప్రారంభింపబడుచున్నవి. ఈ తరగతులందు చేరగోరువారు రుసుము మొదలగు విషయములను తెలుసుకొనుటకు ఆఫీసు మేనేజరును ఏ రోజునైనను మధ్యాహ్నము 2 గంటలు మొదలు 5 గంటలలోగా చూడవచ్చును. బయట ఊళ్లవారు వివరములకు వ్రాసి తెలిసికొనవచ్చును.

లజ్ చర్చిరోడ్,
మైలాపూరు.

జి. జమునాబాయి
అ. చన్నఘంటమ్మ
కార్యదర్శినులు

# ఆంధ్రమహిళ

సంపుటి 5 :: నవంబరు '48 :: సంచిక 6

ముఖచిత్రం : స్వాతంత్ర్య జ్యోతి.



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

—: ప్రచురణ :—

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా   అయిదు రూపాయలు



రాష్ట్రపతి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు




సంపుటి 5 నవంబరు 1948

# రాష్ట్రపతి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

1948 వ సంవత్సరము అక్టోబరు 24 వ తేది, భారత దేశ చరిత్రలో పర్వ దినము. ముఖ్యముగా ఆంధ్రులకు చిరస్మరణీయమైన దినము. డాక్టరు భోగరాజు పట్టాభి సీతా రామయ్య గారు భారత దేశమందున్న రాష్ట్రకాంగ్రెసు సభ్యులచే కాంగ్రెసు మహాసభకు, అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి.

పట్టాభి సీతారామయ్యగారు, 1898 వ సంవత్సరమున కాంగ్రెసు పార్టీలో చేరిరి. అప్పుడు వారు పట్ట పరీక్షకు చదువుచుండిరి. ఆ నాటినుండి ఇప్పటివరకు వారు తదేక దీక్షతో కాంగ్రెసు పక్షముననేయుండి దేశసేవకై పాటుపడిరనిన అతిశయోక్తిలేదు.

పట్టాభి సీతారామయ్య గారు ఎన్నికలలో నిలబడుటకు ప్రత్యేక విశిష్టత కలదు. భారతదేశము స్వతంత్రమైన పిమ్మట, జాతి జనకుడు బాపూజీ మరణించిన పిమ్మట, కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక జరుగుట ఇదే మొదటిసారి. బాపూజీగారి ప్రియముఖ్యులలో పట్టాభి సీతారామయ్య గారు ఒకరు. పైగా ఈ సారి సంస్థానములలోని కాంగ్రెసు సంఘములు కూడ ఎన్నికలలో పాల్గొన్నవి. పట్టాభిగారు, ఇన్ని దినములు సంస్థాన ప్రజామండలి అధ్యక్షుడుగా ఉండుటచేత, వారు ఈ స్థానమును అలంకరించుటకు అర్హులనుటలో సందేహ మేమియు లేదు. ఆంధ్రులు ప్రత్యేకముగా గర్వించవలసిన విషయము ఏమిటనగా ఇరవై సంవత్సరముల అనంతరము తిరిగి ఆంధ్రునకు కాంగ్రెసు అధ్యక్షత లభించినది. ఇదే ఆంధ్రులు ప్రత్యేకముగ గర్వించవలసిన విషయము.

గత సంవత్సరము మహాత్మాగాంధి, కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక విషయము గురించి ప్రసంగించుచు తన దృష్టిలో కృపాలనీగారున్ను, పట్టాభి సీతారామయ్య గారున్ను ఉన్నా

రనియు, కాని వారిద్దరిలో అప్పటి పరిస్థితులనుబట్టి కృపాలనీగారే అధ్యక్షుడుగ ఉండుట తన కోరికయనియు సూచించిరి. ఈ సంవత్సరము కృపాలనీగారు పోటీనుండి విరమించుకొనుటచేత గాంధిగారి కోరిక ప్రకారము పట్టాభిగారే, ఆ పదవిని స్వీకరించవలసి ఉండినది. అందుచేత ఈ పదవికి తీవ్రముగ పోటీజరుగుట విచారకరమైన విషయమే, కాని పట్టాభిగారు గెలుపొందుటచేత అలోటు తుడిచి వేయబడినది.

అధ్యక్షుడు కాగానే పట్టాభిగారు తమ అభిప్రాయమును ఈ విధముగ సూచించిరి. “పోటీ లేకుండ రావడం మనోవర్తి. పోటీలో రావడం సంపాదన. పోటీలేకవచ్చుట దొడ్డి గుమ్మం ద్వారా ప్రవేశిస్తూన్నట్లున్నది కాని సింహద్వార ప్రవేశమువలె కనిపించదు.”

ప్రస్తుతము దేశములో, కాంగ్రెసు పక్షము వారిపై ప్రజలకు దురభిప్రాయము, అసమ్మతి ప్రబలుచున్నది. దీనికంతకును తక్కిన పక్షములవారు చేయుచున్న దుష్ప్రచారమే కారణము. ఇటువంటి పరిస్థితులను, ఎదుర్కొని, కాంగ్రెసు పేరును చిరస్థాయిగా నిలుపుట అత్యవసరము. అట్టి పనిచేయుటకు పట్టాభిగారికంటె సమర్థులెవ్వరు లేరు. ఇది వారు చేయవలసిన ముఖ్యకార్యము. భగవంతుడు వారికి దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించి వారి కార్యక్రమమును నిర్విఘ్నముగా జరుగునట్లు చేయవలెనని కోరుచున్నాము.





ది 2-10-'48 న, ఆలిండియా రేడియో మహిళా మండలి
ప్రోగ్రాములో పాల్గొన్న ఆంధ్ర మహిళా సభ విద్యార్థినులు, సభ్యురాండ్రు.
(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# శ్రీ లక్ష్మలమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూటు

## ఆంధ్ర మహిళా సభ

ది. 15-10-'48 శుక్రవారము సాయంకాలము గం 5-30లకు గౌరవనీయులు శ్రీ ప్రధాని రామస్వామి రెడ్డియార్ గారు ప్రారంభించారు. శ్రీ వేపా రామేశం పంతులుగారు అధ్యక్షత వహించారు.

సభ విద్యార్థినుల 'తెలుగు తల్లి' ప్రార్థనతో సభ ప్రారంభమైనది. శ్రీ దుర్గాబాయిగారు, వివిధశాఖల దైనిక కార్యక్రమమునుగూర్చి ప్రధానిగారికి పరిచయ వాక్యములు చెప్తూ, జాతి, మత, భాషా వివక్షతలేని స్త్రీ జనోద్ధరణమే, యీ సంస్థ యొక్క ఆశయమని నొక్కి చెప్పి, శ్రీ లక్షులమ్మ గారి దాన పటిమవల్ల, స్త్రీల టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ ప్రారంభింప నవకాశము కలిగినదని వారికి ధన్యవాదాలర్పించారు.

తదుపరి అధ్యక్షులు, శ్రీ రామేశంపంతులుగారు శ్రీ లక్షులమ్మ గారిని అభినందిస్తూ, సమాజము వృద్ధి నొందాలంటే ఇట్టి దాన పటిమ గల వారెంతయు అవుసరమని చెప్పినారు.

అటు పైన ప్రధాని రామస్వామి రెడ్డి గారు, తెలుగులో ప్రసంగిస్తూ, స్త్రీ జనాభ్యుదయమునకు శ్రీ దుర్గాబాయి గారు చేస్తున్న సేవను మిక్కిలి ప్రశంసించి, ఇచ్ఛా శక్తి, జ్ఞాన శక్తి, క్రియా శక్తి గల్గి, ప్రేమ శాంతి స్వరూపులైన స్త్రీలే యిట్టి సేవా కార్యక్రమమున కెంతయు తగియున్నారని, ధనాభావముచే ప్రభుత్వము చేయనేరకున్న విద్యావ్యాప్తి, యిట్టి సంస్థలు పూనుకొన్న గాని, సరిగా నెరవేరదని, రాయల నాటి తెలుగుసీమ ఔన్నత్యము తిరిగి లంభించాలంటే, ప్రేమ పూరిత మానసములతో గావించు సేవయే కారణము కాగలదనియు చెప్పుచూ, శ్రావ్య మధుర ఆంధ్రభాషలో త్యాగరాజు రచించిన కీర్తనలను ఆంధ్రులు విస్మరిస్తూ, హిందూస్తానీ ఫక్కి లవలంబించుట శోచనీయము గనుక, ఆంధ్రులందరు శాస్త్రీయమైన కర్ణాటక గానము నభివృద్ధిజేయుట అత్యవుసరమని హెచ్చరించినారు. తదనంతరము శ్రీ దుర్గాబాయిగారు, సంస్థ యింతవరకూ ప్రభుత్వపు సహాయ మిసుమంతయు కోరక, స్వయంకృషి వలననే నిర్మింపబడ్డదనియు, ఇకమీద సభ్యురాండ్రందరూ మిక్కిలి కుతూహలముతో విరాళములిచ్చి నిర్మించ సిద్ధముగానున్న, స్త్రీ, శిశు, రోగి సంరక్షణశాలలకు, కలసిన స్థలమును ప్రభుత్వము సంస్థకు ఉచితముగా నిచ్చు నేర్పాటులు చేయ వలసినదనియూ, ప్రధానిగారిని కోరుతూ, తెలుగుభాషలో చక్కగా ఉపన్యసించిన వారికి, అధ్యక్షత వహించిన శ్రీ రామేశం గారికి, ధన్యవాదాలు సమర్పించిరి.



శ్రీమతి లక్షులమ్మగారు

సభా విద్యార్థినుల నాట్య గాన, ప్రదర్శనములతో నాటి సభ ముగిసినది.



"భావిభారత జాతి నిర్మాణము మీ హస్తగతమైయున్నది."

## శ్రీ పర్లాకిమిడి మహారాజాగారి హెచ్చరిక

ది. 29-9-58 న శ్రీ పర్లాకిమిడి మహారాజాగారు మా సేవా సంస్థను చూడవచ్చిరి. ఇక్కడ జరుగుచున్న కార్యక్రమమున కాయన మిక్కిలి సంతసమును వెల్లడిస్తూ యీ విధముగా ప్రసంగించిరి: "ఇంతమంది ఆంధ్ర సోదరీమణులు ఈ రీతి సేవజేయుట ప్రశంసనీయ విషయము. విద్యాప్రదాన మన్నింటిలోనూ ఉత్కృష్టమైన సేవ. విద్యలేని నరుడు జంతువుతో సమానము. విద్యాధికులై, దేశము నుద్ధరించవలసిన బాధ్యత మీపై నున్నది. జాతి ఔన్నత్యము విద్యావంతులైన గృహిణులపై నున్నది. శక్త్యానుసారముగా ధన కాలములను దుర్వ్యయపరుచక, నేనింత మాత్రము సేవ జేయగలుగుట, మా తల్లి నా చిన్ననాట నా కొసగిన శిక్షణయే యని నొక్కి చెప్పగలను. కాన, మీరందఱు. మీ విద్యార్థిదశనుండిగూడ మీ యొక్క యపూర్వ బాధ్యతను గుర్తించుకుని, దేశాభ్యుదయమునకై వలసిన సేవాదీక్షాద్యాదర్శముల నలవరచుకొండి. కాలము వృధాపుచ్చకండి" యని విద్యార్థినులకు సలహానిస్తూ, సంస్థయందు వారికిగల అభిమాన సూచకంగా, వారి సతీమణి, కీ. శే. నలినీ పట్టమదేవి గారి స్మృతి చిహ్నంగా, సంస్థకొక పెద్ద మోటార్ వాన్ కొనుటకై వలసిన ధనమును విరాళముగా నిత్తునని సెలవిచ్చిరి.

# గాంధీజీ జయంతి

ది. 2-10-48న, లోక పూజ్యుడైన గాంధీజీ జయంత్యుత్సవము మధ్యాహ్నము 4 గంటలకు సూత్రయజ్ఞముతో ప్రారంభమైనది. రమారమి 50 మంది ఒక ఘంటకాలము నూలువడకిరి. తదనంతరము, జాతీయ ఝండా వందన చేయబడినది. అటుపైన, ఝండాను ఆవిష్కరించిన శ్రీమతి దుర్గాబాయి గారు యీ క్రింది విధముగ ఉపన్యసించిరి. "వీరపూజ హిందూసాంప్రదాయ సిద్ధమైనది. వీరపూజ లేని జాతి నసిస్తుంది. అందువల్ల అలోక వీరుడైన బాపూజీ జయంతి జరుపుట మనకు భావ్యమైయున్నది. ఈ సమయంలో, తన జీవితాన్నే ఒక పెద్ద ప్రయోగశాలగా నొనరించి, శాంతి, సత్య, అహింసలనే సాధనాలతో అమూల్య ప్రయోగములు చేసి ఫలితములను ప్రపంచమున కందించిన పరమ వైజ్ఞానికుడు, శానిస భారతదేశమునకు, అంతర్జాతీయ ప్రాముఖ్యత తెచ్చి, అంధకారములోనున్న స్త్రీ జాతికి జ్ఞాన నేత్రాలు ప్రసాదించిన మహానుభావుడు, ఐన మన బాపూజీకి మన దేశస్థులమూ, అందు ముఖ్యంగా స్త్రీలము ఎక్కువ కృతజ్ఞత చూపాలి." ఉపన్యాసానంతరము సభ విద్యార్థినుల గాంధీజీ బుఱ్ఱకథా కాలక్షేపముతో సభ ముగిసినది.



గాంధీ జయంత్యుత్సవమునాడు సభలో సూత్రయజ్ఞము.



# పూజ్య బాపూజీ

శ్రీ గుమ్మిడిదల దుర్గాబాయిగారు ఎమ్.ఏ., బి.యల్.

బాపూవిశిష్టతా, గొప్పతనం పూర్తిగాఅవగాహన చేసుకోగలగటం ఇంకోబాపు మాత్రమే చేయగలరు గాని నావంటి సామాన్యులకు మీరిన పని. నీళ్ళూ, గాలీ, వెల్తురూ మనకు అయాచితంగా లభించినట్లే మనకు అర్హతఉన్నా లేకపోయినా, దుఃఖమయమూ చీకటిమయమూ అయిన జీవితం ఆనందమయం చేయటానికి ఏ పూర్వ పుణ్యం వల్లనో, ఏ పెద్దల తపశ్శక్తి వల్లనో గాంధీజీ మనకు లభించి 70 ఏండ్లు ఈ భూమిని పుణ్య భూమిగా మార్చి తన అమర జీవితంవల్లనూ, సందేశంవల్లనూ, సామాన్య మట్టి నుంచి మానవులనూ దేవతాతుల్యులనూ సృష్టించాడు.

స్వార్థపరులను స్వార్థత్యాగులుగానూ భోగులను యోగులుగానూ, ధనవంతులను ఐచ్ఛిక దారిద్ర్యకాములుగానూ మార్చిన పరసు వేది గాంధీ. యీ మార్పు గంభీరోపన్యాసముల వల్లనూ రాజ్యాధికారమువల్లనూ సాధించినది కాదు. అతని రాజ్యము భౌతికముగాదు. యావత్ప్రపంచహృదయ సామ్రాజ్యము ఆయన దేశము. ఆచరించ గలుగుగాక, ఆచరించ లేక పోవుగాక ఆయన సందేశమునకు చలించని హృదయము లేదు, ఉండబోదు అని నా నమ్మకం.

మనకు స్వాతంత్ర్యం సంపాదించినది కాదు. గాంధీ జీవితసాధన. పశు ప్రాయుడై మానవుడు తోటి మానవుని సోదరుడన్న విషయం మరచి, ఆఖరుకు జంతువులమాదిరి ఆహారం కొరకైనా కాక కేవలం పైశాచికావేశంలో మానవులు తోటి మానవులపైన జరుపుతున్న హత్యాకాండను ఆపటానికి చేసినకృషి, ఆయన సాధించిన ఫలమూ గాంధీ జీవితపు సాఫల్యం. తన జీవితాస్తమయమునకు ముందు కలకత్తాలోనూ, తన జీవితముతో ఢిల్లీలోనూ ఆయన సాధించిన హిందూముస్లిం ఐక్యత ఆచంద్రతారార్కముగా గాంధీజీ అహింసా విధానపు ఉత్కృష్టతకు నిదర్శనములుగా ఉంటవి.

నేడు హైదరాబాదులో మన ప్రభుత్వం ఇంత సునాయాసంగా విజయం సాధించిందంటే, అఖిల

భారతంలో హిందూ ముస్లిం సోదరు లందరూ మన ప్రభుత్వానికి వారు నెరవేర్చిన బాధ్యతా యుత కార్యక్రమంలో ప్రోత్సాహం యిచ్చే రంటే, దీనికి కారణం ఆయన ఢిల్లీలో, తన రక్త ముతోనూ ప్రాణములతోనూ వరదలుగా పారు తున్న హింసనూ అసహనమునూ అడ్డుకట్టటం వల్లనే.

దేనినిచూచి, ఇది ఇంతే అని సరి పుచ్చుకునే ప్రకృతిగాదు గాంధీది. దరిద్రంవుంది, బాధవుంది. యెందుకున్నాయి యివి? యివిపోవటంయేలాగు? యివి పోవటానికి నేను చేయవలసిన దేమిటి? జన సామాన్యాని కందరికీ లేని సదుపాయాలు తనకు వద్దు అని ఐచ్ఛికంగా అన్ని సదుపాయాలూ వదలుకొన్న సత్యప్రియుడు, సత్యాన్వేషి గాంధీ. కోట్లకొద్ది జనంకట్ట గలిగే బట్టే తానూ కట్టేడు. వారు తినగలిగిన ఆహారమే తానూ తిన్నాడు. వారు వుండ గలిగిన యింట్లోనే తనవాసం. ఏ విషయం పైన అయినా, యిది ఏ మిటి అని ప్రశ్నించినపుడు ఆ ప్రశ్నకు సహేతుకమైన సమాధాన ప్రకారం వెంటనే తన జీవితాన్ని మార్చుకో గలిగిన ధైర్యం గాంధీది. నిర్భయ ముగా ఉండే మానవుడు ఎవడేనావుంటే అతడే గాంధీ. తన్ను చూచి ఎవరూ భయపడని మనిషి ఎవరైనాఉంటే అతడే గాంధీ. ఆయనకు తోచిం దేదో వెర్రనీ, అప్రస్తుతం అనిన్నీ ఆచరణ యోగ్యం కాదనీ లోకం అంతా ఘోషచేయనీ గాక, సహేతుకం అని ఆయనకు తోచి నంత వరకూ యేటికి ఎదురీది ఒంటరిగానైనా తనసత్యా న్వేషణను వదలని పట్టుదల గాంధీది. అఖండ విజయం పొందిన ముహూర్తములోనే తనతప్పు తనకుగాతానే ఒప్పుకొనే, వైజ్ఞానికుడూ, సత్య ప్రియుడూనూ గాంధీ.

ఈ కర్మయోగి యిచ్చిన సత్య శాంతి సం దేశము కేవలం భారతదేశ శాంతిస్థాపనకే కాద సర్వప్రపంచశాంతికి ఒకనాడు ఆచరణ యోగ్య మగునని చెప్పక తప్పదు.

ప్రపంచంలో నేడు కాన వచ్చుచున్న వి పూరితమగు మారణ జ్వాలలను చల్లా మానవ ఉత్కృష్టత, జీవితసౌఖ్యము చాటగలి నది ఒక గాంధీ త్రోవే కాని వేరొకటి కాద నేడుప్రపంచము కూడ గుర్తించుచున్నది.

Einsten మహాశయుడు అన్నట్లు కలికాలప ప్రజలలో గాంధీలాటి మనిషి రక్త మాంసాది లతో కూడిన మనిషి యెవరైనా నడిచేడా, లే యీాయనను గురించి మనం వినేవన్నీ కట్టుకథల అనివిస్తు పోతారు, మనముందు తరములవారు.

(ఆలిండియా రేడియో మదరాసు కేంద్రము నుండి ది 2-10-48 ని. ప్రసారము చేయబడినది.)



విద్యార్థినుల బుల్లి కథ.



# ఆంధ్ర మహిళాసభలో
# దసరా ఉత్సవాలు

అనుకున్న ప్రకారము, దసరా ఉత్సవాలు, విజయవంతంగా జరిగిపోయాయి. సభ్యురాండ్రు, విద్యార్థినులుకూడ మిక్కిలి యుత్సాహముతోనూ, ఉల్లాసముతోనూ, నాల్గు దినములూ బొమ్మల కొలువు పేరంటములలోనూ, ఆటల, పాటల పోటీలలోనూ, నృత్యనాటక ప్రదర్శనములలోనూ పాల్గొని, కార్యక్రమమును ఆద్యంతమూ మిక్కిలి జయప్రదంగా జరిపించారు. హృదయ పూర్వకంగా యీ కార్యనిర్వహణలో తోడ్పడిన ఎల్లరకూ, మహిళాసభ కార్య నిర్వాహక వర్గము, కృతజ్ఞత తెలియజేస్తూ ఉన్నారు. పోటీలలో నెగ్గిన వారిని అభినందిస్తున్నారు.

పరీక్షాధిపతులు

శ్రీమతి న్యాపతి కామేశ్వరమ్మగారు.
శ్రీమతి తెలికిచర్ల వసుంధరాదేవిగారు.
శ్రీమతి ఏరువ వెంకటేశ్వరమ్మగారు.
శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు.
శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు.

## తెలుగు వక్తృత్వపు పోటీలు :

ది. 9-10-48 శనివారము ఉదయము 9 ఘంటలకు దేవీ పూజతో కార్యక్రమము ప్రారంభమైనది. పూజానంతరము తెలుగు వక్తృత్వపు పోటీల శాఖా కార్యదర్శిని శ్రీ గిరిజ గారు జరిపించిరి. 10 మంది విద్యార్థినులు, సభ్యురాండ్రు యిందు పాల్గొనిరి. వీరిలో కుమారి గోపరాజు మైత్రి, కుమారి ఆర్. లక్ష్మీబాయి, శ్రీమతి సీతాదేవిగార్లు, వరుసగా ప్రథమ ద్వితీయ, తృతీయ బహుమానములను బొందిరి. ఫలితములను వెల్లడించిన తరువాత, పోటీలలో మాట్లాడిన "స్త్రీలకు పత్రికలు యే విధంగా ఉండాలి" అనే ఒక విషయమును గూర్చి, శ్రీ భావరాజు వెంకట కృష్ణారావుగారు చాలా వివరముగా ప్రసంగించుచూ, పాకకళ, గృహాలంకరణ, గృహ వైద్యము మొదలైన విషయములు స్త్రీల పత్రికలలో విరివిగా నుండాలనీ, ఆదర్శ పూరితములు, చైతన్య ప్రబోధితములగు గద్య, పద్య, వ్యాసములకు, వీరవనితలు తమ బిడ్డలకు చేసిన యుపదేశములకు, పెక్కులకు స్త్రీల పత్రికలలో స్థానమివ్వాలనీ, సలహా నిచ్చిరి.



కుమారి గోపరాజు మైత్రి

* * *

ది. 9-10-48 సాయంకాలము, సభ్యురాండ్రు, వారి పిల్లలు జేరి, నృత్యనాటకములను అద్భుతముగ ప్రదర్శించి సభాసదుల నానందింపజేసిరి. వీరిలో కుమారి గొల్లకోట శ్రీమణికి ప్రత్యేక బహుమాన మీయబడినది.



కుమారి గొల్లకోట శ్రీమణి

* * *

## ఆటల పోటీలు :

ది. 10-10-48 ఆదివారమున ఉదయమే దేవీ పూజానంతరము ఆటలలో పోటీలు శాఖా కార్యదర్శినియైన శ్రీమతి రంగనాయకమ్మగారు

జరిపించిరి. పెక్కుమంది సభ్యురాండ్రు, వారి పిల్లలు, విద్యార్థినులు యిందు అమితోత్సాహముతో పాల్గొనుటవల్ల, యీ పోటీలు పూర్వమునకన్న ఎక్కువ విజయవంతముగా జరిగాయని చెప్పవచ్చు.



శ్రీమతి అ. గిరిజగారు

సభ విద్యార్థినులు హీరాదళము, మోతీదళము అని రెండుగా విభజింపబడిరి. వారు సమిష్టిగా, ఐదు ఆటలలో పాల్గొనిరి. హీరాదళము మూడు ఆటలలో నెగ్గుటవలన, ఈ సంవత్సరము క్రొత్తగా స్థాపింపబడ్డ క్రీడాశాఖ షీల్డు, వారికి బహూకరింపబడినది. తరువాత, వీరిలో విజయముగాంచిన ఒక్కొక్కరికిగూడ, ప్రత్యేక బహుమతులీయబడినది.

సభ్యురాండ్రకై ఏర్పరుపబడ్డ కారమ్సులో, శ్రీమతి కె. అలమేలు గారు ప్రథమ బహుమానమును, కుమారి అన్నపూర్ణ రెండవ బహుమానమును బొందిరి. ఆబ్స్టికల్ రేసులో శ్రీమతి పి. లక్ష్మిగారు ప్రథమ బహుమానమును, దీపములు వెలిగించుటలో సీనియర్, జూనియర్ దళములకు వరుసగా శ్రీమతి కస్తూ కమలగారు, కుమారి ఆర్. లక్ష్మిబాయియు, పరిశీలన పరీక్షలో, సీనియర్ జూనియర్ దళములకు వరుసగా శ్రీ అ. గిరిజగారు, కుమారి టి. ప్రభావతియు బహుమతులు బడసిరి.

* * * *

## గానకళలో పోటీలు :

ది. 10-10-48 సాయంకాలము గాత్ర, వాయిద్య, లలితగానములలో ఉపాధ్యాయిని శ్రీమతి కె. సుబ్బలక్ష్మిగారు పోటీలు జరిపించిరి. రమారమి 25 మంది సభ్యురాండ్రు, విద్యార్థినులు ఈ పోటీలలో పాల్గొని, కార్యక్రమమును అత్యద్భుతముగా జరిపించిరి. రాగాలాపన, స్వరకల్పన కీర్తన గాత్రపాటలలో, కుమారి రుక్మిణి ప్రథమ బహుమానమును, శ్రీ అలిమేలు, భారతలు ద్వితీయ బహుమానమును, కుమారి లక్ష్మి తృతీయ బహుమానమును బొందిరి. వీణవాయిద్యములో కుమారి సీతాలక్ష్మి, శ్రీమతి సావిత్రి, కుమారి రాజ్యలక్ష్మి వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమానములను బడసిరి. లలిత గానములో కుమారి అనసూయ, కుమారి వసంత ప్రథమ, ద్వితీయ బహుమానములను బడసిరి.

**పరీక్షాధిపతులు**

శ్రీమతి రాజ్యలక్ష్మిగారు
శ్రీమతి కె. శారదాంబగారు.
శ్రీమతి మం. రంగనాయకమ్మగారు.
శ్రీమతి అ. అనసూయగారు.



కుమారి రుక్మిణి



కుమారి సీతాలక్ష్మి

* * *

# ఆంధ్ర మహిళాసభలో దసరా ఉత్సవాలు

## హిందీ వక్తృత్వపు పోటీలు :

ది. 11-10-48 సోమవారము ఉదయము ఎప్పటిరీతి దేవీపూజతో కార్యక్రమము ప్రారంభమైనది. విద్యార్థినులు, సభ్యురాండ్రుకలిసి మొత్తము 7గురు మాత్రమే హిందీ వక్తృత్వ పోటీలలో పాల్గొనిరి. సీనియరు శాఖలో శ్రీమతి మంత్రిప్రగడ కనకవల్లిగారు, కుమారి మైత్రి, ప్రథమ ద్వితీయ బహుమానములను, జూనియరు శాఖలో కుమారి టి. శారద ప్రథమ బహుమానమును బొందిరి. పోటీల యనంతరము, హిందీ వక్తృత్వపు పోటీల యొక్క యావశ్యకతను గూర్చి, శ్రీకృష్ణమూర్తి గారు ప్రసంగించిరి.

| పరీక్షాధిపతులు |
|---|
| శ్రీ కృష్ణమూర్తిగారు. |
| శ్రీ వసంతరావుగారు. |



కుమారి టి. శారద

* * *

## నాటక ప్రదర్శనములలో పోటీలు :

ది. 11-10-48. సాయంకాలము విద్యార్థినుల నాటక ప్రదర్శన పోటీలు ఎక్కువ చక్కగా జరిగినవి. అన్ని తరగతుల వారు జేరి, 6 నాటకములు, రెండు టాబులోలు ప్రదర్శించిరి. ఇందలి విశేషము నాటక రచనలోనూ, ప్రదర్శనములోనూగూడ వారి స్వయంకృషి అమితముగ గాన్పించుటయే. యేదో ఒక ఉత్తమాదర్శము ప్రతి నాటకముయొక్క విషయముగా నుండుటచే, మంచి నైతికమైన పునాది విద్యార్థులకి సంస్థలో కలుగుచున్నదని నిర్వాహకులు సంతసింపక మానరు.

| పరీక్షాధిపతులు |
|---|
| శ్రీ టి వి. సుబ్బారావుగారు. |
| శ్రీ న్యా. రాఘవరావుగారు. |
| శ్రీ గో. సూర్యనారాయణగారు. |

నాటకము మొత్తముమీద జూనియర్ విద్యార్థినుల 'వరదక్షిణ' ప్రదర్శనకు ప్రథమ బహుమానముగా నాట్యశాఖకై ఈ సంవత్సర మేర్పరచిన షీల్డును, పారిశ్రామిక విద్యార్థినుల 'మార్పు' ప్రదర్శనమునకు రెండవ బహుమానము యీయబడినవి. ఇంగ్లీషు, హిందీ, సీనియర్, జూనియర్, సబుజూనియర్, పారిశ్రామిక విద్యార్థినులచే ప్రదర్శింపబడ్డ, వేర్వేరు నాటకములలో, నటనాకౌశలమునకై ప్రత్యేక బహుమానములు వరుసగా, సుధ, కృష్ణకుమారి, శారద, అన్నపూర్ణ, ఇందిర, జయలక్ష్ములకు యీయబడినవి.



శ్రీమతి లక్ష్మి

* * *

## నూలు పోటీలు :

ది. 12-10-'48 విజయదశమి, మంగళవారము ఉదయము దేవీపూజ యనంతరము సభ్యురాండ్రు, విద్యార్థినులు జేరి మొత్తము 20 మంది నూలు పోటీలలో పాల్గొనిరి. ½ ఘంట కాలము పోటీ జరిగినది. వీరిలో

| పరీక్షాధిపతులు |
|---|
| శ్రీమతి బె. కృష్ణవేణమ్మగారు. |
| శ్రీమతి సుగుణమణిగారు. |
| శ్రీమతి అ. చన్నఘంటమ్మగారు. |



# రాజకీయాలు

ఈ మాసంలో లండన్‌నందు జరుగుతూన్న డొమినియన్ ప్రధానుల సమావేశమునకు స్వతంత్రదేశ ప్రధానిగా నెహ్రూవెళ్ళాడు. భారత దేశం కామన్వెల్తులోనుండి విడిపోతుందా లేదా? అనే విషయమై అందరు ఊహాగానం చేస్తున్నారు. ప్రస్తుత ప్రపంచ వ్యవస్థలో రెండు పెద్ద విభిన్న కూటాల మధ్య మన దేశము వహిస్తోన్న ప్రాముఖ్యతను అందరూ గుర్తించారు. బ్రిటను అమెరికాలు రెండూ, మనను ఎట్లైనా కామన్వెల్తులో ఉంచే విధానాలు ఆలోచిస్తున్నవి. నెహ్రూకు యింగ్లండులో యివ్వబడే విందులలో, ఆహ్వానాలలో, స్వాగతాలలో ప్రతిబింబిస్తున్న అంతరార్థం యిదే. ప్రతి బ్రిటిష్ రాజకీయజ్ఞుడికి పట్టుకున్న జిజ్ఞాస యిదే.

* * *

కాని నెహ్రూ, భారత దేశం "సర్వ స్వతంత్ర ప్రజా స్వామ్యరాజ్యము"గా ఏర్పడుతుందని, కామన్వెల్తు రాజ్యాలతో తనకుండ వలసిన భావి సంబంధములు రాజ్యాంగ పరిషత్తు ద్వారా నిర్ణయించుకుంటుందని, స్పష్ట పరిచాడు. భారతదేశము తరఫున తానేమీ వాగ్దానము చేయనని, చేయలేనని కూడా అన్నాడు.

* * *

కొంతమంది యింగ్లండులోని రాజకీయవేత్తలు వెస్టుమినిష్టర్ చట్టంలో మార్పులు తెచ్చి, సార్వభౌమునితో సంబంధమక్కర లేకయే "రిపబ్లిక్ యిండియా"కు స్థానం కలుగచేదామని, "బ్రిటిష్ కామన్వెల్తు"అనే పదంనుండి "బ్రిటిష్"అనే మాట తొలగిద్దామనీ, సూచిస్తున్నారు. యీ ప్రయత్నాలలో మాజీ వైస్రాయి, రాజీచేయుటలో అందెవేసిన చెయ్యి, లార్డు మౌంటుబాటను, ప్రముఖపాత్రను వహిస్తున్నాడని తెలుస్తోంది.

* * *

పండిట్ నెహ్రూ, లండన్, పారిస్‌ల ప్రయాణం వివిధ దేశ ప్రతినిధులను కలుసుకొని అంతర్జాతీయ విషయములు చర్చించుటకు మంచి అవకాశము నిచ్చినది. "గాంధీ వారసు"నకు స్వయముగా ప్రపంచ పరిస్థితులను గమనించి వివిధ దేశ ప్రతినిధులతో మాట్లాడుటకు పారిస్‌లో జరుగుచున్న సంయుక్తరాజ్యసభ వీలుగలుగజేసి అంతర్జాతీయ రంగంలో భారత దేశ యశోవిలాసము వ్యక్తపరచింది.

* * *

నిఖిలజమ్మూ - కాశ్మీర్ జాతీయ మహాసభ, కాశ్మీర్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరుట ఆమోదిస్తూ చేసిన తీర్మానము, అత్యంత శ్లాఘనీయమైనది. పాకిస్తాన్ చేసే దుష్ప్రచారానికి అంతకుమించిన జవాబు లేదు. మన దేశము కాశ్మీరు విషయమై అనుసరించిన పంథా న్యాయ సమ్మతమని, ప్రజా శ్రేయస్సుకు సన్నిహితమని నిరూపించుట కింతకంటె ఉదాహరణము అక్కరలేదు.

* * *

మనకొక పెద్దసమస్యగా ఏర్పడిన హైదరాబాదు,రజాకర్ దోపిడిమూకల చెరనుండి బయటపడి, తతిమా భారత దేశముతోపాటు స్వాతంత్ర్య వాయువుల పీలుస్తోంది. ప్రశాంత పరిస్థితులు ఏర్పడుతున్నాయి. భయ భ్రాంతులై పారిపోయిన ప్రజలు తిరిగి తమ తమ యిండ్లకు తరలుచున్నారు. సంస్థానంలో ఏర్పడిన చౌదరీ మిలిటరీ పరిపాలన, పరిస్థితులను చక్కబరుస్తోంది. మిగిలినదల్లా నైజాము భవిష్యత్తు. త్వరలోనే స్టేటుకాంగ్రెసు, హైదరాబాదువ్యథకు కొంత వరకైనా బాధ్యత వంహించగల నైజాము హోదా, నిర్ణయించగలదు.

* * *

నానారాజ్య సమితి కీడ్చబడిన" హైదరాబాదుసమస్య"

నామకః యింకా ఎజండామీద ఉంది. లయకాలి మంత్రివర్గం అవలంబించిన అవినీతి, కుటిల యత్నాలు పూస గ్రుచ్చినట్లు మన ప్రతినిధి తెల్పిన తరువాత కొంత సమాధానపడి ఊర కున్నారు. భారత దేశముపై లేనిపోని అభాండములను కల్పించి, ప్రతికక్షిగా వ్యవహరించిన అర్జంటైనా ప్రతినిధి కుటిలప్రయత్నం నెరవేరలేదు. ఈ పరిస్థితులను గమనించి, తనసౌహార్ధము సూచించుటకో యనునట్లు, అర్జంటైనా తన ప్రతినిధిని మార్పు చేసినది. పాకిస్తాను తన మరియొక విఫలయత్నమును వగచవచ్చును.

*　　　*　　　*

ఇంకా భారత దేశపు అంచుల నంటిపెట్టుకొని యున్న, ఫ్రెంచి కాలనీలు పుదుచ్చేరి, మాహీ, మొదలైన ప్రదేశములలో ఎన్నికలు జరుగుచున్నవి. ఫ్రెంచి భారతప్రభుత్వముల మధ్యజరిగిన సంప్రదింపుల ఫలితంగా ఆ భూ భాగముల భవిష్యతు నిర్ణయించుకునే హక్కు అక్కడి ప్రజలకు వదలి వేయబడినది. కాని అచటి ఫ్రెంచి అధికారులు కల్పించే విపరీతవిపత్కర పరిస్థితులు దానికి వ్యతిరేకంగా ఉన్నాయి. ప్రజాభిప్రాయానికి భిన్నంగా ఎన్నికలు జరుపుతున్నారు. భారత ప్రభుత్వము పంపుతానన్న ఎన్నిక పరిశీలకులను వల్లకాదనిరి. అపుడే మాహీలో ప్రజలు తిరుగబడి ప్రభుత్వమును స్వాధీనము చేసుకొనిరి.

*　　　*　　　*

స్వతంత్ర భారతావని ప్రధమ స్వాతంత్రపు ఎన్నికలకై భారతీయుడైన ప్రతివయోజనునకు ఓటింగు హక్కు కలిగించబడి క్రిందటి నెలలో దేశమంతటా, ఓటర్ల జాబితా తీసుకొనుటకై పని ప్రారంభింపబడింది. ప్రభుత్వము నిర్ణయించిన వ్యవధిలో పని పూర్తికాలేదు కాని చాలవరకు ఓటర్ల లెక్కతయారు చేయబడింది. మిగిలిన వారు కూడా త్వరలోనే చేర్చుకోబడుటకు ప్రయత్నములు చేయబడు చున్నవి.

*　　　*　　　*

మన రాష్ట్రంలో ఆహార సమస్య యింకనూ తీరక తీవ్ర రూపము దాల్చనున్నది. ప్రభుత్వాధీనములో నున్న ఆహార పదార్థాల నిలువ నానాటికి తగ్గిపోవుచున్నది. కేంద్రము నుండి తగు సహాయము రాకపోతే, నేటి రేషనింగ్ విధానము త్వరలోనే భగ్నము కావచ్చును.

*　　　*　　　*

దేశములో అధికచలామణి అరికట్టుటకై కేంద్ర ప్రభుత్వము తీవ్ర చర్యలు తీసుకొన వలసి వచ్చినది. ఢిల్లీలో "ప్రయారిటీస్ కమిటీ" సమావేశమై రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వ మంత్రులు పంపిన రిపోర్టులను పరిశీలించి, త్వరలో ప్రారంభించదలచిన అభివృద్ధికరమైన పనులను విచారించి, కేంద్రప్రభుత్వానికి తన సూచనలను అంద చేస్తుంది. అనవసరముగా ప్రజా ద్రవ్యమును ఖర్చుకాకుండా చేయుటయు, ప్రతిఫలమునీయని, అమిత వ్యయమగు పనులను మాన్పించుటయు దీని ముఖ్యోద్దేశములు.

*　　　*　　　*

ప్రపంచరాజ్య సమితిలో ఒకవైపు రష్యాకు మరి యొక వైపు బ్రిటన్ అమెరికాలకు మధ్య "ఆటమిక్ కంట్రోలు విధానము" పై ఏర్పడ్డ తీవ్రతర విభేదము తొలగించుటకై ఆటమిక్ ఎనర్జీ కంట్రోల్ సబ్‌కమిటీ చైర్మన్‌గా ఎన్నుకోబడిన ఇండియా ప్రతినిధి బి. యన్. రావు చేసే ప్రయత్నములు మెచ్చదగి యున్నది.

కాని ఏ ఒక్క విషయంలోనైన యిరుకక్షుల వారికి రాజీ కుదిరియుంటే గదా దీనిలోనూ రాజీ కుదురుతుందని ఆశించటానికి! ఒకరినీడ చూచి మరియొకరు భయపడే కాలంలో యితరుల మాటలు చెవి కెక్కుతవా? సహృదయముతో సర్వ ప్రపంచమును మరియొక దారుణ యుద్ధోన్ముఖమునుండి తప్పించవలెననే మనపిపాస - ఆ మన ఆధ్యాత్మిక జిజ్ఞాస- వారు గుర్తించేదీ లేనిదీ కాలమే నిర్ణయించగలదు.

*　　　*　　　*

ఐక్యరాజ్య సమితి ట్రస్టీషిప్ కౌన్సిలోనూ, పొలిటికల్ కౌన్సిల్ లోనూ, పతితజాతుల ఉద్ధరణకు, అశేష అస్వాతంత్ర ప్రజానీకపు అభ్యుదయానికి, కంకణము కట్టుకు పనిచేస్తున్నారు భారతదేశ ప్రతినిధులు. వారి యోగక్షేమముల గుర్తించి పరిపాలన జరుగునట్లు చూచుటయేగాక, వారి బాధ్యత ట్రస్టీషిప్ కౌన్సిల్ వహించవలెనని యిండియా కోరుతోంది. జాత్యహంకారుల కిదికిట్టకపోవచ్చును. కాని కాల ప్రవాహమునకు వారు ఎదురీదగలరా?

*　　　*　　　*

మనకు సమీపంలో ఉండే యిండోనీషియన్ రిపబ్లిక్, క్రొద్దికాలము క్రిందటే సంపాదించిన స్వాతంత్ర్యమును నిల బెట్టుకొనుటకు శత్రుద్వయముతో పెనుగులాడుతోంది. ఒక వైపు అనాదిసిద్ధంగాఉండి, కొనప్రాణాలతో మిగిలియున్న డచ్చిసామ్రాజ్య తృష్ణ, మరియొక వైపు సర్వవ్యాపకులైన కమ్యూనిస్టుల తిరుగుబాటు దేశపరిస్థితులను కల్లోలపరుస్తు న్నాయి. పత్రికా వార్తలనుబట్టి, కమ్యూనిస్టుల విద్రోహక చర్యలు చాల వరకు అరికట్టబడి, పరిస్థితులు అదుపులోనికి వస్తున్నాయని తెలుస్తోంది.

*　　*　　*

చైనా అంతర్యుద్ధంలో మంచూరియాలో కీలకపట్టణమైన చంగ్‌చింగ్ కమ్యూనిస్టుల వశమయినది. ప్రభుత్వ సేనలకు యిది తీరని నష్టమే కావచ్చును.

*　　*　　*

పాలస్తీనాలో, యూదు, అరబ్బుల మధ్య చిల్లర సంఘర్షణలు జరుగుచున్నప్పటికీ చెప్పదగిన మార్పులులేవు. సెక్యూరిటీ కౌన్సిల్ ప్రతిపాదించిన యుద్ధ విరామము అంతము కావచ్చుచున్నది. కౌంట్ బెర్నాడోటే ప్లాన్‌ను యిరుతెగల వారు పరిశీలించి తమ నిర్ణయములను తెలుపవలసియున్నది.

*　　*　　*

"బెర్లిన్ సమస్య", అగ్ర రాజ్యాల సంప్రదింపులు విఫలమై, ప్రపంచరాజ్యసభకు తేబడినది. రష్యా తన బెర్లిన్ దిగ్బంధనము సడలించని కారణముచే, పశ్చిమ రాజ్యాలవారు "ఆకాశమార్గము" ద్వారా తమ ఆక్రమిత బెర్లిన్ ప్రజలకు, ఎంత ధనవ్యయమైనప్పటికి సరఫరాలు చేరుస్తున్నారు. వీరిలో ఎవరికివారు తమ హక్కుల పేరిట వైషమ్యములు పెంచుకొనుచుండిరే కాని, యిసుమంతైన సమాధానపడే పంథాలోలేరు. తటస్థ దేశాల ప్రతినిధులు, యిరువురకు సమాధానము కుదిర్చి, మధ్యేమార్గముగా బెర్లిన్ దిగ్బంధము సడలించుటకు, పశ్చిమరాజ్యాలవారి ఆంక్షను తొలగించుటకు ప్రయత్నించుచున్నారు కాని యిది ఎంతవరకునెగ్గేదీ, పీడిత బెర్లిన్ ప్రజకు ఏ విధముగా ఉపకరించునది చూడవలసియున్నది.

*　　*　　*

అమెరికాలో అధ్యక్షుని ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. ప్రెసిడెంటు ట్రూమన్‌కు ప్రత్యర్థిగా, న్యూయార్కు గవర్నర్ థామస్‌డ్యూయీ, రిపబ్లికన్ పార్టీ తరపున నిలబడ్డాడు. ఈ సంరంభములో ట్రూమన్ తన స్థాన బలమును కోల్పోవుచున్నట్లు, డ్యూయికి మంచి అవకాశములు కలుగుచున్నట్లు తెలుస్తోంది.

*　　*　　*



---

(21 వ పేజీ తరువాయి).

శ్రీమతి లక్ష్మి ప్రథమ బహుమానమును, శ్రీమతి రామశేషు ద్వితీయ బహుమానమును, కుమారి లలిత తృతీయ బహుమానమును బడసిరి.

*　　*　　*　　*　　*

ది 12-10-48 సాయంకాలము శ్రీ. పిఠాపురము మహారాణీగారి ఆధ్వర్యముక్రింద, బహుమతులుపంచుట, నాట్యాధ్యాపకురాలైన శ్రీ సామ్రాజ్యంగారి దర్శకత్వముక్రింద సభ విద్యార్థినుల నాట్యప్రదర్శనము జరిగినవి.

కుమారి రాజేశ్వరికి, కుమారి లోకనాయకికి యీ ఉత్సవములలో ప్రత్యేక బహుమానము లీయబడినవి. కుమారి ఈశ్వరికి, 'మార్పు'లో చక్కగా నటించినందుకై ప్రత్యేక బహుమానమీయబడినది.

గాంధీజీ బుఱ్ఱకథను చెప్పిన కుమారి ఈశ్వరి, కుమారి గంగాబాయి, కుమారి కస్తూరిలకు శ్రీ జయకుమారార్య బహుమానము యీయబడినది.

ఇంతటితో ఉత్సవములు ముగిసినవి. కార్యక్రమము జయప్రదముగ సాగించిన సభ్యురాండ్రకు, విద్యార్థినులకు, మీదు మిక్కిలి, శ్రమయనక మాకు తోడ్పడిన పరీక్షాధిపతులకు మా కార్యనిర్వాహకవర్గము ధన్యవాదము లర్పించుచున్నది.





# ప్రమీల

ఏకాంకిక



"శ్రీ జగన్మోహన"

పాత్రలు

విజయుడు

దేవదత్తుడు

వీరబాహుడు

ప్రమీల

ఇందుముఖి

వీణావతి

[స్త్రీ మండలం. రాణి ప్రమీల, జగదేక సుందరి....అశ్వమేధ యాగం చేస్తూన్న ధర్మరాజు అధ్వరాశ్వం ప్రమీల వనం ప్రవేశించింది. హయ రక్షకుడు విజయుడు....సాయంసమయం]

## ౧ వ రంగము

వినవోయీ...వినవోయీ...ఓ...ప్రణయ కుమారా...
మధుర మధురమౌ ప్రణయ కథ ఇదే
హృదయ పథములో సుధను చిలుకు నిక
వినవోయీ...వినవోయీ...ఓ...ప్రణయ కుమారా...

(గలగల గజ్జెల మ్రోతలు కలకల నినాదాలు)

దేవదత్తుడు: వీరబాహు! అదుగో అటు చూడుము...ప్రకృతి సర్వ వర్ణములతో నెట్లు తళతళలాడు చున్నదో!...ఆ కలకల నినాదము లేమి?

వీరబాహు: దేవదత్తా!...ఆ మాత్రమూహింప లేవా?... ఇది స్త్రీ మండలమని తెలియును కదా...అది సర్వ మణిమయ భూషణాలంకృతులైన కాంతల సమూహమని యెంచెదను!...

దేవదత్తుడు: ...కండ్లు మిరుమిట్లు గొల్పుచున్నవి. మిత్రమా ...ఏదీ ఆ వైపునకు పోవుదము నడువుము!

వీరబాహు: ...జాగ్రత్త సుమా...వారి కంట బడిన నీ మానప్రాణములు దక్కవు!

దేవదత్తుడు: ...నా మాట కేమి...నీ విషయ మాలోచించు కొనుము...

(ధ్వను లధిక మగును)

వీరబాహు: ...ఎవరి విషయ మాలోచించు కొనుటకును వ్యవధి లేదు...అదుగో సౌందర్య రాసులు...ఈ పొదరింటిలో దాగి యుందము రమ్ము.

దేవ: ...హృదయము దడదడ నదురుచున్నదోయి...ఇట్టి మనోహర కాంతాసమూహము నెన్నడును చూడలేదు...

(నవ్వులతో సంభాషణ వినబడును)

వీర: ...ఇక మాటలు చాలును...వారేదో సంభాషించుచున్నారు...జాగ్రత్తగా విందము...నువ్వు మాత్రము కండ్లు మూసికొని వినవలయును సుమా...మూర్ఛ వచ్చినచో నా ప్రాణములు పోగలవు...

దేవ: వీరబాహు!...అదిగో! వారి మధ్య మన అధ్వరాశ్వము!...చూడుము.

వీర : ...అది మొదటనే యూహించితిని...నీ వటు వైపు చూడవలదంటినిగదా...అదిగో వారిటే వచ్చుచున్నారు.

(నవ్వు లధిక మౌను—సంభాషణ వినబడును)

ఇందుముఖి : వీణావతీ...చూచితివటే ... ఈ హయమును రక్షించువాడు విజయుడటు...మన నగరము ప్రవేశించు ముందు పేరు మార్చుకొనిన బాగుండియుండును. (నవ్వు)

వీణావతి : ..."విజయు"డన్న నంత పరిహాసముగా నున్నదా నీకు...ఇందుముఖీ అతడు జగదేక వీరుడన్న సంగతి మరచితివా ?

ఇందుముఖి : ...కాని మన మండలమున నా బిరుదములు వర్తింపవు...ఆ మాటకేమి ఈ హయమును దేవికడకు తీసికొని పోవుట మన కర్తవ్యము కదా !...

వీణావతి : అవశ్యము గొనిపోవలయును !...యుద్ధము నిశ్చయమనియే యెంచెదను...కానీ జయాపజయములు నిశ్చయించుట మాత్రము కష్టము.

ఇందుముఖి : సురాసుర సిద్ధ సాధ్యుల కసాధ్యమైన మన దేవి నీనరుడోడింప గలడనియా నీ యభిప్రాయము ?— అట్లెన్నటికినీ కానేరదు...మనదే విజయము.

వీణావతి : విజయుడే విజయవంతుడు కావచ్చును...నా దృష్టిలో ప్రమీలా విజయులు సమముగానున్నారు... ముందున్నది స్వారస్యము !...

ఇందు : సరి...బాగుగా నున్నది !...మన విషకన్యకలను మరచితివా !

వీణా : ఎన్నటికిని మరువలేదు...కాని విజయుని సైన్య బలముకూడ కొంత యూహించితిని !

ఇందు :...ఏల వృధా ప్రసంగములు...పోవుదము రమ్ము... విషకన్యలారా ! అందరును కదలుడు...ఈ యశ్వమును వెంటగొని తెండు.

విషకన్యలు : అవశ్యము ... "జై స్త్రీమండ లాధినేతకీ, ప్రమీలా మహారాణికీ—జై."

మోహ మదయించె నెదలో
అధర పల్లవ మదర మొదలిడె
విజయునామ పవిత్రపథమున
వివశమయ్యెను రాణి హృదయము
ఇది ప్రమీలా ప్రణయ నాటిక
నవ్యసుమ మృదుహృదయుడా! ఎదవిచ్చి వినవోయీ..

తళ్కు తళ్కని మణులు మెరయగ
పల్కు పల్కన కాకలీస్వన రుచులు చిల్కగ
నా మనోహరమూర్తి కదలెను
మదనుతూపుల నదరుహృదితో
ఇది ప్రమీలా ప్రణయ నాటిక
నవ్యసుమ మృదుహృదయుడా! ఎదవిచ్చి వినవోయీ...

(జయజయ ధ్వానాలు)

"రాజరాజేశ్వరీ ! — రాజపరమేశ్వరీ !— అష్ట దిగ్గజ మనో వశంకరీ ! పరాక్ ! బహుపరాక్ ! "

వీణావతి : ఇందుముఖీ—దేవి వచ్చుచున్నది.

(రాజరాజేశ్వరీ !—రాజపరమేశ్వరీ!— అష్టదిగ్గజమనో వశంకరీ ! పరాక్ ! బహుపరాక్ ! )

వీణావతి : కేరళ దేశాధీశ్వరీ !—నమస్కారము.

ఇందుముఖి : రాజరాజేశ్వరికి ఇందుముఖి ప్రణమిల్లుచున్నది.

ప్రమీల : ఇందుముఖి, వీణావతులు తప్ప తక్కిన వారు తొలగిపో నాజ్ఞ.

పరిచారికలు : దేవియాజ్ఞ !— (నిష్క్రమణ)

ప్రమీల : ఇందుముఖీ—మన సైన్యము సర్వము సిద్ధమేకదా!

ఇందుముఖి : సర్వము సిద్ధము.

ప్రమీల : మంచిది.

ఇందుముఖి : విశేషము దేవీ !

ప్రమీల : ఇందుముఖీ !—విజయుడెంత వెఱ్ఱివాడు !— అశ్వమును విడువవలెనట ! మన మబలల మని యెంచి కాబోలు నిట్టి రాయబార మంపినాడు !

వీణావతి : దేవి యిచ్చిన సమాధానము ?

ప్రమీల : సమాధానమున కేమున్నది !—విజయుని రణకళా కౌశల్యము పరీక్షింపక గడవనిచ్చు వారముకాము. నే నిదే సమరసన్నద్ధనై వచ్చుచున్నాను. విజయుని రణరంగమునకు రమ్మనుడని వచించి పంపితిని.

వీణావతి : అట్లైన రణము నిశ్చయమే యైనది.

ఇందుముఖి : రణము నిశ్చయము—విజయమును నిశ్చయమే!

ప్రమీల : అంతియ కాదు—బహుపరాక్రమో పార్జనుండగు విజయుడు బంధితుండైనచో మనకు రానున్న కీర్తి నూహింపుము.

వీణావతి : జగదేక సుందరుడగు విజయుడే దక్కిన నింకేమి కావలయును ?

ప్రమీల : వీణావతీ నీవు వివేకమంజులవు సుమా !...ఇందుముఖీ నీవు పోయి విషకన్యకలను రణరంగమునకు నడిపింపుము !—

ఇందుముఖి : దేవియాజ్ఞ—ఇదే సెలవు గొనుచున్నాను

(నిష్క్రమించును)

(లిప్తకాలం నిశ్శబ్దం)

ప్రమీల : వీణావతీ !—విజయుని నీవు చూచితివటే ?

వీణావతి : నిన్న విహారార్థము రాచనగరున కరుదెంచు నపుడు చూచితిని. ఏమి యా యసమాన తేజఃపుంజము !—ఏమి యా గంభీరముఖవర్చస్సు !—ఏమి యా విశాలవక్షస్థలము !—ఆమనోహర మూర్తిని వర్ణింప నశక్యము సుమా !

ప్రమీల : చెలియా !—ఆతని ధైర్య వీర్యసాహసములును తెలిసికొంటిని—ఇక పరీక్షించుట మాత్రము మిగిలి యున్నది.

వీణావతి : అదియు జరుగనున్నది కదా ! (కలకలము) ఏమి యా కలకలము ?

వీణావతి : దేవీ!—అదుగో మన విషకన్యలు. ఎంత యుత్సాహముగా కళ్యాణమున కేగు కరణిని రణరంగము కేగుచున్నారో చూడుము!

ప్రమీల : అవును ! ఉత్సాహమే జయసూచకము గదా!—ఇక మన మాలసించుట తగదు...నడువుము...

## ౨ వ రంగము

[రణరంగంలో—విజయుని సైన్యాలు విష కన్యల పరాక్రమానికి ఆశ్చర్యపడుతూ—వెను కంజ వేస్తున్నాయి. ప్రమీలా విజయులు ఏకాంతంగా యుద్ధం సాగిస్తున్న స్థలం యుద్ధ నినాదాలు క్రమంగా దూరానికి పోతాయి]

విజయుడు : వాలుగంటీ !—ఇదే ఆగ్నేయాస్త్రము...

ప్రమీల : (నవ్వి) విజయా ! ఏల భ్రమజెందెదవు ?—అనిమిష సిద్ధ సాధ్యగరుడోరగాదు లేనియు నన్ను గెలువజాలరు—హయము కావలె నన్న ఒక్క ఉపాయము చెప్పెదను వినుము.

విజ : జవ్వనీ ! ఎట్టివారినైన నిర్జించి పోరుట వీరధర్మము గదా...నీ చేత జచ్చితినా వీరస్వర్గమలంకరించెద... అంతియ కాని...

ప్రమీల : పాపము ? వీరస్వర్గము నిశ్చయించుకొంటివి గదా!—అట్లైన నా యుపాయము వలదు కాబోలు!—సరి అస్త్రమును విడువుము...

విజ : మోహినీ ! పోనీ ఆ యుపాయమేదియో చెప్పుము. అనుకూలమైనదే యైన ననుకరించెదను—లేనిచో యుద్ధముండనే యున్నది కదా !

ప్రమీల : నేను నిన్ను చేయమనబోవునది అసాధ్యమైన దేమియు కాదు.

విజ : కాంతామణీ ! ఉపాయమనినన్నేల యూరించెదవు! అదేదియో త్వరితముగా చెప్పుము.

ప్రమీల : ...విజయా...నీవు...నన్ను...వరిం...పు...ము. నా యాప్సిత మీడేర్పుము...నీ హయము నీకు దక్కగలదు.

విజ : (నవ్వి) కలకంఠకంఠీ! ఇదియా ఉపాయము...... మరి నిన్ను చేపట్టిన నరుడు మాసములో మరణించును గదా!...ధర్మజునకు హాయము జేర్చువారెవ్వరు?

ప్రమీల : సరి!—నీవు దైవ యోగమున మా దేశమునకు వచ్చినావు...నా కోరిక కియ్యకొనక మూర్ఖత్వము వహించి యుద్ధము యుద్ధమందువా నీ ప్రాణముల నపహరింపక మానను...ఎట్లైనను నీ ప్రాణములు పోవుట నిశ్చయము. ఇక—నా యంతిపురమున బంగరు పసకట్టింటు పుష్పాడి పాన్పుపై లీలావినోదముల ప్రొద్దుల పుచ్చుట కోరుకొందువా—లేక—నా మహోగ్ర బాణ తతిచే గాయముఁ నొందుమేనితో వేదన బడుచు ప్రాణములర్పింప గోరుకొందువా—త్వరితముగా వచింపుము.

విజ : ప్రమీలా! ఏల నా మనమిట్లు సంశయ సందిగ్ధముల నొందిచెదవు?—జయాపజయములు నిర్ణయింప రణరంగమున్నది కదా? యుద్ధమున కుపక్రమింపుము.

ప్రమీల : (నవ్వి) విజయా!...నీ మనోభీష్టమే నెరవేరుగాక!

విజ : కాచికొనుము......

(అస్త్రము విడిచిన చప్పుడు—తెగిన ధ్వని)

ప్రమీల : ఇంక నేయస్త్రము మిగిలియున్నది?

విజ : మోహనాంగీ! ఇదే సమ్మోహనాస్త్రము

(అస్త్రము విడిచిన చప్పుడు—తెగిన ధ్వని)

ప్రమీల : పాపమదియు నిరర్థకమైనది...తరువాత?...

విజ : నారీమణీ!...ఇదే ప్రతిజ్ఞ... (పెద్ద ధ్వని)

ప్రమీల-విజయుడు : ...ఏమిది?

ఆకాశవాణి : "విజయా! నే నాకాశవాణిని. నిర్జరులకైనను ప్రమీలను గెలువ నశక్యము. నీ వెన్ని వత్సరములు పోరినను విజయము చేకూరుటసంభవము. ఒక రాత్రి నీవె శృంగార విలాసముల దనియించి నీ యశ్వము తీసికొని యథేచ్ఛగా చనుము."

విజ : మహాప్రసాదము.

[ఆకాశవాణి అంతర్థానమైన శబ్దము]

ప్రమీల : విజయా! రణమున విజయము చేకూరకున్నను ప్రణయమున విజయమే లెమ్ము—ఇదే యంతిపురమునకు త్రోవ.

విజ : ప్రమీలా!—ఎట్లైన నేమి నీయభీష్టము నెరవేరెను గదా!

ప్రమీల : నీ యభీష్టము నెరవేరుట కిది ప్రథమ సోపానమని తెలియదు కాబోలు?

విజ : అట్లే తలంచవలసి యున్నది.

ప్రమీల : అహా!—చిరకాలము నుండియు నా మనము నారాటు పెట్టుచున్న కోరిక యిప్పటికి కదా ఫలించినది—విజయా!...ఒక్క కౌగిలింత...

విజ : ...ప్రమీలా...

## 3వ రంగము

[సంగరం సమసి పోయింది. మోహ దేవత హృదయ పద్మాలపైన ప్రణయ నృత్యం చేస్తూంది. ఎటుచూసినా ప్రేమగీతాలు ప్రణయ చేష్టలు. అంతిపురం ఇప్పుడు నవదివ్యకళా ప్రపూర్ణం అయింది....చంద్రోదయ సమయం.]

చల్లచల్లని పిల్లగాలుల
జల్లులల్లన నల్లుకొనియెను
ఘల్లుఘల్లను నృత్యధ్వనులను
ఝల్లుఝల్లున పుల్కలెగసెను
వినుమురా! యీ ప్రణయ గీతాలూ
ఎదలోకనుమురా! ప్రణయార్ద్ర భావాలూ..

[మనోహరధ్వనులు క్రమంగా తగ్గుతాయి
—ఒక మధురధ్వని—]

ప్రమీల : విజయా... ఈ సౌఖ్యము నా జన్మమున మరువ గలిగినది కాదు సుమా...ఈ ఉద్యాన వనమెంత హాయి గూర్చుచున్నది!

## ప్రమీల

విజ : ప్రేయసీ—ఈ చంద్ర శిలారమ్యశాలను ఆనందామృతము గ్రోలుచు—వలపు మధువాని సుఖించుటకు కావలసినవన్నియు నున్నవి.

ప్రమీల : ఒడలు పుల్కరించుచున్నది విజయా... నా సర్వస్వము నీ యధీనము చేసెదను... ఈ స్త్రీ మండలమునకిక నీవే ఏలికవు.

విజ : ప్రమీలా—ప్రణయైకమూర్తీ... అటులే కానిమ్ము... ఈ హార మెంత తళతళలాడుచున్నది!

ప్రమీల : విజయా... శయ్యాగృహమునకు...

[ఒక క్షణం—మధురస్వరం]

విజ : ఉషస్సమయమైనది ... ప్రణయినీ—ప్రకృతి నూతన శోభదాల్చుచున్నది... ఇక నాకు సెలవొసంగుము.

ప్రమీల :...హా! అప్పుడే విభావరి గడచినదా... విజయా నిన్ను విడువలేను.

విజ : ప్రమీలా... అట్లనకుము... నా కార్యభారము నీ వెరిగినదే కదా... మోహనాంగీ... హాయము నొసంగుము.

ప్రమీల : నీ కార్య దీక్షనుండి విముఖుని చేయుట నాయభీష్టము కాదు. మంచిది... పోయిరమ్ము... హాయమును విడువ నిదే యాజ్ఞయిడెదను... కాని ప్రమీలతో గడపిన యీ విభావరిని మాత్రము మరువకుము.

విజ : అవశ్యము... తొలగించినను తొలగని యీ రేయి నా హృదయమున ముద్రితము...

ప్రమీల : విజయా... ఎచటికేగినను జయమే చేకూరు గాక! ఇవే మత్తంగ తురంగ మణి భూషణములు... కానుకలుగాను చిహ్నములుగాను అంగీకరింపుము... ఇదే నమస్కారము.

విజ : ధన్యుడను... ప్రమీలా శుభమగుగాక!... కేరళ దేశాధీశ్వరీ! సెలవు.

ప్రమీల : ఓ విమకన్యలారా... ఈతనిని సగౌరవముగా సాగనంపుడు.

విమ : మహాదేవి యాజ్ఞ.

[జయజయ ధ్వానములు—కలకల నినాదములు గజ్జెల మ్రోతలు మొదలైనవి.]



## మా రచయితలకు

మా కోర్కెపై, రకరకముల నాటకములను, వ్యాసములను, పద్యములను, కథలను, మాకు ఎక్కువ ఉత్సాహముతో నందించిన మా రచయితలకు, మా హృదయ పూర్వక కృతజ్ఞతను తెలియ జేయుచున్నాము. స్థలాభావమువలన వాటినన్నింటిని, యీ దీపావళీ ప్రత్యేకసంచికలో ప్రచురింపలేక పోయినందులకు విచారించుచున్నాము. వానిని క్రమముగా యికవచ్చు సంచికలలో ప్రచురింతుమనియు, ఈ సంచికలో ప్రచురించని కారణమున వేరు విధముగా భావింపవలదనియు, ఇకపైనగూడ యిట్టి ఆదరాభిమానములు మా యందు జూపుచూ తమ రచనలను మాకు మాటిమాటికి అందజేయుచుండ వలసినదనియు మా రచయితలను మరల మరల కోరుచున్నాము.

ఆంధ్రమహిళ
సంపాదకురాలు

మహారాణీ

ఝాన్సి లక్ష్మీదేవికి



# స్మరణాంజలి

※ శ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు ※

స్వచ్ఛ విప్రకులపయోధి జననమంది
శ్రీమదూర్జిత ప్రభువను చెట్ట పట్టి
దాస్యముక్తికై యసువులు ధారవోసి
శాశ్వత యశమ్ము నొందితి ఝాన్సిలక్ష్మి!

పదియు నెనిమిది యైన సంవత్సరములు
నిండనే లేదు నీ మహనీయకీర్తి
శత్రుజన సంస్తుతులనంది సకల జగతి
నిండిపోయెను కనివిని నేరమెందు.

నీ నడవడి నీ ధైర్యము
నీ నిశితంబైన రాజనీతి ప్రజాసే
వానిరతియు జాతిభక్తి వి
ధానము వంద్యములు భారతప్రజకు సదా.

వీరులు పుట్టలేదా పృథివీతలమందు ననేకసంఖ్యలై
నేరుపుమీఱ సంగరమునందితవృత్తిని జేయలేదా యా
తీరున నొక్క కేలు వడధీరతమైరణకేళిసల్పు నీ
వీరచరిత్రమన్నిటికి భిన్న మహోజ్జ్వలమై వెలింగడిన్.

కన్న బిడ్డవలెఁ బ్రజఁ గాచినావు
దేశదాస్య విమోచన దీక్షమీఱ
నరుల నుఱుమాడి మెప్పులనందినావు
నీ చరిత నిత్యసంస్మరణీయ మమ్మ.

# శ్రీమతి విజయలక్ష్మి పండిట్

శ్రీ వసంతరావు రామకృష్ణరావుగారు

పండిత జవహరిలాల్ నెహ్రూ సోదరి, ఆదర్శ మహిళ అయిన శ్రీమతి విజయలక్ష్మి పండిట్, స్వతంత్ర భారత ప్రభుత్వముచే మాస్కోకు భారతదేశము తరఫున రాయబారిగా నియమింప బడినది. బాధ్యతాయుతమైన ఇట్టి పదవిని మహిళలు నిర్వర్తించుట భారత చరిత్రలోను, ప్రపంచచరిత్రలోను అపూర్వమైనది. కాంగ్రెసు పదవీ కాలంలో శ్రీమతి విజయలక్ష్మి రాష్ట్రానికి ప్రధాన మంత్రిణిగా పనిచేసి ఉన్నది. నేడు అంతకన్న బాధ్యతాయుతమైన స్థానం ఆమెకు లభించినది.

ఈ సందర్భంలో అటువంటి మహత్తరమైన పదవీ బాధ్యతలను నిర్వర్తించుటకై, ఒక మహిళకు అవకాశం ఇచ్చిన ప్రభుత్వ నిర్ణయం ప్రశంసనీయంగా ఉంది. ఆ పదవిని అలంకరించడానికి ఆమె సమర్థురాలని విశదమౌతూంది.



శ్రీమతి విజయలక్ష్మి పండిట్

శ్రీమతి విజయలక్ష్మి, నెహ్రూ వంశంలో జన్మించింది. అంతర్జాతీయ ఖ్యాతిని సంతరించుకున్న అకుంఠిత భారత దేశ భక్తుడు, ఏకైక ప్రజా నాయకుడు, భారత ప్రధాని అయిన, పండిత జవహరిలాల్ నెహ్రూవలె ఈమెకూడా మాతృదేశానికి విశిష్టమైన సేవ చేసినది. ప్రపంచ దృక్పథంలో, భారత దేశ ప్రతిపత్తికిభంగం వాటిల్లకుండా సామ్రాజ్యవాదులు సాగించిన దుష్ప్రచారాన్ని అరికట్టి, దేశ గౌరవాన్ని నిలబెట్టినది. ఆమె భారత జాతీయ దాస్య విముక్తికి ఆసియాదేశాల అభ్యున్నతికి విశేషమైన సేవచేసి ప్రపంచ గౌరవాన్ని చూరగొన్నది. ప్రాచ్యఖండాలలోని మహిళా సాంప్రదాయానికి ఆమె వ్యక్తిత్వం ఒక గీటురాయి.

శ్రీమతి విజయలక్ష్మి పీడిత ప్రజా కోటికి

## శ్రీమతి విజయలక్ష్మి పండిట్

ప్రాతినిధ్యం వహించి, వారి హక్కులకొరకు పోరాడింది. సాటి దేశాలైన మలయా, బర్మా, ఇండోచైనాల ప్రతిపత్తి విషయమై ఆమె ఎంతో కృషి చేసినది. ఆమె 1944 లో అమెరికాలో సంచారం చేసి, బ్రిటీషువారు సాగిస్తూన్న అసత్య ప్రచారాన్ని తీవ్రమైన ఉపన్యాసాల ద్వారా ఖండించింది. 1945 లో, శాన్‌ఫ్రాన్సిస్కోలో, సంయుక్త జాతుల సభలో భారత స్వాతంత్ర్య ప్రకటన ఆవశ్యకతను ప్రతిపాదించినది. తుదకు, న్యూయార్కులో సంయుక్త జాతి సభకు భారతీయ ప్రతినిధుల నాయికగా వెళ్లి, దక్షిణాఫ్రికా సమస్యను చర్చించి, స్మట్సును ప్రతిఘటించింది. భారతజాతీయ జీవన సాంప్రదాయానికి చెందిన ఆదర్శమహిళ కనుక, ఆమె 20 ఏండ్ల క్రిందట, బ్రస్సెల్స్ నగరంలో జరిగిన సామ్రాజ్యవాదుల సభకు, పండిట్ నెహ్రూతోకూడా హాజరై, అనేక సమస్యలను చర్చించింది.

పై విషయాలనుబట్టి, ఆమెకు, అంతర్జాతీయ విషయాలలో అనుభవమున్నట్లు మనకు తెలుస్తుంది. అందువల్లనే, ప్రభుత్వం ఆమెనే రష్యా రాయబారిగా నియమించింది. అంతర్జాతీయ దృక్పథంలో భారత దేశ ప్రతిపత్తికి విశిష్ట స్థానం లభింపచేయడానికై ఆమె కృషి చేస్తూంది. ఆమెకు గల విశాల జాతీయ దృష్టి అందులకు నిదర్శనం.

శ్రీమతి విజయలక్ష్మి, చిన్నప్పటినుండి సుప్రసిద్ధ రాజకీయ నాయకులతో అనేక విషయాలను ప్రస్తావించి, అపారమైన రాజకీయ పరిజ్ఞానం సంపాదించుకొన్నది. ప్రజాహితము కోరే నాయకుల కార్యక్రమంపట్ల ఆమెకుగూడా ఉత్సాహం అధికమైంది. ఆమె తన 21వ ఏట బారిష్టరు అయిన రంజిత్ పండిట్‌ను వివాహమాడింది. ఆమెకు చంద్రలేఖ, నయనతార, రీటా అను ముగ్గురు కుమార్తెలు కలిగారు. సాంఘికంగాను, జాతీయంగాను ఆమె ప్రజాహితాభిలాషతో కార్యక్రమాన్ని కొనసాగించింది. దేశంకోసం, ఎన్నో త్యాగాలు చేసింది. నిశ్చలమైన కార్యదీక్ష, నిరాడంబర జీవనం ఆమె సుగుణాలు. సాంఘిక, రాజకీయ పరిజ్ఞానాన్ని సమగ్రంగా పెంపొందించుకొని దేశ సేవ చేయడమే ఆమె ఆశయం. వివిధ విషయాలను గురించి ధారాళంగా చర్చించగల పాండితీప్రకర్షణ ఆమెకు వెన్నతోబెట్టిన విద్య.

ఆమె అనుభవైకవేద్యంగా, మహిళా సమాజంలో ఆదర్శజీవితాన్ని గడుపుతూంది. గాంధీజీ సూత్రాలనే ఆమె అనుసరిస్తుంది. స్వానుభవసిద్ధమైన తన రాజకీయ విజ్ఞానం ద్వారా, తన పదవీ భారాన్ని సమర్థతతో నిర్వహించి, స్త్రీలకు ఆమె మార్గదర్శకురాలు కాగలదు. దేశ సౌభాగ్యానికి జాతీయ సౌశీల్యానికి, పురుషులవలె స్త్రీలుకూడా పాటుబడగలరన్న నగ్నసత్యాన్ని, ఆమె, నేడు ప్రపంచానికి వెల్లడి చేస్తూంది.



# వీరవనిత

## [ లేక ]

# నరకాసురవధ

శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు

నానావిధ ఫలపుష్ప భరితమై కనులపండు వొనర్చు యుద్యానవనములో నొక లతామండపము క్రింద చంద్ర కాంతశిలావేదికపై వెనుకకుజేరబడి చేతిమీద శిరమునానుకొని దీర్ఘాలోచనపరుడై కూర్చునియున్నాడు శ్రీకృష్ణుడు. సూర్యు డప్పుడే యస్తమించుచుండుటచేత నీరెండపడి యుద్యానవన మునందలి చెట్లకొక క్రొత్తయంద మేర్పడుచున్నది. సుగంధ పూరితమైన పిల్లవాయువులు చల్లగా వీచుచున్నవి. పక్షులు మధుర రుతములుచేయుచు తమతమ గూళ్లను చేరుచున్నవి. ఆ సాయంకాలము వర్ణనాతీతమై యతి మనోహరముగా నున్నది. యోగనిద్రాపరవశుడైయున్న యోగివలె శ్రీకృష్ణుడు ఈ యానందము ననుభవించుట లేదు. తదేక ధ్యానములో నిమగ్నుడైయున్నాడు.

కృష్ణుని వెదకికొంటూ సత్యభామ అక్కడకు వచ్చింది. ఏకాగ్రచిత్తుడై వంటరిగానున్న శ్రీకృష్ణుని చూసింది. "ఏదో మళ్లీ పుట్టి మునిగినది. లేకపోతే ఎప్పుడూ నవ్వుతో, ఇతరుల నవ్విస్తో, ఎంతో సరదాగా, సంతోషంగానుండే శ్రీకృష్ణు డిట్లువంటరిగా ఆలోచనాతత్పరుడై కూర్చొన్నాడు." అని తనలో తాననుకొంటూ వెనుకనుండి కృష్ణుని సమీపించి కండ్లు మూసింది.

కృష్ణుడు : ఎవరువారు, సత్యభామా ?

సత్యభామ : కృష్ణా! ఏమిటిది అంత దీర్ఘంగా ఆలోచిస్తో న్నావు ? మళ్లీయేదైనా వచ్చిందా యేమిటి? ఎక్కడేది వచ్చినా నీకే కావాలి.

కృష్ణుడు : నాకు కాకపోతే మరెవరికి సత్యా? లోకమంతను పాలించేవాడిని, పోషించేవాడిని, రక్షించేవాడిని నేను. ప్రజల సౌఖ్యమే నాసౌఖ్యము. వారి దుఃఖమే నాదుః ఖము. వారంతా నన్నే నమ్ముకొని నా యొద్దకు వచ్చి మొరపెట్టుకొంటూంటే వారిమొరవిని వారి కష్టములు తొలగించకపోతే నేనుండి యేమి ప్రయోజనము?

సత్య : ఈ సారి యేమి వచ్చింది ?

కృష్ణుడు : ఈ సారి అన్నిటికన్న అతిదుఃఖకరమైన విష యమే వచ్చింది. నా కన్నకుమారునే చంపవలసివస్తోంది.

సత్య : కన్న కుమారునా! ఎవరతడు? ప్రద్యుమ్నుడు కాడు కదా కొంపతీసి ?

కృష్ణుడు : ప్రద్యుమ్నుడెందుకవుతాడు ? మహా పతివ్రతయైన రుక్మిణి గర్భవాసమున జన్మించి ఆదర్శవంతమైన క్రమ శిక్షణలో పెరిగినవాడు ప్రద్యుమ్నుడు. నా తరువాత నా యంతటివాడు.

సత్య : మరెవరైయుంటారు ?

కృష్ణుడు : నీవు వినలేదా ? సత్యా ! నరకాసురుడు అతని పేరు. అతడు భూదేవి వలన నాకు జన్మించినవాడు. పరమ దుర్మార్గుడై ప్రజలను, మునులను చాలా బాధలు పెడుతున్నాడని తెలియుచున్నది. అనేకమంది రాకొమ రులను తీసికొనివచ్చి చెరలోబెట్టి రోజున కొకరి చొప్పున కాళికిబలి యిచ్చుచున్నాడట. స్త్రీలను చెరబడుతున్నా డట. అతడు చేయుదుండగములు మాటలతో చెప్పుటకు వీలు కాదు. ప్రజలు, దేవతలు, అట్టుడికినట్లుడికి పోవు చున్నారు. వాడు చేయు దుండగములు వినుటకు నాకు చాలా కష్టముగా ఉంటోంది.

సత్య : ఎంత దుర్మార్గుడైనా కన్న కొడుకుగదా కృష్ణా! వాని నేదో కొంచెము కొప్పడి దుర్మార్గములను మాన్పించాలి గాని చంపివేయడమేనా ?

కృష్ణుడు : కన్న కొడుకైతేమాత్రం దుర్మార్గుడు దుర్మార్గుడే. శరీరమందలి యొకవ్రేలిమీద వ్రణమై అది పుళ్లి శరీరమున కంతకూ నష్టముగొని రానున్నప్పుడు దానిని తీసివేయక నావ్రేలేకదా తీసివేయుటెట్లని యూరకున్నచో శరీర

మున కంతకూ కీడు కలుగును. ఇది కూడవట్టిదే. కోప్పడడము, నయమున భయమున బోధించడము అన్నీ జరిగాయి. ఎన్నిచెప్పినా వాడిదుష్ప్రవర్తన వాడు మానడములేదు. వాడికితోడుగా కొంతసైన్యముగూడా జేర్చుకొని తపస్సుచేయు మునులను, ఋషులను తనవలెనే దుర్మార్గులై తనజట్టుతో చేరవలయునని నిర్బంధించడం, ఇళ్లుతగుల బెట్టడం, దోచుకోవడం, ప్రజలను చిత్రవధ చేయడం, స్త్రీలను బాధించడం ఈ విధంగా చాలా అల్లరిచేస్తున్నాడు. అహింసాతత్పరులును, ధర్మమార్గానువర్తులును ఐన ప్రజలు వానినేమిచేయ జాలక నాయొద్దకు వచ్చి మొరపెట్టుకొనుచున్నారు.

సత్య : నరకాసురుడంతటి దుర్మార్గుడై ప్రజల నా విధముగా బాధించుచుండగా వానిని వెంటనే బరిమార్చక యింత కాల మెందుకూరకొంటివి కృష్ణా?

కృష్ణుడు : దేనికైనా కర్మపరి పక్వం కావాలి. ఎప్పటికైనా బుద్ధి వస్తుందేమోనని కొంత ఆలశ్యం చేశాను. ప్రజల నా విధంగా బాధిస్తూవుంటే నేను కలుగజేసి కొనుట యెందుకు వాళ్లేవాడికి తగిన బుద్ధి చెపుతారని కొంత యూరకొంటిని. ప్రజలువచ్చి నన్నుకోరనిదే యేలా కలుగజేసుకోనని కొంత యోచించితిని. వాడి దుర్మార్గము లోకానికి బాగా తెలిసి వారు విసిగివేసారకుండా వానిని జంపివేస్తే కృష్ణుడు చాలా న్యాయశీలుడు, ధర్మపరుడు, దూరదృష్టిగలవాడు యుక్తా యుక్త విచక్షణా పరుడు, అహింసా తత్పరుడు, అని నన్నెంతో గౌరవముగా చూస్తోన్న ప్రజలు, ఏదో చెడ్డగా ప్రవర్తించాడని కన్న కొడుకని యైనా చూడక పాపం నరకుని అన్యాయంగా చంపివేశాడని యనుకొంటారేమో, నిందిస్తారేమో, వారికి నాయందుగల నమ్మకము, గౌరవము పోతాయేమో నని కొంత జాగు చేయవలసి వచ్చినది.

సత్య : అయితే వానిమీదకు యుద్ధమునకు వెళ్ళక తప్పదా? కృష్ణా!

కృష్ణుడు : తప్పదు. అందుకే యింత దీర్ఘాలోచన. విచారమూను.

సత్య : యుద్ధానికి నాకు కూడా రావాలని యున్నది. నీతో నేనూవస్తాను.

కృష్ణుడు : సత్యా! యుద్ధమంటే యేమిటనుకొన్నావు? ఉద్యానవనములో విహరించుటనుకొంటివా? వీణవిూటుతో శ్రావ్యముగా గానము చేయుటా? వినోద ప్రదర్శనమనియా నీయూహ. అంతఃపురము, ఉద్యానవనము తప్ప ప్రపంచమెరుగని యమాయికవు, అబలవు, సుకుమారివి అయిన నీవు భయంకరమైన యుద్ధభూమినిజూచి భరింపగలవా? యుద్ధభటులొనర్చు భయంకరమోటు నినాదములను వినగలవా? తెగిపోయిన కాళ్లు చేతులు, అవయవ రహితములైన మొండెములు, మొండెముల నుండి వేరుపడిన తలకాయలు రక్త ప్రవాహములతో దొర్లుతూఉంటే నీవక్కడ నిలువగలవా? స్త్రీల మాన భంగమొనర్చే దుర్మార్గుల కంట స్త్రీలు పడవచ్చునా? ఇదేమి కోరిక సత్యా! స్త్రీలు కోరగూడని కోరిక కోరితివి? నీ సవతులెవరైనా వినిన నవ్విపోదురు. ఊరకుండుము.

సత్య : కృష్ణా! నాకేసిచూడు. నేను తక్కిన స్త్రీలవలెను, నీ తక్కిన భార్యలవలెను సాధారణ స్త్రీవలెనే కనబడుచుంటినా నీదృష్టికి? ఇంతకాలమునుండి చూస్తో నాశక్తి సమర్థతలు కనిపెట్టనేలేదా నీవు? నీవేసామాన్యస్త్రీ గాహిం పనికొంటివినిగాని యింత గ్రహింపుశక్తి లేనివాడవని తలంచలేదు. నాతండ్రి సత్రాజిత్తు నన్ను, తక్కిన తండ్రులు తమ బాలికలను పెంచినట్లు, పెంచలేదు. పుత్రికనైనా పుత్రుడనైనా నేనొక్కతినే యగుటచేత ఆడపిల్లలకు చెప్పించవలసిన సంగీతసాహిత్య నృత్య చిత్రలేఖన మొదలగు లలితకళలతోబాటు మగబిడ్డలకు కావలసిన కత్తిసాము, విలువిద్య, రథము నడపుట, గుఱ్ఱపు స్వారి, యుద్ధముచేయుట మొదలగు విద్యలనుగూడ నేర్పించెను కనుక నాకు యుద్ధమన్నా భయములేదు. ఊరకదూరము నుండి చూచుట మాత్రమే కాదు. అవసరమగుచో నీకు సహాయముగానుండి యుద్ధముకూడ జేసెదను.

కృష్ణుడు : సత్యా నీకెంత జెప్పినను వినకున్నావు. ఇంత సౌందర్యరాశివి, చాతుర్యవంతు రాలవునగు నీవు కంటబడిన

# వీరవనిత [లేక] నరకాసుర వధ

యాదుర్మార్గులూరకొందురా ? నే నొకవేళ యుద్ధములో మూర్ఛపోవుటో, నిన్ను చూచుకొనుట కవకాశము లేకుండా యుద్ధములో నిమగ్నుడనై యుండ వలసివచ్చుటో, ఒకవేళ రణరంగమున చనిపోవుటో సంభవించిన యెడల నీపని యేమిగాను ? నా ప్రాణమునకన్నా నెక్కుడుగా చూచుకొనుచున్న నాముద్దుల రాణిని భయంకరప్రదేశమునకు దుర్మార్గుల మధ్యకు తీసికొని వెళ్లుటకు నా మనసొప్పుటలేదు సత్యా ! పురుషసంతతి లేక పోవుటచేత ఏదో ముద్దుకొలకు నీతండ్రి నీకుకొన్ని విద్యలు నేర్పించియుండ వచ్చును. ఊరక సరదాకు విద్యలు నేర్చుకొనుటకును, అతి భయంకరమైన, ఘోరమైన, కృతిమ పూరితమైన యుద్ధములో వాని నుపయోగించుటకును చాలా తారతమ్యమున్నది. నా మాటవిని నన్ను బలవంత పెట్టక, నిందించక నీ యీ తలంపును వదలుము.

సత్య : కృష్ణా! నీవు చెప్పేమాటలన్ని అబలలు, అమాయికలు, సుకుమారులు, ప్రపంచజ్ఞానము లేనివారలు, కేవలము పురుషులమీదనే యాధారపడ వలసినవారు అని యనుకొనే సాధారణ స్త్రీల విషయములో చెప్పవలసినవి. ఏ విధమైన ఆయుధ సహాయములేకున్ననూ, యుద్ధ సంగతులేవీ యెరుగకున్ననూ సీత, దమయంతి మొదలగువారు కేవలము మనోబలముచేతను, సాత్విక నిరోధముచేతను పరమ దుర్మార్గులు, దుష్టులునగు శత్రువుల జయింపగలిగియుండగా వానితోబాటు ఆయుధముల యుపయోగము, రణకౌశలము నెరిగియున్న నా కొలకా నీవు భయపడునది ? అర్ధాంగినగు నేను నీప్రక్కనుండగా నీకు ప్రాణాపాయమా ? కృష్ణా! సామాన్య మానవునివలె మాట్లాడుచుంటివేల ?

చివరకు కృష్ణునకు సత్యభామను యుద్ధమునకు తీసికొని వెళ్లక తప్పినదికాదు. యుద్ధభూమిలో నరకాసురుడు తన సైన్యముతో నతిభయంకరుడై విహరించుచుండెను. ఎంత నేర్పుగాకృష్ణుడతనితో యుద్ధమొనర్చుచున్నను నరకుని బాణమొకటి యాతనికి గాఢముగా తగులుటచేత నతడు మూర్ఛనొందెను. సత్యభామ యాతని రథమును దూరముగా గొనిపోయి యతనికి శైత్యోపచారములు చేయ భటుల కాజ్ఞనొసగి రణరంగమున ప్రవేశించి యతిచాతుర్యముతో శత్రువుల జెండాడుచుండెను. కనులు మిరుమిట్లు గొలుపు ఆమె సౌందర్యము, స్త్రీజనాతీతమగు నామెశౌర్యపరాక్రమ ధైర్య సాహసములు, యుద్ధ కౌశలము చూచి శత్రువులు ముగ్ధులై పోవుచుండిరి. ఆమె పై బాణమువేయుటకు వారికి చేతులాడుటలేదు. అమెనుండి దృష్టులను మరల్ప లేకున్నారు. అనేకమంది యుద్ధవీరులామె బాణముల కెరయై నేలగూలుచున్నారు. శ్రీకృష్ణునకు తెలివి వచ్చినది. సత్యభామ యేమయినదో యని యతని యాతురత. వేవేగముగా రథమును ఆహవరంగమునకు తోలించాడు. మహిషాసురమర్దనివలె తీవ్రముగా యుద్ధము చేయుచున్న సత్యభామను చూచి నప్పుడు అతని నేత్రములనే ఆతడు నమ్మలేక పోయాడు. కొంతసేపటివరకూ అతనికండ్లు చీకట్లుకమ్మాయి. పిమ్మట ఆమె యుద్ధ నైపుణ్యము, యుద్ధముచేయు సమయములోనున్న ఆమెయొక్క వింత సౌందర్యము చూచి ఆశ్చర్యపోయాడు. అతి వయ్యారంగా తనయొద్దకూర్చుని ముద్దులుకుడుస్తో సవతుల మీద ఈర్ష్య చూపించేకుసుమకోమలి ఆసత్యయేనా యీమె! ఎంత బలము ! ఏమి పరాక్రమము ! ఎట్టి శౌర్యము ! ఎంతటి ధైర్యము ! శత్రువులు గడగడలాడి పోతున్నారే ! నరకుడు చేష్టలుదక్కియున్నాడే ! అరే ! నరకుడు నేలగూలాడు !

తిరిగి యతను లేవ బోవుచుండగా శ్రీకృష్ణుని బాణము అతనిని తిరిగి యెప్పటికిలేవకుండా జేసినది. పరమదుర్మార్గుడగు నరకాసురు డంతమొందాడు. జయజయ ధ్వానములు మిన్నుముట్టాయి. ప్రజలందరూ దీపావళి పండుగ చేసికొన్నారు. పరమ దుర్మార్గుడగు నరకాసురుని వధించుటలో భర్తకు తోడ్పడి ప్రజల కష్టములను తొలగించిన వీరవనిత సత్యభామ.



# తరుణి తలిస్తే....!

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

బాగా వెనక్కి - ఇంకా వెనక్కి - అంతాకన్నా వెనక్కి పోయిచూస్తే - స్త్రీలకు సమాజాలూ, సంఘాలూ, క్లబ్‌లూ, కూటాలూ ఉన్నట్టవుపించవు.

కాని - బ్రహ్మవాదిను లక్కడక్కడ వున్నట్టు బాగా వెనక్కిచూస్తే అవుపిస్తారు.

రాను - రాను - విక్రమార్కశకానికి కాస్త వెనకా - ఆ తర్వాతా - రాజాస్థానాలలో చెల్లా చెదరుగా కవయిత్రులూ మున్నగువారు మాత్రం గోచరిస్తారు.

కవయిత్రులకు కవితాకళా వైభవంతోపాటు పరిపాలనా వ్యవస్థా సిద్ధాంతాలలో, సునిశిత వ్యవహార వైదగ్ధ్యంలో, సాంఘిక స్థాపనాదక్షతలో, గురుతరబాధ్యతా నిర్వహణాదులలో నైపుణ్యంఉన్న విషయం చారిత్రక ప్రసిద్ధం.

కేవలం రాజవంశ జాతలే కాకుండా, సామాన్య కుటుంబ సంజాతలుకూడా సమస్త వ్యవహారాలపట్లా వీను మిగిలిన కోవిదలున్నట్లు తెలుస్తూవుంది. వీరి బుద్ధి బలాదులన్నీ స్వదేశ స్వసంఘాభ్యుదయాలకే వినియోగించేవారు. పరదేశ, పరమతాలపట్ల ఎంతవరకు వ్యవహరించాలో అంతవరకే వ్యవహరిస్తూ - స్వదేశ విజ్ఞానాభ్యుదయాలు స్థిరస్థాయిచేశారు.

నేడు - అనగా - రమారమి రెండువందలేండ్లనుండి, దేశం పరాధీనమై పోవడంవల్లనేమీ, దేశంలో అనేకమతాలు తలలెత్తడంవల్లనేమీ, మరో ఇతర కారణాలవల్లనేమీ మననాగరికతా సంస్కృతులూ, వేషభాషలూ, నిత్యవ్యవహారాచారధర్మాలూ, నీతినియమాలూ ఇవీ అవి ఏమిటి సర్వమూ వెర్రితలలువేసి - పెడదారులుపట్టి - మన సంస్కృతి సిద్ధాంతాల రూపురేఖలు మారిపోయాయి. తలకొక రకం అయిపోయింది. చివరకు మనలను మనము మరచిపోతున్నాం. పోయాం. నియమపద్ధతి నీటిపాలై పోయింది. ఈ సందర్భాలన్నీ సింహావలోకనం చేసిచూస్తే కళ్లనీరు గిర్రున తిరుగుతూవుంటుంది.

యుద్ధాలతోకాని - మతాలతోకాని మనకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సంబంధంలేక పోయినా - పోనీ - యుద్ధాలై చాలాకాలమైనా బట్టకరువూ, తిండి కరువూ, పాలూ పెరుగూ నెయ్యీ కరువూ, కిరసనాయిలు కరువూ, అగ్గిపెట్టెకరువూ, చివరకు పలకర్రకు కరువూ-ఒక్క గాలికి కరువు లేదేమో కాని - ప్రతినిత్య వ్యవహార సాధనసామగ్రులకూ కరువేవచ్చిపడి, స్థిరపడి పోయింది. గవర్నమెంటువారు పంచదారకు కంట్రోలులేదన్నారో లేదో ఇంకా - అప్పుడే - వీశపదిహేను అణాలుదాటి ఒక్కసారి రూపాయి పదణాలయింది. అలాగే ఇరవై నాలుగు కుంచాల బియ్యపు బస్తా తొంభైఆరు రూపాయలు దాటి పోయింది. ఇలాంటి కాటకాని కెందరు బలయ్యారో, అవుతారో మనమూహించ లేకుండా వున్నాం. నిరుపేద లెంగిలాకుల కెగపడ్డారుకదా! సామాన్యులు ఇంటిలో మలమలమాడి పోతున్నారు. గవర్నమెంటు తన హస్తం ఆయా వస్తువుల మీదనుండి తొలగించేసరికి ఇంత ధర ఎలా పెరిగిందో ఆలోచించండి.

అయితే - దీనికి కారకుడు దేవుడా? మానవుడా? దేవుడుకాదు - మానవుడు - అందులో స్త్రీ—

స్త్రీలో సద్విద్యా సంస్కృతులు నశించి పోయాయి. నాగరికత పేరుతో వ్యామోహం జాస్తి అయి పోయింది. ఆశా, అసూయా, స్వార్థపరత్వం హృదయంలో ప్రవేశించాయి. ధనకాంక్ష బయలుదేరింది. నీతినియమాలు అడుగంటాయి. గర్వమూ, గొప్పా కరుడు కట్టాయి. ఇంకేమీ - "తల్లివ్రతెపిల్ల"న్నట్టు ప్రపంచమంతా అలాగే అయిపోయింది.

# దేశం బాగుపడదూ?

## తరుణి తలిస్తే....!

స్త్రీ హృదయం పాడైపోతే దేశ సౌభాగ్యం దిక్కూ-మొక్కూ- లేనిది కావడంలో అంతవిడ్డూరములేదు.

కావున - స్త్రీప్రస్తుతం తన వ్యామోహాన్ని, స్వార్థపరత్వాన్ని, ఆడంబరాన్ని, గొప్పతనాన్ని, గర్వాన్ని, ఆశా అసూయల్ని, ధనకనకవస్తువాహన ధారణాకాంక్షల్ని సంపూర్ణంగా తెగ తెంపులు చేసుకుని జీవకారుణ్య హృదయ అయితే విపరీతంగా విరుద్ధంగా పెరిగిపోయిన లంచగొండి తనాన్నీ, అధిక లాభాదాయాన్నీ నిమిషంలో నీటిపాలు చేయవచ్చు. తెలియని దోపిడీవిధానం దిబ్బచేరుతుంది. సాటి నిరుపేద సోదరితనలా కడుపునిండాతిండీ, వంటినిండా బట్టాలేకుండా ఎందుకుండా? అన్న విచారం బయలు దేరిననాడు దేశం సర్వ సంపన్నమే. సర్వ సంపన్నమైన దేశంలో కరువూ, కాటకాలెక్కడా?

కరువూ కాటకాలూ పోగొట్టలేని మనప్రపంచ పరిణామాన్ని పట్టి వచ్చిన సంఘాలు, సమాజాలూ, సమితులూ, సహవాసాలూ ఏమున్నా లాభంలేదు.

ప్రతిస్వాతంత్ర్య భారత స్త్రీ - తనకు నగలూ నాణ్యాలూ కావాలన్నా, చీని, చీనాంబరాలు కావలన్నా ఇంట్లో, ఎలా పోరు పెట్టి మగవారి మనస్సు చెదరకొడుతుందో అలాగే - బ్లాక్‌మార్కెటు చేసి తెచ్చిన ధనాన్ని వీధిలో పారవేస్తాననీ, ఆ ధనాన్ని ముట్టననీ, లంచం సొమ్ము తెస్తే తిండిపెట్టక పోవడమే కాకుండా, మంచినీరైనా ఇంట్లో ఇవ్వననీ త్రికరణ శుద్ధిగా ప్రతిపట్టి ఆచరిస్తే ఈదుర్భిక్షమూ క్షామమూ, దౌర్భాగ్యమూ పటాపంచలై పోతుంది. పతి వ్రతా ధర్మానికి భంగం కూడాలేదు.

నీఅందచందాలకూ, నీబాగోగులకూ, నీచావుబ్రతుకులకూ తుదకు - నీనిర్వాహక నిమిత్తం పరపీడచేసి, పడరానిపాట్లు పడి, అధర్మంగా, అన్యాయంగా ధనాన్నార్జిస్తున్నానని పురుషుడు మనమీద మోపే నిందాకళంకం మటు మాయమవుతుంది. ఇందుకే స్త్రీ శక్తిస్వరూపం అనీ, ఆమె సాధించలేని కార్యాలులేవనీ, ఆమె అమృతస్వరూపమనీ, అంతకూ ఆమేకారకురాలనీ అంటున్నాను.



# మాతా!!

శ్రీ ఎ. సత్యనారాయణాచార్యగారు, బి. ఏ.

మ॥ నవమాసంబులు నిండి యావెనుక నెన్నన్ రాని ఖాధాళిలోఁ
బవటన్ రాత్రుల నెట్లు పుచ్చితివొ! సంభావింపఁగా శక్యమే!
భవితవ్యంబున నాశలన్ గలిగియబ్బా! వానినెట్లోర్చితో!
యెవరమ్మా సరినీకు నీపుడమి నేయేరీతులన్ జూచినన్ ॥

శా॥ ఎన్నో కష్టములన్ భరించి మమునీ వింపారు ప్రేమంబుతోఁ
గన్నావమ్మ! పతివ్రతాగ్రణి! మహా కల్యాణ సంధాయినీ!
పున్నెంపుంగని వీవు, నీ పదముల న్పూజింతు నమ్రాత్మ, నీ
కన్న న్దైవ మిఁకెవ్వరమ్మ! ధరలోఁ గాపాడఁగా మమ్మికన్ ॥

సీ॥ ఉదయంబునన్ లేచి సదయాంతరంగవై
యఱ్ఱు బాలను బెట్టి యూఱడించి
ఉష్ణోదకంబుల నుత్సాహమును మీరి
యుదకమాడఁగఁజేసి యుడుపు లిచ్చి,
రెట్టించు నాశలన్ బొట్టు కాటుకఁ బెట్టి
భద్రంబుగా మమ్ము నిద్ర పుచ్చి
ఎపుడు లేతురో యంచు నపుడప్పుడే నీవు
విధుల నన్నిటి దీర్చి వేగ వచ్చి,

గీ॥ బహుముఖంబుల మామీఁద బఱపి కనుల
నిరతర శ్రేయమును గోరి నీమమునను
గంటికిన్ రెప్పవలె మమ్ముఁ గాచినట్టి
త్యాగశీలవు మాకిల దైవ మీవె॥

ఉ॥ ఏమహనీయ తాఁగలుగనీయిలఁ గారణమన్న సూక్ష్మము
న్నేమఱియుంటనో, తుదకు నింగిత మేమియు లేక నుంటనో
పామరుఁడై కృతఘ్నతకుఁ బాల్పడు పుత్రునిఁ గూడ ధాత్రిలో
సేమమె గోరు నీ విమల శీలము నెట్టు నుతింతుఁ దల్లిరో॥

# డిటెక్టివ్ సుందరి

* శ్రీ కందుకూరి లింగరాజుగారు *

బీరువాలో బట్టలుసద్దుతున్నా. చాకలి తెచ్చినవి నాకోసం అని ఎదురుచూస్తూ మంచంమీదవున్నవి. క్రితం రేవులో వేసిన, చార్లచొక్కా రాలేదు. అప్పుడు అనుకున్నా మాసిపోయిన వానిలో పడిందేమో అని. పద్దువేసేటప్పుడు ఆ చొక్కా లెఖ్ఖలోకి రానేలేదు. ఏమయింది అన్న ఆలోచనకు సమాధానం దొరకలేదు. పైగా బనీన్లలో రెండు కనుపించటంలేదుకూడాను. నేను ఏ పాకీవానికైనా ఇచ్చినట్టూ జ్ఞాపకం లేదు. ఏ సమయంలో అయినా సుందరి, పాతది, చిరిగడానికి సిద్ధంగావుంది అని ధర్మం చేసిందేమో కనుక్కోవాలి అనుకునే బీరువామూసాను.

సావిట్లోకి వచ్చేటప్పటికి సుందరి "రొట్టె, కాఫీ బల్ల మీద పెట్టేనండీ" అంది. "రొట్టె కాఫీ రోజూ వుండేదే చార్లచొక్కా మాత్రం మాయమై పోయింది" అని లోపల గునులుకున్నా.

సుందరీ తనవాటాతో వచ్చి ఎదురుగా కూర్చుంది. నాకు రొట్టె దిగటంలేదు. కాఫీరుచిగావున్నట్టూ తట్టలేదు. సుందరి తనపని యధాలోపంగానే చేసేస్తోంది. నేను తినక పోవడంతో ఓసారి తలెత్తిచూచి, బహుశః మళ్ళీ కథవ్రాయడం కొరకు తల్లో ఏదైనా కుమ్మరిపురుగు దొలుస్తోంది కాబోలు అనుకునే వంచుకుంది.

చెప్పనా, ఒద్దా అన్న సంధిగ్ధం నన్ను ఇరుకున కూర్చోపెడుతోంది. చెపుదామన్నా ఎల్లామొదలు పెట్టాలో తెలియని స్తబ్దత నన్ను కూర్చోపెట్టింది.

"మొన్న ఆ కాందిశీకికి నా జాకెట్టు, చీరా ఇచ్చాగా ఏమిటి?" సూటిగావేసింది.

తెల్లబోయే, "లేదే"

"అవికనుపించటం లేదండి!"

"నాచార్లచొక్కా, బనీనులు కూడా కన్పించటంలేదు. నిన్ను అడుగుదామనుకుంటున్నా." పీఠికా ప్రారంభం అటువైపునుండి వచ్చినందుకు సంతోషపడుతూ.

"ఏమిటీ?" ఆశ్చర్యంలోనే అంది.

"మాయమై పోయేయి"

ఏం మాట్లాడకుండా, తలోసారి పరికించి, కప్పులు, సాసర్లూ లోపలికి తీసుకువెళ్ళిపోయింది. మౌనం నన్ను ఇరుకున పడేసింది. ఏదోఅనునయంగా ఓమాటో, కనుక్కుంటా అన్న ఆశో, వెతుకుతా అన్న ఆతృతో కన్పరిస్తే ఇంతగా బాధపడే వాణ్ణికాదు.

ఆ రెండుచేతుల బరువుతోనూ, ఆవ్రగా, కుదుమట్టంగా మధ్యపాపిడి, తేనెరంగు కళ్ళతోఉన్న సుందర్ని చూస్తుంటే పెళ్ళయి తొమ్మిది నెలలు దాటింది. ఇంకా ఎంతకాలానికి ఈ విడిని అర్థంచేసుకోగలనా అన్న ప్రశ్న నన్ను అడుగుతోంది.

అసలు సుందరివచ్చినప్పటినుండే జీవితాన్ని రెండు దృక్పథాల్తో చూడవలసి వస్తోంది.

*　　*　　*

దీపావళికి కావలసిన సరకులు కొనుక్కొని చీకటిపడే వేళకి ఇంటికిచేరాను. కాంపౌండు గేటు తీసేటప్పటికి ఇంట్లో ఏదో రాద్ధాంతం జరుగు తోందనిపించింది. సుందరి ఎవర్నో తిట్టేస్తోంది.

గుమ్మంమెట్లు ఎక్కా. సావిట్లో పనిచేసే అప్పలమ్మ, కుర్రాడు వెంకన్న, బంట్రోతు సూరన్న, పిల్లలక్ష్మి, నుంచునివున్నారు. సుందరి ఎదురుగానుంచుని, అప్పలమ్మని నువ్వు "తీసేవా? లేదా?" అని నిలదీసి అడుగుతోంది.

వీధిగుమ్మానికి అర్థంకాక చేర్లపడ్డా. "నేను నిన్ను మేడ మీద అలమార్లో అద్దం, దువ్వెన్నా ఉందని పంపింతే అద్దం అవీ తెచ్చియిచ్చేవు. ప్రక్కగావున్న ఐదురూయలచిల్లర్లోను పావలా ఎలా తక్కువవుతుంది?" అప్పలమ్మ తలవంచేసింది.

"మాట్లాడవేం సూరన్నా! అక్కడ చిల్లర పావుఘంట క్రితం నువ్వెయెంత పెట్టేవు?"

"ఐదురూపాయలదండి అమ్మగారు?"

"మరి పావులా ఎల్లా తక్కువైంది. నేను కూడా వెళ్ళి చూచానే..."

ఆ వరసలో అప్పలమ్మ దూషిత్వాన్ని ఋజువు చేరచింది. వెంకన్నా, సూరన్నా, లక్ష్మి కూడా అప్పలమ్మకి ఏ సహాయం చెయ్యలేక పోయేరు.

అప్పలమ్మ, సిగ్గుతో కుళ్ళిపోయే, తప్పిదం ఒప్పుకుంది. నాకు జాలికల్గుతోంది.

"అయితే, అయ్యగారి చొక్కా, బనీనులు, నాచీర, జాకెట్టూకూడా నువ్వే మాయంచేసేవన్నమాట ..అవునా?

ఆ అడగడంలోని ప్లీడరీ నన్ను ఆశ్చర్యపరిచింది. కూడా ముగ్గురు తెల్లబోయేరు. ఈ సారి ఎవరి భుజాల మీద నేరం పడుతుందో అని.

"అసలు బుద్ధిపుట్టకూడదు పుట్టిందాఒదలదు. నిజంచెప్పు తీసేవా?" సుందరి నిలత్రొక్కింది.

"వాళ్ళందర్నీ కూడా మేడమీదికిపంపానే. ఒకళ్ళూ అంత చిల్లరవుంటే తియ్యలేదు. నీకే ఆబుద్ధివుంది..."

అప్పలమ్మకి ఇకనోరు కట్టినట్టేఅయ్యింది. ముగ్గురు తేలిక పడ్డారు. ఏడుస్తూనే "దొంగిలించేనండి క్షమించండి...ఇంకెప్పుడూ అల్లాంటి పనులు చెయ్యనండి..."అని ఏడ్చింది.

"మరి అల్లాంటివి చెయ్యవచ్చా? నిన్ను నమ్మకునే కదా ఇల్లంతా ఒదిలివేసే..."అంది.

ఇంకేం అనకుండానే వాళ్ళని వెళ్ళమంది. అప్పలమ్మ గుమ్మందాటుతుంటేనే'అప్పలమ్మ'అంది. దాంతో ప్రాణాలు పోయేయిదానికి. "రేపుపనిలోకి రావడంమానకు. దీపావళి పండుగ కూడాను" అంది.

అంతవరకూ కూలివాడి నెత్తిమీదసామాను అల్లాగేవుంది. నేను గుమ్మానికిఆనుకునే ఉండిపోయా. "రండి" అంటూనే చిరునవ్వు నవ్వేసింది. నవ్వుతుంటే బుగ్గలు అందంగా సొట్ట పోతాయి సుందరికి.

లోపల అడుగుపెడుతూనే "అయితే శ్రీమతి 'డిటెక్టివ్' సుందరిగారు దొంగని పట్టుకున్నారన్నమాట."

"పోదురు! మీదంతా వేళాకోళం"

"అబ్బెబ్బె! లేదు మీరంటే గౌరవం" అన్నా.

ఒక్కటి మాత్రం నాకు అర్థంకాలేదు. ఒక్కఅప్పలమ్మ తీసిందని నిర్ధారణఏముందీ అని ఆలోచించా భోజనంచేసే టప్పుడూ...

" సాయంత్రం నాలుగు అలమారులలోను చిల్లర పెట్టే. నలుగుర్నీ నాలుగుపనులు పురమాయించిపంపే ఒక్క అప్పలమ్మ వెళ్ళిన అలమారులోనే పావులా తక్కువైంది..."

ఇక అర్థమే అయ్యింది.

మర్నాడు అప్పలమ్మని మధ్యాహ్నం పిలిచి, చీర ఒకటి ఇస్తూనే "ఎప్పుడూ అల్లాంటిపని చెయ్యకూ. అడిగితే నే నివ్వనా, బాబుగారివ్వరా?" అంది.

అప్పలమ్మ ఓసారి నమ్మలేని కళ్ళతో నమస్కారం చేస్తూనే గుమ్మందాటింది. కళ్ళప్పగించి అల్లా చూస్తూవుండి పోయే.

"ఏమిటీ చూస్తున్నారు" అంది కొంటెగా డిగ్రేట్ డిటెక్టివ్ సుందరిగారు. 'హూత్' అంటూనే చేతులు భుజం మీదవేసి "భయపడకండి...దేవుడు అభయహస్త మిస్తు న్నాడు"అంది.

నవ్వుకున్నాం.



# అంతర జ్యోతి



నీతి - జ్యోతి
అనురాగరసం - చమురు
హృత్కమలం - ప్రమిద

శ్రీమతి దొప్పలపూడి అనసూయగారు

" నీతిలేకున్న జగతివిఖ్యాతిలేదు
నీతిలేకున్న మతికి సంప్రీతిలేదు
నీతిలేకున్న యాత్మకు జ్యోతిలేదు
యేదియును నీతికిల సాటి రాదు మనస "

అని ఆర్యవచనం. నీకు లక్షలాది ధనమున్ననూ, పెక్కు విద్యలందు ప్రావీణ్యమున్ననూ, గొప్ప అధికారమున్ననూ, గొప్పగొప్ప బిరుదులున్ననూ అంతరంగము చీకటిమయమై యుండెనేని ప్రశాంతమైన హాయిని పొందజాలవు.

మన పూజ్యబాపూజీ యిట్లునుడివెను " అంతరంగముయెదుట అసత్యముగానుండేకంటే లోకమునకు అసత్యముగానుండుటవేయిరెట్లుమిన్న. " దీనినిబట్టి బయటి ప్రకృతిలో మంచిని సంపాదించుకొనుటకంటే లోపలి ప్రకృతిలో మంచిని సంపాదించుట చాలరెట్లు కష్టసాధ్యమని తేలుచున్నది.

నీలో అంతర్భూతమైయుండు అసుర గుణములను నశింపజేసుకొని దైవగుణములను వృద్ధిచేసుకోవాలి.

నీకు యొకమిత్రము మిక్కిలి యిష్టమైన తినుబండరములు కొన్ని తెచ్చి యిచ్చుచూ " నేను మరల వత్తును వచ్చులోపల వీనిని యెంగిలిపరచకు " మని చెప్పు ననుకొనుము. నీవుసరియె నందువు. మిత్రము వెళ్లిన తరువాత నీలోనిఅసుర గుణము "అయినా కొంచెమునోట్లో వేసుకొంటే ముంచుకుపోయేదేముంది?" అంటుంది. "ఛీ! తినవలదని చెప్పినపుడు వప్పుకొని చాటుగ యెంగిలిపరచటం భావ్యంకా "దని దైవగుణము మందలిస్తుంది. నీవు దేనిని విశ్వసిస్తావో దానికి బలమౌతుంది. అట్లు కొన్ని సారులు జరిగిన తరువాత నీవు దైవగుణములకుప్రాధాన్యమిస్తే అసురగుణములు క్రమముగ నశిస్తాయి. అసుర గుణములకు ప్రాధాన్యమిస్తే దైవగుణములు తలచూపవు.

దైవగుణములను వృద్ధిచేసుకొనుటకు ముఖ్య

సాధనము దైవధ్యానము. దైవప్రార్థనమువలన మనోమాలిన్యములు ప్రక్షాళనమౌను. ప్రార్థన వాణీ వైభవము కాదనియూ, దానికి కాణాచి నాలుక కాదు హృదయమనియూ బాపూజీ చెప్పెను. దైవచింతనమువలన దుష్టగుణములకు నెలవు చిక్కక హృదయము శుభగుణముల కాలవాలమగును. అట్టి అంతరంగమందు అనురాగపు వూటజనించును. ఆ యనురాగమునందు నిలిపిన నీతియేజ్యోతియై బ్రతుకును ప్రకాశింపజేయును. అట్టివారి మోము ప్రశాంత సుందరమై ఆకర్షణీయముగనుండును. కన్నులు కాంతులు వెదజల్లును.

సౌందర్యమే ప్రేమ. ప్రేమయే సౌందర్యము. రెండును త్యాగములె అని పెద్దలవచనము. అనురాగ రహితాంతః కరణులై అరిదము కొఱకు పై వేషము లెన్ని వేసిననూ, హృదయ ప్రకాశితమైన యందమునకూ దీనికీ హస్తిమశకాంతరముండును. నగల తళతళలు, వన్నె బట్టల విలాసములు సుకృత శోభిత స్వాంతములయొక్క ఆకర్షణశక్తిని తగ్గించునే కాని యెక్కువ చేయలేవు, అని ఆర్యోక్తి. వదనము హృదయమునకు ప్రతిబింబము. క్రోధముగాని, హర్షముగాని గుండెలో జనించగనే అది వదనమున గోచరించును. మహాత్ములు హృదయమును చూతురు కాని పైపైని చూడరని పెద్దలు నుడివిరి.

బాపూజీ మొదలగు వారు ఆత్మ పరిశుద్ధత వల్లనే మహాత్ములైరి. సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి, మొదలగు పురాణ యుగము నాటి సతీమణుల జీవితములలో త్యాగయుతమైన ప్రేమ గోచరిస్తుంది.

మన గ్రంథ రాజములలో మహర్షులు దివ్యదృష్టిని పొందినట్లువుంది. ఆత్మశక్తికి అసాధ్యమగునది లేదుగదా !

ఆత్మసంస్కర్తవై అంతరంగమునుపరిశుద్ధము చేసుకొనుటలో కృతార్థత చెందితివేని లోకములో సత్కీర్తి నీవుకోరకున్ననూ వ్యాపిస్తుంది. మలినయుతాంత రంగముతో సంఘ సంస్కర్తవై గొప్ప కీర్తిని గణించగోరి యితరులకు చేయుబోధనలు, సభలలోచేయు గంభీరోపన్యాసములువ్యర్థ ప్రలాపములు. తమధర్మములుమాత్రము తాము విడచి యితరుల ధర్మము లిట్టివని చెప్పుట దుష్టజనలక్షణమని పెద్దలనుడువు. యింటగెలచిరచ్చగెలువ మనిరి. యిచట గేహము దేహమునకు గూడ అన్వయిస్తుంది.

మన దేశనాయకులు ఆత్మశక్తిచేతనే అహింసాయుతముగ దేశమాత దాస్యమును బాపిరి. స్వారాజ్య పరిపాలనాపద్ధతులు ఆత్మశక్తి ననుసరించియే జరుగనున్నవి. స్వారాజ్యము రామరాజ్యమువోలె విలసిల్లుటకు ప్రతి యొక్కరూ చేయవలసిన కృత్యము స్వదోష బహిష్కరణము.

దీపావళి వివిధవిధములుగా వెలుగునుసృష్టించుకొని వేడుకపడుటకై యేర్పడినపండుగ. ప్రతి యింట గృహిణి ప్రమిదలలో పెక్కుదీపములను వెలిగించి గృహమునందు తగుచోట్లదిద్దితీర్చి సంతసించును. బాలిక గుమ్మటమునందు దీపము వెలిగించి గిరగిర త్రిప్పుచూ హర్షించును. బాలుడు మతాబాలూ, పువ్వొత్తులూ, చిచ్చుబుడ్లూ వగైరా మందుసామానులను వెలిగించుచూ పొంగుచుండును. గృహస్థు తాను వెలిగించియూ, తమవారు వెలిగించుట గాంచియూ మురిసిపోవును.

యీ పండుగనాడు కలిగే సంతసమూ వెలుగూ జీవితము పొడుగునా ప్రభవించుటకై అంతరజ్యోతిని వెలిగించుకొనుటకై నేడే ప్రయత్నింతము.

★

# భారతశ్రీ

శ్రీ ముళ్లపూడి నరసరాజుగారు

పారతంత్ర్యము వీడి
ప్రసవవేదన తీరి
మాతృ రూపము దాల్చి
మహిత భాగ్యములందెగా
మనతల్లి
నవ్య శోభలు చిందెగా !

భారతీయుల భాగ్య
స్వాతంత్ర్యభాను
ఉదయగీతికారావ
మాశాచయమ్ములు నిండగా
మనతల్లి
నవనవోన్మిషిత మాయెగా !

గాఢ సుషుప్తిని వీడి
దీర్ఘ నిట్టూర్పులను
సడలించి బడలించి
స్మితపూర్వ మోముతో
మనతల్లి
చైతన్యమై యొప్పెగా !

నవయుగ నాటకా
రంభదశయందు
నాంది పద్యములతో
నూత్న రూపము దాల్చెగా
మనతల్లి
నవ్య శోభలు పరిపెగా !

కలువపూ పాత్రలో
మధురమధువును నింపి
కన్నె విరులును మే
ల్కొలుపుల పాడ
మనతల్లి
నవ్య శోభతో వెలిగెగా !



# ఈ నాటి దీపావళి

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

అనాదినుంచి మన పండుగలన్నిటికి కూడ తలొక కారణము గలదు. ముఖ్యముగా అసుర సంహారముల తర్వాత గలిగే శుభములే పండుగ రూపములుగా ప్రజలు చేసికొనుచున్నారు. "దసరా" అంటే, మహిషాసుర సంహారము, దేవి రౌద్రమూర్తియై, మహాకాళిగా లోక కంటకులైన రాక్షసులను సంహరించి, లోక శాంతి చేసిన సంతోషములే దశదిన వేడుకలు. రాజ్య కాంక్షచే క్షత్రియులు విజయ భేరీలు మ్రోయించి, శరదృతువైన ఆశ్వీయుజములో బాణబాణాదికములు చేబూని, చతురంగ బల యుతులై పరరాజులపైని యుద్ధ సన్నధులగుటయే, విజయదశమి పండుగ.

ఇక "దీపావళి" పండుగ సంగతి గమనించెదము. అది సత్యభామా సహితుడైన శ్రీకృష్ణుడు లోక కంటకుడై, మహామునులను, దిక్పాలురను బాధించి నారీలోకమును బాధించి బంధించి భరింపరాని కల్లోలములను కల్పించిన పాపాత్ముడైన నరకాసుర సంహారమును చేసిన నాటి దినమే. లోకమెల్ల ఘోరాసుర తిమిరాంధకారము తొలగెనన్న సంతోషముచే దీపావళులచే స్త్రీలు తమ యిండ్లను కాంతివంతము చేసికొనుటయు ఆ బాలగోపాలము అభ్యంగనము లొనరించి తీయని పిండి వంటలు స్వీకరించి, దివిటీలు బాణ సంచాకాల్పులు, నూతన వస్త్ర ధారణములు మొదలగు ఆనంద వెల్లువలలో తాండవించుచు నత్యంత శుభ దినముగా ఆసేతు హిమవన్నగము వరకు కూడ పండుగగా చేసికొనుట ఆ నాటి నుండియు జరుగుచున్నది.

ఈ నాటి "దీపావళి" యుత్సవముకూడ తిరిగి లోకకంటకులై మహామ్మారులై గోవధ, స్త్రీవధ, బాలహత్యానేక గృహదహన పరంపరల చిత్రవధలచే బాధించిన, అసురతుల్యులను హతమార్చి, దేశకల్లోలములణచివేసి, భూభారమును దీర్చిన మన నాయకులకు, హారతులెత్తి, జే జే లొనరించి, భారతాంబ కన్నీళ్లను తుడిచి లోక శాంతిని పొందచేసిన యీ నాటికే నిజమైన "దీపావళి అమావాస్య" పండుగగును. ఆ నాటి "దీపావళి" పౌరాణిక విదితముగా విని చేసికొనుచున్నాము. ఈ నాటి "దీపావళి" కనులార గాంచియు, చేతులార చేసికొనియు, మనసార ననుభవించియు చేసికొన గలము. మన కీ పండుగ స్వాతంత్ర్య సంతోషములలో వచ్చిన తొలి కానుక. దసరా యుత్సవము లీ నాటికి మన తల్లికి రెండు కానుక లమరినవి కాని అవి అసంపూర్తియైనవి. ఈ నాటి "దీపావళి" పండుగ ధగద్ధగిత జగజ్జేగేయమానముగా ప్రకాశించెడి, దీపావళీ రత్నహార కానుకగా తల్లి మెడలో వేసి ఇంటింట నామె కారతులెత్తుదము.

"బూరుగువృక్షము-పచ్చగడ్డి" కథలో తలెత్తినా చెదరక నిలబడితినన్న అహంభావముచే

## ఈ నా టి దీ పా వ ళీ

బూరుగు వృక్షము గరిక చేనును అధిక్షేపించి, చివరకు మహావాయు వీచికలకు నేల మట్ట ముగా నేరుగుటయు, పొట్టివై, చిన్నవిగా యున్న సస్యములు నిలబడి బూరుగు వృక్ష మునకు బుద్ధి చెప్పుటయు మనము పాఠ్య పుస్తకములలో చదివి యున్నాము. అట్లే అధర్మమును తుదముట్టించి దుర్మార్గ అసుర సంహార మొనరించి ధర్మానీక సస్యశ్యామల వసుంధరాదేవికి మాతృ భక్తి పరాయణ ముద్దు బిడ్డ లిచ్చు విజయ సూచక ఆనంద మయ రత్నఖచిత చిహ్న తొలికానుక ఈ దీపావళి. దీనిని మన తల్లి కర్పించి నేటికి నిజమైన దీపావళి పండుగ చేసికొందము గాక. "ఇంటింట దీపావళీ, దేశమంత దీపావళీ" యని పాడుకొనుచు, ఆబాలగోపాలము కార్తీక మాసారంభపు అమావాస్యను జయప్రదముగా నొనరించిన నాయక మణులకు హారతులిచ్చి దీవించి ఆనందించెదము గాక!

జై హిం ద్

ఓం శాంతిః శాంతిః శాంతిః



## "బంగారు నా లచ్చి"

శ్రీ మేడూరి వెంకటప్పయ్య శర్మగారు

పుట్టెడు దిగులునూ
గట్టిబెట్టే నాకు - రయిలు
పెట్టెక్కి నాలచ్చి
పుట్టింటి కెళ్లింది
గుండెలో - యేలకో
బండ బడ్డాదోయీ!

పొగరుతో - లచ్చితో
పొగలనూ జిమ్ముచూ
వేగమున బోయింది
దిగులు నంటాగట్టి
గుండెలో - యేలకో
బండ బడ్డాదోయీ!

బంగారు నా లచ్చి
బండి కదలంగనే
పలుమారు చేయూచి
ప్రణయంబు రేపింది
గుండెలో - యేలకో
బండ బడ్డాదోయీ!



# సద్గ్రంథపఠన జ్ఞానార్జన



## ( జిజ్ఞాస - విజ్ఞాన దృష్టి )

జిజ్ఞాస—విజ్ఞాన దృష్టి మానవ సహజము లైనవి. సృష్టి వికాసంలో మానవుడు పశుప్రాయత్వాన్ని వీడి కొంత విచక్షణ దృష్టి కల్గినదాదిగా—అనంత సృష్టి ప్రదర్శనాన్ని తిలకించి తన నిజ స్వరూపాన్ని గురించి చింతించి, వీటి రహస్యాల్ని గ్రహించ ప్రయత్నించి, తానవగాహన మొనర్చుకొన్న వాటిని పరులకు తెలియ జెప్పి, తాను పొందే ఆత్మానందాన్ని యితరులకు కూడా కలిగించాలన్న ఆదుర్దాతో కొట్టుకొంటున్న విషయం గుర్తిస్తే ఆది మహా ఋషుల రచనలు మొదలు ఆధునిక శాస్త్ర వేత్తల ప్రచారాలవరకు తిలకిస్తే—'జిజ్ఞాస—విజ్ఞాన దృష్టి' మానవ సహజాలన్న సంగతి బాగా విశదమాతుంది.

కాని, ఈ జ్ఞానార్జనానికి పల్వురు, పలుశతాబ్దాలలో పలువిధాల కృషి చేసిరన్న విషయం గుర్తించదగ్గది. మతాలవల్ల, తపాలవల్ల ప్రకృతి పరిశోధనలవల్ల, చివరకు లోక జీవనంవల్లకూడా కొంతి కొంత జ్ఞానం లభిస్తూవచ్చింది. "జ్ఞాన" మంటే—సృష్టిలోని వస్తుజాలాన్ని గురించి విషయాల్ని గురించి మానవుడు తన యింద్రియాల ద్వారా యెరుగ నయ్యే విషయ సంచయమని ఒక తెగవారి అభిప్రాయం. ఈ మాదిరి జ్ఞానం, చాలవరకు పాశ్చాత్య శాస్త్రాలవల్ల లభిస్తుంది. ఇంద్రియాదిష్టములయ్యే భౌతిక వస్తువుల్ని గురించేగాక, తదితరములైన సర్వాన్ని గురించీ కూడా తెలిసికొని, ఇదమిథ్యమని నిరూపించ గలిగి యుక్తాయుక్త వివేకంతో సృష్టికి—తనకు—సృష్టి కర్తకుగల భిన్నత్వమే కత్వాల్ని గ్రహించగలగడం ఆదిగాగలదేదై తేయుందో అదే "నిజమైన జ్ఞాన" మని మన భారతీయుల దృష్టిలో అర్థం అని తేలుతూయుంది. "కస్మిన్ను

---

మహాత్ముల పాదరేణువు

---

భగవో విజ్ఞాతో — సర్వమిదం విజ్ఞాతం భవతి" దేన్ని తెలుసుకోవడంవల్ల సర్వాన్నీ తెలుసుకోవడం అవుతుందో అదే "విజ్ఞానం" అన్నారు పెద్దలు. దీన్ని సాధించడానికై యుండే మనోవాంఛనే "జిజ్ఞాస" అన్నారు.

ఎవరు దేన్ని విజ్ఞానమనుకున్నా, మానవ బుద్ధికి, ఈ సృష్టిలోని వస్తు జాలాన్ని గురించీ, తన్నుగురించీ తెలుసుకోవాలన్న అభిలాష, వీటి ఆది-క్రమం-అవధి యెరిగికోవాలన్న కుతూహలమూ, సహజంగా ఉందనడం మాత్రం నిజం. ఆ అభిలాషయే ఇంతవరకు మనిషి సేకరించిపెట్టిన సర్వజ్ఞానానికీ మూలమైంది. కాని, పాశ్చాత్య శాస్త్రిలు, కేవలం భౌతికవస్తు పరిశోధనతో సంతుష్టిపడి ఉండిపోయినయి; భారతీయులు భౌతికేతరాన్ని శోధించి "కస్త్వం? కుత ఆజాత?" అని తమ్ముతామే శోధించుకొని, అపూర్వమైన ఆధ్యాత్మిక రహస్యాల్ని సాధించేరు. (విశ్వమనే) అనంత విస్తృతమైన గొప్ప ఫలవృక్షాన్ని చూస్తూ, దానికొమ్మలు రెమ్మలు ఆకులు లెక్కలుగడుతూ, ఆ లెక్కలతోటే సంతుష్టిపడే గణిత శిఖామణి ఒకడట; నేరుగబోయి, ఫలాల్ని చేజిక్కించుకొని, చవిజూచి, ఆశ్చర్యానందాలతో తన్మయుడయ్యే జిజ్ఞాసాపిపాసియొకడట. మొదటివాడు పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు, రెండవవాడు భారతీయుడునని ఒక మహానుభావుడన్నాడు.

భౌతిక దృష్టితో చూచినప్పటికీకూడా, అనంతంగాతోచే అనంత నామరూపాలతో గాన్పించే సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణువు మొదలు బ్రహ్మాండమైన నెబ్యులాలవరకు ఒక నియమిత విధానంలో క్రమరీతిని తిరుగాడే, ఈ బాహ్య విశ్వమే చిత్రం! దానిలో ఎక్కడా పొడగట్టని 'జీవం' అనబడే అపూర్వం మన యీ చిన్న భూగోళం మీద ఉద్భవం కావడం చిత్రంలో చిత్రం!! అలాంటి జీవులన్నిటికంటె మహోత్కృష్టమైన మానవుడు యీ నాటక రంగంలో తయారవడం అంతకన్నా చిత్రం!!! వీని చిన్నబుర్రకు అండపిండబ్రహ్మాండాల్ని గురించి తెలుసుకొని వాటిని తనలో యిముడ్చుకోగల మనోవికాసంగలగడమూ, తనలో జూచుకుని "అహం బ్రహ్మాస్మి"యని, బాహ్యాన్నిగాంచి "తత్వంఅసి" అని అరయగల సామర్థ్యంగలగడం, చిత్రాతి చిత్ర విచిత్రమైన విషయం!!!! నిజంగా చూస్తే మానవుడు సృష్టి వికాసానికి అవధి. ద్రవ్యం—ప్రాణం—మనస్సు అపూర్వంగా సంఘటన పొందిన మానవ శరీర యంత్రం జ్ఞానార్జనానికి సాధన భూతమైయుంది. అందుకే "మానవ జన్మ మహత్తపూర్ణమైనద"ని పెద్దలన్నారు.

ఇట్టి దుర్లభమైన మానవ జన్మమెత్తికూడా, (పశు పక్షి మృగాదులవలె ఆహార నిద్రా సుఖ వాంఛలతో సంతుష్టిపడి) జ్ఞానార్జనానికి యత్నించక పోవడంకంటె శోచనీయాంశం మరొకటి లేదు. "........మోక్ష సాధన మీమేను— వృథా నశించునని సంతాపించెదన్, వేగమీ తనువెత్తించిన మేలొసంగు పరమాత్మా!" అని ఒక మహాత్ముడు తల్లడిల్లి పోయేడు. "....జగతి బుట్టిపుట్టి, చచ్చిచచ్చి, పొరలనేల మనకు— బుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి"

# సద్గ్రంధపఠన జ్ఞానార్జన

అని బాలుడైనా ప్రహ్లాదుడు దివ్యంగా ప్రబోధించాడు. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవారెన్ని బోధిత" (లెమ్ము, మేల్కొనుము, గమ్యస్థాన పర్యంతము ఆగబోకుము) అని వివేకానందుడు సింహ ఘర్జన గావించాడు.

అందుచేత జ్ఞానార్జనయే మానవ జీవితపు ముఖ్య కర్తవ్యమని గుర్తించి, మానవుడు ఇహ లోక భయ విషాదులనుండి విమోచనమునంది, నిత్యానంద సుఖశాంతుల ననుభవించడానికి జ్ఞానమే పరమ సాధనమని పెద్దలన్నారు. జ్ఞానమనగా లోకోత్తర ప్రతిభాసంపన్నులైన మహాపురుషుల, పతివ్రతామ తల్లుల జీవిత అనుభవ విశేషమే. అట్టి జ్ఞానం కొంత భాషాబద్ధమై గ్రంధస్థమైయుంది. మహాపురుషులతో ముఖాముఖి భాషించగల భాగ్యమెందరికోగాని లభించదు. కాని, వారి జీవిత చరిత్రలు, ప్రబోధ వాక్యాలు అందరికీ లభ్యములై యుంటాయి. రామాయణ, భారత, భాగవతాది గ్రంధాలు భగవద్గీత, శ్రీ రామకృష్ణ వివేకానంద, గాంధి, యిత్యాది మహాపురుషుల జీవిత చరిత్రలు, వారి వారి బోధామృత వాక్యాలు పఠించవలసి యుంది. విస్తార గ్రంధ పఠనకంటె అందు గ్రహించిన ఏ కొద్ది విషయాలనైనా జీవితంలో అవలంబించడం ముఖ్యం.

"ఎఱుకగలవారి చరితలు -
గఱచుచు సజ్జనుల గోష్టిఁ గదలకధర్మం
బెఱుగుచు నెఱిఁగిన దానిని -
మఱవ కనుష్టించునది సమంజస బుద్ధిన్"

అని భారతోక్తి

"అనంతశాస్త్రం - బహువేదితవ్య, అల్పశ్చకాలో - బహుపశ్చ విఘ్ను!" అని మహాపురుషుల హెచ్చరిక గనుక ఎవరి కేయే గ్రంధం, మార్గం నచ్చితే దాని ననుసరించే తరించవచ్చునని మహాత్ముల మార్గ దర్శక వాక్యాలు.



# నేటి భారతావని పౌరులుగా స్త్రీల బాధ్యత

* శ్రీ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తిగారు *

నిఘంటువులు "పౌరుడు" అనే పదాన్ని కొన్ని హక్కులను, కొన్ని స్వేచ్ఛాభావాలను కలిగిన పురవాసి అని నిర్వచిస్తై. కాలగమనంలో అన్నింటిలాగే పదార్థాలకు కూడ మార్పు వాటిల్లింది. అందుకనే, ఈనాడు పౌరుడు అంటే కేవలం కొన్ని హక్కుల ననుభవించే పురవాసి అని మాత్రమే కాక, మన ప్రజాబాహుళ్యాని కంతటికీ ఆమాట ఒక విశేషార్థాన్ని ప్రసాదించేదిగా మారింది. పూర్వంకన్నా, స్థూల దృష్టితో చూచి మనం ఇప్పుడు నిర్వచించుకుంటున్నాం.

ఆంగ్ల భాషలో "సిటీ" "సిటిజన్" అనే పదాలకు సరియైన అర్థాన్ని తెలుసుకోవాలంటే, గ్రీకురోమను కాలాల దాకా వెనుకంజ వేయాలి. వారి "సిటీ" అనే పదం ఒక ప్రదేశాన్ని, ఒకపురాన్ని, ఒక పట్టణాన్ని సూచించక, అది ఒక ప్రజ కావాసస్థానమైన సంస్థగాను, సంస్థానంగాను, ప్రజా బాహుళ్యపు ఒక విధమైన రాజకీయ సంఘంగాను వ్యవహరింప బడుతూ ఉండేది. తానొక సభ్యుడుగానున్న జాతియొక్క సాధక బాధకాలను చర్చించి, రీతి నీతులను యోచించి, యోగక్షేమాలను చేకూర్చేటందుకు రాజ్యాంగ నిర్వహణలోను, న్యాయ శాస్త్ర నియమ పోషణలోను పాల్గొనటానికి హక్కుగల వ్యక్తే "పౌరుడు" అని అరిస్టాటిల్ నిర్వచనం. కాబట్టి స్వతంత్ర రాజ్యంలోనే ఒక పౌరుడు అనే వాడు ఉండగలడు. పౌర బాహుళ్యంతో నిండిన రాజ్యం జీవిత విషయాలను సక్రమంగా నిర్వర్తించటానికి చాలునని అరిస్టాటిల్ విశ్వసించాడు. ఒక్క వాక్యంలో, పౌరుడు అంటే తానొరులను పాలిస్తూ, ఒరులచేపాలింపబడుతూ స్వజాతి యోగక్షేమాదులకు, స్వజాత్యభ్యున్నతికి దోహదమిచ్చేవ్యక్తి. తొలునాళ్ల ఏథెన్సులోను, ఇతర గ్రీకు జాతులలోను పౌర హక్కులు ఆయా జాతులకు చెందినవారిచే ఏర్పరుప బడుతూవచ్చినై. కాని, రాను రాను గ్రీకు సాంఘిక నైతిక రాజకీయ జీవితాలలో మరికొంత పరిపూర్ణత సిద్ధించే సరికి పౌర హక్కుల నిర్ణయం కష్టమైంది. స్వదేశ సేవకు ప్రతిగ్రీకు యువకుని జీవితమును ధారాగతం చేసి, జీవితకుసుమాంజలి ఘటించే మహోత్కృష్ట సన్నివేశం మనదేశంలోకూడ మన భారతావనిలో కూడ మన యువకుని మార్గదర్శిగాను, ఉద్రేకోత్సాహ ప్రదాతగాను వెలసి ఉంటే బాగుండేది. పౌరసత్వపు హక్కులు గ్రీకు రోమనుల కాలాలలో పరమార్థమైన సంపద. పౌరసత్వంతో హక్కులకుగల యీసంబంధం నేటిదాకావచ్చింది. ప్రప్రథమంలో పూర్వపు గ్రీకు రోములలో జాతీయ ప్రభుత్వం నెలకొన్నప్పుడు స్త్రీలకు రాజ్యాంగంలో భాగంలేదు. నాడు పౌరసత్వమునకు పుంస్త్వమునకు ఒక వెర్రి సంబంధముండేది. 19 వ శతాబ్దం వరకు లింగభేదాలను పాటించటం, దాని మూలాన దైవసృష్టిలో ఒక తెగకు అతివృష్టి, మరొక భాగానికి అనావృష్టి ప్రబలింది.

సివిక్సు—పౌరసత్వపు సిద్ధాంతాలూ, పౌరులబాధ్యతలూ నేడు సాంఘిక విజ్ఞాన శాస్త్రంగా పరిగణింప బడుతున్నది. కొందరు దీనిని నాగరికతా శాస్త్రము అని కూడా అనజొచ్చారు. ఎందుకంటే "పౌరసత్వము, సివిక్సు, నాగరికత" అనే మూడు మాటలూ 'సిటిజన్' అనే అర్థంగల ల్యాటినుమాట 'సివిస్' నుండి ఉద్భవించినై. దీనికీ రాజకీయానికీ గల సంబంధం వివరింపతగినదే. పౌరుడు అనే పదానికి అరిస్టాటిల్ నిర్వచనం ముఖ్యంగా రాజకీయంగాను, సంస్థాన సంబంధంగాను మాత్రమే. గ్రీకులు వారి పురసంస్థానాలలో గొప్ప సాంఘిక, రాజకీయ జీవితాలను అభివృద్ధి పరచుకున్నారు. తెనుగులో పురము. ఆంగ్లంలో సిటి. గ్రీకులో పొలిస్. గ్రీకుల ప్రభుత్వం వంటి ప్రభుత్వాన్నే రోమన్లూ తమపురంలో "సివిటాస్"లో— నెలకొల్పుకొన్నారు. అంటే ఏవిధంగా గ్రీకుల పట్టణ వ్యవహార విషయాలకు వర్తించేదో, ఆ విధంగానే సివిక్సు అంటే

రాజకుమారి అమృత్ కౌర్ గారి ఆంగ్ల వ్యాసం ఆధారం

ఇటలీ వారి పుర వ్యవహారాలను సూచించేది. ఈ రెండు మూలంలో సమానార్థాలే. పొలిటిక్సు అనేపదం ముఖ్యంగా జాతీ యాంతర్జాతీయ వ్యవహారాలకు ఉపయోగింప బడు తున్నది. అది రాజకీయ పద్ధతులకు, రాజకీయ సంస్థలకు కారణ భూతమై, పౌర హక్కులను నిర్దేశించి, వానిని రక్షించే సాధనోపాయాలను గూర్చి వివరిస్తుంది. సివిక్సు ముఖ్యంగా విధులను, ధర్మాలను, నియమాలను గురించీ, విద్యనుగురించీ, అన్నింటినీ చక్కగా నిర్వర్తించు కోటానికి కావలసిన శీలాన్నిగురించీ చెబుతుంది. ముందంజ వేస్తూ, అభ్యున్నతినిగాంచుతున్న నాగరికతవల్ల "సివిక్సు" శాస్త్రం అన్ని జీవిత విభాగాలను—ఆర్థిక, దైవిక, సాంఘిక, సాహిత్యవిషయాలను తనలోనే యిముడ్చుకున్నది. ఐరోపా దేశపు సివిక్సుశాస్త్రం గ్రీకు రోమనుల పరంపరాగతా చారాలపై ఆధారపడి, వివిధ దేశాలలో జాతీయాచారాలకూ, జాతీయభావాలకు, జాతీయావసరాలకు అనువైనమార్పులకు లోనై వైవిధ్యాన్నిదాల్చింది. మనదేశంలో, హిందూ ధర్మ శాస్త్రాలు మానవుడు కుటుంబాని కోసం తననూ, గ్రామం కోసం కుటుంబాన్నీ, దేశంకోసం గ్రామాన్నీ, నిజాత్మకోసం ప్రపంచాన్నీ త్యాగంచేయాలని నిర్దేశిస్తున్నై. హిందూసాంప్ర దాయపు పౌరసత్వపు చట్టాలు అంతగా రాజకీయం కావు, అవి సాంఘికమూ, ఆధ్యాత్మికమూ, ఎందుకంటే, ఆత్మ సంస్కారమూ, ముక్తి మన మన సాంప్రదాయంలో మహోత్కృష్టమైన పరమార్థాలు. పౌరుడంటే కేవలం హక్కుల ననుభవిస్తూ, సంఘంలో సభ్యుడుగాఉండి, అక్కడి చట్టాలకుబద్ధుడై ఉండటమేకాక, తానా సంఘంలో, ఆ సంస్థానంలో ఒక ప్రత్యేక సభ్యుడని తానుకూడ ఆ ప్రభుత్వ దైనందిన జీవితంలో ఒక భాగమనీ అనుకోవాలి. కేవలం ఆదేశపు ఎల్లలలో ఉండటంవల్ల అతడందులో ఒక భాగం కాదు; ఆ ఉద్దేశాల నామోదిస్తాడనీ కాదు; కాని, నాగరికంగా ఉండి, నాగరతవ్యాప్తికి తోడ్పడే ఆ ప్రభుత్వానికీ, ఆసంఘానికీ సహాయపడటంవల్ల అతడుఅందులో ఒక భాగంఔతాడు. కాబట్టి పౌరత్వం అంటే ఒక హక్కు—మన జీవిత ధర్మాలను, నియమాలను చక్కబెట్టుకోటానికి, విధులను నిర్వహించుకోటానికీ గలహక్కు.

సాంఘిక విజ్ఞానాన్ని బోధించేది సివిక్సు. (1) ఏది (సప్రమాణంగా) తనకూ, తనసంఘానికీ, తనదేశానికి, విశాల ప్రపంచానికీ మంచి జీవితమో అరసి దాన్ని కరతలామలకం చేసుకొనుట. (2) పూర్వప్రస్తుత పరిస్థితులవల్లా, అవసరావల్లా సంస్కృతులవల్లా తిన్నని జీవితపథంలో ఆర్జించిన జ్ఞానాన్ని భవిష్యదాశయాల ననుసరించి, స్వానుభవంలో నిరూపించుకోటం, అన్ని శాస్త్రాలలాగే ఇదీ స్వార్థంనుండీ పరార్థం దాకా ప్రాకుతుంది. అదే జాతీయమూ, అంతర్జాతీయమూ అయి మానవకోటి కంతటికి వ్యాపిస్తుంది. దానిని వ్యక్తిగతంగాను సాంఘికంగాను, భౌతికంగాను, నైతికంగాను అన్ని జీవిత కేంద్రాలనుండి తిలకించి సరిచూచుకోవాలి. చేసే పనులను స్వానుభవపు వెలుతురులో ఉంచుకొని, భవిష్యదాశయాలతో పోల్చుకొని నిర్ణయించుకుంటూ ఉండాలి. ప్రజల మేల్గీళ్లను పాటించి, సివిక్సు విద్యార్థికి పరుల పరిస్థితులను దయాదాక్షిణ్యాలతో చూచేవిధిని నియమిస్తుంది. ఇదిలేకుంటే అభ్యుదయముండదు. ఆరిస్టాటిల్ "మానవుడు సాంఘిక జంతువు—సంఘంలో పుట్టాడు. సంఘంలో పెరుగుతాడు" అన్నాడు. మానవుడు అనాదినుండి కుటుంబాన్ని, గోత్రాన్ని, శాఖను, కులాన్ని, మతాన్ని, జాతిని, పల్లెను, పట్నాన్ని, రాష్ట్రాన్ని, దేశాన్ని, సామ్రాజ్యాన్ని, ప్రపంచాన్ని నిర్మించుకున్నాడు. ఈ అభివృద్ధి ఔతుండేవేగాన్ని, పెరిగే స్వభావాన్నిచూచి గొప్పగర్వాన్ని పొందాడు. నేడు మనంకావాలన్నా ఒంటిగా మిగతా ప్రపంచంతో సంబంధాలు లేకుండా ఉండలేము. మన విజ్ఞానం అభివృద్ధి చెందే కొద్దీ, మనీ సంబంధ బాంధవ్యాలు హెచ్చుతున్నై.

సంఘంయొక్క సభ్యులం కాబట్టి మనంఅంతా ఏఏ విధాలుగా సంఘాభ్యున్నతికి తోడ్పడవచ్చునా అని ఆలోచించి తగిన సహాయాన్ని చేయాలి. సంఘంయొక్క మూలాశయం వ్యక్తియొక్క మంచిజీవితమే. వ్యక్తి అభ్యుదాయానికి కావలసిన స్వేచ్ఛనిచ్చే హక్కులు మంచి సంఘానికి ప్రథమావసరం. ఈ ప్రాథమిక హక్కుల అనుభవం ద్వారా సంఘంలోని ప్రతివ్యక్తికి సజ్జీవితాన్ని సాధించటమే దీని ముఖ్యోద్దేశ్యం అయిఉండాలి. దైనందిన జీవితంలో హక్కుల అనుభవంలోనూ, విధుల నిర్వహణలోనూ వ్యక్తుల ప్రత్యేకమైన తెలివి తేటలను నైపుణ్యాన్ని అభివృద్ధి పరిచటానికి కావల

సిన అవకాశాలను ప్రభుత్వం ఇవ్వటంలోనూ నిర్మాణాత్మక మైన పౌరసత్వానికి గట్టిపునాది ఏర్పడగలదు.

హిందూదేశం ఒక నూతన జీవితపు పోరటను ప్రారంభించింది. హిందూదేశపు స్త్రీత్వం దీర్ఘనిద్రనుండిలేచింది. స్త్రీలు విధులనుచూచి, నెఱవేర్చి, నిర్ణయించుకునే బాధ్యత కలిగి యున్నారు. మన దేశంలోని స్త్రీల సంస్థలు నూతనపు ప్రభుత్వప్రణాళికలో పురుషులలాగే స్త్రీలకుకూడా అన్నివిధాలా అన్ని హక్కులనూ యిచ్చే పౌరసత్వాన్ని యివ్వమని మరి మరి కోరినవి. మన పౌరసత్వపు హక్కు మనం పౌరులము అంటే, కేవలం రాజకీయ స్వాతంత్ర్యం మాత్రం కలిగిన వాళ్లంకాదని అంతకన్నా ఇదిచాలా ఎక్కువని బోధిస్తుంది. పౌరులు విధులనుసరిగా అవగాహన చేసుకొని, వానిని నిర్వహిస్తేనేగాని, పౌరులహక్కులకు అర్థం ఉండదు. హక్కులు విధులూరెండూ స్వతంత్రాలే—ఎందుకంటే ఒకరివిధి మఱొకరి హక్కు. మజ్జిని ఇల్లాగన్నాడట "మీఱనుభవించే ప్రతి హక్కూ మీరు నెఱవేర్చే విధినుండి జనించిందే." అతని మాటలను జ్ఞప్తికుంచుకోమని ప్రతిహిందూ స్త్రీకి సలహా.

మనదేశానికిప్పుడు తప్పని సరిగా ముఖ్యమైనది సాంఘిక విద్యావిషయిక సంస్కరణ. ఈ సంఘ సేవ భారం ప్రస్తుతం స్వార్థ శూన్యులైన సేవకుల భుజ స్కంధాలపై నున్నది. ఇండియా సక్రమంగా ముందంజ వేయాలంటే మన స్త్రీలు సంఘాన్ని పెంపొందించటానికి పెద్ద పునాదులను వేయాలి.

1. మన దేశంలో మాతృమూర్తికి మహా గౌరవం ఉంది. సంసారనిర్వహణ, శిశుపోషణ హైందవ స్త్రీ పవిత్రధర్మాలు. పసిబాలురను ఉన్నతాశయాలుగల పెద్దవారిగా జేసేటట్లు పెంచే బాధ్యత స్త్రీలలోఉంది. వారి చిన్న హృదయాలలో స్వదేశంపై ప్రేమ, మానవజాతిపైప్రేమ, మంచిఅంటేప్రేమ, తప్పు అంటే ద్వేషంకలిగించి, పరమ పావన పథంలో నడిచే విధం, సత్యానికోసమే జీవించి త్యజించే రీతిని బోధించి, నాటించి భావిలోని సాటిలేనిమేటి హైందవ పౌరులుగా జేసే పవిత్రకార్యం స్త్రీలది.

2. స్త్రీలు తమకూతుళ్లకు, కొడుకులకు విద్యాభి వృద్ధికి కావలసిన అవకాశాలను కల్పించి, సదుపాయలుచేసి సరియైన విద్యనిప్పించాలి.

3. గృహిణి సంసారాన్ని నిర్వహించుకుంటూ, తీరు బాటుకాలంలో తనకంటే అన్నివిధాలా తక్కువ స్థితిలో ఉన్న ఇతరులబాగుకూ, అభ్యున్నతికి తోడ్పడి సేవజేయటానికి వీలుతప్పకుండాఉంది. ఈ విధంగా బాహ్యప్రపంచ బాహుళ్యాన్ని సేవించవచ్చు. మన పాఠశాలలలోను, వైద్యశాలలలోను, శిశురక్షణ కేంద్రాలలోను, పారిశ్రామిక కేంద్రాలలోని స్త్రీల సంరక్షణలోను, అన్నింటికంటే పల్లెలలో నివసించే మన ఎక్కువ భాగపు జనసంఖ్యయొక్క మానసములకు పట్టిన తుప్పును వదిలించి, అజ్ఞానాన్ని చీల్చివేసి, దారిద్ర్యాన్ని నిర్మూలించి, సాయపడటంలో స్త్రీలకు ఎంతో తావుంది. పట్టణవాసులైన స్త్రీలు విద్యా సముపార్జన చేసి, ప్రపంచాన్ని తెలిసికొని యింకా గ్రామీణులైన సోదరీమణుల అవసరాలను లెక్కించక పోవటం శోచనీయం. పల్లె పిల్లలకుకూడ విద్యకావాలని పిల్లల తల్లులు ఎంతోఆశిస్తున్నారంటే నమ్మండి. వారికి పాఠశాలలు కావాలని ఎంతో ఆదుర్దాగాఉన్నారు. తీరుబాటుకాలంలోపోయి మాటాడి విచారించబోయే స్త్రీలను యెంతో మర్యాదతో ఆహ్వానిస్తారు. అలాంటివాళ్ల జీవిత పరిస్థితులను అర్థంచేసుకొని, వాళ్లకుమన కుడిచేతిని కేలూతగా మైత్రితో యివ్వాలి.

4. బాల్య వివాహాలయొక్క భయంకర పర్యవసానాల నెఱిగి, దాన్నితుదముట్ట నిర్మూలించే దీక్షతో అంతా ఏకమై పనిచేయాలి. పరంపరా గతాచారాల మూఢ విశ్వాసంవల్ల శారదా చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించేవాళ్లకు కఠిన శిక్ష విధించాలి.

5. 'పర్దా,' బహుభార్యాత్వం, కన్యాశుల్కం మొదలైన దురాచారాలను, దుఃఖాలను బాపటమే మన ముఖ్యోద్దేశంగా ఉండాలి. ఇంతటి సంఘసేవ జరుగుతున్నప్పటికికూడ ఇంకా ఇలాంటివి జరుగుతూనే ఉన్నవి. వీటిని అరికట్టాలి. ఏదైనా ఒక సాంఘికాచారం దురాచారమో, దుఃఖమో అయితే దాన్ని వెంటనే నిర్మూలించాలి.

6. అస్పృశ్యతా నివారణ తీవ్రంగా జరగాలి.

7. ఐకమత్యం ఒక గొప్పసేవ. అందఱూ సమాజంలో సమాన హక్కులు కలవారేనని, ఒకరి లాభనష్టాలు మఱొకరికి కూడ వర్తిస్తాయని మనం తెలుసుకొని బిడ్డల మానసాల

లోకి ఈ ఆదేశాలను చొరజేస్తే, మనం భవిష్యత్తుయొక్క జాతీయతకు పునాదిరాతిని వేసినవాళ్లమౌతాం.

ఇప్పుడు తెలియజేసినవన్నీ కూడ స్త్రీల అందుబాటులో ఉన్న పనులే. ఇవన్నీ లోకానికి తెలియనివికావు. అయితే తెలుసుకున్న వారికిది జ్ఞాపక పూర్వకం. దేహ మనో దారుఢ్యాలు గల యువతులు సంఘ సేవకు పూనుకోవాలి. ఎందుకంటే సేవకులు తక్కువ. పనియెక్కువ.

“ప్రజా ప్రభుత్వం వెలయటం జీవితాన్ని సాధ్యం చేయటానికి ” అన్న అరిస్టాటిలు మాటలు కలకాలం నిలుస్తై.

హిందూస్త్రీలు మన సంఘాన్ని నైతిక ధర్మంగాచూసి నైతిక ప్రబోధచేయాలి. నియమాలు, ఉద్దేశాలు నిర్మాణాత్మకం కాబట్టి వానిని మనం విశ్వసించి వానివెంట నిలబడాలి. విశ్వాసంలేకపోతే ఆశయాలు అనుభవయోగ్యమూ, సాధ్యమూకావు. మహత్తరవిషయాలను సాధించటానికి ఆత్మత్యాగం అనవసరం. సాంఘికాభ్యుదయానికి ఆత్మను త్యజించాలి. ఆధ్యాత్మిక చింతన, ఆత్మ విరక్తి ఎక్కువగ స్త్రీలు వాంఛితార్థాలను కష్టం లేకుండా సాధించగలరు. ఆ జాతి యుగంనుండి కూడ ఆత్మ త్యాగాన్నిగూర్చి మానవుడుకి తెలుసు. కాబట్టి అన్నివిధాలా నిజమైనపౌరులు కావాలంటే నైతికాధ్యాత్మిక విషయాలను అమూల్యంగా చూడాలి.

ఇది లేకుంటే భౌతికసంపద, రాజకీయ స్వాతంత్ర్యం అర్థం లేని చెత్తకౌతై. దైవికాలోచన మానవ జీవితానికి ప్రాణ వాయువులాంటిది. కాని, అది మూఢ విశ్వాసాల కాలవాలమై పరమ అసహ్యమూ, దుర్భరమూ అయిన మతంగా ఉండరాదు. మహోత్కృష్ట, ఉదాత్త విషయాలను రేపి ఉద్రేకాన్ని కల్గించే ఆత్మత్యాగంయొక్క జన్మస్థానం అయిన విధిని కల్పించే ప్రేమ మతంగా ఉండాలి. అది ఇలాంటి ప్రేమతత్వం మనలో ప్రబలితే మనజీవితాలను ఉజ్వలంగా ప్రజ్వరిల్ల జేస్తుంది. దానిలోనుండి సేవ—తన ఆస్థిపాస్థులను సోదర సోదరీ మణులతో పంచుకొనే సేవ—చేయాలనే ఆశ ఉదయిస్తుంది. పర్వతాలను సైతం కదలింపగల విశ్వాసం తోడుగావస్తుంది. ఈ ప్రేమ మతం మూలంగానే హిందూ స్త్రీలు ఉత్కృష్టపథాలను త్రొక్కి మనంప్రేమించే మాతృదేశానికే కాక ప్రపంచాని కంతటికీ గర్వింపతగ్గ పౌరులు కౌతారనీ ఆశిస్తున్నా. మానవ నిర్మితాలైన జాతి మతాలనే గోడలను పడద్రోసి, ఈ కష్టపడే ప్రపంచానికి శాంతిసౌఖ్యాలును చేకూర్చేటందుకు ఉడుతభక్తితో చేతైనంత చేసి కృతకృత్యలుకావాలి. దీనికిమానవ సోదరతత్వం ఎంతో ఉపకారి.

“ దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా ”

సర్వేజనా స్సుఖినో భవంతు.



## విజయము

మైలాపూరు Y. M. C. (యంగ్ మెన్సు ఎథీనియమ్)లో, ది 2-10-’48 న జరిగిన, నూలు పోటీలలో, ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థిని, శ్రీమతి సుగుణమణికి ప్రథమ బహుమానము యివ్వబడినది. ఈమెకు మా అభినందనములు.

ఆంధ్ర మహిళా సభ

# ఆంధ్రమహిళ సప్లిమెంటు




ఆంధ్ర మహిళా సభ

## కార్యనిర్వాహక వర్గము

# ఆంధ్ర మహిళ సప్లిమెంటు

సబ్ కమిటీ :

శ్రీమతి గౌరీసుబ్బయ్యనాయుడుగారు, శ్రీమతి లక్ష్మీరఘురామయ్యగారు, శ్రీమతి పి. శకుంతలమ్మగారు, శ్రీమతి టి. అహల్యగారు, శ్రీమతి కర్రా కమలగారు, శ్రీమతి సంపూర్ణమ్మగారు, శ్రీమతి గో. కమలామణిగారు, శ్రీమతి డి. స్వర్ణమ్మగారు.

ది. 12-10-48 న, 15-10-48 న శ్రీమతి పప్పు కామాక్షమ్మగారి అధ్యక్షత క్రింద జరిగిన సర్వసభ్య సమావేశములో, పైన పేర్కొన్న ట్రస్టీలు, నూతన పాలకవర్గము, సబ్ కమిటీ సభ్యురాండ్రను ఎన్నుకొనుటయేగాక, యీ దిగువ పేర్కొనబడిన తీర్మానములు ఆమోదించబడినవి.

(1) నియమావళిలోని 24 వ నిబంధనలో ఏర్పరచినట్లు గాక, 5 గురు పాలకవర్గ సభ్యులు మాత్రమే క్రమముగా సారస్వత లైబ్రరీ, క్రీడా, కళా, క్లబ్బు శాఖలకు ప్రాతినిధ్యము వహించవలసినదని ఈ సర్వసభ్య సమావేశమువారు, ట్రస్టుబోర్డు వారికి తెలియజేయుచున్నారు.

(2) నియమావళిలోని 18 వ నిబంధన ననుసరించి, నియమింపబడే కరస్పాండెంట్లు, యీ క్రింది పేర్కొన్న రీతిని కార్య నిర్వహణ జరుపవలెనని యీ సర్వసభ్య సమావేశము వారు ట్రస్టుబోర్డు వారికి తెలుపుచున్నారు.

అ. చన్నఘంటమ్మగారు : రాజ్యలక్ష్మీ పారిశ్రామిక విద్యాలయమునకు, టెక్నికల్ ఇన్‌స్టిట్యూటుకు కరస్పాండెంటుగాను, 'ఆంధ్రమహిళ' సహాయ సంపాదకురాలుగను.

జ. జమునాబాయిగారు : మహిళా విద్యాలయపు కరస్పాండెంటుగాను, హాస్టలు శాఖ నిర్వాహకురాలుగానూ.

(3) ఆంధ్ర మహిళాసభకు ప్రస్తుతములో నున్న చరస్థిరాస్తులనే గాక, ఇక ముందు సంక్రమించే చరస్థిరాస్తులపై గూడా నిబంధనావళిలో తెలిపినటుల, ట్రస్టీలు సర్వాధికారము పొందియుండుట ఈ సభయొక్క ఉద్దేశ్యమని మెమోరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్‌లోని 14 వ నిబంధనను పై విధముగా వివరము చేయవలెనని ట్రస్టుబోర్డు వారిని అడుగుటకై తీర్మానించడమైనది.

# ఆంధ్ర మహిళా సభ

## మెమొరాండమ్ ఆఫ్ అసోసియేషన్

I. ఈ స్త్రీల సంస్థ "ఆంధ్ర మహిళాసభ" అని పిలువబడును.

II. "ఆంధ్ర మహిళాసభ" యొక్క లక్ష్యములు యీ దిగువ నుదహరింపబడినవి.

(1) ఉత్సాహము, సమర్థతకలిగిన సేవికలకు శిక్షణ నిచ్చి భావి జాతీయ నిర్మాణమునకు, స్త్రీ జనోద్ధరణకు పాటుపడుట;

(2) హిందూ ధర్మములను స్త్రీలలో ప్రచారము చేయుట;

(3) స్త్రీ విద్యావృద్ధికై పాటుపడుట;

(4) స్త్రీలకు కళలలోను, చేతిపనులయందు, పరిశ్రమలలోను, శిక్షణ గరపుట;

(5) స్త్రీలకు శరీరవ్యాయామమునందు తరిఫీదు, ఆటలయందు సౌకర్యము కలిగించుట;

(6) స్త్రీలలో విద్యావ్యాప్తికి, వారి సాంఘికౌన్నత్యమునకు తోడ్పడుటకుగాను పత్రికలను నడుపుట;

(7) బాలికలకు ఆరోగ్య విద్యాభివృద్ధులను సమకూర్చుట;

(8) విద్యార్థినులకు, సేవికాబృందమునకు, తగిన భోజనవసతి గృహముల నేర్పాటుచేయుట;

(9) పతిత స్త్రీజనాళికి వలయు సహాయ మొసగుట;

(10) స్త్రీ, శిశుసంరక్షణాలయములను స్థాపించి నిర్వహించుట;

(11) స్త్రీ, శిశుక్షేమాదర్శమునకై పాటుపడుచున్న, నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుచున్న ఏ యితర సంస్థలతోనైన సహకరించుట;

(12) వివిధములైన చేతిపనులను, కళలను బోధించు, లేక, ఒసగు ఏ యితర సంస్థలనుగాని, పాఠశాలలనుగాని, కళామందిరములనుగాని, తరగతులనుగాని ఏర్పాటుచేయుటగాని, నడుపుటగాని, నడుపుటకు తోడ్పడుటగాని చేయుట;

(13) ఈ సభచే నడుపబడుచున్న యీ క్రింది సంస్థలను సంఘాదర్శసిద్ధికై, నిర్వహించుట;

(అ) విశ్వవిద్యాలయ పరీక్షలకు స్త్రీలకు శిక్షణనిచ్చుటకు, ముఖ్యముగా వయోజనులకు సాధారణ విద్యాసౌకర్యముల నొసగుటకు మొదలిడిన "మహిళా విద్యాలయము."

(ఆ) చేతిపనులను, కుటీరపరిశ్రమలను నేర్చి, గవర్నమెంటు పరీక్షలకు స్త్రీలను తరిఫీదు చేయుట కేర్పడిన "రాణీరాజ్యలక్ష్మీ పారిశ్రామిక విద్యాలయము."

(ఇ) ముఖ్యముగా ఆంధ్ర మహిళాసభచే నిర్వహింపబడుచున్న విద్యాసంస్థలలోని విద్యార్థినుల భోజనవసతి సౌకర్యముల కేర్పడిన "రాణీ మల్లమదేవి హాస్టల్."

(ఈ) సభా సభ్యురాండ్రకు గ్రంథాలయముగాను, పఠన మందిరముగాను ఉపకరించుట కేర్పడిన "నిర్మాలాదేవి గ్రంథాలయము."

(ఉ) బీద ప్రజల యొక్క బిడ్డల సంరక్షణమును విచారించి సహాయమొనరించుటకై ఏర్పడిన "నాగేశ్వరరావు పంతులు శిశుసంరక్షణాలయము.

(ఊ) సంగీతము, నాట్యము, చిత్రరచన మొదలగు లలితకళలను బోధించుట కేర్పడిన "కళాశాఖ."

(ఋ) సభా సభ్యురాండ్రకు అన్యోన్య సాంఘికాను పరిచయము నేర్పరచుటకు, బాహ్యాళి ఆటలను, గృహాళి ఆటలను కల్పించుట కేర్పడిన. "క్లబ్, క్రీడా శాఖలు."

(ౠ) సారస్వతము నభివృద్ధిచేయుటకై యుపన్యాసముల నిప్పించుటకు, కవులను గాయకులను పండితులను ఆహ్వానించి, వారలచే అధునాతన విషయములపై చర్చ సేయించుటకు ఏర్పడిన "సారస్వత, సాధారణ శాఖలు."

(ఎ) సాంఘిక సేవ చేయుటకుగాను కొంతమందికి శిక్షణ గరపుటకై ఏర్పడిన "సాంఘిక శాస్త్ర, పౌరశిక్షణ శాఖలు."

(ఏ) ఇందు పేర్కొనబడిన ఆదర్శములను ప్రచారము సల్పుటకు, స్త్రీల విద్యా వ్యాసంగములను ప్రోత్సహించుటకు ఏర్పడిన "ఆంధ్రమహిళ" యను పత్రిక.

(14) ప్రస్తుతం, లజ్ చర్చిరోడ్, మైలాపూరులో స్వంత భవనములలోనున్న ఆంధ్రమహిళా సభ కొరకు భవనములను, తదితర ఆస్తులను కొనుటగాని, సంపాదించుటగాని, కలిగి యుండుటగాని, విక్రయించుటగాని చేయుట.

(15) పైన పేర్కొనబడిన పనులు అన్నిటినిగాని, వాటిలో కొన్నిటినిగాని, వాటికి సంబంధించినవాటినిగాని చేయుట లేక చేయించుట.



# ఆంధ్రమహిళాసభ నిబంధనావళి

1. ఈ స్త్రీలసంస్థ "ఆంధ్ర మహిళా సభ" యని పిలువబడును.

2. ఈసంస్థ కార్యకలాపములు మద్రాసు రాజధానిలో జరుపబడును. రిజిష్టర్డు ఆఫీసు, లజ్‌చర్చిరోడ్, మైలాపూర్, మద్రాసునగల ఆంధ్రమహిళాసభా భవనములలో కలదు.

3. "మెమొరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్"లో పేర్కొనబడిన ఆశయములను లక్ష్యములను యీ క్రింది నిబంధనల ననుసరించి సాధించుటయే యీ సభ యొక్క కార్యక్రమము.

## సభ్యత్వము

4. (i) సభాసభ్యులు యీ క్రింది తరగతులుగా నుందురు.

(అ) రాజపోషకులు: సభకు రు. 1,000/- లు విరాళ మొసగువారు.

(ఆ) పోషకులు: సభకు రు. 500/- లు విరాళ మొసగువారు.

(ఇ) యావజ్జీవసభ్యులు: సభకు రు. 100/- లు విరాళ మిచ్చువారు.

(ఈ) సభ్యులు: సభకు సంవత్సరమునకు రు. 10/- లుగాని నెలకు రు. 1/- గాని చందా నిచ్చువారు.

(ఉ) గ్రామాంతరసభ్యులు: మద్రాసు నివాసముగా లేనివారై సభకు సంవత్సరమునకు రు. 5/- లు చందా నిచ్చువారు.

(ఊ) ఎసోసియేట్ సభ్యులు: పదునెనిమిది సంవత్సరములకు లోబడిన వయస్సుగలిగి సంవత్సరమునకు రు. 5/- లు చందా నిచ్చువారు.

(ii) సభానిర్వాహకులు పై సభ్యత్వరుసుమును తమకు తోచిన విధముగా అప్పుడపుడు మార్పుచేయుటకు అధికారము కలిగియుందురు.

5. స్త్రీలు, బాలికలు వయసుతోగాని, కులముతోగాని, భాషతోగాని నిమిత్తము లేక సభసభ్యురాండ్రుగా నుండతగుదురు. అయితే వారు సరియగు దరఖాస్తు ఫారముపై దరఖాస్తుచేసి చేరదలచిన సభ్యత్వరుసుమును, ప్రవేశరుసుమును చెల్లించి కార్యనిర్వాహకవర్గపు అనుమతిని పొందవలెను.

6. (8, 9 నిబంధనలకు లోబడి) పై తరగతుల సభ్యులందరూ సర్వసభ్యసమావేశము యొక్క సభ్యత్వమునుపొంది సమానహక్కులను, అవకాశములను కలిగియుందురు.

7. సభ్యత్వమునకై చేయబడిన దరఖాస్తు, కార్యనిర్వాహకవర్గముచే పరిశీలింపబడి అంగీకరింపబడవచ్చును, లేక త్రోసివేయబడవచ్చును. వారినిర్ణయము ఖాయమైనదిగా ఉండును. దరఖాస్తు అంగీకరింపబడినవెంటనే ఆదరఖాస్తు చేసినవారి పేరు సభ్యుల రిజిస్టరులో నమోదుచేయబడి, వారు అంతటినుండి సభకు సభ్యులుగా నగుదురు.

8. తెలుగు మాతృభాషగా కాని వారి పేరులన్నియు వేరొక రిజిస్టరులో వ్రాయబడుచుండును. ఆంధ్రేతరులగు యిట్టివారుకూడా సభాసభ్యురాండ్రుగా అన్నిహక్కులకు, సదుపాయములకు అర్హులై యుందురు. కాని వారు ఓటుహక్కును కార్యనిర్వాహకవర్గసభ్యత్వమువంటి ఎన్నికలకు నిలుచు అధికారమును పొందియుండరు.

9. నాలుగవ నిబంధనలోని (ఉ) తరగతికి చెందిన ఎసోసియేట్ సభ్యులకుకూడ ఓటింగుహక్కు, కార్య నిర్వహణకు సంబంధించిన ఏ పదవులకు నిలబడే హక్కుఉండదు.

10. సభ సభ్యురాండ్రనుమాత్రమే హాస్టలులోగాని, ఈ సంస్థచే నిర్వహింపబడుచున్న ఆయా శాఖలలోని తరగతులలోగాని చేర్చుకొనుటకు వీలుకలుగును.

## కార్యనిర్వహణము

11. ఏడుగురు సభ్యులుగల ట్రస్టుబోర్డు ఇందులోని షరతుల ననుసరించి ఈ సంస్థ వ్యవహారములను తణిఖీచేయుట, నిర్వహించుట, చేయుచుండును. ట్రస్టుబోర్డు అధికారము స్వీకరించువరకు, యీ సంస్థ వ్యవహారములు, వ్యవస్థాపక కార్యదర్శినిగారైన శ్రీమతి దుర్గాబాయిగారు వ్యవస్థాపక అధ్యక్షులైన మీర్జాపూర్ రాణీవారి సలహాపై నిర్వహించుచుందురు.

## ట్రస్టుబోర్డు

12. ఈసంస్థ యీ క్రిందివారిని ట్రస్టీలుగా ఎన్నుకొనినది. వారు ట్రస్టీలుగా నుండుట కంగీకరించినయెడల వారొక ట్రస్టుబోర్డుగా యేర్పడి, సభయొక్క ఆస్థిని, వ్యవహారములను, యిందలి షరతుల కనుగుణముగా నిర్వహించుచుందురు.

(1) శ్రీమతి లక్ష్మీవెంకాయమ్మరావు, మీర్జాపూర్ రాణీగారు.
(2) శ్రీమతి లక్ష్మీసుభద్రయ్యమ్మరావు, బొబ్బిలి రాణీగారు.
(3) శ్రీమతి రాణీరాజ్యలక్ష్మీగారు.

* (4) శ్రీ బు॥ సాంబమూర్తిగారు.

* (5) శ్రీ చిం॥ రాఘవరావుగారు.

(6) శ్రీమతి దుర్గాబాయిగారు.

(7) శ్రీమతి జ. జమునాబాయిగారు (సర్వసభ్య సమావేశ ప్రతినిధి).

13. 12వ నిబంధనలో పేర్కొనబడిన ట్రస్టుబోర్డువారికి సభయొక్క చరస్థిరాస్థి, కార్యక్రమ నిర్వహణములలో, హక్కు నొసగుటకు వీలుకలుగచేయు నిమిత్తము "ట్రస్టుడీడ్" రిజిస్టర్డు చేయబడును. తదనంతరం వెంటనే ఆ ట్రస్టుబోర్డు వారు అధికారము స్వీకరింతురు.

14. 7వ ట్రస్టీ మినహా అందరూ, జీవితాంతమువరకు ట్రస్టుబోర్డు సభ్యులుగా నుందురు. రాజీనామా మొదలుగాగల కారణములవలన ఏర్పడే ఖాళీలను, మిగిలిన ట్రస్టుబోర్డు సభ్యులు ఎన్నికద్వారా భర్తీచేయుచుందురు.

15. 7వ ట్రస్టీ, ట్రస్టుబోర్డు అధికారము స్వీకరించి ఒక సంవత్సరము గడచిన తరువాతగాని, ఆ సంవత్సరము పూర్తియైనపిదప జరుగు వార్షిక సర్వసభ్య సమావేశానంతరముగాని ట్రస్టుబోర్డునుండి విరమించును.

16. 7వ ట్రస్టీ, నిర్ణీత సంవత్సరాంతమున తిరిగి సర్వసభ్య సమావేశముచే ఎన్నుకొనబడుటకు అర్హత పొందియుండును.

17. సభయొక్క వ్యవస్థాపకాధ్యక్షులైన శ్రీ మీర్జాపూర్ రాణిగారు, వ్యవస్థాపక కార్యదర్శినియైన శ్రీమతి దుర్గాబాయిగారు ట్రస్టుబోర్డునకు అధ్యక్షకార్య దర్శినులుగా నుందురు.

18. మహిళావిద్యాలయమునకు, రాణీరాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయమునకు విడివిడిగా కరస్పాండెంట్లను ట్రస్టుబోర్డు నియమించును. అటుల నియమింపబడిన వారిరువురు సభాకార్యనిర్వహణము నెరపుటకు సంయుక్త కార్యదర్శినులుగా వ్యవహరింతురు.

19. పై విధముగా నియోగింపబడిన కరెస్పాండెంట్లకు కొంతసొమ్ము గౌరవవేతనము నీయవచ్చును.

20. ట్రస్టుబోర్డు సభకార్యకలాపములన్నిటిని "మెమోరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్" అనుశ్రుతిగా ఈ నిబంధనలకులోబడి పరిశీలించుచు నడుపవలెను.

---

* ట్రస్టుబోర్డులో స్త్రీలేయుండుట సమంజసమని యిచ్చిన సలహా ననుసరించి వీరిద్దరిస్థానే స్త్రీలను యెన్నుకొనుటకు 12-10-48వ తేదీని సర్వసభ్య సమావేశము సమావేశము కానున్నది.

21. ఈ సంస్థక్షేమము దృష్టియందిడుకొని ట్రస్టుబోర్డు, ట్రస్టుడీడ్‌లోని విధుల ననుసరించి, మెమోరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్'', ''నిబంధనావళు''లకు లోబడి, సభానిర్వహణమునకు వీలుకలుగుటకు కావలసిన ''బైలాస్'' నేర్పాటు చేసుకోవచ్చును.

22. ట్రస్టుబోర్డు అధికారమునకు లోబడి కార్యదర్శినులు, కార్యనిర్వాహకవర్గము సభకార్యక్రమములను నెరపుచుండవలెను.

23. ట్రస్టుబోర్డు కార్యదర్శిని సూచించినయెడల అత్యవసరమైన విషయములను ట్రస్టుబోర్డు సర్క్యులేషన్ ద్వారా ఆవిషయములను నిశ్చయించవచ్చును. ఈబోర్డు ఆరునెలల కొకసారియైన కలుసుకొనుచుండవలెను. ఆయా పరిస్థితులను బట్టి తరచుగాకూడా కలుసుకొనుచుండవచ్చును. ట్రస్టుబోర్డు, కార్యదర్శినిచే సమావేశపరచబడును.

24. ఆంధ్రమహిళాసభ కార్యనిర్వాహకవర్గములో-ట్రస్టుబోర్డుచే నియమింపబడిన యిద్దరు కార్యదర్శినులు (కరెస్పాండెంట్లు), సర్వసభ్య సమావేశముచే నెన్నుకొనబడిన అయిదుగురు సభ్యురాండ్రు వుందురు. ఈ అయిదుగురు హాస్టల్, ఆంధ్రమహిళ, గ్రంథాలయము, కళాశాఖ, క్లబ్ క్రీడాశాఖ లకు ప్రాతినిధ్యము వహించి వాటి కార్యక్రమమును నిర్వహించెదరు.

25. ఇకముందు స్థాపింపబడు శాఖలకు ప్రాతినిధ్యము కలుగజేయుటకు కార్యనిర్వాహకవర్గపు సలహా ననుసరించి ట్రస్టుబోర్డు, కార్యనిర్వాహకవర్గ సభ్యురాండ్ర సంఖ్యను హెచ్చింపవచ్చును.

## కార్యనిర్వాహకవర్గము

26. కార్యనిర్వాహకవర్గము నెలకు ఒకతూరిగాని అంతకు లోపుగాని, సభయొక్క నెలసరి లెక్కలను, కార్యకలాపములను సరిచూచుటకు, పునర్విమర్శించుటకు కలుసుకొనుచుండవలెను.

27. కార్యదర్శినులచే కార్యనిర్వాహకవర్గము సమావేశపరచబడును. ప్రత్యేక సమావేశములు వేరువేరుశాఖలకు చెందిన ఏముగ్గురి వ్రాతమూలకమగు కోరిక పైననైనా పిలువబడును.

28. ఈ సమావేశములకు అందలి సభ్యులందెవరైన అధ్యక్షత వహించవచ్చును.

29. కార్యనిర్వాహకవర్గముచే అంగీకరింపబడిన తీర్మానములను అమలు జరుపుటకు కార్యదర్శినులు బాధ్యత వహింతురు. కాని అవి ట్రస్టుబోర్డు సూచనలకు విరు

30. కార్యదర్శినులు, వివిధశాఖల నెలసరి రిపోర్టులను, కార్యవర్గ తీర్మానములను, నెలసరి జమాఖర్చు లెక్కలను, సంవత్సరిక ఆడిట్ రిపోర్టను, ట్రస్టుబోర్డునకు పరిశీలన నిమిత్తము, సలహా సూచనల నిమిత్తము పంపుచుండవలెను.

31. సర్వసభ్య సమావేశము సంవత్సరమున కొకసారియైన కలుసుకొని యీ క్రింది విషయములను చర్చింపవలెను.

(a) సంవత్సరిక ఆడిట్ రిపోర్టు, సంవత్సర బడ్జట్.

(b) కార్యనిర్వాహక సభ్యుల ఎన్నిక, ట్రస్టుబోర్డు నందలి ప్రతినిధి ఎన్నిక.

(c) ట్రస్టుబోర్డునకు (రికమెండు) సూచింపబడిన విధానము.

32. సర్వసభ్య సమావేశము, సభాకార్యదర్శినులచే పిలువబడును.

33. ప్రత్యేక సర్వసభ్య సమావేశములు, వ్యవస్థాపక కార్యదర్శినిచేగాని, కార్యవర్గములోని ఏ నల్గురిచేగాని, సభ్యులుగానుండిన వారిలో $\frac{1}{4}$ వంతు సభ్యులచే గాని లిఖిత పూర్వకముగా కోరబడిన ఏర్పాటు చేయబడును.

## సమావేశములకు నోటీసు

34. కార్యనిర్వాహకవర్గ సమావేశములకు 2 రోజులు వ్యవధిగాను, సర్వసభ్య సమావేశములకు 15 రోజులు వ్యవధిగను నోటీసులు జారీచేయబడవలెను.

## సమావేశములకు హాజరు కావలసిన కనీసపు సంఖ్య

35. కార్యనిర్వాహకవర్గ సమావేశములకు 4 రు తక్కువ కాకుండాను సర్వసభ్య సమావేశమునకు సభ్యురాండ్ర పట్టీలోనున్న వారిలో 8వ వంతునకు తక్కువ కాకుండాను సభ్యులు హాజరు కావలెను.

## మల్లమదేవి హాస్టల్

36. మహిళావిద్యాలయము, పరిశ్రామిక విద్యాలయము మొదలగు, శాఖలలో విద్యనభ్యసించుచున్న విద్యార్థినుల సౌకర్యార్థ మిది ఏర్పాటుచేయబడినది. దానిలో ఉపాధ్యాయినులు, సభాకార్యక్రమము వహించువారు కూడా చేర వచ్చును. కార్యదర్శినుల అంగీకారముపై, మద్రాసు నగరములోని ఏ యితర విద్యాసంస్థలలోని విద్యార్థినులకైనా వసతిసౌకర్యములు కల్పింపవచ్చును. అయితే వారు ఈసంస్థలో సభ్యులుగాచేరి హాస్టలు నిబంధనావళి ననుసరించి యుండవలెను.

37. హాస్టల్ సక్రమముగా నడుపుటకు, దాని కట్టుబాటుల సరిగనుంచుటకు, దానిపై రావలసిన సొమ్ము వసూలుచేయుటకు అవుసరమనితోచే నిబంధనలు కార్యదర్శినులు ఏర్పాటుచేయవచ్చును.

## ఆంధ్రమహిళ

38. ఆంధ్రమహిళ, అనే మాసపత్రిక ఈ సభతరఫున సభచే నడుపబడుచున్నది. స్త్రీలవిద్య, వారి అభ్యుదయము, వారి అభివృద్ధికి యీపత్రిక తోడ్పడుచుండును. పత్రికా సంపాదకులను ట్రస్టుబోర్డు నియమించును.

## మహిళా విద్యాలయము - పారిశ్రామిక విద్యాలయము

39. మహిళావిద్యాలయము, రాజ్యలక్ష్మి పరిశ్రామిక విద్యాలయములు - రెండూ "మెమోరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్"లో పేర్కొనబడిన లక్ష్యములను సాధించుటకు నిర్వహింప బడవలెను.

## ఇతర శాఖలు

40. ఈసంస్థచే నడుపబడుచున్న ఇతర శాఖలన్నియు "మెమోరాండమ్ ఆఫ్ ఎసోసియేషన్" ననుసరించి నిర్వహింపబడవలెను.

## సిబ్బంది

41. ఈసంస్థలో పనిచేయు అధ్యాపకులయొక్కగాని, మరియే యితర పనివారల యొక్కగాని జీతములనుగాని, ఆనరోరియములనుగాని ట్రస్టుబోర్డు నిర్ణయించును.

## ఆర్థిక నిబంధనలు

42. సభయొక్క జమాఖర్చు లెక్కలను సరిగా నుంచుటకును, మామూలు సభ కార్యక్రమములను సక్రమమైన విధముగా నడుపుటకును కార్యదర్శినులు బాధ్యత వహింతురు.

43. సభ తాలూకు, చర, స్థిరాస్తుల విషయమై ట్రస్టుబోర్డునకే సర్వహక్కులు గలవు.

44. సంయుక్త కార్యదర్శినులు ట్రస్టుబోర్డు అనుమతిలేనిదే రు. 500/-లకు మించిన అప్పు (ఋణము) చేయవీలులేదు.

45. నెల 1 కి రు. 100/-లకు మించి ఖర్చుకాగల ఏ క్రొత్తపని (శాఖ) నైనా ట్రస్టుబోర్డు కార్యదర్శిని ప్రత్యేక అనుమతిలేనిదే ప్రారంభించరాదు.

46. ఆంధ్రమహిళాసభ పేరిట బ్యాంకులో ఒక కాతా ఏర్పాటుచేయబడును. ఆ బ్యాంకు లెక్కను, కరస్పాండెంటులలో నొకరు, దైనందిన ఖర్చులకు సొమ్ము తీయుటకుగాని, లేక వేయుటకుగాని అధికారము కలిగియుందురు. ఆయా శాఖల అవసరములనుబట్టి కార్యనిర్వాహక వర్గమువారు, వేరువేరు శాఖల

పేర్లతో బ్యాంకులలో కాతాలను ఏర్పాటుచేసి, కరస్పాండెట్సుకుగాని, ఆయా శాఖాధికారులకుగాని డబ్బుతీయుటకుగాని, లేక వేయుటకుగాని అధికారమీయ వచ్చును.

47. రు. 50/- లకు మించని సొమ్ము ఆయాశాఖా నిర్వాహకులకడ కార్యదర్శినులు ఉంచవచ్చును.

48. ట్రస్టుబోర్డు యుద్దేశించినయెడల సభ పేరనగాని, శాఖల పేరనగాని బ్యాంకు లలో నిలవయున్న సొమ్ము అంతాగాని, లేక కొంతగాని ట్రస్టుబోర్డు పేర మార్పుచేసి ట్రస్టుబోర్డే ఖాతాను వ్యవహరింపవచ్చును.

49. ఈ సంస్థయొక్క వుద్దేశములను సక్రమముగా నిర్వహించుటకు సభ తాలూకు నగదు లెక్కలకు బ్యాంకు ఎక్కౌంట్లకు సంబంధించిన నిబంధనలలో మార్పులు తెచ్చుటకుగాని, క్రొత్తనిబంధనలను చేయుటకుగాని ట్రస్టుబోర్డు అధికారము కలిగియున్నది.

## సా మా న్య వి ష య ము లు

50. 'ట్రస్టుబోర్డు' అంగీకారము లేనిదే, కార్యవర్గముగాని, సర్వసభ్య సమావేశము గాని ఈ సభ 'నిబంధనావళి'లో మార్పులు తేరాదు.

51. సర్వసభ్య సమావేశమునందుగాని, కార్యనిర్వాహకవర్గమునందుగాని, మరి యే యితర సభ సమావేశములందుగాని, అట్టి సమావేశమునకు ముందు వరు సగా మూడు మాసములు సభలో సభ్యత్వము కలిగియున్నవారే వోటు చేయుటకు అర్హులు. సభ్యత్వపు చందా పూర్తిగా చెల్లించిన వారలే సర్వ సభ్య సమావేశములో పాల్గొనవలెను.

52. మహిళా విద్యాలయముయొక్కయు, రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము యొక్కయు కరస్పాండెంట్లు, తమతమ శాఖలను సరిగ నడుపుటకై తగిన సిబ్బందీ నేర్పాటు చేసుకొనవచ్చును. అట్టివారు కరస్పాండెంటుల అదుపు ఆజ్ఞ లకు లోబడియుందురు. వారు కరస్పాండెంటుల చర్యలపై, ట్రస్టుబోర్డునకు అపీలు చేసుకొనవచ్చును.

53. గ్రంథాలయము, కళాశాఖ, క్లబ్ మొదలగు శాఖలకు కావలసిన సిబ్బంది నియామకములు, ఆయా శాఖల నిర్వాహకులతో సంప్రదించి, కార్యదర్శినులు చేయుచుండవలెను.

54. యోగ్యత అర్హతలుగల బీదవిద్యార్థినులనుండి ఆయా తరగతులకు నిర్ణయింప బడిన జీతములు తీసుకొనకయే, కార్యవర్గమువారు, విద్యాసౌకర్యము లొసగ వచ్చును. ఈసంస్థ ఆర్థికసౌష్టవము ననుసరించి స్కాలర్‌షిప్స్, స్టైపెండ్సు (ఉచితవేతనములు) కూడా నీయవచ్చును.

55. కార్యవర్గములోని ఏ సభ్యురాలిపైననైనా, విశ్వాసరాహిత్య తీర్మానము తేవలెనన్న ప్రత్యేక సర్వసభ్య సమావేశములోనే తేవలెను. నూటికి 70 మంది దానికి ఓటుచేయనిదే అది అంగీకరించబడదు,

(మొత్తము 55 నిబంధనలు)

ఇది ''ఆంధ్రమహిళాసభ'' నిబంధనావళికి సరియగు నకలుగానున్నదని సర్టిఫై చేయబడిన దానికి తెలుగు అనువాదము.

(1) సం॥ గు. దుర్గాబాయి — వ్యవస్థాపక కార్యదర్శిని.

(2) సం॥ అ. చన్నఘంటమ్మ
(3) సం॥ జ. జమునాబాయి — సంయుక్త కార్యదర్శినులు.



మల్లమదేవి హాస్టల్



# కృతజ్ఞత

శ్రీ పర్లాకిమిడి మహారాజా గారు, వారి భార్య, కీర్తి శేషురాలు : శ్రీ నలినీ పట్టమదేవి గారి స్మృతి చిహ్నముగా, సభా సభ్యురాండ్రయొక్కయు, విద్యార్థినులయొక్కయు ఉపయోగార్థము,ఒక పెద్ద మోటార్ వాన్‌ను కొనుటకై కావలసిన ధనమును విరాళమిచ్చుటకు అంగీకరించిరి. వీరికి మా హృదయ పూర్వక కృతజ్ఞత.

శ్రీ లక్ష్మలమ్మగారు, సభలో స్త్రీలకు షైపు, షార్ట్‌హాండ్ క్లాసులు నడిపించుటకై తగిన ఏర్పాట్లు చేయుటకు, రూ. 2000/-లు విరాళముగా నొసగిరి. వీరికి మా కృతజ్ఞత.

దసరా ఉత్సవ సందర్భములో సభ్యురాండ్రు పెక్కుమంది ఉత్సవ ఖర్చులకై విరాళము లిచ్చిరి. వీరికి మా కృతజ్ఞత.

శ్రీ పి. శంకుతలమ్మగారు,

శ్రీ మొ. నర్సుబాయమ్మగారు,

శ్రీ కె. శారదాంబగారు,

శ్రీ అ. మనోహరమ్మగారు,

శ్రీ పా. కల్పకముగారు,

వీరొక్కొక్కరు రూ. 100/-లు విరాళము యిచ్చి, ఆంధ్ర మహిళాసభకు యావజ్జీవ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి. వీరికి మా కృతజ్ఞత.

అ. చన్నఘంటమ్మ

జ. జమునాబాయి

క థా ని క :

# "వరహాలరావులో మాణిక్యం కళవుంది!"

✻ శ్రీ వాడ్రేవు జోగిపంతులుగారు ✻

"నాన్నా! దాయిదాయినిమనింటికి భోజనానికిరమ్మనూ! పెరుగోసి అన్నం పెడుదువుగాని!"

"నోలేదీ దాయిదాయికి?" దండుముండ తిరిగి ప్రశ్న వేశాడు! నిండు పూర్ణిమ రోజుల్లో పెరట్లో మంచంవేశాడు రాఘవరావు. వాలుజడ సవరించుకుంటూ వచ్చి మంచం చివరన కూర్చుంది మాణిక్యం. వారిరువురి అనురాగ ప్రతీఫలం వరహాలరావు. ఆరేళ్ల వాడు. రెండోతరగతి చదువుతున్నాడు. అయినా ఇంకా ముద్దమాటలు మటుకు పోలేదు. పగలల్లా బ్యాంకులో కొట్టుకుని కొట్టుకుని వచ్చే రాఘవరావుకి వరహాలు మాటలు కొంత విశ్రాంతిని కల్గించేవి.

"వరహాలు ప్రయివేటు మాస్టరు జీతంకోసం పదేపదే అడుగుతున్నాడు! ఆయనమాత్రం ఎన్నాళ్లూరు కుంటాడు!"

"వచ్చేనెలలో ఇద్దాం!"

తనకి జీతంవల్లవచ్చే ఆ ఏభయ్ రూపాయిలూ పదో తారీకొచ్చేసరికల్లా మంచుకిమల్లేకరిగిపోయి వూరుకుంటాయి. ఇహ అక్కడనుంచి మిత్రులమీద పడతాడు. ఓ వేపున అప్పులు పెరుగుతున్నాయి. సుఖమనేదిలేదు. దానికి తోడు మాణిక్యం ఏడోమాసం గర్భిణీ! ప్రసవ సమయం నాటికి కనీసం వందరూపాయలన్నా చేతపట్టుకోపోతే లాభంలేదు. ఆలోచిస్తూన్నాడు. ఏం పాలుపోవడంలేదు.

"ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తూన్నారే?"

"ఆ! ఏం లేదు! ఈ ప్రపంచం ఇంకా ఎంతకాలం వుంటుందా అని?"

"వేదాంతానికేం గాని వరహాలు పుట్టినరోజు నాలుగు రోజుల్లోవుంది. వాడికిబుష్‌కోటు కావాలిట! లెఖ్ఖ ఏమేనా వుంటే......!"

"బుష్‌కోటుతోపాటు ఇంకేం కావాలిరా?"

"ఒబ్బరుజోలు, కాజా, జీపకోడి, సోంపపుడీ అన్నీ కావాలి!" వాడిమాటలకిమాణిక్యం ఫక్కుననవ్వింది. రాఘవరావు నిరాశతోకూడిన చిరునవ్వు నవ్వాడు. వరహాలురోజూ రాఘవరావు ఆఫీసుకి పోయేటప్పుడు "నాన్నాలూ! పెందలాలే ఒత్తాలా? లబ్బరుజోలు తెత్తారా? కాజోవో? జీపకోడీవో?" అంటూ సందుమలుపు తిరిగేదాకా కేకలేస్తూంటాడు. కాని సాయంత్రం రాఘవరావు ఇంటికివచ్చిన తర్వాత మాత్రం 'నేను చెప్పినవి తేలేదేం?' అని ఎరుగడు.

తన ముద్దుకొడుకు పుట్టినరోజుకి వాడికి కావలసిన బట్ట కుట్టించలేక పోయానే అని రాఘవరావు చాలా విచారించాడు. కాని ఓ రూపాయిపెట్టి వాడికి కావలసిన తినుబండారాలు కాజా గట్రా కొనితెచ్చాడు. ఈ సందట్లో వాడు కోటుగొడవే మరచిపోయాడు. దీనికి మాణిక్యమూ, రాఘవరావూకూడా మనస్సులో భగవంతున్ని అభినందించారు!

సమయానికి వంటసరంజామా లేక పోవటం చేత ఆఫీసు వేళయేసరికి, ఉడికీ వుడకని అన్నం ఇంత ఆవకాయముక్క చల్లావేసుకుని తినిచక్కా పోతాడు. ఉన్నరోజుని మధ్యాహ్నమప్పుడు కాఫీత్రాగేవాడు. లేని రోజున అంతే! ఒహ నెల రోజుల్నించి ఆఫీసులో వున్నా, ఇంటి దగ్గర వున్నా, షికారువెళ్లినా ఒక్కటే ప్రశ్న రాఘవరావుని పీకుతోంది! అదే మాణిక్యం ప్రసవ సమస్య!

మాణిక్యానికి ప్రసవకాలం సమీపించింది. రాఘవరావు తల్లిని పిలిపించుకున్నాడు తన దగ్గరికి. తను అనుకున్నట్టుగా వంద రూపాయలు కాదుగాని ఒక్క చిల్లిగవ్వయినా వెనకవెయ్యలేకపోయాడు. సహాయం చేస్తామని మాట యిచ్చిన మిత్రులలోఒక్కరూ సమయానికి ఆదుకోలేదు. మాణిక్యాన్ని మెటర్నిటీ హోమ్‌లో చేర్పించాడు. తనబోటి దరిద్రులికి సహాయం చేదామనే కాబోలు ఆ మహానుభావుడెవరో ఫ్రీ మెటర్నిటీ హోమ్ స్థాపించాడని తన కృతజ్ఞతలను వెళ్లబోసుకున్నాడు రాఘవరావు. మరి రెండు రోజులు గడిచాయి. మాణిక్యం ఏ క్షణంలో నయినా ప్రసవించడానికి సిద్ధంగావుంది.

# "వరహాలరావులో మాణిక్యం కళవుంది!"

ఏజెంటుని ఎట్లాగోవప్పించి రెండు రోజులు సెలవు తీసుకున్నాడు. ఆరోజు వుదయమే ఫ్లాస్కులో కాఫీ పోసుకుని మెటర్నిటీహోమ్‌కి బయలుదేరాడు రాఘవరావు. మాణిక్యం నీరసంగా మూలుగుతూవుంది.

"మాణీ! ఎట్లావుంది?" మెల్లిగా అన్నాడు.

"నీరసంగా వుంది! వొళ్లంతా నొప్పులు!" మూల్గుతూ జవాబిచ్చింది.

"కాఫీ తెచ్చాను తాగుతావా?"

"ఊఁ!" అంది. వేడివేడికాఫీ కప్పులో పోసి యిచ్చాడు. మెల్లమెల్లగా తాగింది.

"ఓహో! మీరువచ్చారా?" అంది నర్స్ గదిలో ప్రవేశిస్తూ.

"ఎట్లావుందమ్మా మా మాణిక్యానికి?" ఆత్రంగా అడిగాడు. నాడి పరీక్షచేసి "నాలుగయిదు యింజక్షనులు ఇస్తేనేగాని సుఖప్రసవంకాదు" అంది పెదవి విరుస్తూ. ఇంజక్షన్లకు డబ్బు కావాలి. కనీసం పాతిక రూపాయలన్నా కావాలి. ఎక్కడనుంచి తెచ్చేది. ఆలోచిస్తోన్న కొద్దీమనస్సు వికలమైపోతోంది. వెధవ మనస్సు అయిన వారికే కీడు తలపెడుతుంది.

"ఆ ఇంజక్షనులు మీదగ్గరలేవా?"

"లేవు! వుంటే తప్పకుండా ఇచ్చేదాన్నే!" సానుభూతి పూర్వకంగా మాట్లాడింది. సహాయం చేసినా చేయకపోయినా. అటువంటిమాటలే చాలు మనస్సు ఊరటపడటానికి!

బయలుదేరాడు—కనబడిన మిత్రులందర్నీ అడిగాడు—ప్రతిమిత్రుడి గుమ్మం ఎక్కాడు—కాని ఫలితం శూన్యమయింది. ఏం చేయడానికి తోచింది కాదు—పోనీ ఇంట్లో సరుకు ఏదన్నా తెగనమ్ముదామన్నా అట్లా అమ్మదగ్గ—కాదు ఇతరులు కొనదగ్గవస్తువులేవీలేవు. మధ్యాహ్నంపన్నెండుగంటలసరికి మెటర్నిటీహోమ్‌కి శూన్యహస్తాలతో వెళ్లాడు గదిలోనికి రానివ్వలేదు—వరండాలో ఆత్రంగా ఇటూ అటూ పచార్లుచేస్తున్నాడు.

నర్సు ఆవేపునుంచి వెడుతోంటే "సిస్టర్! నామాణిక్యానికి ఎట్లావుంది?" గుటకలు మింగాడు.

పెదవి విరిచింది. "ఇంజక్షనులు ఇవ్వకపోతే ప్రాణాలు కూడా దక్కవు. మాటపడి పోయింది!" అన్నది విచారసూచకంగా అప్పటి రాఘవరావు పరిస్థితి రాయటానికి నాకలం నడవదు! ఛీ! వెధవ బ్రతుకు కట్టుకున్న భార్యని దక్కించుకోలేని నిర్భాగ్యుడని లోకం తూలనాడదూ? దారిద్ర్యంతో కృంగి కృశించేకన్న ఏ నుయ్యో గొయ్యో... ఛా! నాదారి నేను చూసుకుంటే నా చిట్టి వరహాలు గతి? భావపరంపరలు రాఘవరావును క్రమ్ముకున్నయ్. మనస్సు ధైర్యం చెబుతోంది. మరొక మారు ప్రయత్నించు రాబర్ట్ బ్రూస్‌కథ తెలీదూ? అంటోంది. లేచాడు. ఆఖరి ప్రయత్నంగా తన ఏజెంటునే నెలజీతంలో డబ్బుఇవ్వమని అడుగుదామని అనుకున్నాడు. బ్యాంకుకు వెళ్లేసరికి ఏజంటులేడు గంట—రెండుగంటలు వేచివున్నాడు. ఏజెంటు వచ్చాక కాళ్లా వేళ్లాపడి బ్రతిమాలగా దేవుడు రాఘవరావు పక్షాన వుండడంచాత, ఏలాగయితేనేం ఇచ్చాడు! అయిదు గంట లయింది—మందుల షాపుకి వెళ్లి ప్రిస్క్రిప్షన్ చూపిస్తే లేవన్నాడు—బజారంతా తిరిగాడు—ఎక్కడా దొరకలేదు—తాణా ఆఫీసులో జవాను ఆరుగంటలు కొట్టడానికి సంసిద్ధుడవుతున్నాడు—తిరిగితిరిగి ఆఖరున వోకొట్లోమందు సంపాదించ గలిగాడు. గబా గబా—రోడ్డుమీద నడిచే కార్లు, బళ్లు ఇవేవీ అతనికి కనబడ్డంలేదు—మధ్యాహ్నం పన్నెండు గంటలకే ప్రమాద స్థితిలోవున్న నా మాణిక్యం ఇంకా ఈ లోకంలో వుంటుందా? అలాటి ఆలోచనలకు తావీయకూడదు—నడచి—కాదు—పరుగునే మెటర్నిటీ హోమ్ చేరాడు—గది తలుపులు మూసివున్నయ్. గదిలోలైటులేదు. "నామాణిక్యం ఎట్లావుంది? ఎట్లా వుంది? చెప్పవూ? సిస్టర్! నీకు పుణ్యంవుంటుంది! నా మాణిక్యం ఎట్లావుంది? సిస్టర్ జవాబుగా బుర్రక్రిందికి దించేసుకుని అక్కడనుంచి వెళ్లిపోయింది—రాఘవరావు నిలువునా కూలిపోయాడు—అంత కష్టపడి సంపాదించిన మందు వృధా—తన మాణిక్యాన్ని పోగొట్టుకున్నాడు. మొర్రోమంటూ రాఘవరావు తల్లి వరహాలుని తీసుకు వచ్చింది. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు వరహాలు— 'మీ వరహాలులో మాణిక్యం కళవుంది. ఇది చూసుకు సంతోషించండి' అంది సిస్టర్ రెండు కన్నీటి బిందువులు రాలుస్తూ!



Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.



ఆంధ్రమహిళాసభ ట్రస్టీలు-కార్యదర్శినులు
మధ్య పూలహారముతో శ్రీ బొబ్బిలి రాణీవారు









ఆంధ్రమహిళాసభలో గౌ. సర్దార్ పటేలుగారికి సన్మానము
ప్రార్థనసమయంలో దృశ్యము



పారిశ్రామికవిద్యాలయ ద్వారమున
పటేలుగారిని నూలుమాలాలంకృతులను జేయుట



# కృతజ్ఞత

శ్రీ. శ్రీ. పిఠాపురం మహారాజావారు, ఆంధ్రమహిళా సభలో, గా. సర్దార్ పటేల్ గారికి జరిపిన సన్మాన సందర్భములో, రూ. 100/- విరాళ మిచ్చిరి. ఆదినుండి, దాతగా, సభయందు వీరు జూపుచున్న ఆదరాభిమానములకు మా హృదయపూర్వక కృతజ్ఞత.

ప్రావిన్షియల్ కోఆపరేటివ్ బాంక్‌వారు, తమ సత్కార్య నిధినుండి, పారిశ్రామిక విద్యాలయమునకు రూ. 250/- విరాళముగా యీ సంవత్సరముకూడ నిచ్చిరి. గత రెండు సంవత్సరములు వీరు రూ. 500/-, 250/- యీ విద్యాలయమునకు విరాళమిచ్చి యుండిరి. వీరి ఆదరమునకు మా కృతజ్ఞత.

ఈ దిగున పేర్కొనబడినవారు, ఒక్కొక్కరు, రూ. 100/- విరాళముగనిచ్చి, మహిళాసభకు యావజ్జీవ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి.

శ్రీమతి జుటూరి. సరోజనీ దేవిగారు,
శ్రీమతి తురగా. సీతాలక్ష్మీ నారాయణగారు,
శ్రీమతి ఎస్. రాధాకృష్ణ స్వామిగారు,
శ్రీమతి సి. కమలమ్మ వరదప్ప నాయుడుగారు,
శ్రీమతి విజయలక్ష్మి చంద్రశేఖర్‌గారు,
శ్రీమతి దోమా. నాగరత్నమ్మగారు.

వీరికి మా కృతజ్ఞత.

# ఆంధ్రమహిళ

సంపుటి 5 :: మార్చి '49 :: సంచిక 11

ముఖచిత్రం: అమరజీవి సరోజినీ నాయుడుగారు.



సంపాదకురాలు: శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు: శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

—: ప్రచురణ :—

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 5 మార్చి 1949 సంచిక 11

# అమరజీవి సరోజనీ నాయుడు

మధురకవి, సుప్రసిద్ధ వక్త, మహామేధావి,

సంఘసంస్కారి, రాజకీయవేత్త,

వనితలలో వజ్రము,

భరతమాత యనుంగు పుత్రి,

బాపూజీ యనుంగు శిష్యురాలు

మార్చి 2-వ తేదీ బుధవారము తెల్లవారుఝామున 2-30 గంటలకు గుండెజబ్బువలన మృతినొందితి.

రమారమి అర్ధశతాబ్దము, అకుంఠిత దీక్షతో, అపూర్వపటిమతో, స్వాతంత్ర్యసమరములో మహిళలకేగాక, పురుషులకుగూడ నాయకత్వమును వహించి, వనితా లోకమునకే వన్నెదెచ్చిన వీరనారి, నేటి సంయుక్తరాష్ట్రపు గవర్నరు, డెబ్బది ఏడుల వృద్ధనారి, శ్రీమతి సరోజనీ నాయుడు. "జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యమేలనుల" కన్నట్లు, ఆమెను గూర్చి విపులముగ వ్రాయుట అనవసరము.

ప్రఖ్యాత వంగ బ్రాహ్మణులైన చట్టోపాధ్యాయ కుటుంబమునబుట్టి, బ్రహ్మ సమాజ వాతావరణములో బెరిగి, పాశ్చాత్య విద్యా కళాశాలలలో ఉన్నత విద్యను బడసిన యీామె, విద్యార్థి దశనుండియు, కవయిత్రిగా, వక్తగా ప్రశంశనొందినారు. వీరు ఆంగ్లమున రచించిన గీత

# శ్రీమతి సరోజినీ నాయుడు

ములు వీరియొక్క ఆంగ్లభాషా పటిమకు, భావసరతళకు విపుల తార్కాణములు. హిందీ, ఉరుదు, ఆంగ్లభాషల మూడింటిలో వీరు ప్రఖ్యాత వక్తలు. ఉద్రేక పూరితములైన ఊహాపరంపరలు యీమె మధుర వాగ్ధాటిలో ఉయ్యాలలూగెడివి. ఈమె ఉపన్యాసములు ప్రబోధ గీతా గానములు. ప్రాక్ దేశపు నైటింగేలను బిరుదు సార్ధక నామధేయ మీమెకు.

భరతమాత దాస్యవిముక్తికై, మహాత్ముని అడుగు జాడల ననుసరించిన యువతులలో ప్రప్రథమురాలీమె. బాపూజీ ప్రియశిష్యురాలు. ధీశక్తిచే, క్రియాశక్తిచే, కాంగ్రెసు అగ్రనాయకులలో నొకర్తయై, కాంగ్రెసు కేంద్రపాలకవర్గములో సభ్యురాలై, అమూల్యసేవజేసిన స్త్రీరత్నము వీరొక్కరేయని చెప్పవచ్చును. 1925 వ సం॥లో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షత పదవిని వహించిరి. ఈ భాగ్యము స్త్రీలలో వీరికొక్కరికే లభించినది. రాష్ట్ర గవర్నరుగా నియోగింపబడుటకుకూడ స్త్రీలలో నీమెయే ప్రథమురాలు. పట్టుదలలో, ధైర్యసాహసములలో, జోన్ ఆఫ్ ఆర్క్, ఝాన్సీలక్ష్మి, చాంద్ బిబీ మొదలగు నారీమతల్లులను మరిపింపజేసి, అహింసా అస్త్రముతో స్వాతంత్ర్య సమరములో పోరాడిన యోధాగ్రగణ్య, శ్రీమతి సరోజినీనాయుడు, వీరనారీలోకానికో పెద్దవెలుగు.

సంఘసంస్కరణలో, దేశభక్తిలో, త్యాగపరతలో, రాజకీయ వ్యావహారిక విజ్ఞానములో యీమెకీమెయే సాటి పరతంత్ర భారతావనిలో అహింసాయుధముతో వైరి నెదిరించి నిలచిన ధీరురాలు, స్వతంత్ర భారతావనిలో అహింసా సూత్రమును వ్యాపింపజేయుచు, దేశాభివృద్ధికై సేవజేయగలుగునట్లు భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యములను ప్రసాదించుగాక యని నిన్నగాక మొన్న ఉచ్చరించిన యీ వాక్కుతోనే, యింత శీఘ్రకాలములో, దివంగతయైన ఆమె ఆత్మకు పరిపూర్ణశాంతి గలుగుగాక యని భగవంతుని ప్రార్థించవలసిన దురదృష్టము మనదైనది.

భారతమాత యనుంగు పుత్రియగు యీమె మృత్యువుచే, అఖిల భారత కాంగ్రెసుకూ, భారతనారీ లోకానికే గాక, భారత ప్రజలకందరకూ, తీరని లోటు కలిగింది. 33 కోట్ల భారత ప్రజలతోపాటు, ఆంధ్రమహిళ యీ అమరజీవి యాత్మ శాంతికై అశ్రుసిక్త భక్త్యంజలిని సమర్పిస్తూఉంది.



ఆంధ్రమహిళ

# ఉపప్రధాని హెచ్చరిక

ఉపప్రధాని సర్దార్ పటేలు, మన ప్రాంతాలకు వచ్చి, 12 సంవత్సరములై పోయినది. బహుకాలానికి జరిగిన ఆయనరాక ప్రభుత్వానికి, ప్రజలకు, కాంగ్రెసువారికి, కాంగ్రెసేతరులకు, ప్రజాసేవ చేయుచున్నా మనుకొనుచున్న తదితరులకు, వారు వీరననేల, ఎల్లరకు, ఆత్మవిమర్శన కొక యవకాశమును కలిగించింది. మదరాసులో, మైసూరులో, హైదరాబాదులో, అన్ని ఉపన్యాసాలలోనూ, సర్దార్ చెప్పింది ఒకటే విషయము - "ప్రస్తుత పరిస్థితులు చక్కబడక పోతే, కుల మత భాషాతత్వాలు, రాజకీయశాఖా విభేదాలు, యీ విధంగా వ్యాపించిపోతే, సిద్ధాన్నము బోరగిలపడ్డట్టు, చేజిక్కిన స్వరాజ్యము భూపతనము కాగలదు, జాగ్రత్త! జాగ్రత్త!!" అంటూ, ఉన్నదున్నట్లు, నిర్మొగమాటంగా, నిష్కపటంగా, నగారావాయించి, యీ నిర్వివాదాంశాన్ని నొక్కి వ్రాక్కుచ్చారు. బానిస శృంఖలాలు వీడినా బానిసదృక్పథము పోలేదన్నారు. స్వార్థపరులచేత, యీ స్వాతంత్ర్యము కోతికి కొబ్బరికాయచిక్కిన చందమైనదన్నారు. ఏ ఉత్తమ సూత్రాలచే యీ స్వరాజ్యము సిద్ధించినదో, ఆ సూత్రాలను విస్మరించు వారిపట్ల యీ స్వాతంత్ర్యము సార్థకము కానేరదన్నారు.

వీరి విమర్శ ముమ్మాటికి తథ్యము. స్వాతంత్ర్యమంటే హక్కులు, అధికారము అనుభవించుటయనునదే మనభావన. హక్కులనుభవించు వారు బాధ్యతల నంగీకరించాలను ప్రాథమిక విషయము మనము బొత్తిగా మరచిపోయినాము. అదను దొరికినది గదాయని అగ్రపదవులనున్న వారు వీలైనంతవరకు, తామిదివరలో చేసిన త్యాగమునుదానికి సరియైన మూల్యమును సేకరిస్తూ, అధికారమును చలాయిస్తూ, బంధువులకు ప్రీతి గొల్పుతున్నారు. "స్వరాజ్యమంటే యిదే కాబోలు, జీవితావసారాలకే కరువు సంభవించింది. కొరివితో తలగోక్కున్నట్టు, డబ్బుపెట్టి తద్దినము కొని తెచ్చుకున్నట్లు, ఎందుకొచ్చిన స్వరాజ్యమిది? తెల్లవారి పరిపాలనే నయము. కూటికీ గుడ్డకూ అయినా సమృద్ధియుండెడిద"ని విలపిస్తున్నారు సామాన్య ప్రజ. "పనులు తగ్గించాలి - జీతాలు ఎక్కువ యివ్వాలి - లేకపోతే, స్వరాజ్యము వచ్చినలాభం మాకేముంది?" అని అడుగడుగునకు, తుమ్మితే వూడిపోయే ముక్కువలె, సమ్మె బెదిరింపులను జారీ చేస్తున్నారు, కార్మిక బృందమంతా. ఇదేయదను తాము ప్రాముఖ్యతకు వచ్చుటకని, కులకక్షులు, మతకక్షులు, భాషా రాజకీయ కక్షలను మెక్కులు పెల్లగించి, నాయకులమని భుజాలు తట్టుచున్నారు, కొందఱు స్వార్థపరులు.

సత్య అహింసలనెడి రెండు దివ్యాస్త్రములచే సంపాదించిన స్వరాజ్యమిది. విశ్వ మానవ ప్రేమ, సర్వమత సామరస్యము దీనియొక్క లక్ష్యములు. స్వరాజ్యప్రదాత బాపూజీ యీ లక్ష్య

సిద్ధికై నిర్ణయించినది నిర్మాణ కార్యక్రమము. ఈ కార్య క్రమములో, సత్య అహింసా ప్రచారమునగాని, గృహపరిశ్రమలచే స్వయంసమృద్ధి ప్రణాళికను ఏర్పాటు చేయుటలోగాని, ఏక రాష్ట్ర భాషా ప్రచారమునగాని, యింకా నిర్మాణ కార్యక్రమ ప్రణాళికలోని ఏ విభాగములోగాని, ఏ బాధ్యతను పూనుకుని నిర్వహించుచున్నారు పై బేర్కొనిన వివిధ తెలగలవారు అనునది, అడుగవలసిన ప్రశ్న - ఇదే మనము యిప్పుడు చేసుకొనవలసిన ఆత్మవిమర్శ.



## శ్రీ కీ. శే. సరోజనీదేవి

# స్మారక సభ

2-3-'49 బుధవారము సాయంకాలము ఆంధ్రమహిళా సభలో దివంగతులైన శ్రీమతి సరోజనీ నాయుడుగారి స్మారక చిహ్నముగా, స్త్రీల బహిరంగ సభ జరిగినది. శ్రీయుత బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షత వహించిరి. 5 గం. నుండి సభ బాలికలు సూత్రయజ్ఞముచేసిరి. 5-30 గం.కు సమావేశము ప్రార్థనగీతములతో ప్రారంభమైనది. సభాధ్యక్షులు శ్రీమతి సరోజనీదేవిగారిని గూర్చి ఉపన్యసించిన పిదప, ఈ దిగువ తీర్మానమును చదువగా సభాసదులు, గౌరవ పూర్వకముగ నిలచి, తమ నిశ్శబ్దముతో తీర్మానమును ఆమోదించిరి.

"ప్రఖ్యాత నారీరత్నము, దేశసేవాపరాయణి, స్వార్థత్యాగినైన, శ్రీమతి సరోజనీ నాయుడుగారి అకస్మాత్తు మృత్యువునకై యీ సభవారు తమ విషాదమును తెలియబఱచుచున్నారు. దేశమునకు, అందు ముఖ్యముగా స్త్రీ లోకమునకు యీమె చేసిన అపారసేవను, భక్తి పూర్ణముగ సంస్మరిస్తూ, ఈమె ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచున్నారు."

తీర్మానానంతరము, శ్రీమతులు అమ్మన్నరాజాగారు, ముత్తులక్ష్మిరెడ్డిగారు, మేరీక్లబ్బువాలాగారు, బీగమ్ అమిరుద్దీన్‌గారు, లేడీ శంకరయ్యార్‌గారు శ్రీయుతులు పూటుకూరి నరసింహారావుగారు, త్రిలోకేకర్‌గారు, బషీర్ అహమ్మద్ సయ్యాత్‌గారు, వెంకట్రామన్‌గారు, తెలుగులో, అరవములో, హిందీలో, ఆంగ్లములో, శ్రీమతి సరోజనీ నాయుడుగారి సేవా జీవితాన్ని గూర్చి ఉపన్యసిస్తూ వారి మృత్యువువలన, ప్రస్తుతము దేశమున కొక తీరని వెలితి కలిగినదని చెప్పారు.

'జనగణమన' గానముతో సభ ముగిసినది.

భారత ప్రభుత్వ ఉపప్రధాని

# గౌ. సర్దార్ వల్లభాయి పటేల్‌కు సన్మానము

"గాంధీ మహాత్ముని ప్రవచన సూత్రావలం బనయే సంపూర్ణ స్వాతంత్ర్యమునకు సరియగు రాజబాట. మనము గాంధీమహాత్ముడు చూపిన మార్గమున పోవుట లేదు అందుకు విభిన్న మార్గము ననుసరించు చున్నాము. కావుననే మనకు సంపూర్ణ స్వరాజ్య మందుబాటునందు లేదు. సంపూర్ణ స్వాతంత్ర్యము మనకు కరతలామలకము కావలెనన్న, మనము ఐకమత్యముగా నుండుట సహనభావము కలిగియుండుట, నేర్చుకొని మహాత్మునిచే నిర్ధరింపబడిన, అసంపూర్తిగా విడువంబడిన నిర్మాణ కార్యక్రమము కొనసాగించవలెను."

శ్రీమతి దుర్గాబాయిగారు చాలా జబర్దస్తీ స్త్రీ. పురుషులను మించి ఆమె పెక్కు కార్యములను నిపుణతతో నిర్వహించుచున్నారు.

"ఆంధ్రమహిళా సభలో జేయుచున్న నిర్మాణాత్మక కార్యక్రమము నాకెంతయు సంతసమును గూర్చుచున్నది." అని గౌ. సర్దార్ పటేల్ ఆంధ్రమహిళా సభలో ప్రసంగించిరి.

## సమావేశ వివరములు

ఫిబ్రవరి 23-వ తేదీ ఉదయం 9 ఘంటలకు భారతదేశ ఉపప్రధాని సర్దార్ పటేల్, ఆంధ్ర మహిళాసభ ప్రాంగణమున, సభా కార్యదర్శిను లిరువురి చేతను, బులుసు సాంబమూర్తిగారి చేతనూ ఆహ్వానితులై లోనికిం గొనిరాబడిరి. ఆంధ్ర మహిళాసభ విద్యార్థినులచే వారికి గౌరవ వందన మాచరింప బడినది. తరువాత సభ తాలూకు, దాతలు, ధర్మకర్తలు, కార్యనిర్వాహక సభ్యురాండ్రు, ఉపాధ్యాయినీవర్గము వారికి పరిచయము చేయబడిరి. సభ వసతి గృహము, పారిశ్రామిక విద్యాలయము, టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్, గ్రంథాలయము పరికించిన వెనుక సర్దార్జీ సభా స్థలికిం గొనిరాబడిరి. వారితో వారి కుమార్తె శ్రీమతి మణిబెన్ పటేల్ కూడ ఉండిరి. ఉపప్రధాని ఆసీనులైన వెనుక కరతాళ ధ్వనుల మధ్య పుష్పమాలాలంకృతులు కావింపబడిరి.

ఈ సభకు ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు, మద్రాసు ప్రధాని రామస్వామి రెడ్డియార్, రాష్ట్ర మంత్రులు, సీతారామ రెడ్డి, భక్తవత్సలం, న్యాయపతి రాఘవరావు, పళ్లంరాజు, సుందరరావునాయుడు, మదరాసు మేయరు మొదలగు పురప్రముఖులనేకులు విచ్చేసిరి.

ప్రార్థనానంతరము, ఆంధ్రమహిళా సభ కార్యదర్శినులగు, శ్రీమతి చెన్న ఘంటమ్మగారు తెలుగునందును, శ్రీమతి జమునా బాయిగారు ఆంగ్లమునందును, స్వాగత పత్రములను చదివిరి. ఆ పత్రములు అందమైన నగిషీ దంతపు

పేటిక యందుంచబడి ఉపప్రధానికి సమర్పింప బడినవి.

భారత ప్రభుత్వపు ఉపప్రధాని
శ్రీ గౌ॥ సర్దార్ వల్లభాయి పటేలుగారికి
ఆంధ్రమహిళా సభా సభ్యులచే సమర్పింపబడిన

# స్వాగతపత్రము

మహాశయా, నాయకాగ్రణీ!

అపురూపమైన తమ రాక మాకెంతయు గౌరవ దాయకము, సంతోష ప్రదాయకము నైనది. నేడు, మహిళా సభ చరిత్రలో సువర్ణాక్షరముల లిఖింపతగు సుదినము.

పూజ్య బాపూజీ వారసులుగ, జాతీయ బల సంపత్తిని వృద్ధిజేసి, దేశ స్వాతంత్ర్యమును సుస్థిరమొనరింప వలసిన గురుతర బాధ్యత తమదైనది. ఈ మహోత్కృష్ట కార్య నిర్వహణలో, మా శాయశక్తుల తమ ఆజ్ఞానువర్తులము కాగలమని విన్నవించు కొనుచున్నాము.

ఎనిమిదేండ్లుగ, జాతి, మత, వర్ణ, భాషావిభేదములను విస్మరించి, స్త్రీ జనాభ్యుదయమునకై మేము ఒకించుక సేవ చేయుచున్నామని తెల్పుకొనుట ఆత్మస్తుతి కానోపదు. స్త్రీ జనాళికి వలయు విద్య, పరిశ్రమలు నేర్పుట, స్త్రీలలో లలితకళలు, జాతీయసంస్కృతి పెంపొందించుట, హిందీప్రచారము, మాకు సన్నిహితమైన కార్యక్రమము. ఇదియు, నూతనముగా మేము తలపెట్టిన మాతా శిశు శరణాలయ నిర్మాణము కూడ, నిర్విఘ్నముగ కొనసాగుటకై తమ మంగళాశీస్సులను అభిలషించుచున్నాము.

తమరాకచే మాకుకలిగిన అపరిమిత ఉత్సాహము, మా సేవాకాంక్షను ద్విగుణీకృత మొనరింపగలదు. నిర్విరామమైన తమ కార్య క్రమములో, తమకు అతిథి సత్కారముచేయు సదవకాశమును మాకొసంగి నందులకు మా హృదయపూర్వక ప్రణామములు.

ఇట్లు
మద్రాసు, } భవదీయులు,
ది 23-2-'49 } ఆంధ్రమహిళా సభ సభ్యురాండ్రు.

స్వాగత పత్రమునకు ప్రత్యుత్తరముగ సర్దార్ పటేల్ హిందీ భాషయందు యీ క్రింది విధముగా ఉపన్యసించిరి:—

"నేను చాలాకాలమునుండి హైదరాబాదు చూడవలెనని తలంచుచుంటిని. దానికి సమీపమునగుండే మద్రాసు చూచిన బాగుండునని అనుకొని యిక్కడకు వచ్చితిని. నేను రాబోవు ముందు శ్రీమతి దుర్గాబాయిగారు ఆంధ్రమహిళా సభను చూడమనికోరిరి. ఆమె జబర్దస్తీగల స్త్రీ. యితర పనులు పెక్కులున్ననూ నేను తప్పక చూచెదనని వాగ్దానము చేసితిని. దాని పర్యవసానమే నేడు మీ ఆంధ్రమహిళా సభ ఆహ్వానమును ప్రేమ పురస్సరముగా అంగీకరించుటకు గల కారణము. అది అటుండనిండు.

మన దేశము పారతంత్ర్యమునుండి బయట పడినదే కాని మన మింకనూ నిజమగు స్వేచ్ఛా స్వాతంత్ర్యములను బడయ లేదని వప్పుకొనివలెను. మహాత్ముని త్రోవను మనము నడచుచుండుటలేదు. దేశమున రాజకీయకక్షలు ఎక్కువైనవి. ఒకరు కమ్యూనిస్టులు, ఒకరు సోషలిస్టులు, ఒకరు రాష్ట్రీయ స్వయం సేవకులు

అగుచున్నారు. దేశీయులందు తీవ్ర విభేదము లేర్పడుచున్నవి. ఎవరికి వారే దేశోద్ధరణకు పని చేయుచున్నామని తలంచుచున్నారు.

దేశము, పేరునకు మాత్రమే స్వాతంత్ర్యమును బడసినది. సరియగు స్వాతంత్ర్యము, శాంతి, దేశమునందు నెలకొనలేదు. బ్రిటిష్‌వారు దేశమును విడిచిపెట్టిరి. కాని మనము మన బానిసప్రవత్తులను వీడ జాలకున్నాము. పంజరమున నుండుట యలవాటుపడిన పక్షి, విడువ బడిననూ తిరిగి పంజరమునే జొరబడుమాదిరి, దాస్య విముక్తుల మయ్యూ, మనకు బంధనములు వీడినప్పటికీ, కవాటము, తెరువబడి నప్పటికీ వెలుగు కాను పించు చున్నప్పటికీ, సరియగు మార్గము గానరాకున్నాము. పూర్వపు అలవాటులు, పద్ధతులు మార్చుకొనలేకున్నాము. ఏ మహనీయుని తపశ్చర్యతో స్వాతంత్ర్యమును బడసితిమో, వారి సిద్ధాంతములనే కాలదన్ను చున్నాము. వారు నిర్మాణకార్య క్రమము కొనసాగించమని ఆదేశించిన అది మనము పెడచెవిని పెట్టినాము. దాని ఫలితమే గుడ్డల కరువు. ఇట్టి దుష్ఫలితములు అరికట్టవలెనన్న ఆ మహనీయమూర్తి సత్య, అహింసాత్మకమగు నిర్మాణ పథకమును అనుసరించి కృషి సల్పవలెను. ఓర్పు, ఐకమత్యత కలిగియుండి, మన దేశ యౌన్నత్యమునకు మనము ఓపిన మట్టుకు సహాయపడవలెను. జాతి మత వర్ణ విభేదములను దరిజేరనీయవలదు. మతము వ్యక్తుల స్వాతంత్ర్యమునకు ఏమీ అడ్డురానంత వరకు అంగీకరించవలసినదే. అది సామాజిక వ్యవస్థకు సంబంధించిన విషయము.

దేశమునకు స్వాతంత్ర్య మెంత యవసరమో, జాతీయభాష ఒకటి ఏర్పడుట కూడా అంత అవసరమే. అట్టి భాషబహుసంఖ్యాకముగ ప్రజలకు వాడుక యందున్న భాషయై యుండాలి. మన జాతీయ భాషగా హిందూస్థానీ ఏర్పాటు కావలెనని గాంధీమహాత్ముని అభిమతమైయున్నది. కాన వారి సలహా ప్రకారము హిందీ ప్రచారము మనము గావించుట శ్రేయస్కరము.

ఇక్కడ జరుగుచున్న నిర్మాణాత్మక కార్యక్రమము నా కెంతయు ముచ్చట కలిగించు చున్నది. సర్వ జాతి మత సమానత్వము మహాత్ముని ఆదర్శము. జీవిత ప్రధాన అవసరాలలో స్వయం సమృద్ధి ఏర్పాటులకై, గృహపరిశ్రమల యభివృద్ధి ఆయన రెండవ ఆదర్శము. చిన్న బాలికలు, యువతులు యిక్కడ వస్త్రము తయారు చేయుచున్నట్లు పెక్కుచోట్ల జరిగినచో జీవితావసరమైన గుడ్డకై మనకి కరువుండదు గదా! ఎవరి శక్తిననుసరించి, వారు యిట్టి నిర్మాణాత్మక కార్యక్రమములో పాల్గొనినచో మనకు నిజమైన స్వరాజ్యము దక్కి యుండెడిది. ఇకనైననూ, మన భేద భావములను విస్మరించి, ఆశయములను సంస్మరించి, సరియైన పంథాను అనుగమించినగాని, మనకు స్వరాజ్యము వచ్చిన లాభము గానరాదు.

హైదరాబాదునందు కమ్యూనిస్టులు గత ఒకటి రెండు మాసములలో 250 మంది కాంగ్రెసువారిని హింసించి చంపినారు. వారి దుష్కృత్యములు రోజు రోజూ మితి మీరుచున్నవి. వారి పైనగాని, వారి సూత్రములపైగాని మాకెట్టి

## గౌ. సర్దార్ వల్లభాయి పటేల్‌కు సన్మానము

విద్వేషము లేదు. కాని వారు ఉపయోగించెడి సాధనములన్నా, పద్ధతులన్నా, మాకు సరిపడదు. అహింసాయుతమగు పద్ధతులలో వారు మాకు పోటీగా నిలబడవచ్చు కాని హింసాపద్ధతి ఉపయోగించిన ప్రభుత్వము వూరకుండ జాలదు. మన దేశ భవిష్యత్ నిర్మాణ సమయమున, మన మందరము అంతరంగిక విభేదములను మరచి, బాపూజీయొక్క నిర్మాణ కార్యక్రమమును కొనసాగించవలెనని కోరుచున్నాను. అట్లైన మహాత్ముని ఆశీస్సులు ఎల్లప్పుడు మన వెంటనే ఉండగలవు.

ఈ సంస్థయందు, మహాత్ముని నిర్మాణ కార్యక్రమాంశములను కొనసాగించుచుండుట చూడ ఎంతయు సంతోష దాయకము. ఈ సంస్థను చూడ నాకెంతయు వేడుకగా నున్నది. ఇట్టి సంస్థ పూర్ణాభివృద్ధి నొందగలదని ఆశించుచున్నాను."

"జనగణమన" గానముతో సభ ముగిసినది.



గౌ. సర్దార్ పటేలుకు, ఆంధ్రమహిళా సభ విద్యార్థినుల గౌరవ వందనము.

## సంఘ సంస్కరణ చట్టములు
## స్త్రీలయొక్క స్థానము.

ఫిబ్రవరి 16వ తేదీ సాయంకాలము, ఆంధ్ర మహిళా సభలో, సారస్వతశాఖ సభ్యురాండ్రకు ఉపన్యసిస్తూ, సంఘ సంస్కార చట్ట నిర్మాణ, అనుసరణలలో స్త్రీలయొక్క బాధ్యతనుగూర్చి, శ్రీమతి. మోనా హెన్సుమెన్‌గారు వివరించిరి.

ప్రారంభమున, అధ్యక్షత వహించిన శ్రీమతి మంగళాంబ, ఎమ్. ఏ. ఎల్. ఎల్. బి. గారు, శ్రీమతి మోనా హెన్సుమెన్‌గారి సేవా జీవితాన్ని ప్రశంసిస్తూ, ఆ నాటి ఉపన్యాస విషయము ఎక్కువ వివాదయుతమైనదనీ, సంస్కరణ చట్టము ముందా, ప్రజాభిప్రాయము ముందా యను వాగ్వివాదములు యీ విషయమై పెక్కులుగల వనియు చెప్పిరి.

ఉపన్యాసకులు తదుపరి, ఆంధ్ర మహిళా సభలో జరుగుచున్న కార్య క్రమమును ప్రశంసిస్తూ, ఇట్టి సంస్థల ద్వారానే సంఘ సంస్కరణ చేయనగునని చెప్పిరి.

సహగమన నిరోధక చట్టము, అతి బాల్య వివాహ నిరోధక చట్టము, దేవదాసీ చట్టము, మధ్యపాన నిషేధ చట్టము, హరిజన దేవాలయ ప్రవేశ చట్టము, బహు భార్యాత్వ నిషేధ చట్టము, విడాకుల చట్టము, వితంతు వివాహ చట్టము, హిందూ స్త్రీల ఆస్తి హక్కుల చట్టములు, ఇత్యాదులే సంఘ సంస్కరణ చట్టములు. ఇట్టి సంస్కరణ చట్టములు అమలు జరుగుటకు తోడ్పడుట, ప్రజలందఱూ, అట్టిచట్టబద్ధులై అనుసరించునట్లు ప్రభోధించుట, స్త్రీలు ముఖ్యముగా చేయవలసిన పనులు. ఏ సంస్కరణమైనను ఆదియందు బలవర్ధకములైన నిరోధ శక్తులకు పాలగును. శాసనోల్లంఘనము అనేక రీతుల రహస్యముగా జరుగుచునే యుండును. విద్యాధికులైన స్త్రీలు ప్రభోధమువల్ల, తమ యింటా బయటాకూడ సంస్కరణ చట్టములు అవిలంఘ నీయములుగ అనుసరించ బడునట్లు చూచుట అత్యావశ్యకము.

ఉపన్యాసకులకు ధన్య వాదములతో, జన గణ మన గానముతో సభ ముగిసినది.

## సర్వోదయ దినోత్సవము.

ది 30-1-49 తేదీ ఉదయం 6 గంటలకు మామూలుగా ప్రార్థనలు జరిగినమీదట విద్యార్థినులు, సూత్రయజ్ఞమును ప్రారంభించి ప్రశాంతముగను, నిరాడంబరముగను దినమంతయు దీక్షతో నూలువడకిరి. వేదికపై నుంచిన గాంధీ మహాత్ముని ప్రతిమకు ధూప దీప నైవేద్యాదులొసంగి అవనత వదనములతో, విషణ్ణహృదయములతో, భక్తిప్రపూర్ణ మనస్కులై మహాత్ముని ప్రియతమ గీతములనుపాడి, భారత జాతి జనకునకు భక్త్యంజలి సమర్పించిరి.

సాయంకాలము ఆ సభకు శ్రీ బులుసు సాంబమూర్తిగారు, శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు మొదలగు వారు హాజరైరి. అఖిల భారత కాంగ్రెసు మహాసభచే ఆమోదింపబడిన ప్రమాణస్వీకారము జరిగినది. శ్రీమతి జమునాబాయిగారు ప్రతిజ్ఞను చదివి వినిపించిరి. 'జన గణ మన' గీతముతో సమావేశము ముగిసినది.

★

# 21 వ అఖిలభారత మహిళా సమావేశము

21 వ అఖిలభారత మహిళా సమావేశము శ్రీమతి ఊర్మిళా మెహతాగారి ఆధ్వర్యమున గ్వాలియర్‌లో జయప్రదంగా కొనసాగింది. డిసెంబరు ఆఖరు వారములో జునగాడ్‌లో జరుగవలసిన సభ, వర్షములు లేమివలన అక్కడ తటస్థించిన కరువుబాధవలన ఆగిపోయినది. గ్వాలియర్ మహారాణివారి సౌజన్యమువలన, గ్వాలియర్ స్త్రీలు, జనవరి కడవారములో, తమ పూరనీ సమావేశముజరుప సాహసించారు. అయినా, భోజనవస్తువులు దొరకుట దుస్తరమైన యీ రోజులలో, రమారమి 400 మంది అతిథులకు భోజన సౌకర్యముల నేర్పాటు చేయనియ్యకొనుట, ఏ పూరివారికైనా సాహసమేయని చెప్పవచ్చును. ఇప్పటి వరకూ యిది యొక అలవాటుగా జరుగుచుండుటచే, ఎవరో ఒకరు యీ సమావేశ బాధ్యతను పైవేసికొని ప్రతి సంవత్సరము వరుస తప్పకుండా జరిపించుచునేయున్నారు. ఆహ్వాన సంఘమువారికి, నలుమూలలనుండి సమావేశమునకు వచ్చు ప్రతినిధి వర్గానికి గూడ, యీ సమావేశములు ఎంత వ్యయ ప్రయాసలకు కారణ మగుచున్నావో, క్రమంగా స్థాయి సంఘము వారు గ్రహింపక పోలేదు. సంఘీభావము వృద్ధిపొందుటకు, స్త్రీల లోపర్యటన వాంఛకలిగించుటకు, వివిధ జాతి, మత, భాషా పద్ధతుల వారొకచో, సమాన వాంఛతో సమావేశమగుటకు, యిట్టి అవకాశములు కావలసియున్నను, ఫలితమునకు పదిరెట్లెక్కువ కష్ట కారణములగుట యిక మీాదనివి రెండువర్షముల కొకతూరి జరిపించుట ఉత్తమమని స్థాయిసంఘమువారు నిర్ణయించిరి. యీనిర్ణయము ఒప్పుకోతగ్గది.

గ్వాలియర్ మహారాణియైన శ్రీ విజయరాజే సింధే ఆహ్వాన సంఘాధ్యక్షురాలు కావటమువల్ల, ప్రతినిధులకు వసతి సౌకర్యాలకుగాని, భోజన సదుపాయాలకుగాని, ఇతర సత్కారాలకుగాని లోటు లేకుండా, చక్కగా జరిగిపోయాయి. పరదా వదలి కొన్ని నెలలైనా కాకముందే, గ్వాలియర్ స్త్రీలు, తమ మహారాణి ఉదాహరణతో, తమ కార్యనిర్వహణయందు తెలివి తేటలు, చాక చక్యము చూపించారు. అతిథులందఱు సంతసించునట్లు ఎక్కువ అభిమానముతోనూ, జాగ్రత్తతోనూ, లోటు లేని ఏర్పాట్లు గావించినారు.

శ్రీమతులు రాజకుమారి అమృతకౌర్, కమలాదేవి, హన్సామెహతా, రామేశ్వరీ నెహ్రూ, రేణుకారే, హానాసేన్, రక్షాశారన్, అనసూయాబాయి కాళే, మిథాన్ లామ్, యింకా యిత్యాది ప్రముఖ స్త్రీలు సమావేశమునకు విచ్చేసిరి. స్థాయి సంఘ సభ్యురాండ్రు, వివిధ ప్రాంత ప్రతినిధులు, తదితరులు చేరి రమారమి 400 మంది గ్వాలియర్ సమావేశమునకు పైనుండి వచ్చిన అతిథులు.

సమావేశ ప్రారంభమునకు ముందు రెండు రోజులు స్థాయిసంఘ సభ్యురాండ్రు తీర్మానించవలసిన విషయాలను గూర్చి చర్చించి, కేవ

లము ప్రాంతీయములు కానివి, ఒకజాతికి ఒక మతముకు, ఒక భాషకు ఒక శాఖకు మాత్రమే సంబంధించినవి గానివి, ఒక ముఖ్యమైన తీర్మానములు ప్రతినిధులందఱూ చర్చించి తీర్మానించ వలసినవిగా నిర్ణయించారు.

నూత్న అధ్యక్షురాలు శ్రీమతి వూర్మిళా మెహతాగారు, సమావేశ ప్రారంభ దినమున, అధ్యక్షపీఠము నలంకరించిన పిదప, ఆహ్వాన సంఘాధ్యక్షురాలగు, మహారాణీ విజయరాజే సింధేగారు, స్వచ్ఛమైన హిందీభాషలో స్వాగతోపన్యాసమును చదువుచూ, భారత స్త్రీల పూర్వ ఔన్నత్యాన్ని పునరుజ్జీవింప జేసే ఘనతర బాధ్యత యీనాటి స్త్రీలదేయని హెచ్చరించారు. మహారాజా సింధేగారు సీత, సావిత్రి, దమయంతి యిత్యాది స్త్రీ రత్నాలను కన్న యీ పుణ్యభూమిలో, నేటి స్త్రీలు తమప్రాచీన సంస్కృతిని దశదిశల చాటగలరను విశ్వాసమును వెల్లడించినారు.

అటుపైన అధ్యక్షురాలగు శ్రీ వూర్మిళా మెహతాగారు, తమ సుదీర్ఘోపన్యాసములో, నేడు భారతావని నెదుర్కొనుచున్న క్లిష్ట పరిస్థితులను గూర్చియు, సమస్యా పరిష్కారములో స్త్రీల యొక్క బాధ్యతను గూర్చియు విపులముగ విమర్శించిరి. స్వాతంత్ర్యముతో తారసిల్లిన దేశవిభజన, శరణార్థుల సమస్య హృదయ విదారకమైనది. దేశమంతయు కుల మతద్వేషములు, కరువు కాటకములు తాండవ మాడుతున్నాయి. రెండు ప్రపంచ సంగ్రామముల దెబ్బచే లోకమంతయు కల్లోలితమైయున్నది. బాపూజీయొక్క సత్య, అహింసా విధానములుతక్క దేశమునకు శాంతి ప్రదాయకములు మరిలేవని ప్రపంచమునందలి ప్రముఖ నాయకులందఱూ తలంచుచు చున్నారు. ప్రపంచ శాంతి సంస్థాపనకు భారత భూమే మార్గదర్శి కావలెనని వారు ఆశించు చున్నారు. కనుక, బాపూజీ అనుచరులమైన మనము సర్వ విధములా ఆయన బోధనల నతిక్రమించక, అహింసాపంథాలో, నిర్మాణ కార్యక్రమములో నిమగ్నులము కావలసిన అదను వచ్చినది. సర్వమత సామరస్యము, విశ్వమానవ ప్రేమ — యీ రెంటిని దేశమంతటిలో నెలకొల్పుట, విద్యావ్యాప్తి, ఆరోగ్య అభివృద్ధి — ఈ ప్రణాళిక ననుసరించి, నిర్విరామ కృషి సల్పుటయే, అఖిలభారత మహిళా మహాసమావేశపు కర్తవ్యమని శ్రీ వూర్మిళా మెహతాగారు ఉద్ఘాటించిరి.

ఈ సమావేశమునకు శ్రీమాన్ రాజగోపాలాచారి, శ్రీమతి సరోజినీ నాయుడు, పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, విజయలక్ష్మి పండిట్, ఇంకా యితర ప్రముఖనాయకులు, తమ శుభాశీస్సులను పంపిరి. ప్రతినిధులతో ప్రేక్షకులతో సభ క్రిక్కిరిసి పోయినది.

తదుపరి మూడు దినములలో, 30 తీర్మానములు చర్చింపబడ్డాయి. స్త్రీలయొక్క విద్య, ఆర్థిక, సాంఘిక హక్కులు, దేశము యొక్క శాంతి రక్షణ మార్గములు, యీ తీర్మానముల యొక్క విషయము. ఇందుకొన్ని ఏకగ్రీవముగ తీర్మానింపబడినను, కొన్నింటి విషయమున తర్జన భర్జన లెక్కువగా జరిగాయి. ప్రసంగములలో

పాల్గొన్న సోదరీ మణులందఱూ తమ విమర్శనా శక్తిని, వాగ్ధాటిని ఎక్కువగా విశదపరచినారు గాని, కాలపరిమితిని మాత్రము గమనించక పోవుటవల్ల, అధ్యక్షురాలికి, యితర ప్రతినిధు లకుగూడ విసువుగొల్పారు. ప్రతి విషయమును చక్కగా మననము చేసికొని, తెలివి తేటలతో ప్రసంగించ గలిగియుండుట, ప్రతినిధుల యొక్క విద్యా, విజ్ఞానములను, యిటీవల స్త్రీలలో కలి గిన వికాసమును నిరూపించినవి.

ఒక విషయము కొంచము అసంతృప్తిని కలి గించకపోలేదు. ఈ సమావేశము కేవలము సాంఘికమైనది. రాజకీయ విభాగాలకు, కొట్లాట లకు యిందు స్థానము లేదు. శాంతి యుతమైన సక్రమ పంథాలో జరిగినంత కార్య క్రమమును జరుపుటయే సభ్యురాండ్ర ఆశయము. దీనిని విస్మరించి, కొంతమంది సోదరీమణులు, తమరాజ కీయ విభేదముల నాధారము చేసికొని, కొన్ని అసందర్భమైన ప్రసంగములను గావించి, సభలో అలజడి కలుగ జేసిరి. సభ వెన్నెముకలైన కమలాదేవి మొదలగు ప్రముఖులతి జాగరూక తతో వీరిని అదుపులో నుంచవలసిన అగత్యము కలిగినది. ఇక మీదనైన యీ సమావేశపు సభ్యురాండ్రు, తమ శాఖా విభేదముల నిందు జొరనీయ కుందురనియు, యీ అఖిల భారత మహిళా సమావేశము, జాతి, మత, కుల, భాషా, రాజకీయశాఖా విబేద రహితమై, ఒక ఆదర్శసంఘమై స్త్రీ సేవ, దేశసేవ గావించ గల దని నమ్ముచున్నాము.



శ్రీ సంగీత రత్నాకర, సంగీతకళానిధి

# శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారి

## సన్మాన మహోత్సవ సమావేశము

## విజ్ఞప్తి

శ్రీ విజయనగర సంస్థాన ఆస్థాన విద్వాంసులగు శ్రీ సంగీత రత్నాకర, సంగీతకళానిధి ద్వారం వెంకటస్వామి నాయుడుగారిని ఉచితరీతిని సత్కరించుటకై ఒక సన్మాన మహోత్సవ సభా సమావేశము 1949 మార్చి 26 వ తేదీని మద్రాసులో జరుగును.

ఈ సందర్భమున శ్రీ నాయుడుగారి శిష్యులకు, కళాభిలాషులకు, కళారాధకులకు, కళాపోషకులకు తమతమ కృతజ్ఞత, గౌరవాభిమానములను నివేదించుటకు అవకాశము కలదు.

అంతేకాక కవులు, రచయితలు, గాయకులు, కళాభిలాషులు అందరూ శ్రీ నాయుడుగార్ని గూర్చి వ్రాసిపంపే ఆశీర్వచన పద్యములు, అభినందన పత్రములు, సన్మాన పత్రములు, శ్రీ వారితోకూడిన ఫోటోలు పంపిన 'శ్రీ నాయుడుగారి సన్మాన సంచిక'లో ప్రకటింతుము.

ఆశీర్వచనములతో బాటు భూరివిరాళములను సైతము పంపి, కళాభిలాషులందరూ యీ సన్మాన మహాసభను, విజయవంతముగా జరిపింపగలరు.

'శ్రీ నాయుడుగారి సన్మాన సంచిక' వివరములు, ఉత్తర ప్రత్యుత్తరములు శ్రీ రామాచారి, 'ఎడిటర్' 'నటన' రాయపేట, మద్రాసు వ్రాయండి

ఇట్లు

ఆర్. బి. రామకృష్ణరాజు, కార్య నిర్వాహకులు,

శ్రీ నాయుడుగారి సన్మాన సంఘము.

3 శ్రీరామనగరు దక్షిణ వీధి, ఆళ్వారుపేట, మద్రాసు 16.



# ప్రతిబింబము



ఏకాంకిక



శ్రీ సూరంపూడి భాస్కరరావుగారు



పాత్రలు :

రాజ్యలక్ష్మి, సుందరి, లలిత, సరోజిని } ఒక జాతీయ సంస్థలో విద్యార్థినులు.

రామలక్ష్మమ్మ : లలిత తల్లి.

మంగమ్మ : సుందరి తల్లి.

సరళాదేవి : ఉపాధ్యాయిని.

## రంగము ౧.

['వందేమాతరం' పాటపాడుతూ ఉండగా తెరయెత్తబడుతుంది. మధ్యలో సరళాదేవి ఆసీనురాలై ఉంటుంది. ఆవిడకి కుడిప్రక్కగా లలితా రాజ్యలక్ష్మికూర్చుని ఉంటారు. ఎడమ ప్రక్కగా, సుందరీ సరోజినీ కూర్చుని ఉంటారు. అంతా రాట్నం వడుకుతూ ఉంటారు.]

సరళాదేవి : (పాట ముగియడం తోనే) లలితా, రాజ్యం మీ యిద్దరికి నేను చెప్పవలసింది ఒకటుంది. (ఆగి) అయితే రాజ్యం, నీ దగ్గర లలిత పుస్తకా లేవేవి వున్నాయి ?

రాజ్యం : రెండో మూడో ఉన్నాయండి.

సరళాదేవి : అవి వెంటనే లలితకిచ్చేయి. లలితా ఈ సారి నువ్వెప్పుడూ రాజ్యంతో ఎక్కువచనువుగా ఉండకూడదు రాజ్యం, నువ్వు ఈ సారినించీ, లలితని చేర దియ్యకు. తెలిసిందా ? నువ్వింకా లలితతో మాట్లాడు తున్నావని తెలిస్తే, ఈ సంస్థలోనుంచి వెళ్ళిపోవలసి వస్తుంది. జ్ఞాపకముంచుకో. (అంతా బిక్కమొగంవేస్తారు. సరళాదేవి లేస్తుంది. విద్యార్థినులు రాట్నాలు కట్టేసి పుస్తకాలు తెరుస్తారు.)

సరళాదేవి : (రాజ్యంతో) ఇదుగో రాజ్యం, నీకేవైనా గొప్పగొప్ప అభిప్రాయా లుండవచ్చు, తెలివి తేటలుండవచ్చు. వాటిని మాత్రం యితరులమీద ప్రయోగించకు. వింటున్నావా ? (నిష్క్రమిస్తుంది)

సరోజిని : ఏమే లలితా, ఎందుకే సరళగారి కోపమొచ్చింది ?

లలిత : (ఉక్రోషంతో పళ్లు పటపటకొరుకుతూ) ఎందుకో?

సుందరి : (ఫుల్లవిసుపుగా) మధ్యన నీ కెందుకు ?

సరోజిని : పోనీలే బాబూ. (పుస్తకం చదువు కుంటుంది)

(రాజ్యం లోపలికి వెడుతుంది)

సుందరి : ఎంతో స్నేహమైతేమాత్రం, అంతరానుకు తిరగాలే మిటి ? రాజ్యం యేదో కబుర్లు చెబుతుంది. అది లలితకి కులాసాగా ఉంటుంది. ఆమట్న్ని రాజ్యానికేం కావ లిస్తే అది పదో, పాతికో రూపాయలు మెల్లిగా వాళ్ల నాన్న దగ్గర్నుంచి కాజేసి రాజ్యాని కిస్తుంది. ఇవన్నీ చూస్తే ఊరుకుంటారేమిటి ?

లలిత : ఛీ నోరుముయి ఎవరన్నా సుఖంగా స్నేహంగా ఉన్నారంటే అంత ఉక్రోష మెందుకు ? మంచి చెడ్డా ఉండక్కర్లేదూ, మాట్లాడేనోటికి ?

రాజ్యం : (పుస్తకాలతో ప్రవేశించి) లలితా, ఇవిగో నీ పుస్తకాలు. ఇకనుంచీ నీ పాఠాలు నువ్వు జాగ్రత్తగా చదువుకో. (అని కూర్చుంటుంది.)

లలిత : రాజ్యం, నాతో మాట్లాడవూ ?

సరళ : (ప్రవేశించి) లలితా, నీకు ఒక సారి చెప్పాను చాలదూ. ఇప్పటికి మీ తల్లిగారు అన్నమాటలు చాలు. అది యింకా సాగక్కరలేదు. రాజ్యం, నువ్వు వెళ్లి అవ తల గదిలో చదువుకో.

(రాజ్యం వెళ్లి పోతుంది.)

లలిత : రాజ్యంచేసిన తప్పేముందండీ, పాపం నాకు పాఠం చెప్పేది, అనేకపుస్తకాలు నాచేత చదివించేది, దేశంలో మంచీ చెడ్డా యేం జరుగుతోందో, అంతా చెప్పేది. నేను రాజ్యంతో కలిసిఉంటే నాకెంతో సంతోషంగా ఉండేది.

సరళాదేవి : చాలు ! మాట్లాడకుండా పుస్తకమేదో చదువుకో—

(రామలక్ష్మమ్మ మంగమ్మ ప్రవేశిస్తారు)

మంగమ్మ : ఆ రాజ్యానికెంత పొగరనుకున్నా వమ్మా. పెద్ద వాళ్ల మాటంటే కాస్తలక్ష్యంలేదు. అన్నీ తనకే తెలుసు నంటుంది.

సరళాదేవి : రామలక్ష్మమ్మగారా ? రండి, కూర్చోండి.

(సుందరీ, సరోజినీలతో లలిత నిష్క్రమిస్తుంది.)

రామలక్ష్మమ్మ : మీతో ఒక చిన్న సంగతి మాట్లాడాలి.

సరళాదేవి : ఔను, మీరనబోతున్నది నాకూ తెలిసింది.

మంగమ్మ : అయితే, మీ బడిలో రాజ్యలక్ష్మి అని పిల్ల ఉంది కదండీ.

సరళాదేవి : ఔనండి, మీకిదివరకే తెలుసేమో.

రామలక్ష్మమ్మ : ఆ అమ్మాయి ఒక్కతే యిక్కడ వుంటోం దిట కదండీ, వాళ్లవాళ్లెవరూలేరూ ?

సరళాదేవి : ఉన్నారండి. లేకేం. అయితే వాళ్లంత స్థితి మంతులు కాదు. అందుచేత ఆ అమ్మాయి, తనకి చేత నైన విధంగా సంస్థకి తోడ్పడుతుంది. ఉచితంగా భోజనవసతి ఏర్పాటుచేశాం. తనమానాన్ని తను చదువు కుంటూంది.

రామలక్ష్మమ్మ : సరళగారూ, ఒకటి చెప్తాను వినండి, ఇలా ఉచితంగా అని చెప్పేసి వచ్చే వాళ్లుంటారే, వాళ్లకి అదుపు ఆజ్ఞ ఉండదండి.

మంగమ్మ : అందుకేవాళ్లు యెంతకైనా తెగుదురు.

సరళాదేవి : తెలిసీ తెలియకుండా మనం మాట్లాడటం అంత మంచిది కాదండీ.

రామలక్ష్మమ్మ : ఇంతకీ, యీ మాటవినండి, మొన్న రెండో తారీకుని మా ఆయన జీతం తీసుకున్నాక, అప్పులు అవీ తీర్చాక ముప్పైరూపాయలు మిగిలై. దాంట్లో ఇరవై రూపాయలు, యింట్లోఖర్చుకని నా కిచ్చారు. నేను యెప్పుడులాగే అలమారులో పెట్టాను. రెండు రోజులు పోయాక పాలవాడి కిద్దామకదాయని చూస్తే, అక్కడ పదీలేదు యిరవై లేదు.

మంగమ్మ : మీ రాజ్యలక్ష్మి దగ్గర నిన్న ప్రొద్దుటికి యిరవై రూపాయలుండడం నే నెరుగుదును.

సరళాదేవి : మీరు పొరపాటు పడుతున్నారు. రాజ్యలక్ష్మి దగ్గర యిరవై రూపాయలు కాదుకదా, యిరవై కానులు కూడా ఉండవు.

రామలక్ష్మమ్మ : కొంచెం ఆ అమ్మాయిని పిల్చి కనుక్కో కూడదూ ?

సరళాదేవి : కనుక్కోడానికి అర్థమేమీ ఉండొద్దూ! ఆ అమ్మాయి దగ్గర రూపాయలనేవి యెప్పుడూ ఉండవు. అయినా ఆ అమ్మాయికీ మీ యింట్లో పోయిన రూపాయలకీ సంబంధ మేమిటి ? ఆ అమ్మాయి మీ యింటి కెప్పుడన్నా వచ్చిందా ?

రామలక్ష్మమ్మ : ఆ అమ్మాయిరాలేదు. మా లలిత యెంత అమాయకపు పిల్లో మీరెరుగుదురు. దానికదేం పిచ్చో వాళ్ల నాన్నతో అదేపనిగా రాజ్యం యిదిచెప్పింది, అది చెప్పింది, యిది చదివింది, అది చదివింది, యిది చేసింది అది చేసింది అని వాగుతూ ఉంటుంది. దాని కస్తమానం ఆ అమ్మాయి ధ్యాసే. యిన్నాళ్లనుంచీ, రాజ్యం కోసం రోజూరోజూ బడికి గంటముందుగానూ, యింటికి గంట ఆలస్యంగానూ వస్తూంటే ఏమో అనుకున్నాను.

మంగమ్మ : రాజ్యం చాలా గ్రంథకర్త లెండి. ఎవరినైనా యిట్టె వశపర్చుకోగలదు.

రామలక్ష్మమ్మ : అలాగే ఉంది చూడగానూ. లేక పోతే యిదంతా యేమిటి ?

సరళాదేవి : రామలక్ష్మమ్మగారూ, తొందరపడి లేని పోని అపోహలు పెట్టుకోకండి. మీ అమ్మాయికి రాజ్యంమీద యిష్టం ఉంటే, అది యెవరి తప్పు? అయినా మంచి వాళ్లనిచూస్తే యెవరికైనా యిష్టం కలుగుతుంది.

మంగమ్మ : ఆ మంచివాళ్ళే మందులాళ్లు. నాకిదేదో తెలుసు కోవాలని ఉంది సుమండి. మా సుందరీ రాజ్యం దగ్గర నిన్న యిరవై రూపాయలు కళ్లారా చూచిందట. లలిత తెచ్చి యివ్వడం కూడా చూచిందట. ఇంతకంటె యేం కావాలీ ?

సరళాదేవి : చాలా సంతోషం మంగమ్మగారూ. యీవేళ సుందరే నాకీ విషయమంతా చెప్పింది. రాజ్యం దొంగతనం చేసిందని, రాజ్యంతో స్నేహం చేసి లలిత పాడై పోతోందని రామలక్ష్మమ్మగారను కుంటున్నారనీనూ, అందుకే వాళ్ల కిందాకా పాఠం చెప్పాను, ఒకళ్లతో ఒకళ్లు నోరెత్తి మాట్లాడవద్దని.

మంగమ్మ : పాఠం బాగానేఉంది లెండి. డబ్బుమాట !

సరళాదేవి : అయితే మీరు నామాట నమ్మరన్న మాట. (బిగ్గరగా) రాజ్యం,

రాజ్యం : (ప్రవేశించి) పిల్చారాండి.

సరళాదేవి : నీదగ్గిర యిరవై రూపాయలున్నాయిట నిజమేనా ?

రాజ్యం : (నిర్వెరపోయి) ఉన్నాయండి.

సరళాదేవి : అవి నీకెక్కడివి ?

రాజ్యం : మీరు ప్రెస్సువాడికిమ్మని యిచ్చిన డబ్బు, వాడింకావచ్చి తీసుకెళ్లలేదండి.

సరళాదేవి : అయితే నిన్న నీకు లలిత ఎందుకిచ్చింది ?

రాజ్యం : (మాట్లాడదు)

సరళాదేవి : మాట్లాడవేం ?

రాజ్యం : (ఏడుపుకంఠంతో) నాకేమీ తెలియదండీ. సరదాగా దాచిందికాబోలు మళ్ళీయిచ్చేసింది.

మంగమ్మ : ఆ, తెలియదూ? సుందరి చూడలేదనుకున్నావా? తే. అవిక్కడపెట్టు. మాయచేసి పిల్లల్చేత యిల్లాంటి పనుల్చేయిస్తున్నావా ? ఏడుస్తోంద పైగాను.

రాజ్యం : (లోపలికివెళ్లి యిరవై రూపాయలూతెచ్చి సరళాదేవి కిస్తుంది)

సరళాదేవి : ఎంతో బాగుంది చేసిన ఘనకార్యం. నీకింక చదువులూ సంస్థలూ అనవసరం. నువ్వు వెంటనే మీ ఊరు చేరుకోవచ్చు. యీ పది రూపాయలూ తీసుకుని వెళ్ళి మీ వాళ్లకి నువ్వుచేసిన ఘనకార్యంవిన్న వించు. సంతోషిస్తారు.

రాజ్యం : కృతజ్ఞురాలిని. మీఋణంతీర్చుకోడానికి ప్రయత్నిస్తాను. మీ దయవల్ల యిన్నాళ్ళూ లోకజ్ఞానం సంపాదించుకున్నాను. కాని ఒకమాట వినండి. నాదేమీ నేరం లేదు. అయినామీఆజ్ఞని నేనుశిరసావహిస్తాను. విచారక

ర్థమైన సంగతి ఏమిటంటే, యీనాడు మన దేశంలో అనేకమంది జనులు, మూర్ఖత్వంలో, అహంభావంలో, దొంగ గౌరవాలకి ప్రాకులాడడంలో, పాతుకుపోయి ఉన్నారు. ఒకరినొకరు నమ్మలేరు. తమలో ఏనీచత్వం ఉందో అదే అందరిలోనూ ఉందని వారి నమ్మకం. తమలోని నీచత్వం రూపు మాపు కోవడాన్ని గూర్చి ఒక్కరూ ప్రయత్నించరు. సంఘం, యీవిధంగా, పరస్పరద్వేషంతో, స్వార్థంతో వున్నంతకాలం, దేశానికి ముక్తి లేదు. నన్ను ప్రస్తుతానికి మీరు అవమానించి, శిక్షించినా, ఇట్లాంటి అనేకుల మీదికి కూడా యిదే బాణం ప్రయోగించకండి. దరిద్రులంతా నీచులనీ, ధనికులంతా గొప్పవారనీ సిద్ధాంతంలేదు. ఒకరి స్నేహంసంపాదించుకున్న ప్రతివారూ, లాభంకోరే స్నేహం చూపుతున్నారనడం కూడ సిద్ధాంతంకాదు. ఏ ఒక్కరూ తమ ధర్మాలని నిర్వర్తించుకోకుండా, ఇతరుల మీద దూకడం మంచిదికాదు. నాకు గర్వమనీ పొగరనీ మీరనుకుంటే నేనేమీ చెప్పలేను కాని, పరిస్థితులని అర్థం చేసుకోగలిగిన ఎవరూ కూడా మనుష్యులు యీవిధంగా ఊహలతో, అపోహలతో నిందలతో, ముఖ స్తుతులతో బ్రతికిపోవడం చూచి సంతోషించ లేరు. ప్రతి వ్యక్తికి సాంఘిక బాధ్యతఉంది. సాంఘికాభి వృద్ధిలోనే తన అభివృద్ధికూడా ఉంది. ఒకరినొకరు సమానంగా ప్రేమించగలగడం, గౌరవించగలగడం, నమ్మగలగడం అనేవే కాకుండా, తానే ఆచరిస్తూన్న స్వార్థ కృత్యాలు, మోసాలూమానుకుని, నిరంతంగా, శక్తికొలది కృషిచేసి, సంఘంలో జ్ఞానాభివృద్ధికొఱకూ, ఆర్థికాభి వృద్ధికొఱకూ పాటుపడాలి. క్షమించండి. అది నేను నిర్ణయించుకున్న కర్తవ్యం. కాని నేను మీకుచెప్పడం మీ అభిమానానికి భంగం కలిగించడం ఔతుంది. నేను వెళ్లిపోతూ మిమ్మలిని వినయపూర్వకంగా కోరేదదే. అందరినీ సమానమైన గౌరవంతో చూడండి. చిన్నవాళ్ళు చెప్పిందైనా మంచి దేనేమోనని కొంచం ఆలోచించి చూచుకోండి— శలవు.

(నిష్క్రమిస్తుంది)

మంగమ్మ : ఎంత ఉపన్యాసమిచ్చింది ?

సరళాదేవి : మీకింకా ఆ అమ్మాయిమీద పగతీరలేదూ ?

రామలక్ష్మమ్మ : అమ్మయ్య, ఇప్పుడే ఇరవై రూపాయలు వచ్చాయి కనక ప్రాణంకుదుట పడింది. లేక పోతే మా ఆయనతో ఏం చెప్పాలీ. కొంపలోతిట్లూ తిప్పలుమాని, చివాట్లూ చెప్పుదెబ్బలూ నానా అల్లకల్లోలమూ అయిపోయేది. వస్తానండి.

సరళాదేవి : అయితే యింతకీ లలిత ఆ అమ్మాయి కెందుకిచ్చిందంటారు ?

మంగమ్మ : ఇవ్వడానికేముందండీ, అమాయకపు పిల్ల. అది తెమ్మనుంటుంది, ఇది తెచ్చి ఉంటుంది. దీనికేం అర్థం తెలుసునా, శుభం తెలుసునా ?

సరళాదేవి : అంతసులువుగా పోనివ్వకండి కొంచెం సుందరిని పిల్చి కనుక్కుంటారా ?

మంగమ్మ : బాగుందండోయి, సుందరికేం తెలుసును ? అది చూసింది చెప్పింది. మిగిలింది తెలుసుకోవాలి.

లలిత : (ప్రవేశించి) రాజ్యం ఊరికెకుతోందాండి ?

రామలక్ష్మమ్మ : దానిజోలీ నీకెందుకు ? నీ మానాన్ని నువ్వు పడుండు.

లలిత : అమ్మా నీకు తెలియదే రాజ్యం ఎంతమంచిదోను.

సరళాదేవి : లలితా సుందరి నిలా పిలు.

సుందరి : (సరోజినితో ప్రవేశించి) నేనింటికి వెళుతున్నానే అమ్మా.

సరళాదేవి : సుందరీ, నిన్న లలిత రాజ్యానికి ఇరవైరూపాయిలివ్వడం నువ్వుచూచావు కదూ ?

సుందరి : ఔనండి లలిత నడగండి. యెదుకు గుండానే వుందిగా.

లలిత : ఆ యిరవై మీరెరుచ్చారుటండీ. సరదాగా దాచి యిచ్చేశాను.

రామలక్ష్మమ్మ : అయితే యింట్లో ఉన్న యిరవై యెక్కడ మాయమై పోయాయే భడవా ?

లలిత : ఏమో నాకేం తెలుసు. నాన్ననడక్కా పోయావా ?

రామలక్ష్మమ్మ : నాన్ననా ? నాన్ననడిగితే ఒళ్లుమరిచి డబ్బు దొంగలపాలుచేసి నన్నడగడాని కొచ్చావా అని, నోటినిండా గడ్డెడతారు. నాన్ననడగాలిట, చేసిన వెధవ పనికి సాయం సలహాలిస్తోంది.

లలిత : ఏమో, నాకది నాన్నెయిచ్చాడు.

సరళాదేవి : (ఆశ్చర్యంగా) ఆ, సరదాగా దాచానన్నావు, నాన్నెందు కివ్వాలసొచ్చింది ?

సరళాదేవి : సుందరీ, నీదగ్గిరేదో కొత్త పెన్నుంది, ఇల్లా పట్రాచూద్దాం.

(సుందరి బిక్క మొగంతో పెన్నందిస్తుంది.)

సరళాదేవి : పార్కర్ చాలా బాగుంది. ఎప్పుడుకొన్నావు ?

సుందరి : (కంగారుగా) కొనలేదండీ. రోడ్డుమీద దొరికింది.

సరోజిని : అఁయ్, మొన్న మనిద్దరం షాపుకెళ్లి కొనలేదూ?

సరళాదేవి : చూశారా మంగమ్మగారూ, మీ అమ్మాయి యిరవై రూపాయిల పెన్ను కొంది.



లలిత : (బిక్క మొగంతో) మీ రిచ్చిన డబ్బుకోసం నేనూ రాజ్యం పెట్టెతెరచి చూశామండీ. డబ్బు కనపడకపోతే ఆపూటంతా యేడుస్తూ కూచుంది రాజ్యం. ఆవేళ నే నింటికివెళ్లి మానాన్నని బతిమాలి రాగాలెట్టి అడిగితే యిచ్చారు. అది యిస్తే ఎక్కడిదని అడిగింది. నీదగ్గరదే సరదాగా దాచా అని చెప్పిందాకా పుచ్చుకోలేదు.

రామలక్ష్మమ్మ : ఏమిటేమిటే ? అయితే మీనాన్నే ఆ డబ్బుతీసి నీకిచ్చారన్న మాట. అయితే ఆ అమ్మాయి దగ్గిరున్న డబ్బు యెలాపోయింది ?

మంగమ్మ : (భయపడుతూ) దాని మొహం దానికి డబ్బెక్కడిదండీ. ఎక్కడో దొరికే ఉంటుంది.

రామలక్ష్మమ్మ : అదేం మాటమ్మా షాపు కెళ్లికొన్నామని ఆ పిల్ల చెబుతూ ఉంటేనూ.

(సుందరి యేడుపు మొదలు పెడుతుంది)

లలిత : యిప్పుడు యేడుస్తున్నావా ? రోజూ రాజ్యాన్ని సూటిపోటి మాటలన్నట్టు లేదేం ? రాజ్యాన్ని పిల్చుకొస్తానుండు.

(24-వ పేజీ చూడుడు.)

# ప్రజాస్వామ్యము



మరియే యితర ప్రభుత్వ పద్ధతుల యందు కానుపించని సదవకాశములు, ప్రజాస్వామ్యములో గానవగుచున్నాయి. వ్యక్తిత్వము కాపాడుకొనుటకు, వ్యక్తికి సమాజమునకు ప్రకృతిచే ప్రసాదితమైన ప్రతిభా విశేషములు సరియగు మార్గమున వృద్ధినొందుటకు తగిన అవకాశములు ప్రజా స్వామ్యమున పొడగట్టును. మానవుడు, అతనిజాతి, స్వేచ్ఛావాతావరణంలో మాత్రము చక్కగ వృద్ధినొంద గలవని మానసిక, సాంఘిక తత్వచరిత్రలు ఉద్ఘోషిస్తున్నాయి. వ్యక్తి స్వాతంత్ర్యము నరికట్టేసిద్ధాంత భావనాపరంపరలు, పద్ధతులు, దైవకృత న్యాయమునకు, సహజ మానవత్వమునకు ద్రోహం చేయుటకే ఉపకరిస్తాయి. ప్రపంచపు ఔన్నత్యము, సంస్కృతులు వాటి వాటి విభిన్నతపైననే ఆధారపడి వృద్ధినొందుచున్నవి. ఇంకా అనంతమైన సావకాశములు, ప్రతిభావిశేషములు మానవునిలో సహజముగా అంతర్భూతమై యున్నాయి. ఎట్టి ప్రతిబంధకములు లేని స్వేచ్ఛ మానవునకు కలిగి నప్పుడే అవి వెలుగొందు చుండును.

నిరంకుశ ప్రభుత్వము తనప్రఖ్యాత విధానానికి, నియమములకు అడ్డువచ్చే ఎట్టి స్వల్ప వ్యతిరేక భావనములనైనా, స్వప్రయోజనాన్నికై కేంద్రీకరణ మిషతో నేర్పరితనము రూపొందించు హేతువుపై, అణచి వేసి, తన మార్గమును నిష్కంటకము చేసుకొంటుంది. అన్యాభిప్రాయముల నేమాత్రము సరకుగొనక, జాతీయ అంతర్జాతీయ వ్యవహారాలలో ఒంటరి మార్గమవలంబిస్తుంది. అటుగాక, ప్రజా స్వామ్యమున ప్రతి వ్యక్తికి సముచిత స్థానము లభిస్తుంది. ఆతని భావములకు తగిన ప్రోత్సాహము యివ్వబడుతుంది. ఇతరుల భావోద్దేశములకు దాస్యముచేయు నగత్యత కాన్పింపదు. ప్రతి వ్యక్తికి సమాన వాక్స్వాతంత్ర్యంముంటుంది. తత్ఫలితముగా బయల్వెడలు సత్యమునకు, యథార్థ విషయమునకు, అభివృద్ధికరమగు సదుద్దేశ్యములకు విలువ యివ్వబడుతుంది. 'ప్లాటో' మొదలు నేటివరకుగల విద్యావేత్తల అన్వేషణకు గమ్యస్థానము యీ విధానమున కనిపిస్తుంది. మానవునికి సత్యమునందుగల గౌరవము సత్యాన్వేషణయందుగల కాంక్ష, ధీశక్తియందుగల నమ్మకము, విభిన్న ప్రతిభా జనిత సంస్కృతులు, వృద్ధినొందవలెనన్న, ప్రజా స్వామిక పరిపాలన నెలకొనాలి.



# స్త్రీలు — వివాహ స్వాతంత్ర్యం

* శ్రీమతి అహల్యాదేవిగారు *

"ఆడ పిల్లలకు పెండ్లిండ్లు చెయ్యాలంటె ఆరు జతల చెప్పులజోళ్లు అరిగిపోవాలి" అంటారు. ఆరు జతలు కాదు, పది జతలజోళ్లు అరగవలసి వస్తోంది. ప్రతియింట్లోను వివాహము కాని యువతులు ఎంతోమంది వుంటున్నారు. ప్రతివారి నోటా "మా అమ్మాయికి సంబంధం కుదరలేదంటే, మా అమ్మాయికి కుదరలేదు" అనే.

మా యింటి ప్రక్కన ఒక మధ్యతరగతి కుటుంబంవుంది. వారింట్లో పెండ్లియీడువచ్చిన యువతులు ముగ్గురువున్నారు. నాల్గు సంవత్సరములనుండి ఆ తండ్రి ఎక్కడ సంబంధం వున్నదంటె అక్కడకు పోవడం, తీరా కుదరక పోవడం, తిరిగి రావడం నిత్యకృత్యమై పోతున్నది. విసుగెత్తి చివరకు ఆ పిల్లలకు పెండ్లిళ్లు చెయ్యలేం అనే నిరాశలోకి వస్తున్నారు.

ఈ విధంగా మధ్య తరగతి కుటుంబాల్లోని ఆడ పిల్లల పెండ్లి ఒక విషమ సమస్యగా తయారయి కూచుంది.

## వివాహాలు కాకపోవటానికి కారణం ఏమిటి ?

రోజు రోజుకి వస్తువులధరలు విపరీతంగా ఎట్లా పెరిగి పోతున్నాయో అదే మాదిరిగా ఈ కట్నాలు, కూడా విపరీతంగా పెరిగి పోతున్నాయి. ఈ హెచ్చు కట్నాలు ఈ నాడు పెండ్లిళ్లుకాకుండా వుండిపోవటానికి ఒక కారణం.

"ఆడపిల్లలకు చదువు సంధ్యలు అనవసరం. యింట్లో కూర్చుని యింత పనీ, పాటా, నేర్చుకుంటే మంచిది. చదువుకునివుద్యోగం చెయ్యాలా! వూళ్లేలాలా?" అనుకునే ధోరణిలోంచి "మగ పిల్లలతోపాటు ఆడ పిల్లలకు కూడా చదువులు చెప్పించటం అవసరమని, స్త్రీలు కూడా విజ్ఞానవంతులై, అన్ని విషయములు తెల్సుకోవాలి" అనే అభివృద్ధికర దృక్పథంలోకి యీ నాడు సంఘం వచ్చింది. అందువల్ల యీ నాడు ఆడపిల్లలకు వున్నత విద్యలు చెప్పిస్తున్నారు.

అంటే మధ్య తరగతి కుటుంబాలు ఆడపిల్లలకు రెండు రకాలుగా ఖర్చుబడి పెట్టవలసి వస్తోందన్న మాట. ముందు చదువుకు కొంత ఖర్చు అవుతోంది. ఈ చదువుకు అయిన ఖర్చుకంటె అనేక రెట్టింపులు వివాహానికి పెట్ట వలసి వస్తోంది.

మా యింటి ప్రక్కనవున్న మధ్యతరగతి కుటుంబంలోని అమ్మాయిలు ముగ్గురు స్కూల్ ఫైనల్ వరకు, చదివి కూర్చున్నారు. చదువుకున్న యువతులకు, తమకంటె హెచ్చు విజ్ఞాన సంస్కారము కలిగివున్న యువకులు రావాలని ఆశ వుండటం సహజమైన విషయము.

ఒక స్కూల్ ఫైనల్ చదివిన అమ్మాయి థర్డుఫారమే ఫేలయి పల్లెటూళ్ళో కూర్చుని వ్యవసాయం చేసుకుంటున్న యువకుని వివాహం చేసుకోవడానికి అంగీకరిస్తుందా? తన కంటే హెచ్చువిజ్ఞానస్థాయి కలవారిని ఆశిస్తుంది.

కాని, యీ నాడు చదువుకున్న యువకులు అలభ్యం అవుతున్నారు. వీరికి హెచ్చు కట్నాలు యివ్వవలసి వస్తున్నది. స్కూల్ ఫైనల్ చదివిన యువకునికి రెండువేలు. ఇంటర్ చదివిన వారికి మూడువేలు. సరె యిక బి. ఏ. డిగ్రీలు పొందిన యువకులకు అయిదువేలు వరకునూ ఈ మాదిరిగా చదువులనుబట్టి కట్నాలధరలు ఆకాశం నంటుతున్నవి.

ఆడపిల్లలకు సరైన సంబంధాలు కుదరక పోవడం, హెచ్చుకట్నాలు యివ్వలేక పోవడం వలన, యీ నాడు తల్లిదండ్రులు, అభివృద్ధి వ్యతిరేక మార్గాలవైపు మళ్లుచున్నారు కూడా!

బాల్యంలోనే వివాహాలు జరిగితే అమ్మాయిల యిష్టాయిష్టాలతో, నిమిత్తంలేకుండా, తల్లిదండ్రులు తమకుతోచిన సంబంధము చూసి చేసెయ్య వచ్చును. అమ్మాయి యిప్పుడు మాదిరిగా తన అభిప్రాయాలు చెప్పేదశలో వుండదు. అందుచేత బాల్య వివాహాలు చేస్తే బాగుండుననే ఉద్దేశ్యంలోకి రావటం ఒకటి.

ఆడ పిల్లలకు చదువులు చెప్పించటం వలన పెండ్లిళ్లు కావటం లేదు. ఏమంటె చదువుకున్నవాళ్లకు అంత

# స్త్రీలు — వివాహ స్వాతంత్ర్యం

కంటె ఎక్కువ చదువుతున్న వాళ్లను తీసుకురావాలి. చదువులు చెప్పించటం అనర్థదాయక మవుతున్నది. అందుచేత చదువులు చెప్పించకూడదు అనే ధోరణికి వస్తున్నారు.

చివరకు విసుగెత్తి నిర్బంధంగా పెళ్లిళ్లు చేసేస్తున్నారు. అమ్మాయి యిష్టంతో నిమిత్తంలేకుండా, ఆస్తివున్న వారికో లేనివారికో ఆఖరికి ఏదారే పోయేవాడికో, యిచ్చి పెండ్లి చేసి పంపుతే, తమనెత్తిమీద బరువు దిగిపోతుందని భావిస్తున్నారు.

## అసలు లోపం ఏమిటి ?

వివాహాలు నిర్ణయించేది తల్లితండ్రులు కాక ఆ బాధ్యత యువతీ యువకులకు వదలాలి. ఆ దృష్టి తల్లితండ్రులకులేదు. విద్యా స్వాతంత్ర్యానికి సంఘం అంగీకరిస్తుందిగాని, వివాహ స్వాతంత్ర్యాన్ని మాత్రం అంగీకరించలేక పోతున్నది. ఉన్నత విద్యనేర్చి ఆనర్సు డిగ్రీ పొందిన అమ్మాయి సంబంధము కొరకై తండ్రులు తాతలు వరాన్వేషణకొరకు బయలు దేరే స్థితిలోకి మన సంఘంవుంది! దాంతో అదొక తెగని సమస్యగా తయారవుతూంది!

## పరిష్కారమార్గం ఏమిటి ?

స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం వుండాలి. తన కాళ్లమీద తాను నిలబడేశక్తి కలిగేవరకు తల్లితండ్రులు బాధ్యత వహించాలి. చదువులైతే చెప్పిస్తున్నారుకాని, ఆడపిల్లలు ఆర్థికంగా తనకాళ్లమీద తాను నిలబడగల్గి వుండేస్థితిలోకి తీసుకు వెళ్లటానికి అంగీకరించటంలేదు. స్త్రీ ధనార్జన చేయటం న్యూనతగా చూడటం జరుగుతోంది. ఈ సంకుచిత భావం పోయినపుడే ఈ సమస్య పరిష్కారం అవుతుంది. అపుడే వివాహ స్వాతంత్ర్యం ఆచరణలోకి అమలులోకి వస్తుంది. అప్పుడే కుల మత విభేదాలు లేకుండా యువతీ యువకులు తమ స్వంత బాధ్యతలపై వివాహాలు చేసుకుంటారు.

"చదువులు చెప్పిస్తే పెళ్లిళ్లు కావు, అందుచేత చదువులు చెప్పించకూడదు. ప్రాజ్ఞత వస్తే స్వాతంత్ర్య భావాలు వస్తాయి. అందుచేత బాల్యంలోనే ముడి పెట్టేస్తే బాధ వదలిపోతుంది" అనే అభివృద్ధి నిరోధక భావాలు మధ్య తరగతి కుటుంబాల్లో నేడు వ్యాపిస్తున్నాయి. ఒక సమస్యకు సక్రమ పరిష్కార మార్గం కనపడనపుడు అది ఈ విధముగా వెర్రితలలు వెయ్యడం సహజం. వెర్రితలలు వెయ్యడం పతనానికి సూచన అని గుర్తుంచుకోవాలి.

ఈ పతన స్థితినుండి సంఘాన్ని రక్షించవలసిన బాధ్యత మహిళా సంఘాల మీదవుంది. మహిళా ఉద్యమాలు ఈ కర్తవ్యాన్ని దృష్టిలో పెట్టుకుంటున్నాయా? అన్నదే నేటి సమస్య!



---

(21-వ పేజీ తరువాయి.)

సరళాదేవి: అమ్మా! యిల్లా ఉంది లోకం. మీ అనుమానాల ధర్మమా అంటూ ఒక అమాయకపు విద్యార్థినిని అడివిలోకి తరిమేశారు. మంగమ్మగారు ఒకరి మీదకి తోయ బోయిన నిందలు తమ మీదకే యెలా తిరుగుతాయో చూచారా? (మంగమ్మ తల వంచుకుంటుంది) అమ్మా! ఏ జాతికైనా గౌరవం, ఉన్నతి కలగాలంటే, ఆ జాతి యొక్క నైతిక బలం మీద ఆధారపడి ఉంటుంది. ప్రతి స్వతంత్ర దేశపు పౌరుడికీ కొన్ని పౌర ధర్మాలున్నాయి. మనని మనం ఒకసారి అద్దంలో చూసుకుంటే, మనం యెంత వికృతంగా ఉన్నామో మన కర్థ మౌతుంది. మనకి వచ్చింది స్వాతంత్ర్యమైనా, మన మింకా స్వాతంత్ర్యానికి తగం. రామలక్ష్మమ్మగారికి భర్తంటేభయం. సుందరికి పార్కర్ పెన్నంటేయిష్టం. మంగమ్మగారికి నిందలు మోపడం యిష్టం. ఈ విధంగా ఉంటే మనమీద మనకిరోత కలగద్దూ. ఆ వెళ్లిపోయిన అమ్మాయి యొక్క జ్ఞానంలో సహనంలో మంచితనంలో కొంతైనా మనం అలవరచుకుంటే, యింకా సమయం మించిపోలేదు, బాగుపడవచ్చు. మీకూ నాకూ రోజూకొక్కొక్క గాంధీదీగారొచ్చి ఉపదేశంచేయరు. ఆయన చేసినప్పుడే ఉన్నప్పుడే మనం ఆ జీవితంయొక్క సారాన్ని గ్రహించాలి. శెలవు.

[నమస్కారం చేస్తుంది. ఇంతలోనే లలిత ప్రవేశించి, రాజ్యంలేదండి! ఎక్కడికి వెళ్ళింది. 'రాజ్యం రాజ్యం' అని కేకలు వేస్తుంది. తెర వాలుతుంది. అంతా 'జన గణ మన' పాడతారు]



# భారత మహిళలు — భారతీయ సంస్కృతి

"సత్య"

(తరుణ సాహితీ సమితి)

దేశీయాన్నత్యము, ఆ దేశమునందలి మాతల సంస్కృతిపై నాధారపడియుండును. స్త్రీయే తన దేశ సంస్కృతిని విస్మరించినయడల, ఆ దేశము యొక్క భావి నిరాశాజనకమగును.

అనాదినుండియు ప్రపంచ నారీమణులలో, భారత నారీమణిది విశిష్టస్థానము. ఆమె వాక్కు వేద వాక్కు. ఆమె శాసనమునకు అడ్డులేదు. ఆమె పరాక్రమము నిర్వక్రమము. ప్రాచీనకాలమునందు, స్త్రీ సంపూర్ణస్వతంత్రురాలు. అత్యంత మేధావి. అమిత బలపరాక్రమశాలిని. ఆనాడు భారత దేశములో, "పురుషునకు స్త్రీ ఏ విధముగను తీసికట్టు కాదు" అని సహేతుకముగా నిరూపించిన స్త్రీలు కొల్లలు. ఆనాటి స్త్రీల జీవితములు అత్యంత ఆహ్లాద సంపూరితములు, సంపూర్ణ స్వాతంత్ర్య సంజనితములు.

భర్త మూర్ఛితుడైన తరి, తన విశిఖమ్ముచే శత్రువును దునుమాడిన వీరనారీ శిరోమణి సత్యభామ, కింకర్తవ్యతా విమూఢులై యుద్ధ సన్నద్ధతకు వెనుదీయుచున్న భర్తలకు, విస్మరించిన రాజనీతిని, ధీరోక్తులను తిరిగి జ్ఞాపకము చేసి పౌరుషేయులనుగా నొనర్చిన పాంచాలి, మొదలైన అసంఖ్యాకములగు మహిళలు, ప్రాచీన స్త్రీల పరిస్థితులకు నిదర్శనలు. అర్వాచీనమునందలి స్త్రీలు భారతీయ సంస్కృతికి భౌతిక రూపములు.

ఇవి నమ్మజాలని పురాణపు రోజులైనా, మొనమొన్నటి ఝాన్సీ లక్ష్మీభాయి వ్యక్తిత్వము మాట యేమి?

భారతీయుల కత్యంత ప్రియమయిన స్వేచ్ఛా మారుతముకై, తన శత్రువులతో బోరి యసువుల బాసెనే? ఆ నాడామె బల శౌర్యములు కన్నులార కాంచి, ఆమె కరవాల భ్రమణ కౌశలము, సంపూర్ణ రాజనీతిజ్ఞతలను గూర్చి ఆంగ్లేయులు వ్రాసిన గ్రంథములను పఠించినారా? ఆమెలో అంతటి శక్తి ఉత్పన్నమగుటకు కారణమేమి? స్వేచ్ఛ కొరకు అంతగా ఆమె కృషి చేయుటకు కారణ మేమి? భారతీయ సంస్కృతిని విస్మరించి ప్రాశ్చాత్య నాగరికత ననుకరించిన యడల, వీర ఝాన్సీ ప్రథమ వీరనారి కాగలుగునేమో ఊహించారా?

ఎప్పుడే యననేల? నేడు ఆకలి గొన్న ఆడ సింహము అరుణా అసఫాలీ, భారతీయ ఆదర్శ స్త్రీ మూర్తి విజయలక్ష్మీ పండిట్, అపర సరస్వతి సరోజని, వీరు ముప్వురు భారతీయ నాగరికతను త్రోసి పుచ్చినారా?

భారత మహిళ, ప్రపంచ మహిళలలో విశిష్టతను సంపాదించుటకు, భారతీయ సంస్కృతావలంబనమే కారణ మని ఇప్పుడైన తెలిసినదా?

నేటి భారత మహిళల స్థితి హృదయ విదారకముగానున్నట్లు అందరికీ తెలిసినదే! నిర్బంధపై

ధవ్యము, అవిద్యా వ్యాప్తి నేటి స్త్రీల పరిస్థితు లను స్పష్టముగా చూపుచున్నవి.

శ్రీమతి ఊర్మిళా మెహతాగారు అఖిల భారత మహిళాసభ అధ్యక్ష పీఠమునుండి "సర్వతో ముఖ దేశసేవయే భారత మహిళల కర్తవ్యము" అని ఎలుగెత్తి చాటుట ఎంతయు ముదావహము. సాంఘిక చైతన్యమునందు, నవజీవనమును గూర్చుట ఇప్పటి మహిళల ప్రధమ కర్తవ్యము.

శ్రీమతి వూర్మిళా మెహతాగారు అన్ని సమ స్యలను సమగ్రముగా చర్చించి, ప్రతి దాని యందును స్త్రీలకు గల పాత్రను విశదీకరించుట వలన, నేటి మహిళలకు తమ కర్తవ్యము సుగ్రా హ్యమైనది.

ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల నెఱుంగక బానిస జీవితమును గడుపుచు విజ్ఞాన శూన్యులై పల్లె లందున్న మహిళలకు విజ్ఞాన ప్రబోధము జేసి నేటి పరిస్థితులయందు వారి కర్తవ్య మేమియో తెలియపరచవలసిన బాధ్యత, నవీన యువతు లపై నున్నదని, శ్రీమతి మెహతాగారు తెల్పిరి. కాని నవీన యువతీ సోదరీమణులను ప్రార్థించు చున దేమనగా, పల్లెలందలి మహిళా సోదరీ మణులను విజ్ఞాన యువతులుగానే జేయుటకుగాని భారతీయ సంస్కృతి నింకను అతి భద్రముగా పోషించుచున్న, పల్లె సోదరీమణులను ప్రాశ్చా త్య నాగరికతా పిశాచ వ్యామోహగ్రస్త హృద యులను గావింపవలదని.

శ్రీమతి మెహతాగారు తమ ఉపన్యాసములో ఉదహరించిన (లేక ధ్వనించిన) భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకు అనంగీకారముతోడను, సంతాన నిరోధక ప్రబోధముతోడను అంగీకరింప జాలను. నేనేకాదు. ఏ భారత మహిళయు, ముఖ్యముగా ఆంధ్ర మహిళయు ఇట్టి సంకుచితా భిప్రాయము యెడల తమ విముఖతను తెలుప కుండనుండ జాలదని నా విశ్వాసము.

భారతీయ సంస్కృతికి 'సంతాన నిరోధకము' కన్న గొడ్డలి పెట్టులేదు. సంతాన నిరోధకము నంగీకరించుటయన, పాశ్చాత్య నాగరికతను దేశ కాలమాన పరిస్థితులను, శీతోష్ణతా విభేదము లను గుర్తింపక గ్రుడ్డెద్దు చేను బడ్డట్టు అనుక రించుటయే అగును.



# మా హాస్టలు నాల్గవ వార్షికోత్సవము

కుమారి టి. శారద (సీనియర్ తరగతి విద్యార్థిని)

జనవరి 23 వ తారీఖున మా హాస్టలు నాల్గవ వార్షికోత్సవము చాల జయప్రదంగా జరిగింది. అంతకు క్రిందటి రోజున కేవలము వసతి గృహ విద్యార్థినులకు మాత్రమే ఆటలలో పోటీలు పెట్టబడినవి. ఆ ఆటలలో "నన్ను కనుక్కో" యను నాటలో కోకా ఈశ్వరి ప్రథమ బహుమానమును పొందెను. మూడు కాళ్ల నడకలో రాజ్యలక్ష్మి, రూపకుమారి, రత్నమాల, లీలావతులు ప్రథమ బహుమానములు పొందిరి. ఆ తరువాత Words Building లో అచ్చయ్యమ్మకును, అనుసూయకును ప్రథమ బహుమానములు వచ్చినవి. Musical arms లో రామశేషు ప్రథమ బహుమతి పొందినది. వీటి నన్నింటిని శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మగారు జయ ప్రదముగా జరిపించిరి.

వార్షికోత్సవ సందర్భములో శ్రీమతి దుర్గాబాయిగారు, పాలకవర్గ సభ్యురాండ్రు విందుకు విచ్చేసిరి. ఈ రోజువిందుకు మా సోదరీమణులగు సత్యవతిగారు, మంగళాంబగారు, మరి కొందరు విద్యార్థినులు రుచికరముగా క్రొత్త రకపు పిండి వంటలతో వంటకములను తయారుచేసిరి. సాయంత్రము 4 గంటలవరకు హాస్టలులోవున్న ప్రతివిద్యార్థినికి తీరుబడి లేదు. అందరూ డ్రామాకు తయారగుటలోను, మరికొన్ని పనులలోను నిమగ్నులై యుండిరి. నాలుగు గంటలకు నాటకములలోయున్న వారు నాటకము వేయుటకు సిద్ధముగా తయారైరి. ఉపాధ్యాయినులు, మెంబర్లు అందరు 5 గంటలకు హాజరైరి. పైహాలు కిటకిటలాడిపోయినది. ఆ రోజుకార్యక్రమము "కరుణామయి" యను సాంఘిక నాటకము, "పరమానందయ్య శిష్యులు" అను హాస్యనాటిక, "వెఱ్ఱి గొల్లవాడు-గొల్లభామ"యను సంగీత నాటికలు. "కరుణామయి" యను నాటకములో అనసూయ నిజంగా కరుణామయి మాదిరిగానే వేసి అందరి హృదయములను కరుణామయము చేసినది. పరమానందయ్య యతని శిష్యులలో, కరుణామయి వల్ల కలిగిన దుఃఖమును, పోగొట్టి ప్రేక్షకులను నవ్వించినారు. గొల్లవాడు, గొల్లభామ కూడా చాలా బాగా వేసినారు. "జన గణ మన" పాటతో ఆ రోజు కార్యక్రమము ముగిసినది.

ఆ తరువాత దుర్గాబాయిగారు హాస్టలుపిల్లల కౌశలమును పొగడిరి. నాటకములో వేసిన కరుణామయి (అనసూయ)కు బెన్నూరి కృష్ణవేణమ్మగారు ప్రత్యేక బహుమాన మొసగిరి. ఆతరువాత టి. శారద (డ్రామాలో లచ్చి) కిని, కస్తూరి డ్రామాలో కిశోర్ (కరుణామయి తమ్ముడు) కిన్ని ప్రత్యేక బహుమానము లివ్వబడినవి. ఆటలలో గెలుపొందిన వారికి బహుమానములు పంచి యివ్వ బడినవి. దుర్గాబాయిగారు, టీచర్లు, మెంబర్లతోగూడి హాస్టలు విద్యార్థినులు, అందరూ ముచ్చటలగు పాటలతో విందు నారగించిరి. ఆరోజు 12 గంటల రాత్రివరకు మెం

తో సంతోషముగా గడిపితిమి. ఆరోజు మా అందరకు పుట్టినరోజు పండుగ అయినదన్న మాట.

ఇంక ఒక మాట! మద్రాసులో యెన్నో హాస్టల్సు వున్నాయి. కాని మా హాస్టలు వేరు. ఇందులోనున్న పద్ధతులు, పిల్లల నడవడిక వేరు. అందుచేతనే పై విద్యార్థినిలందరూవచ్చి ఇక్కడ వుంటారు. ఇక్కడవున్న గొప్పతన మేమిటంటే యిక్కడ జాతి మత విచక్షణ యిసుమంతయు లేదు. ఇక్కడవున్న విద్యార్థిను లందరూ ఏక గర్భవాసులు వలె కలసి మెలసి వుంటారు. ఇక్కడ హాస్టలులో వున్న వారికి తమ యిండ్లకు వెళ్ళవలెనని కోరికయే యుండదు. ఇందుకు కారణం యిక్కడ దుర్గాబాయిగారు, అమ్మన్నగారు మాకు తల్లి సమానులు. మా టీచర్లు, అక్కలు లాగ వుంటారు. హాస్టలు మా యిల్లు లాగ వుంటుంది. ఇవన్నీ మా తల్లి దండ్రులను మా గృహములను మరిపింప చేస్తవి. ఇచ్చటి వారు ఒక్క చదువు కొనుటకే కాదు, కుట్టు పనులు నేర్చుకొనుటకుకూడవచ్చి హాస్టలులోవుంటారు. దూర దేశములనుండి పిల్లలు వచ్చి యిక్కడ వుంటారు. ఇక్కడ విద్యార్థినులకు, చదువు పూర్తి అయిన తరువాత గృహమును చక్కగా నిర్వహించుకొనుటకై గృహిణికి వలసిన పనులు కూడ నేర్పబడుచున్నవి.





మల్లమదేవి మహిళా మందిర వాస్తవ్యులు. శ్రీ బొబ్బిలిరాణీ వారితో

# కోతులు — డోలర్లు

కథ

శ్రీ కవికొండల వేంకటరావుగారు

"నిరుడు మామిడి చెట్లు, ఒక్కటైనా, కాసిందిలేదు: ఊరగాయక్కూడా మొగంవాచిపోయినాం! ఈ యేడు కూడా తత్తుల్యంగానే వున్నాయిగాని చెట్లన్నీ, ఏం మహిమో! ఊరగాయల మామిడి కాసింది!" అని చెప్పి, సొంత సేవ్యం గావించడంలో అపార ప్రజ్ఞ సంపాదించిన 'సర్వాధికార్ల సమస్త విద్యా వినోది' అనే విప్రోత్తముడు, ఆ యేడు ఏం చేశాడూ—తీర్థానికైనా వెళ్లకుండా ఆ ఊరగాయల మామిడి చెట్టు దగ్గఱ కాపలా కూర్చోసాగాడు, పూతప్పటి నుంచీ!

మబ్బులకు పూత రాలిపోతుంటే మబ్బులను తిట్టేవాడు. పూసిన పూత అంతా నిలుస్తుందా అనేమాట మఱచిపోయే వాడు. పిందెలు ఉఢుక్కి ఊడి పడిపోతూవుంటే సూర్యుణ్ణి తిట్టేవాడు. వేసిన పిందె అల్లా విత్తనం అవుతుందా అనే మాట మఱచిపోయేవాడు.

మినపగింజంత అయిందా, పెంకులెగిరిపోయేటట్లు కేకవేసేవాడు "ఎవరూ ఆ దరికి రాకూడ" దని. చూస్తే దిష్టి కొట్టేస్తుందని—గడ్డిబొమ్మను చేసి కొన కొమ్మ కెక్కించాడు. దానికో వాలం పెట్టాడు. దాని మూతినదో రూపం తేల్చి, ఎఱ్ఱటిరంగు పులిమాడు. "వీరాంజనేయులు కాకుండా వెఱ్ఱి ఆంజనేయులు కాకుండా తోచాలి కోతి మూకకు," అన్నాడు.

వాని భయం ఏమిటంటే కోతులువచ్చి ఆ కొంచెంకొంచెం గొప్పవవుతూవున్న కాయల్ని కడతేరుస్తాయేమో అని, మనుష్యుల మాట అలా వుంచి.

ఈలావుంటూ వుంటే, చెట్టు నెంతలేదన్నా, వెయ్యి సుమారు ఆ మాత్రం ఆ మాత్రం, ఉరవుగా వున్న కాయ ఊరగాయ పదునుకు వచ్చినవి తేలాయి. చెట్టుకూడా అప్పుడప్పుడు పళ్లు పడుతూవుంది. మాసంకూడా వైశాఖమాసం వచ్చేసింది. పగలు బయళ్లు ఎండలు పెళ్లుమని కాస్తున్నాయి. రాత్రిళ్లు పెరళ్లు మల్లె పువ్వులతో పరిమళిస్తూ వున్నాయి.

ఒక్క కోతీ ఆయేడు వచ్చి ఒక్క కాయా కొరుక్కు వెళ్లిన పాపాన్ని పోలేదు. అసలు కోతులే మాయమైపోయినాయి.

దానిక్కారణం ఏమిటా అని ఆ రాత్రి— మరి మర్నాడు ఊరగాయ సరంజాం అమారు కాబోతూవుంది—కారం, ఆవ, ఉప్పు పాళ్లు పోసి కలుపుతారు—నూని ఆడించి వుంచారు— కాయ మర్నాడు మధ్యాహ్నం దింపికొని వచ్చి మఱి సాయంకాలం కొట్టి, తరిగి, కొంత ముక్క,

కొంత కాయపెట్టేస్తారు—పొలంలో చిన్న బోతుంది—ఇంటిపట్టు ఇల్లాలు ఎక్కడ లేని వొయ్యారం కాపరుస్తుంది, చిన్నమణ్ణి, సన్న మణ్ణి— — —ఆ రాత్రి చెట్టు క్రింద పడుకుని, అర్ధరాత్రి వేళ, సర్వాధికార్ల సమస్త విద్యా వినోదిగారు, ఆకాశంవంక చూస్తూ "ఈ యేడు ఒక్క కోతీ రాకపోవడానికి కారణం ఏమా ?" అని ఆలోచింపసాగాడు. ఆలా ఆలోచిస్తూ వుండే సమయంలో "అదంతా తన వట్టి గడ్డి వాలమూర్తి ప్రభావంగా" తలపోసి ఆ దిష్టి బొమ్మ కేసి చూచాడు. చూచీ చూడ్డంలో వట్టి గడ్డి రూపసి మెడలో సరీగ్గా వొక్క వెయ్యి డోలర్ల దండ, పైనుండి సెర్చిలైటు వెలుగు సమేతంగా వాయువిమానంనుండి జారి పడింది ! బ్రహ్మాండంగా గలగలమంది ! విగ్రహం మెడ నిండా కనకం మెఱిసింది !

"కోతులు అన్నవి హిందూ దేశంలో ఎవరివీ కానట్టు తిరుగుతూవుంటాయి కాబట్టి, ఎవరికని ఈ డబ్బు ఇవ్వడమో తెలియక మేము ఆ కోతుల మెడల్లోనే మా డోలర్లను దండలుగా వేసి దండల సమేతంగా తీసుకుపోతున్నాం !" అని ఒక పెద్ద చాటింపు, బూరావూదినట్లు గావించి, యమపాశం వోసి పైకి లాగినట్టు లాగసాగారు, ఆ విమానంలోని అమెరికన్ వైజ్ఞానికులు ఈ సర్వాధికార్ల విద్యా వినోదిగారి వట్టి గడ్డి వెఱ్ఱి తొఱ్ఱి దిష్టి బొమ్మను !

సర్వాధికార్ల విద్యా వినోదిగారు, వెంటనే— అది తను ఆదాకా కాసుకు కని పెట్టుకుని ఊరగాయల మామిడి అన్న మాట మఱచి, రెమ్మ రెమ్మ ఊతంగా, పైకెగబాకి, కాయలన్నీ రాలి పోయినా సరకు చేయక, చితికి పోయినా కాతరుచేయక, ఆ దిష్టి బొమ్మ వాలం తన మొలను చుట్టేసుకున్నాడు.

క్రమంగా విమానంలోని వైజ్ఞానికులు బొమ్మనూ మన "బొమ్మన్"నూ కూడా కలిపి పైకి లాగున్నారు విమానంలోకి ! "ఎవరు ఇందులో కోతి ?" అని అడిగారు వైజ్ఞానికులు! "తోక ఇద్దఱనూ కలుపుతూవుంది : ఈ తోక తెగ్గోస్తే రెండు కోతులు కాగలవా ?" అని ప్రశ్నించుకోసాగారు వారిలో వారు ఆ వైజ్ఞానికులు !

వాయు విమానం అల్లా అంతరిక్షమందు ఆగి వుంది. ఇంజన్ ఆపబడ లేదు. గంయిమంటూ నేవుంది. జవాబు ఎవర్కి చెప్పాలో అర్థం కా లేదు. ఏమని చెప్పాలో అంతకన్నా తోచ లేదు, సర్వాధికార్ల విద్యా వినోదిగారికి.

విమానం నిండా, ఏభై అరవై కోతులు దాకా, నిరుడు ముందటేడు తనను వేపుకు తిన్న వన్నీ డోలర్ల దండలు వేసుకుని "కిచకిచ"మంటున్నాయి ఆ విమానంలో చూచాడు ! మనవాడు !

"ఆ కోతులన్నా ఈ వట్టి గడ్డి కోతి పిల్లలు. ఈ వట్టి గడ్డి కోతి నా పిల్ల ! మీరెల్లా వీటిని తీసుకు వెడతారో చూస్తాను" అన్నాడు ఆర్భాటంగా. "ఏలా తీసుకు వెడతామా ! నీ మెల్లోనూ ఒక డోలర్ల దండ వేసి తీసుకు వెడతాం !" అని ఒక పెద్ద డోలర్ల దండ ఆ సర్వాధికార్ల విద్యా

(32 వ పేజీ చూడుడు)

ఆర్షకళా ప్రతిష్ఠాపక

# శ్రీ. కాంచనపల్లి కనకాంబగారు

శ్రీమతి కవితా విశారద కవితిలక విద్వాన్ కాంచనపల్లి కనకాంబగారికి తిరుపతి కవితా సమితి వారిచే నివ్వబడిన "ఆర్షకళాప్రతిష్ఠాపక" బిరుద ప్రదాన సమయంబున చదువ బడిన పద్యములు.

ఉ॥ కమ్మదనాల పద్యములఁ
గానుకలిచ్చుచు మాదు తెన్గులో
కమ్మనకుర్ణ వినూతన వి
కాసముగూరిచి వాసి కెక్కితో
సొమ్ముగఁ గీర్తికాంత నిను
సోదరి భావమెలర్ద నెంచుచుర్ణ
రమ్మయటంచు నద్దిశల
రాగముత్తోడు తనావరించెనే ॥

తే॥ మధురమంజులగాన మహాపృథుల కవిత
కలముచేఁబట్టి వ్రాయగ ఘల్లుఘల్లు
మనుచు, నేతెంచు భారతిమాన్యమగుచు
ఆంధ్ర శారదా నీకిదే యంజలిడుదు.

శ్రీ కాండూరి నరసింహాచార్యులు

స్వాగతమమ్మరో తెనుగు వాణికి
అచ్చపు మేలుబంతియరా
రాగమెలర్పగా రచనరాజిల
జేసిన నీదు కావ్యముల్
బాగుగ వాసి గాంచినవి పావని
యరా తెనుగమ్మ తోటలో
ఏగతి మీటినావొ రచియించిన
వేళల నాంధ్రవల్లకిర్ణ ॥

తెనుగుపొలముల సేద్యము తేటపడగ
తావి వెదజల్లు క్రొంగ్రొత్త పూవువోలె
డెందమానంద మొందుచు అంద మొసగు
రచన గావించెదీవుగా రమ్యఫణితి ॥

పుష్పముల నిండ మధువులు పొర్లియున్న
సరియె ! తీపిలేదని మాచుప్రజము లెల్ల
విసరివేయక యందలి రసమునే గ్ర
హించి పూచినందుల కెంతో హితము మాకు॥

శ్రీ ముళ్లపూడి నరసరాజు.

శ్రీ కాంచనపల్లి కనకాంబగారు స్త్రీలలో ప్రఖ్యాతి కెక్కిన కవితామతల్లి. వీరిజీవిత మంతయు భాషాసేవకే అర్పితము. చెన్నపురి క్వీన్ మేరీ కళాశాలలో రమారమి 15 సంవత్సరములు ఆంధ్ర ఉపాధ్యాయినిగా వీరు పనిచేసిరి. జీవయాత్రయను పద్యకావ్యము, హంసవిజయమను నాటకము, ఇంకా పెక్కులు, గద్య పద్య రచనలు, వీరి భావనా సంపత్తిని, ఆధ్యాత్మిక ప్రపత్తిని విశదపరుస్తాయి. వీరి ఔన్నత్యాన్ని గుర్తించి, తిరుపతి కవితాసమితి, 'ఆర్షకళా ప్రతిష్ఠాపక' బిరుదాంకితులను చేయుట, వీరికేగాక, సాహితీసమితికే అధిక గౌరవదాయకము.



## కోతలు — డోలర్లు

(30 వ పేజీ తరువాయి)

వినోదిగారి మెడలో పారేశాడు ఆ విదేశీయుల్లోని ఒక మహావేత్త.

బరువుకు తూగిపోతూ స్వరాధికార్ల ఆయన "నాకు పెళ్లాంవుంది—ఇంకా పిల్లలు వున్నారు—ఊరుగాయ పెట్టే రోజూ తెల్లారి! చెట్టు నిండా కాయలున్నాయి!" అని ఎంత గోల పెట్టినా మఱి ఆ అమెరికన్ వైజ్ఞానికులకు అర్థంకాలేదు. "వుంటే మా దేశం వెళ్లాక వుత్తరం రాద్దు గానిలే! మేం బంగీద్వారా తెప్పించి పెడతాం నీకు ఊరుగాయ!" అని అన్నారేగాని అత గాణ్ణి విడిచి పెట్టలే!—

"తాజా వూరుగాయ! తాజా ఆవకాయ—మా వూరగాయల మామిడికాయతో పెట్టిన—మా ఆవిశ పెట్టిన—కాయ—కాయ—కాయ!" అంటూ వట్టి గట్టి, పీర, కాదు, వెట్టి ఆంజ నేయ విగ్రహాన్ని ఊరికే ఉసి గొలిపే వాడు, కసి గొద్దీ తోకట్టుకు లాగేవాడు, సర్వాధి కార్ల విద్యావినోది. కాని ప్రయోజనం లేక పోయింది!

అతగాడు మఱి భారత దేశానికి దక్కకుండా వెళ్లి పోయాడు! మఱి ఆ యేటు వాని యింటిల్లి పాదికీ వూరగాయ కాదుగదా! ఉప్పు బద్దన్నా లేకపోయింది.



## మన సామెతలు

1. అందానికి పెట్టిన సొమ్ము, ఆపదకు ్డ్డం వస్తుంది.

2. అక్క మనది అయితే, బావ మనవాడా?

3. అత్తచచ్చిన ఆరు మాసాలకు కోడలి కంటి నీరు వచ్చినదట.

4. ఆకలి రుచి యెఱుగదు. నిద్ర సుఖ మెఱు గదు. వలపు సిగ్గు యెఱుగదు.

5. ఆడదాని చేతిలో అర్థము, మొగ వాని చేతి బిడ్డా బ్రతకదు.

6. ఇంటి దీపమని ముద్దు పెట్టు కొంటే, మూతి మీసాలన్నీ తెగగాలినవట!

7. ఇంట్లో పెండ్లి అయితే, ఊళ్లో కుక్క లకు హడావిడి.

8. ఉంగరాల చేతితో మొట్టితే నొప్పి ఉండదు.

9. ఉద్యోగం పురుష లక్షణం, అది పోతే అవలక్షణం.

10. గుళ్ళో దేవునికి నైవేద్యము లేకుంటే, పూజారి పులిహారకు ఏడ్చినాడట.

11. చద్దికూడు తిన్నమ్మ మొగుడాకలి ఎరు గదు.

12. చల్లకువచ్చి ముంత దాచుకున్నట్లు.

13. జరిగే మట్టుకు జయభేరి, జరగక పోతే రణభేరి.

14. నా యింటికి నేనేపెద్దను, పిల్లికి పెట్టరా పంగనామము.

---

కూర్పు: శ్రీమతి మన్యం కామేశ్వరీదేవిగారు

# విముక్త చైనా వనితల వీరోచిత పాత్ర

శ్రీమతి పరకాల సుశీల

ఇండియా చైనా దేశాలు రెండింటికీ అక్క-చెల్లెళ్ళ సామ్యముందని చరిత్రలో ప్రసిద్ధి. అవిద్యలోను, సనాతనాచారాలలోను, బానిస జీవితంలోను, నిరంకుశదోపిడీ వ్యవస్థలోను ఒక టేమిటి, అన్నివిథాలాపోలికే!

మనదేశం ఎక్కువ వ్యవసాయ దేశం అగుట వల్ల రైతులు దోపిడీకి గురయి, తమ జీవితాలను నిరంకుశ భూస్వాముల చాకిరీకివమ్ము చేసికొని, నిరక్షరాస్యతలో మునిగి వుండడంవలన చాలా కుటుంబాలకు బయటి ప్రపంచంతో సంబంధం వుండదు. అందులోను చాలామంది స్త్రీలలో, పూర్వపు సాంప్రదాయాలు జీర్ణించి వుండడంవల్ల తాము బయటి విషయాలజోలికి పోనక్కరలేదనే భావం ఇమిడివుంది. సాంఘిక సంస్కరణ విషయంలో అంతా వెనుకబడి వున్నాము. ఇంకా అత్త మామల నియంతృత్వం భర్తలుచేసే దౌర్జన్యాలకు చాలా మంది స్త్రీలు గురవుతూనే యున్నారు. ఈ పరిస్థితుల్లోసాంఘికంగా స్త్రీలు ముందుకు రావాలంటే చైతన్యంకలిగిన స్త్రీలు ఈ రోజున తమ కర్తవ్యం నెరవేర్చ వలసియుంటుంది. కాని, చదువుకుని విజ్ఞానంగలిగిన స్త్రీలు తమ జీవనోపాథియో, లేక గృహ బాధ్యతలో నెరవేర్చుకోవడమేగాని, సంఘంలో తమ వంతు కర్తవ్యాన్ని నెరవేర్చక పోవడంవలన దేశానికి కావలసిన వీరమాతలుకాని, సంఘ సంస్కర్తలు గాని ఏమాత్రం తయారవడంలేదు.

మన దేశంలో వలెనే చైనా స్త్రీల పాత్ర కూడా అంతే! ఈ నాడు దోపిడి వ్యవస్థనుండి విముక్తిపొందిన ప్రాంతాలలోని స్త్రీలుఏరకంగా నున్నారో మనంకూడా తెలిసికోవాలి.

## సాంఘిక సంకెళ్లను స్త్రీలు ఛేదించారు!

సనాతనాచారాలు బాగా ప్రజల్లో జీర్ణించ డముచేత స్త్రీలు అనేక హింసలకు గురయ్యేవారు. మన దేశంలో వలెనే అక్కడ కూడా బాల్య వివాహాలెక్కువ; ఘోషా, చదువులేదు. దీనికి తోడు స్త్రీలను బానిసలుగా అమ్మే వారు. (స్త్రీలను కొంత డబ్బుకు అమ్మి వేయడం వలన ఆ స్త్రీ అమ్ముడుబడిన వానికి శాశ్వతంగా చాకిరచేయుచు అతని నియంతృత్వానికి దాసిగా పరిగణించ బడుతుందన్న మాట.) కొంత మంది స్త్రీలు వివాహ సమయంలో భర్తకు అమ్ముడు పోయేవారు. వివాహమయిన స్త్రీలకు కాళ్లకు గొలుసులు బిగించి, బయటి ప్రపంచానికి సంబంధంలేకుండా దూరం చేయ బడతారు. స్త్రీలు నడవడానికి కూడా వీలులేకుండా పాదాలు వెనుకకు బెత్తెడు బిళ్లలుగా విరిచి కడతారు! ఈ పద్ధతి స్త్రీల పాదాలకు అందాన్నిస్తుందట!

విప్లవకాలంలో స్త్రీలు గిరజాల జుట్టునుంచుకుని, సాంఘిక బంధాలు త్రెంచుకొని సైన్యంలో చేరారు. స్త్రీల హక్కులకై ఎలుగెత్తి పోరాడారు.

## చైనా మహిళల కోర్కెలు

1. స్వేచ్ఛా పూర్వక వివాహాలు: అంటే తమకు నచ్చిన యువకుని వివాహము చేసికొనే హక్కు. దీనికొరకు చాలా ఆందోళనచేశారు. కొంతకాలానికి వుద్యమం వెనుకబడ్డంవల్ల గిర జాల జుట్టున్న స్త్రీలను చాలా మందిని వురి తీశారు.

తరువాత 20 సంవత్సరాలకు, కార్మిక మధ్య తరగతి స్త్రీలు ముందుకువచ్చి పనిచేయసాగారు. గ్రామాల్లో చైతన్యంరాలేదు. భర్తలకు బానిస లుగా స్త్రీలుంటే వారి అత్త మామలు కోడం డ్రను కొట్టేవారు. ప్రస్తుతం ఈ వెనుక బడిన ప్రాంతాల్లో స్వేచ్ఛా పూర్వక వివాహాలంటే చాలా అపోహలు కలుగడం వలన ఈ కార్య క్రమాన్నక్కడ ఆపుచేశారు.

2. స్త్రీలకు సమాన హక్కులు, రాజకీ యంగా, సాంఘికంగా పురుషులతో పాటు కావాలని ఆందోళన చేస్తున్నారు. కాని, దీనిని కూడా వెనుక బడిన ప్రాంతాల్లో ఆపు చేశారు. ప్రస్తుతం సౌఖ్యవంతమయిన కుటుంబ జీవితం కొఱకు కృషి చేయడం, శిశురక్షణ ఈ కార్య క్రమాల్లో స్త్రీలను సమీకరిస్తున్నారు. విద్య నేర్చుకోవడం, నూలు వడకడం, వృత్తులు నేర్ప డము మొదలగు పనుల్లో 1 లక్ష 50 వేల మంది స్త్రీలు యోనాన్ ప్రాంతంలో సమీకరించ బడ్డారు. విముక్త చైనాలో స్త్రీల విషయంలో క్రొత్త న్యాయ చట్టం తయారయింది. ఈ నాడు స్త్రీలు అన్ని విషయాల్లోను ముందుకు వచ్చి సైనికులుగాను నాయకులుగాను తయా రయి దేశపురోగమనానికి చేయూత నిస్తున్నారు.



# నువ్వు

(జె. టూవీమ్ యొక్క పోలిష్‌నుంచి)

నువ్వు నన్ను భూమిమీద నిలబెట్టావు; నువ్వు నన్ను స్వర్గానికి లేవ నెత్తావు. ఇక్కడే నా జీవిత సర్వస్వమూ అయిన నువ్వు వున్నావు. అందుచేత వేరే ఎక్కడికో వెళ్లవలసిన అవసరం ఏముంది?

నేను నిన్నొక్కర్తెనే తెలుసుకున్నాను; ఒకర్తె గురించే నేర్చుకున్నాను. మిగతా ప్రపంచంతో నాకేమీ సంబంధంలేదు. అందుచేతనే మిగతా ప్రపంచం గురించి నాకేమీ బోధపడదు.

ప్రతి అడుగూ, ఒక వింత బాట; ప్రతి తలపూ, ఒక అంతులేని అగాధం. మాటలతోనైనా, నిశ్శబ్దంతోనైనా నువ్వే సమాధానం యివ్వాలి.

నీ ధవళ వక్షస్థలంలో కొట్టుకునే నీ హృదయ రక్తాన్ని వింటూ, నా గ్రుడ్డి ప్రేమలో మరణంతో కూడుకున్న యీ జీవితాన్ని జీవిస్తా.

—శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తిగారు



దక్షిణ హిందూదేశపు ప్రజలు ఒక్కొక్క ప్రాంతములో వుండేవారు, ఆచార వ్యవహార నడవడికలయందు మాత్రమే కాకుండ, భోజనం, వంటకములయందు కూడ భిన్న పద్ధతులను అవలంబించుచున్నారు. ఇచ్చట వివిధ జాతుల వారు కొన్ని కొన్ని వంటకములయందు ప్రత్యేక నిపుణతను గలిగి యున్నారు. ఆంధ్రులు, పచ్చళ్లు, ఊరగాయలు, వేపుడు కూరలు చేయుటలో ప్రసిద్ధిజెంది యున్నారు. రాయలసీమ ఆంధ్రులు చింతకాయతొక్కు, పప్పుకూరలు, చట్నీ పొడి చేయుటలో ఆరితేరినవారు. మైసూరు కన్నడంవారు చారు, బిసిబేళేహుళి (పప్పుపులుసన్నం) 'వాంగీబాత్' యిలాటివి చేయునట్లు మనం చేయలేము. సాంబార్, వంకాయ రస వాంగి, కాకరకాయ పిట్లే చేయుటయందు అరవ వారిదే మొదటి చేయి. మళయాళపు వంటలు కూడ రుచిగా వుంటాయి. అవియల్, ఓలం, మశియల్, మొళగుట్టాం (మిరియాల పులుసు) యిలాటివి యింకా కొన్ని వంటకములు వండుతారు. ఇవి వండుటకు వేరు వేరుగా మసాలా సామాన్లు పొడిచేసికొన్ని, ముద్దగానూరి కొన్ని వాడుతారు. మనము వాడుకగా రోజూ చారు, పప్పు పులుసు, కూరలు వీట్లకు ఉపయోగించే మసాలా పొళ్లు కూడ రకం వారీలుగా చేసుకొంటారు.

వంటకములకు కావలసిన మసాలా సామానుల పట్టీ :—

1. మిరపకాయలు :—సన్నగా, ఎఱ్ఱగా, పొడుగుగా ఉండే కాయలు వాడుకొనవలయును.

2. ధనియాలు :—పుచ్చినది, మగ్గినవి కాకుండ మంచివి వాడవలెను.

3. మిరియాలు :—క్రొత్తవిగా వుండేవి వాడవలెను.

4. ఆవాలు :—క్రొత్తవిగా, ఎఱ్ఱరంగుకలవిగా ఉండుట మంచిది.

5. మెంతులు :—పసుపు రంగు గలవిగా ఉండుట మంచిది.

6. జీలకఱ్ఱ :—మంచిదిగా వుండవలెను.

7. నువ్వులు :—మగ్గినవి కాకుండా వుండవలెను.

8. సెనగపప్పు :—నూక లేక పొట్టుతీసి మంచి పప్పును ఉపయోగించవలెను.

9. మినపప్పు :—నూక లేక పొట్టుచెరిగి వుపయోగించవలెను.

10. ఎండుకొబ్బెర :—లావుగా, నూనెచక్కగా వుండునది చూచి ఉపయోగించవలెను.

11. పచ్చిటెంకాయ :—ముదురుకాయ మంచిది.

12. మరాఠిమొగ్గలు :—క్రొత్తవిగా ఉండవలెను.

13. రాతిపూత.

14. లవంగాలు.

15. లవంగపట్ట. (డాల్‌చిని)

16. సోంపు.

17. ఇంగువ :—చెక్కవలెగాక, మృదువుగాను ఉండేది శ్రేష్ఠమైనది.

18. తెల్ల ఉల్లిపాయలు అనగా వెల్లుల్లి.

19. చింతపండు :—మిక్కిలి పాతదిగాగానిలేక మిక్కిలి క్రొత్తదిగాగాని వుండకూడదు.

20. ఉప్పు :—శుభ్రమైనదిగా వుండవలెను.

1. చారు పొడికి కావలసిన మసాలా సామాన్లు చేయు విధానము :—

1 సోలెడు మిరియాలు, 3 సోలలు ధనియాలు, 1 సోలెడు

కందిపప్పు, ½ సోలెడు జీలకఱ్ఱ, 1 టేబిల్ స్పూన్ ఆవాలు, రెండు చిన్న పసుపు కొమ్ములు, నూనెలేకనే పుత్త మంగలము (గోలము)లో వేయించి రోట్లో పోసి దంచి జల్లించి, ఆ పొడిని వేరుగ ఉంచుకొనవలెను. జీలకఱ్ఱ జాగ్రత్తగా వేయించవలెను. తక్కువగా వేయించిన ఒక మాదిరి చేదు వేయును. రెండు చంచాల నూనెవేసి ¼ తులం ఇంగువ పొంగించుకొని తీసి, సోలెడు మిరపకాయలు వేయించుకొని రోట్లోపోసి దంచి బాగా జల్లించి, ముందు దంచిన పొడితో కూడ కలిపి ఒక జాడీలోకాని, సీసాలో కాని వేసి మూత పెట్టవలెను. చేసిన ఒక వారం వరకు పొడి క్రొత్తగా ఉండుటచే చారు చాలరుచిగా వుండును.

2. పులుసుపొడికి కావలసిన మసాలా సామాన్లు చేయు విధానము :—

4 సోలలు ధనియాలు, ¼ సోలెడు మెంతులు, రెండు చిన్న పసుపుకొమ్ములు, నూనెలేకనే వేయించి రోట్లో దంచి వుంచుకొనవలెను. 5 పలాల మిరపకాయలు ¼ తులం ఇంగువ, రెండుచంచాల నూనెలో వేయించి రోట్లో దంచి, ముందుగ దంచి వుంచుకొన్న పొడితో కూడ కలిపి ఒక సీసాలో, లేక జాడీలోనైనవేసి మూతపెట్టి వుంచవలెను.

3. కూరపొడికి కావలసిన మసాలా సామాన్లు చేయు విధానము :—

1 సోలెడు మినపపప్పు, ¾ సోలెడు శనగపప్పు, ¼ సోలెడు ధనియాలు, ¼ తులం ఇంగువ, 2½ పలం మిరపకాయలు, యివన్నియు నూనెలో వేయించి పొడిచేసి వుంచుకొనవలెను మెత్తగా దంచకూడదు. కొంచము నూకగానే దంచవలెను. ఈ పొడి 10 రోజులకంటే యెక్కువ వుంచుకొన కూడదు. వేపుడు కూరకైన, ఉడకపెట్టి తిరుగమోత పెట్టే కూరకైన యీ పొడిని వాడుకొనవచ్చును.

గ. రి.



# ఒకేనాటి రాత్రిలో

రాత్రి చాలప్రొద్దు పోయింది. సుమారు 11 గం॥ కావచ్చును. హేమా, యింకా తెలుగు పద్యాలు వల్లెవేస్తోంది. ఆమెకు రేపు తెలుగుపరీక్ష. అన్నిపరీక్షలు ఒకఎత్తు, తెలుగు పరీక్ష ఒకఎత్తు. అప్పుడు ఆమె నాన్నగారు, "హేమా! యింకా ఎంతసేపమ్మా చదువుతావు? యిలా చదివితే శరీరారోగ్యం పాడైపోదు! 11 గంటలవుతుంది. పోయి పడుకో తల్లీ, తెల్లవారఝామునలేచి వల్లెవేద్దువుగానిలే,పో"అన్నారు. తండ్రిమాట కాదనలేక మనసులో చదువ వలెనని యున్నప్పటికి పుస్తకం మూసి పక్కమీద పండుకుంది. "రేపటితో పీడ అంతా వదలిపోతుందిరా, భగవంతుడా!" అని యిట్లా ఏదో ఆలోచిస్తూ కళ్లుమూసింది.

శోభ, ఆమె, ఒకేక్లాసులో చదువుతున్నారు. శోభఅంత గొప్పవాళ్ళ పిల్లకాదు. బీదవాళ్ళ పిల్లకాదు. మధ్య రకం. కాని చాలా అందముగా వుంటుంది. క్లాసులో మంచి మార్కులు కూడా తెచ్చుకుంటుంది. "పువ్వులతో గూడిన నారకు వాసన కలిగినట్లు" శోభతోకూడిన హేమాకుకూడ బాగా చదువాలని మంచిమార్కులు తీయాలని బుద్ధిపుట్టింది. కృషిచేయటం మొదలుపెట్టింది.

శోభ ఆమెతో చదువుచున్నప్పుడు వాళ్ళ అమ్మ చచ్చిపోయింది. ఆమె తండ్రి చాలమెత్తనివాడు. అమాయకుడు కూడాను. ఆఫీసులో ఏదో విధంగా నెగ్గుకొస్తున్నాడు. ఆయనకు శోభఒకతే ముద్దుబిడ్డ. ముద్దుగా పెంచుతున్నాడు. భార్య గతించిన తరువాత శోభ సంరక్షణార్థమై ఆమె తండ్రి మారుపెండ్లి చేసుకున్నాడు. శోభకు అప్పుడే పది సంవత్సరములు నిండినవి. తల్లి బాగా తెలుసుకాని, మారుతల్లి వచ్చి ఆమెను తల్లి సంగతి మరపింప చేసింది. అంటే మారు తల్లి ఆమెను అంత ప్రేమగా చూసేది. శోభకు ఆమెను వదలి స్కూలుకు వెళ్ళటంకూడా దుస్సరమయ్యేది. స్కూలులో శోభ నాటకాలలోను ఆటలలోను మంచి మంచి బహుమానాలు, పేరుకూడా పొందింది. కాని ముందు ఏమి జరుగనున్నదో ఎవరెఱుంగుదురు?

శోభ సవతి తల్లి మనసు పూర్తిగా మారిపోయింది. కారణం ఆమెకు ఒక కూతురుపుట్టింది. శోభవైపు ఆమె ప్రేమ గారాబము విషంగా మారిపోయాయి. తియ్యని మాటలు బదులు తిట్లు వినబడుతున్నాయి. శోభకు కారణం ఏ మాత్రం తెలియలేదు. ఆమె మాత్రం తనకు చెల్లెలుపుట్టింది కదా అని ఎంతో సంతోషించింది. ఆమెను ఎక్కువగా ప్రేమించింది. కాని, చెల్లెలిని ఎత్తుకోవాలని వెళ్ళితే శోభకు దెబ్బలుకూడా తగిలేవి. యిప్పుడు ఆమెకు తల్లి, సవతి తల్లిలోని భేదభావం బాగా తెలిసింది. కాని శోభమీద సవతితల్లి అసూయ దిన దినాభి వృద్ధికావచ్చింది. చివరకు తన కూతురిని యెత్తుకొని మోయటంకొరకు ఆమె చదువు మాన్పించాలని చాలా పట్టు పట్టింది.

అప్పుడు శోభ ఒకరోజు :— పిన్నీ! నేనేం చేశానని నామీద అంతకోపంనీకు. నేను చెల్లెలిని నిద్రపుచ్చి యింట్లో అన్నిపనులు చేసిపెట్టి వెళ్ళి చదువుకుంటాను. చదువుసంధ్య లేకుండా యింట్లోచేతులు నులుపుకుంటూ కూర్చుంటే ఏమి లాభం? మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. దానిని స్త్రీ పురుషులు కలసి పనిచేసి నిలబెట్టాలి. స్త్రీలు కూడా పురుషునివలె చదువుకుని పైకిరావాలి. అప్పుడే మనదేశం కూడా పైకిరాగలదు. పిన్నీ, నీ కాళ్ళుపట్టుకుంటాను పిన్నీ! నన్ను మన్నించి నా చదువు మాన్పించకు పిన్నీ! స్త్రీ పురుషులు, స్త్రీలు చదువుకొని పైకివచ్చినందువల్ల కలిగే లాభాలు తెలుసుకోవాలంటే నీవు ఎల్లుండి మా స్కూలులో నాటకం చూడడానికి రా! అందులో మన యింటి ప్రక్క వున్న జమీందారుగారమ్మాయి హేమా నాయకుడుగాను నేను నాయకిగాను వేస్తున్నాము. అందులో స్త్రీ విద్యవల్ల వచ్చే లాభాలను దేశమునకు తేటతెల్లముగా చూపిస్తాను. అందరూ వస్తారు పిన్నీ నువ్వుకూడా తప్పక రా! అది చూస్తే నువ్వే 'శోభా! నీవు కూడా చదువుకొని దేశ స్వాతంత్ర్యం నిలబెట్టమ్మా' అంటావు. అని మామూలు పిన్నే కదా అని గుక్కతిప్పకుండా అనివేసింది.

కాని మంచిమాటలుకూడా చెడ్డవారికి విషంగా కనుబడుతాయి. అప్పుడు "ఓసీ నీపని యింతవరకు వచ్చిందటే

కాని చూస్తానుగా" అని కళ్ళెఱ్ఱచేసి అక్కడనుంచి వెళ్ళి పోయింది. శోభగుండెల్లో రాయిపడింది. ఆమె తండ్రిఏమి చేయగలడు? అంకుశం అంతా ఆమె చేతిలోవుంది.

శోభ పెండ్లి. ఒక కురూపి, మూఢుడు అయిన ఒక యువకునితో నిశ్చయమయింది. శుభలేఖలు మాస్టర్లకు, పిల్లలకు చేరాయి. వారు సంతోషంతో కానుకలు తీసుకొని పెండ్లి సమయానికి వచ్చారు. అందరూ శోభ పెండ్లి చూచి ఆమె నాశీర్వదించి తమ తమ యిండ్లకు వెళ్ళి పోయారు. కాని రోడ్డుమీద వెళ్ళుతూ కొందరు శోభ స్నేహితులు, సహాధ్యాయినులు యిలా మాట్లాడుకున్నారు.

1వ :—అదేమిటీ చారుమతీ? ఆ అందం, ఆ రూపు, ఆ నలుపు ఏ జంతువుకు పోల్చాలో నాకు తెలియటంలేదే? వారిద్దరి పెండ్లిని కాకి ముక్కుకి దొండపండు కట్టినట్లుగా వుందే. సరేకాని మన శోభ ఎట్లా ఒప్పుకుందే ఆ పెండ్లికి?

2వ :—నీమొహం! అది ఒప్పుకోవటం ఏమిటీ? అది నాకు పెండ్లి వద్దందట! దానికి చదువంటేనే ఎక్కువయిష్టం. పెండ్లిమాట ఎత్తితే భగ్గున మండిపడేది. దాని ఆశయాలన్నీ చాలా పెద్దవిలే. యింతకు ఆ సవతితల్లిముండ వచ్చి యింత పని చేసింది. స్త్రీకాదు టే మంచి కార్యము చెయ్యాలన్నా చెడ్డది చేయ్యాలన్నా సాహసంకలది. శోభ చదువు మాన్పించి దాని నొక కురూపి కిచ్చి పెండ్లి చేసింది. పెండ్లి సమయంలో శోభమొహం ఎంత వాడిపోయిందో చూశావుగా! మన నాటకంలో శోభ పేయూల పెండ్లి కానేలేదు. కాని, రంగమణీ! వాళ్ళమ్మవుంటే యిల్లా చేసేదంటావా? పాపం ఆమె ఎప్పుడూ "మా శోభను బి.ఏ., వరకు చదివిస్తాను. ఆ తరువాత దానంతటదే స్వతంత్రంగా పెండ్లి చేసుకుంటుంది" అనేది. కాని విధి కృతము తప్పింప నెవ్వరి వశమే! అని శోభ భర్తను గురించి మాట్లాడుతూ వారు వారి యిండ్లు చేరిరి.

శోభకు పదకొండేండ్లయినా నిండలేదు. అప్పుడే ఆమెకు అత్తవారింటికి వెళ్ళవలసి వచ్చింది. కాని ఆమె మనస్సెల్లప్పుడు చదువు మీద నేవుండేది. సవతితల్లికి ఆమె యింటిలో వుండటం ఏ మాత్రం యిష్టంలేదు. అందుచేత పెండ్లి అయిన 5 నెలలకే అత్తవారింటికి పంపి వేసింది. "మూలిగే నక్కమీద తాటిపండు పడినట్లు" చదువుమాని వేశానని కుమిలి ఏడుస్తున్న శోభ మీద అత్తవారింటి వంట భారం కూడా నెత్తిమీద పడింది. ఆమెకు దేశవిషయాలు తెలుసుకోవటం పుస్తకాలు చదవటమే తెలుసుగాని వంట చేయటం అంత బాగా తెలీదు. అందులోను కుంచెడు తప్పాలా వార్చాలంటే మాటలా! శోభ తల్లి ఆమెకు చదువుకునేందుకు సమయము యిచ్చింది కాని వంటచేయుట కవకాశ మివ్వ లేదు. వంట యింట్లోకి వెళ్ళేసరికి యింక :—

అత్తగారు :—ఏమే అస్తమానం పొయ్యి దగ్గరే పడి చస్తావేం, ఏర్ఘామయింది. యివ్వాక యివ్వాక వంట పని యిస్తే యివ్వాళ మమ్మల్నందరిని పస్తు పడుకో బెట్టేట్టుగా వున్నావు. ఆ, యింకా ఎక్కువ చదువుకుంటే ఎల్లావుండే దానివో? పిల్ల చక్కనిది, పనిపాటలు చక్కగా నేర్చినది, కొంచెము చదువుకున్నది అని అనుకుని బుట్టలో పడ్డాము. నీ చదువు. నీవు మండా! తొందరగా కానియ్యవే!

శోభ :—అత్తయ్యా! పచ్చి కట్టె పుల్లలవటం చేత పొయ్యిలోనుంచి పొగయే తప్ప మంట రావటం లేదండీ! అంతా నాదే తప్పనండి. కాని ఎందుకు చదువునలా తిడతారు? అది మన కందరకూ జ్ఞానం యిస్తోందనా? చదువు లేక పోవటంవల్లనే మనదేశం ముందుకు వెళ్ళలేక పోయింది. చదువుకుని విజ్ఞానం సంపాదించి మనం కూడా యితర దేశ స్త్రీలలాగ ముందుకు పోవాలి. యితరదేశాలలో చూడండి! అక్కడ బాల్య వివాహాలే లేవు, స్త్రీ బానిసత్వం లేనేలేదు, అంతా స్వేచ్ఛ. మరి మనదేశంలోనో, ఎవరైన ముందుకు రావటానికి ప్రయత్నిస్తే వారిని నిందిస్తోంది ప్రపంచం. వారికి ముందుకు పోవటానికి స్థానం యివ్వటంలేదు.

అని అత్తగారికి యింకా ఏవేవో చెప్పబోతుంటే అత్తగారు ఒక కఱ్ఱ బడితె పుచ్చుకొని "ఓసీ! నీవటే నాకు బుద్ధులు చెప్పవచ్చావు చచ్చినట్లు పడివుండక" అని తిట్టుతూ కఱ్ఱతో నాలుగంటించింది. యిది రోజూ జరిగేకథ. ఆమె భర్తకూడా తల్లికి తగిన కటిక మూఢుడు.

ఒకరోజు శోభయింట్లో ఏదో పనిచేస్తూంది. యింతలో ఆమె మరది (5 ఏండ్ల పిల్లవాడు) చేతిలో ఒక కవరుపుచ్చుకొని, "వదినా, నీకు వుత్తరం వచ్చిందొదినా" అంటూ

## ఒకే నాటి రాత్రిలో

ఎగురుకుంటూ వీధిలోనుంచి వస్తున్నాడు. కాని యింతలో పిడుగులాగున శోభ భర్తవచ్చి తమ్ముడి చేతిలోనుంచి కవరు లాగుకొని చింపి చదువ నారంభించాడు. అందులో యిలా వ్రాసివుంది :—

నా ప్రియమైన పత్ని శోభకు.

'శోభా! నీవు నాకుతప్పక వుత్తరం వ్రాస్తాననిచెప్పావు. కాని నీవు అక్కడకు వెళ్ళిన తరువాత వుత్తరమే వ్రాయ లేదు. నీవు అట్లా వుత్తరమే వ్రాయక పోతే నా మనసు ఎంతో ఆదుర్దాగా వుండదూ? నీవు ఒక రోజు నాతో "హేమూ, యింక కొద్దిరోజుల్లో మనమిద్దరము ప్రజలందరి ఎదుట ఎంతో ఆనందంగా పెళ్ళిచేసుకో బోతున్నాము. ఎందుకు నీకు చింత? మన మిద్దరము ఏకమై దేశసేవ చేసి దేశంలోని స్త్రీ పురుషులకు వారు కూడా ఏకమై దేశ సేవ చేయాలని మచ్చు చూపిద్దాము" అని అన్నావు. కాని తానొకటి తలచిన దైవమొకటి తలచునని మన యిద్దరిపెండ్లి యింకా రెండు రోజులుండనగా నీపెండ్లి అయి పోయింది. యిప్పుడు నీ క్రొత్త భర్తతో చాల హాయిగా వున్నావను కుంటాను. కాని నన్ను మాత్రం మరువకు. మనం పెండ్లిచేసు కొనక పోయినా పిల్లలచేత మ్యాస్టర్లచేత భార్యా భర్తలమని పించుకున్నాము. పేపర్లలో కూడా పడ్డాము. వెంటనే వుత్తరం వ్రాయి.'

యిట్లు
నీ భర్త హేము.

ఆ వుత్తరం చదవగానే శోభ భర్తకు కోపం ఆగలేదు. వెంటనే తను తల్లిదగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళి వుత్తరం చూపించాడు. అగ్నికి గాలి సాయమైంది. వారికోపం మరీహెచ్చయింది. వెంటనే ఆమె తల్లి తండ్రులకు "మీ పిల్ల శీలం బాగాలేదు. ఆమె మాకక్కర లేదు. మా వంశానికి నాశకారిణి అయింది. కాబట్టి వెంటనేవచ్చి తీసుకొని వెళ్ళ"మని అర్జంటు టెలిగ్రాము యిచ్చారు. లోపల శోభ భర్త ఆమె దగ్గరకు వెళ్ళి కోపావేశంతో ఒకకఱ్ఱతో ఒళ్ళుచితకబాదాడు. "ఓసీ ముండా, వాడినే పెండ్లి చేసి కొనక పోయావటే? మా యింటికి ఎందుకు వచ్చావు?" అని తిట్టినాడు. ఆమె దెబ్బలతో స్పృహతప్పి పడిపోయింది.

మధ్యాన్నం తల్లి, తండ్రి జట్కాలో దిగారు. చెల్లెలు కూడా వుంది. అప్పుడే శోభకు కొంచెము తెలివి వచ్చింది. తండ్రి మాటవినగానే ఆమె గాయములు తగిలినమాట మరచి పోయి పరుగెత్తుకొని తండ్రి దగ్గరకుపోయి, "నాన్నగారు! యిన్నాళ్ళకు నా మీద దయకలిగిందా? అబ్బ! నేటి నా సంతోషమునకు మేరలేదు" అని తన చెల్లెలిని ఎత్తుకొని, "ఏం పిచ్చితల్లీ! నీ అక్కను మరచి పోయావా" అని అప్పుడు సవతి తల్లిని చూచి, "ఏం, పిన్నీ యిన్నాళ్ళకు నన్ను చూడాలని బుద్ధి పుట్టిందా? మన వూరిలో అందరు కులాసాగా యున్నారా? మన హేము వాళ్ళందరు కులాసాగా వున్నారా" అని గ్రుక్క తిప్పుకోకుండా ప్రశ్నలు వేయటం ప్రారంభించింది.

కాని తండ్రి ముఖంలో సంతోషంలేనేలేదు. వారికి టెలి గ్రాము చూడగానే సంగతేమిటో బోధపడ లేదు. యిటు మన శోభకు ఆ గొడవ తెలియదు. భర్త ఎందుకు తనను కొట్టాడా? అని వుద్దేశ్యము కూడా ఆమెకు లేదు. కాని తండ్రిని చూచి నివ్వెర పోయింది.

యింతలో ఆమె భర్తవచ్చి మామగారితో, "చూడండి మీ అమ్మాయి నడవడిక, ఎక్కువ చదివినందువల్ల లాభం చూచారా! ఎవరో హేముట! ఒక వుత్తరం వ్రాసాడు. అందులో స్పష్టంగా "నన్ను మరువకు ప్రియా"అని అంటూ వ్రాశాడు. వాడిని అడ్డంగా నరికినా పాపం లేదు. ఎంత సాహసం! కట్టుకున్న మొగుడు యిక్కడ వుండగానే ఇంత సాహస కార్యమా? కాని వాడి ననుకోవటం ఎందుకు? మీ అమ్మాయి వప్పుకోకపోతే. వాడింత పనిచేస్తాడా! విషం అంతా మీ అమ్మాయిలోనే వుంది. మా యింటి దగ్గర దీని ఆటలు సాగవు. ఇదుగో! మామగారూ! ఆ అమ్మాయి నా భార్యాకాదు, మీరు నాకు మామగారు కాదు. మా వంశానికి నాశకారిణి అయి వచ్చింది. ఆమె ముఖము నేను యింక చూడను. మొట్ట మొదట ఆచేసే పెండ్లి, ఎవడో ఆ హేమూతోటే చెయ్యలేక పోయారా? పాపం వాళ్ళ పెండ్లి రెండురోజులలో తప్పిపోయిందట, పేపర్లలోకూడా పడిందట. కాని వాళ్ళపాలిటి శత్రువులాగ మధ్య నేనొచ్చాను. పాపం యిప్పుడీమెకోసం ఎంత తపిస్తూవుంటాడో

## ఒకే నాటి రాత్రిలో

తీసుకువెళ్ళండి. ఒక క్షణం మా గుమ్మంలో ఉండడానికి వీలులేదు పొండి. మా యిల్లు యిప్పటివరకు పవిత్రంగావుంది. తొందరగా వెళ్ళిపొండి" అని శోభ భర్త గ్రుక్క త్రిప్పుకోకుండా చెప్పటంవల్ల ఆమె తండ్రికి కూడా కొంచెము ఆమె మీద అనుమానం కలిగింది.

యిదిచూచి శోభ విషయం అంతా గ్రహించింది. అందు చేత ఆమె వారందరితో, "యిదుగో నిష్కల్మష హృదయంతో జరిగిన సంగతంతా చెపుతాను వినండి. నాలో ఏ విధమైన లోటూలేదు. నా శీలం పవిత్రమైనది. ఆ వుత్తరాన్ని మీరు సరిగా అర్థం చేసుకోలేదు. వుత్తరం యిట్లా వుండడానికి కారణ మేమిటంటే నేను చదువు చున్నప్పుడు మా స్కూలులో ఒక డ్రామావేద్దా మనుకున్నాము. అందులో "స్త్రీ పురుషులు చదువుకొని ఏకమై దేశ స్వాతంత్ర్యమును నిలబెట్టాలి" అని ప్రజలకు ఒక దంపతులు మచ్చు చూపుతారు. ఆ నాటకంలో నేను నాయకిగాను, హేమా అనే పిల్ల నాయకుడుగాను వేశాము. అందులో వివాహం కూడా చూపిస్తారు. యిది అంతా పేపర్లలో పడింది. స్కూలులో పిల్లలు మాస్టర్లు అంతా ఈ విధంగానే పిలచేవారు. అప్పుడు నాటకం యింకా రెండురోజులు వుండనగా మా పిన్ని పట్టుదలవల్ల నా వివాహం అయిపోయింది. ఆ అమ్మాయి హాస్యముగా అట్లా వుత్తరం వ్రాసింది. మీరు కూడా బాగా చదువుకుని వున్నట్లయితే యిటువంటి చిన్న చిన్న విషయము యింత పెద్దగొడవ చేయకవుండెడి వారే. మీరు అందులో చివర వ్రాసిన **आपकी प्यारी बहन** అనేది హిందీ అవటం చేత అది తెలుసుకోనలేక తప్పుడు అర్థము తీసుకున్నారు. యింతే జరిగిన విషయం."

ఆమె ఉద్రేక పూరితమయిన, విచారకరమైన మాటలు వినేసరికి అందరి మనసు మారిపోయింది. భర్త కోపమంతా చల్లారి పోయింది. నిజం తెలుసుకొన గలిగాడు. భర్త ఆమె యొక్క ఆశయాలను గుర్తించ గలిగాడు. స్త్రీ పురుషులు ఏకమై దేశ సేవ చేయాలని వారిద్దరు కంకణము కట్టారు. అలాగే దేశానికి మచ్చు చూపించారు. కురూపి అయితే నేమి, మంచి గుణములు కలిగిన తరువాత? వారిద్దరు సత్యమైన ప్రేమను దేశానికి చూపించారు. ఆనాడు శోభ నాటకం ద్వారా చూపించ లేకపోయినా ఈ నాడు ప్రత్యక్షంగా అందరకూ చూపించ గలిగింది. ఆమె ఆశయాలు పూర్తిగా నెరవేరినవి. పెండ్లి అంటే నిజమైన పెండ్లియిదే.

"హేమా" కళ్ళు తెరిచింది. కిటికీలోనుంచి సూర్యుడు ఆమెకు "యింకా లేవవేం? అందరూ లేచారు" అని కోప్పడుతున్నట్లుగా సూర్యకిరణాలు ఆమె మీద పడుతున్నాయి. పగలు 9 గంటలయినది. ఆమె కండ్లు ఎఱ్ఱగా నిప్పుముద్దలయి పోయాయి. ఆమె ప్రక్కనే శోభ తెలుగు పరీక్ష వ్రాయుటకు సిద్ధంగావచ్చింది. యింకా హేమా లేవలేదని ఆమెను లేపింది. అంతే కాని హేమాకు మెలకువ రాలేదు. తెలుగు పద్యాలు తెల్లవారు ఝామునలేచి వల్లెవేద్దా మనుకుంది. పాపం లేస్తూనే "శోభా! శోభా! ఎంత బాధపడుతున్నావు?" అంటూ వుండటమూ అదే సమయంలో ప్రక్కన వున్న శోభ ఆమె మాటలు విని పక్కున నవ్వడమూ జరిగాయి. యింతలో హేమాకు పూర్తిగా తెలివి వచ్చింది. అప్పుడు శోభ ఆమెతో "ఏమాయి! హేమా! తెలుగు పరీక్షలంటే నీకు ఎంతో భయంకదా? మరి ఎందుకు యింత ఆలస్యంగా లేచావు. రాత్రి 1 గంట వరకు మేలుకుని చదివావా?" అని ప్రశ్నించింది. అదివిని హేమా తనకు కల వచ్చింది కాని నిజంగా అదంతా జరగలేదని పెద్ద పెట్టున నవ్వ నారంభించింది. ఆ నవ్వువిని ఆఫీసు రూములో వ్రాసుకుంటూన్న వాళ్ళ నాన్నగారు వచ్చి,- "ఏం పిచ్చితల్లీ! రాత్రి అంత సేపు నిద్రలో ఏడ్చావు, ఏమైనా పీడకల వచ్చిందా?" అని అడిగాడు. అప్పుడు హేమా రాత్రి తను కలలో చూచిందంతా పూసగుచ్చినట్లు తండ్రికి, శోభకు వినిపించింది. తను నిజమే ననుకొని ఏడ్చిందట. శోభ తల్లి తండ్రి కులాసాగానే యున్నారు. తను మామూలుగా చదువుకుంటోంది. కాని హేమా అప్పుడు ప్రపంచంలో యిల్లాంటివి చాలా జరుగుతున్నాయని నమ్మింది.

ఇదంతా "ఒకే నాటి రాత్రిలో" జరిగిన కథ.

—కుమారి టి. శారద



# వ్యథ ★ శ్రీమతి గోటేటి బంగారమ్మగారు..

ప్రశాంత నిశా సమయాన ఓ వృద్ధ కంఠం, చీకటిని చీల్చుకుని ప్రస్ఫుటంగా ప్రతిధ్వనించింది. విస్మయంతో నాపురోగమనాన్ని ఖండించి అలా వింటూ వుండిపోయాను.

"హే భగవంతుడా! ప్రభో, ఎక్కడ వున్నావు నాయనా! ఇందతా నీలీలా నటనమేనా. ఈ ప్రపంచంలో ఏనాటికైనా శాంతి దేవత కన్ను తెరచి చూస్తుందా. ప్రజా స్వాతంత్ర్యం, ప్రజా స్వాతంత్ర్యం" అంటే ఏమిటో అనుకున్నా. అందరూ కలసి మెలసి వుంటారు, దేశం సశ్యశ్యామలం అవుతుంది అనుకున్నా. చివరికి యిలా పరిణమిస్తుందని కలలోకూడా వూహించ లేదు దేవా. నీవే లేవని కొందరు, అందరూ వకటేఅని మరికొందరూ, వారువేరు, వీరువేరు, అని కొందరూ, వారు ఉండకూడదని కొందరూ, వీరిని అణగ ద్రొక్కాలని కొందరూ, ఈ మచ్చరము, ఈ అసూయ, ఈ భిన్నాభిప్రాయాలు, సాధుహింస, కొట్లాటలు, ఈ రక్త పాతము, వినలేక చూడ లేక హృదయం బ్రద్దలవుతోంది. ఓ వీర భారత సహోదరులారా! మీరు అనేక సంవత్సరాలు దారాపుత్రులను విడచి, సర్వమూ త్యజించి, కారా గృహాలలో పడరాని కష్టాల ననుభవించి, అందరూ వకటేనని ఉద్ఘోషించి, భారత దాస్య శృంఖలాలని త్రెంచి తెచ్చిన స్వరాజ్యమేనా యిది? "అందరు మానవు లొకటేమైనా, మనకీ ఖర్మము తప్పదిదేలా" అన్న సంగీతాలూ, "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న గేయాలు, మనకి స్వాతంత్ర్యం వచ్చే వరకునేనా పరమేశ్వరా! న్యాయం, ధర్మం, సత్యం, అహింస, యివన్నీ ప్రయాణమై, మన పూజ్య బాపూజీతో పాటు అమరత్వాన్ని పొందాయా! గాంధీజీయే మన ఆదర్శ పురుషుడు, మనం అంతా ఆయనమార్గాన్ననుసరించి నడచు కోవాలి" అనే వార్తలు గాలివార్తలూ, పైపై మాటలూ నేనా? పదవీ వ్యామోహం అనే దారుణ పిశాచం, ప్రజలని మార్చి, తల్లక్రిందులుజేసి తమ కర్తవ్యాన్నే మరపింప జేసిందా. బాపూజీ బోధ మానవ హృదయాలని స్పందించి, ఏనాటికైనా క్రియా రూపకంగా వెలువడుతుందా, లేక యాదవ కులములో ముసలంలా పరిణమిస్తుందా. ఏమి నీ మాయ ప్రభో! సంతతము నీ ధ్యానప్రభావమున కర్మపరిపక్వము నొంది, ప్రజలలో నీ భక్తి మార్గపు అమృతధారలు కురిపించే త్యాగులూ, యోగులూ, సర్వసంగ పరిత్యాగులూకూడా యీ పుణ్యభూమిలోవుండకూడదని నిశ్చయించావా తండ్రీ. ఇన్ని నిర్బంధనాలు పాపం ఆ తెల్లవాళ్లలోకూడా కనపడలేదే. ప్రజలలో ఐకమత్యం కలుగజేసి, నిష్కల్మష ప్రేమభావంతో వర్తించేటట్లు అనుగ్రహించలేవా తండ్రీ! "హిందుఔర్ ముసిలిం ఏక్ హై" మాట అటుంచి హిందువుతో హిందువులకే కొట్లాటలా? ఈ వృద్ధాప్యంలో యివన్నీ చూసి చూసి దుఃఖించటానికే నన్ను బ్రతికించావా!"

రానురాను కంఠ స్వరం మందమై చీకటిలో కలిసిపోయింది. ముకుళిత హృదయంతో యిల్లు చేరుకున్నాను.

కథానిక:

# మా వారూ రచయితేనని నాకు గర్వం!

వాడ్రేవు శ్రీ జోగిపంతులుగారు

అన్నయ్య తను రాసిన కథలున్న పత్రికలన్నీ పంపేవాడు. అన్నయ్య రచన ఏదోవొకటి లేని తెలుగు పత్రికలు ఆ రోజుల్లో లేవంటే గొప్ప కాదు! అన్నయ్య రచనలు ఇతర పాఠకుడు చదివేటంత ఆసక్తితో చదివే దాన్నికాను. సాధారణంగా ఒక రచయితతో పరిచయంవున్న పాఠకుడు—ఆ రచయిత ఎంత చక్కగా రాసినా అదొక విధమైన అసంతృప్తితో చదువుతాడు! చలంగారితో కానీండి, మరో రచయతతో కానీండి నాకు పరిచయం లేదు కాబట్టి, మా అన్నయ్యపంపిన పత్రికలలోవున్న ఇతర రచనలు ముందుచదివి, ఆఖరున-అదొక అసంతృప్తితో మాఅన్నయ్య రచన చదివేదాన్ని! ఒకరచయిత, తను కథకుణ్ణనిగానీ, వ్యాస కర్తననిగానీ ఎవరికీ-ఎక్కువగా పరిచయంవున్న వారికేనా సరే-తెలియకుండా చేసుకోడానికీ, తద్వారా న్యూనతను కొంత పోగొట్టుకోడానికి, మారు పేర్లు (పెన్ నేమ్) బాగా ఉపకరిస్తాయి! అంతే కాకుండా సంఘంలోని విద్రోహులను నిర్మొగమాటంగా విమర్శించడానికి ఈ మారు పేర్లు బాగా సహకరిస్తాయి. అందుచేత ప్రతి రచయిత ఒక 'పెన్ నేమ్' ఎంచుకోడం మంచిదనీ మా అన్నయ్య అప్పుడప్పుడు అనటం నాకు బాగా జ్ఞాపకముంది. ఎందుచేతనంటే ఆవ్యక్తి ఆ రచయితని పది మందిలో వుండగా చూసి, 'ఈ పెద్ద మనిషి కథలు రాస్తాడట!' అనీ, 'వ్యాసాలు రాసి దేశాన్ని వుద్ధరిస్తాడట!' అని ఆతనిలోని విజ్ఞతను ఏమాత్రం గమనించకుండా, న్యూనపరచడానికి ప్రయత్నిస్తాడు. ఇది నా స్వానుభవంమీద చెప్తున్నాననని కూడా మా అన్నయ్య అనే వాడు. ఇది నిజమే, ఏమంటారా, 'క చ ట త ప'లో పర్వతాలు ఏడ్చినట్టు, తను రాయలేనందుకు ఏడవక, ఎదటి వాడు రాసి సైన్ అవుతున్నాడే అని ఏడుస్తారు కొందరు! రచయిత కావడం అంత బ్రహ్మాండమైన విషయం కాకపోయిన మాట వాస్తవమే! ప్రయత్నిస్తే వారూ కావచ్చు! ప్రయత్నించరు. ప్రయత్నించే వాణ్ణి చూస్తే ఏడుపు!

పగలెల్లా కాలేజీలో కొట్టుకుని కొట్టుకుని వచ్చాక ఈ తెగరాయటమనేది అన్నయ్యకి ఎట్లా సాధ్య పడేదా అని అనుకుంటుండే దాన్ని. ఎండాకాలపు సెలవులకి వస్తున్నానని వుత్తరము రాస్తూ "కథలురాసే మా అన్నయ్య వస్తున్నా" డని మటుక్కి టాం టాం చేయొద్దన్నాడు.

కాని మా అన్నయ్య కథలురాస్తాడని చెప్పుకోడంకంటె మరో ఘనత నాకేం కనబడలేదు!

అన్నయ్య వొచ్చిన నాలుగురోజులు దాకా వూళ్ళోవున్న పత్రికలవాళ్ళూ, రచయితలూ తెగ వొచ్చారు! తను ఈ వూరు వొస్తున్నట్లు వాళ

కూడా వ్యాసాలు రాశాడు గావును! మా వూళ్ళోకూడా ఇంతమంది రచయిత లున్నారని నే నెప్పుడూ అనుకోలేదు! సెక్స్‌గురించి రాయ మని సెక్స్ పత్రికల వారూ, జాతీయ జీవనం గురించీ, పీడిత ప్రజానీకం గురించీ రాసి యివ్వ మని జాతీయ పత్రికలవాళ్ళూ, బాల సాహిత్యం కథల్లో రాయమని పిల్లల పత్రికలవాళ్లు, చలన చిత్రకళా పురోభివృద్ధికి మార్గాలు సూచిస్తూ సీరియల్ వ్యాసాలు రాయమని సినీమా పత్రికల వారూ ఇలాగ రక రకాల పత్రికల వారు రక రకాల వ్యాసాలూ, కథలూ రాసివ్వమని వేధిం చుకుతిన్నారు. అందరికీ తలోవ్యాసం పంపుతా నని హామీ యిచ్చి వదల్చుకున్నాడు.

అన్నయ్య భయపడినట్లు 'వీడూకూడా రచ యితే నటోయ్!' అని ఎవ్వరూ అనలేదు. ఒక్క మా వారు తప్ప! 'ఇప్పటికే నా సత్యాన్ని గ్రహింప గలిగినందుకు ధన్య వాదాలు!' అన్నాడు అన్నయ్య. 'ఆయన' మరి మాట్లాడ లేదు!

'నువ్వుకూడా రచన నేర్చుకో రాదూ?' అన్నాడు అన్నయ్య ఆయనతో. ఒక వెకిలినవ్వు నవ్వి వూరుకున్నారు. గట్టిగా పట్టుపట్టడం చేత సరే కానీయమన్నారు. వ్యక్తి పేరునిబట్టి ప్రచు రించే పత్రికలు కొన్నీ, రికమెండేషన్ల వల్ల ప్రచురించే పత్రికలు కొన్ని ఏదో సమితి పేరు చూసి ప్రచురించే పత్రికలుకొన్ని వుండడంచాత పై విషయాలలో సంబంధంలేకుండా రచన విలు వని గుర్తించే 'ఆంధ్రమహిళ' వంటి పత్రికలలో భావం మాత్రం చెప్పి ఆయనచేత రాయించే వాడు అన్నయ్య. ఆ నెలవల్లో కనీసం ఓ అర డజను రచనలన్నా రాయించాడు. ఇప్పుడు 'మాకు మీ రచన ముఖ్యావసరం!' అని ఆయనికి రోజూ వుత్తరాలు వచ్చేటంత పెద్ద రచ యిత అయ్యారు! ఇంట్లో ఏ చిన్ని సంఘటన జరి గినా నా పేరు కథలో కెక్కించి రాసేస్తారు! ఇప్పుడు మా అన్నయ్యే కాకుండా - మావారు కూడా రచయితేనని గర్వంగా చెప్పుకొంటాను! ఒప్పుకుంటారా?



## చిన్న కథలు



సంపుటములు 5, 6, 7, 8: రచన శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ప్రకాశకులు. కలాభివర్ధనీపరిషత్తు, రాజమండ్రి; వెల ఒక్కొక్క-సంపుటము 1-4-0.

రచయిత సుప్రసిద్ధ విద్వాంసులు, కథకులు, ఆంధ్ర విద్వత్ లోకమునకు చిరమిత్రులు. సంపుటము 5 అంతయు నొక్కటేకథ—వడ్లగింజలు. పుటలు 164. ఇది కొన్నేండ్ల క్రితమాంధ్ర వార పత్రికలో ప్రచురితము. నిరు పేదయగు విద్వచ్ఛిఖామణి తంగిరాల శంకరప్ప పండితోత్తముడైన పెద్దాపురపు మహారాజును దర్శించుటకు పడిన యగచాట్లను కథ నిరూపించుచున్నది. చదరంగమున నిర్వురూ నిపుణులు. కడకు విజయము కథా నాయకుడు శంకరప్పదే.

ఆరవ సంపుటమందలి కథలు మూడింటిలో, "శుభికే! శిరఆరోహ" మొదటిది. ఇందులో ఆంధ్రులు హిందూస్థానీ దేశ భావల, సంప్రదాయముల, కళల ననుసరించుచు, తమ యాచారవ్యవహారముల, సంగీత సాహిత్యముల, విద్యల నెటుల నేవగించుచున్నారో బహు చక్కగ జూప బడ్డది. ఇందలి "గొంగామాయ్, రామేషు" పాత్రలు యీ పరాధీన నాగరికతను స్పష్ట పర్చుచున్నవి. రెండవ కథ—తాపిమేస్త్రీ రామదీక్షితులు బి. యే.—పేదతనమువల్ల నణకువ, ధనాధికత వల్ల గర్వము, వాని ఫలితముల దెల్పుచు, "ఓడలు బండ్లగును, బండ్లోడలగు" నన్న వాక్యము ఋజువుచేయుచున్నది. ఇది ప్రథమమున నాంధ్రశిల్పిలో ముద్రితము. మూడవకథ-గులాబీ అత్తరు-ఫకురల్లీఖాను రాజదర్శనార్థం ఢిల్లీనుండి పెద్దాపురం వచ్చి హఠాత్తుగనైు, రాజుకు గా. న్కగ తెచ్చిన అత్తరు సీసాను, కోట గోడకు విసిరియప్పుడే బయటకు వచ్చుచున్న రాజును మూర్ఛిల జేసెనని జెప్పుచున్నది. ఇదియు నాంధ్రశిల్పిలో బ్రకటితమై, రేడియోలో బ్రసారితమైనది.

సంపుటము 7 అంతయు నొక్కటే కథ—మార్గదర్శి—పుటలు 136. కథానాయకుడైన మార్గదర్శి జీవిత మాదర్శప్రాయమై, నిరుపేద బ్రాహ్మణుడు వర్తకంవల్లనెంత సంపన్నుడై, స్వతంత్రుడై, సుఖజీవనము జేయగలడో జూపుచున్నది. యీ కథ వుద్యోగము దాస్యమును, పరాధీనతను మప్పి, స్వప్రతిభను గ్రుంగదీయుననియు, అందరు కులభేదం లేకయన్ని వృత్తుల నవలంబించ వచ్చుననియు బోధించుచున్నది. ఇది మొదట భారతిలోను, తదుపరి ఆనంద వాణిలోను ప్రకటితము.

ఎనిమిదవ సంపుటమందలి కథ - కన్యాకాలే యత్నాద్వరితా—పార్వతీశం రంగనాయికలకు వివాహము నిశ్చయమై, కారణాంతరములవల్ల నది జరుగక పార్వతీశం జానికమ్మలకు బరిణయమగును. రంగనాయిక బాల వితంతువై జానికమ్మతో మైత్రినెరపి పార్వతీశంను జేరుకొనును. ఈ కథ భారతిలో బ్రచురింపబడినదే.

కథలపేర్లుకొన్ని, కథలలోపల వాక్యములు, పదములు కొన్ని, సంస్కృతమైనను, శైలిసలలిత ప్రవాహము. మిక్కుటముగ సంభాషణ సరణి యనుసరితము. ఐదవ సంపుటము దప్ప, మిగత సంపుటములకు ప్రథమకూర్పు. ముఖపత్రములు, ప్రచురణ రమ్యములు. రచయిత, ప్రకాశకులు యిట్టి చక్కని కథల నింకను నాంధ్రుల కర్పింతురని మా యాశయము.

---

## గ్రంధసమీక్ష ★ డాక్టర్ కౌతా యశోదాదేవిగారు యం.ఏ., డి.లిట్.

---




# మంచి రుచి అయినది - చాలా బాగుండును

పుష్టికరాహారాలు సమృద్ధిగా ఉన్నవి.

బోర్న్-విటాలో ఎముకలను నిర్మాణంచేసే ద్రవ్యాలు, బలమిచ్చే ద్రవ్యాలు 95%కు ఎక్కువగా ఉన్నవి. ఇందుకు తోడు, ఇది చాలా రుచిగా ఉంటుంది. జీర్ణశక్తిని వృద్ధి చేస్తుంది, తేలికగా విపాకమౌతుంది. ముఖ్యంగా స్త్రీలు గర్భవతులుగా ఉన్న సమయంలోను, వ్యాధి నుంచి తేరుకొనేటప్పుడు ఇది బాగా ఉపయోగపడుతుంది.

## కాడ్బరీస్

# బోర్న్-విటా

కాల్సియం విటమినులు ఎక్కువగా ఉన్నవి.

క్యాడ్బరీ శ్రేష్ఠతకు ప్రసిద్ధం.

నాది

నాది

నాది




నాది

నాది

నాది

# అమృతాంజనము

గాని,

" యధాయధా................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తిముల్లోకములను దెల్పఁజేయు పూసికతో పెరుఁగు చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madra
Printed by M. Satyanarayana at the H. P. Press, 12. Thanikachalam Chetty Road, T'Nagar, Madras.



మహిళాసభలో శ్రీమతి సరోజినీనాయుడుగారికి స్వాగతము





రాష్ట్రపతికి మదరాసుమహాజనుల విందు
రాజాజీహాలు ప్రాంగణములో

ANDHRA MAHILA

Regd. No. 4753

# ఆంధ్రమహిళాసభ

మైలాపూరు - మద్రాసు

---

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్ మీడియెట్ పరీక్షలు, నృత్యము, గానము

పారిశ్రామిక విద్యాలయము:- (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) కుట్టు, ఎంబ్రాయిడరీ, ఉల్లు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక

నిర్మలాదేవి గ్రంథాలయము :- సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము

క్రీడా, క్లబ్బు శాఖలు

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి

# పోటీలలో నెగ్గినవారు

1. NO.



గిరి కుమారి　　లోలాక్షి　　జానకి　　జయలక్ష్మి



భారతి　　గాయత్రి



అన్నపూర్ణ



మీనాక్షి　　అలిమేలు







వస్తుంది!
వాహిని వారి
గుణసుందరి
కథ...
డాక్టర్. సుబ్బారావు...శివరావు...రేలంగి
శాంతకుమారి...మాలతి...శ్రీరంజని
నటించినది..
డైరెక్టర్...కె.వి.రెడ్డి, బి.యస్‌సి (ఆనర్సు)

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: అక్టోబరు '49 :: సంచిక 5

ముఖచిత్రము :: శివపార్వతి



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,
సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా అయిదు రూపాయలు



సంపుటి 6 — అక్టోబరు 1949 — సంచిక 6

# రూపాయి విదేశవిలువ తగ్గింపు

జరిగిన 18 సంవత్సరములలోనూ ఇంగ్లండు తన పౌండు విలువను రెండుమారులు తగ్గించింది. కాని యీ మధ్య జరుపబడిన తగ్గుదల రేటు ప్రపంచముయొక్క ఆర్థిక కేంద్రాలన్నిటిని ఒణికించింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరము బ్రిటన్ ఆర్థికంగా చాల కుంగిపోయింది. ఉత్పత్తి సాధకాలు వెనుకబడుటవలన ఉత్పత్తులు తగ్గిపోయాయి. వస్తువులకొరకు ఆత్రుత ఎక్కువ అగుటవలన వస్తువుల ధరలు పెరిగిపోయాయి. అమెరికానుండి అత్యవసర వస్తువుల దిగుమతికైన ఖర్చులు తీర్చుకొనుటకు ఉత్పత్తులు లేమి ఎగుమతులు పంపుటకు వీలులేక పోయినది. అందువల్ల డాలర్లు సంపాదించుటకు వీలులేదు. ముందుగొయ్యి, వెనకనుయ్యివలె ఒకప్రక్క ఉత్పత్తులు ఎక్కువ చేసుకొనలేక, రెండవప్రక్క దిగుమతులకు కావలసిన డాలర్లులేక ఇంగ్లండు చాల చిక్కు పరిస్థితులలో పడినది.

ఈ క్లిష్ట పరిస్థితులకు తోడు యుద్ధకాలంలో మనకు అప్పుపడ్డ స్టెర్లింగ్ నిల్వలను తీర్చవలసివచ్చినది. ఇవికాక పశ్చిమ యూరోపు రాజ్యాలను రష్యా ప్రాబల్యమునుండి రక్షించుటకొఱకై మరికొంత ఖర్చుచేయవలసివచ్చెను. ఈ ఖర్చులకు తగిన ఆదాయాలు స్వదేశంలో పెంపొందకపోయినవి. పైగా అమెరికానుండి పుచ్చుకొన్న అప్పు, మార్షల్ ప్రణాళికలవల్ల విశేష లాభములు పొందగలిగినను, యీ సొమ్మును తమ యిష్టమువచ్చినట్లు ఉపయోగించుటకు వీలులేదను నిషేధాజ్ఞలు వుండుటవలన ఇంగ్లాండుకు కొత్త సమస్యలు కల్గించాయి. దీనికితోడు స్పెక్యులేషన్ అధికమగుటవలన వ్యాపారము దెబ్బతిని, బ్రిటన్‌కు అమెరికాతోను, యితర దేశాలతోను, దిగుమతులకన్న ఎగుమతులు వెనుకబడుటవలన విశేషమగు ప్రతికూల వ్యాపారశేషము లేర్పడ్డాయి. ఇట్టి విపరీత ప్రతికూల పరిస్థితినుండి బయటపడుటకు ఇంగ్లాండుకు ఎగుమతులను అభివృద్ధి చేసుకొనవలసివచ్చింది.

# రూపాయి విదేశవిలువ తగ్గింపు

ఇటువంటి మార్పు తీసుకొనివచ్చుట చాల కష్టము. మొదట ఇంగ్లాండు వస్తువుల ధరలు యితర దేశాలలోకన్న తక్కువగా వుండాలి. అప్పుడే అమెరికాకు బ్రిటిష్ వస్తువులు లాభదాయకము కాగలవు. ఈ పరిస్థితులకొరకే పౌండుయొక్క విదేశవిలువను తగ్గించివేసింది. అంటే ఒక డాలరుకు యిప్పుడు ఎక్కువ బ్రిటిష్‌వస్తువులు రాగలవు. ఇంతకుమునుపు ఒక పౌండుకు 4.03 డాలర్లు, యిప్పుడు ఒక పౌండుకు 2.8 డాలర్లు మాత్రమే అనగా, నూటికి 30.5 వంతులు పౌను విలువ తగ్గినది.

ఈ విలువలమార్పు విదేశీయులకేగాని స్వదేశీయులకు లభించదు. ధర తగ్గుటచే ఇందువలన యిదివరకుకన్న ఎగుమతులు అధికముకాగలవు. అనగా తమ కరెన్సీవిలువ తగ్గించిన దేశాలకు యిదివరకుకన్న డాలర్లు ఎక్కువగా లభ్యమగును. వీలైనంతవరకు హార్డు కరెన్సీదేశాలనుండి దిగుమతులను తగ్గించుటచే డాలర్ నిల్వలను మరింత ఖర్చుకాకుండ రక్షించుకోవచ్చును. ఈ పద్ధతి వలన పెరిగియున్న ప్రతికూల వ్యాపార శేషాలను చాలవరకు తగ్గించుకొనవచ్చును.

బ్రిటన్ స్టెర్లింగ్ ప్రాంతాలకు ముఖ్యదేశం. స్టెర్లింగ్ దేశాలన్నిటిలో ముఖ్యమగు వ్యాపార సంబంధాలు వున్నాయి. అందుచేతనే బ్రిటన్‌తోపాటు స్టెర్లింగ్ ప్రాంతాలన్నీ తమ కరెన్సీల విదేశ విలువలు తగ్గించుకొనవలవివచ్చినది. కామన్‌వెల్తు సభ్యరాలు అగుటవలన, స్టెర్లింగ్ ప్రాంతములలో ఒక ప్రాంతమగుటవలన భారతదేశము తన కరెన్సీ విదేశవిలువను బ్రిటన్‌తో సమానముగా 30.5% తగ్గించుకోవలసి వచ్చినది. ఇట్లు తగ్గించుటవలన కలుగు లాభనష్టములనుగూర్చి ఆలోచించుటకు ముందు దేశముయొక్క ప్రస్తుత పరిస్థితి అర్థంచేసుకోవడము అవసరం. రెండవ ప్రపంచ యుద్ధము తర్వాత భారతదేశం చాల కష్టదినములనుభవింపవలసివచ్చినది. ఉత్పత్తులు చూస్తేనా అభివృద్ధిలోలేవు. అన్నిటికన్నా ముఖ్యమైనది ఆహార సమస్య-ఆహార సమస్యను తీర్చుటకై ప్రభుత్వము అనేక రకములుగ ప్రయత్నించవలెను. ఉత్పత్తులభివృద్ధిగావించాలంటే అనేకములైన యంత్ర సామాగ్రులను అమెరికానుండి దిగుమతి చేసుకొనవలెను.

ఇటువంటి సందర్భములలో భారతదేశం కూడ తన కరెన్సీ విలువ తగ్గించడము లాభమా, నష్టమా అన్న ప్రశ్నరాక తప్పదు. ఈ విషయమును గురించి అనేక భేదాభిప్రాయాలు గలవు. కాని ప్రస్తుతము కొద్దికాలమువరకు అది లాభకరమే అన్నట్లు తేలుచున్నది. ఏ దేశమునకైనను లాభములు ఎగుమతులుమీదనే ఆధారపడియుంటును. మన కరెన్సీవిలువ తగ్గింప బడుటచే బ్రిటన్‌లోవలెనే మన దేశంలో కూడ ఎగుమతులు చవుక అగుటచే అమెరికా మన వస్తువుల నెక్కువగా కొనవచ్చును. అందువల్ల మన దేశపుడాలర్ నిల్వలధికము కావచ్చును. అమెరికన్ టూరిష్టుల ద్వారాకూడా మరికొన్ని డాలర్లు దేశానికి చెందగలవు. ఈ విధంగా భారతదేశం డాలర్లను చేకూర్చగలదు. భారతదేశం వెంటనే అమెరికా మొదలగు హార్డు కరెన్సీ దేశములనుండి దిగుమతి

అగుచున్న ఆహార పదార్థములను ఆపుచేసుకొనవలెను. మూడువంతులు ముప్పాళ్లు స్వదేశమునసే స్వయంపోషకంగా చేసుకొనుటకు ప్రయత్నించవలెను. తప్పని సరి అయిన యెడల సాధ్యమైనంత వరకు స్టెర్లింగు ప్రాంతాలనుండే దిగుమతి చేసికోవలెను. ఈ విధంగా గాని మనకేర్పడిన వ్యతిరేక వ్యాపార శేషాలను అనుకూలముగా మార్చుకొనలేము. కాని ఇందులో ఇంకొక బాధ వున్నది. భారతదేశం ఎగుమతిచేసే వస్తువులు చాలకొద్ది. వస్తువుల నాణ్యం చాలాతక్కువ. కనుక యింక మీద ఎగుమతి ఎక్కువ చెయ్యావలెనంటే, కరెన్సీ విలువ తగ్గించటమే కాకుండా, వస్తువుల నాణ్యముకూడా హెచ్చించవలెను.

ఇక పాకిస్థాన్ భారత దేశంతో ముఖ్యముగా వ్యాపారముచేయును గాబట్టి భారతదేశమునకు నష్టము కలిగించుట కొరకై తన రూపాయ విలువ తగ్గించుకోలేదని చాలమంది అభిప్రాయము. కాని పాకిస్థాను కూడ త్వరలోనే కరెన్సీ విలువ తగ్గింపక తప్పదు. ఇది ఆలోచింపతగ్గ విషయమే. తగ్గించని యెడల భారత దేశానికి తాత్కాలికంగా కొంత నష్టం రాగలదు.



### ఆంధ్ర మహిళా సభలో

# దసరా ఉత్సవాలు

ప్రతి సంవత్సరం దసరావస్తుంది. ప్రతివారు ఆ నాలుగు రోజులు బొమ్మల కొలువు, పేరంటములతో ఎంతో చక్కగా దసరా ఉత్సవాలు చేస్తారు. పిన్న పెద్దలందరు ఉత్సాహంతో పాల్గొంటారు. ఆ విధంగానే ఈ సంవత్సరం ఆంధ్రమహిళాసభ విద్యార్థినులు సభ్యురాండ్రు వారి పిల్లలు దసరా నాలుగు దినములు ఎంతో ఆనందముగా జరపినారు. నాలుగు దినములు ఆటల పోటీలు, తెలుగు హిందీ భాషలలో వక్తృత్వపు పోటీలు జరిగినవి. ప్రతిదినము ఉదయము దేవీ పూజలతో ప్రారంభించబడి, సాయంత్రము బొమ్మలకొలువు, పేరంటములు జరిగినవి. అందరూ ఈ నాలుగు దినములలో జరిగిన కార్యక్రమములయందు ఉత్సాహముతో పాల్గొని ఎంతో నిపుణతతో ఉత్సవములను జయప్రదముగా జరిపిరి.

### ఆటల పోటీలు

విదియ, శనివారము 21-9-49.

నిర్వాహకులు :—శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మగారు.
శ్రీమతి కళ్లా కమలమ్మగారు.

2 గంటలకు ఆటలలో పోటీలు ప్రారంభించబడినవి. ఈ ఆటల పోటీలలో విద్యార్థినులు, సభ్యురాండ్రు వారి పిల్లలు పాల్గొనిరి. విద్యార్థినుల షీల్డును మూడు ఆటలలోను నెగ్గిన మోతీదళము వారు గెలిచిరి. కారమ్సులో శ్రీ అలిమేలు, మీనాక్షిగార్లకును, పింగ్ పాంగ్‌లో శ్రీ అల్లాడి కల్పకం, కె. బాలగార్లకును ప్రథమ ద్వితీయ బహుమతులు, ఆబ్‌స్టకిల్ పోటీలో శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మగారికిని, సభ్యురాండ్ర పిల్లల పోటీలలో కస్తూరి అన్నపూర్ణ, వేపా సావిత్రి, కస్తూరి ప్రమీలరాణి, ఏ. శ్యామల, జి. వెంకటలక్ష్మిలకును, బహుమతులు ఇవ్వబడినవి.

*　　*　　*

### తెలుగు వక్తృత్వపు పోటీలు

నిర్వహణ :—శ్రీమతి మంత్రిప్రగడ రంగమ్మగారు.

పరీక్షాధిపతులు:
- శ్రీ యం. నాగేశ్వరరావుగారు.
- శ్రీ యస్. వెంకటాచల శాస్త్రిగారు.
- శ్రీ జి. లక్ష్మీకాంతమ్మగారు.

అష్టమి గురువారము (ది29-9-49) ఉదయము 9 గంటలకు దేవీపూజజరిగిన పిదప తెలుగులో వక్తృత్వపు పోటీలు నిరి. ఇందు జూనియరుశాఖ ఈ క్రింద నుదహరించిన శీర్షికలపై ప్రసంగించిరి.

1. పరీక్షలుండవలెనా ?
2. స్త్రీలకు విద్య లేక భూషణములా అలంకరణములు?
3. యుద్ధములవుసరమా ?

సీనియరు శాఖవారు ఈ క్రింద నుదహరించిన శీర్షికలపై మాట్లాడిరి.

1. సామాజిక జీవనములో కళాపరిజ్ఞానమా లేక శాస్త్ర పరిజ్ఞానమా ముఖ్యమయినది ?
2. సాంఘిక నైతిక సంస్కరణమునకు శాసనములవసరమా ?
3. మరణమే మహాపురుషుల మహాత్మ్యమును దెల్పును.

ఈ పోటీలలో సీనియరు శాఖలో శ్రీమతి రామక్రిష్ణమ్మ, టి. ప్రభావతిగార్లకు ప్రథమ, ద్వితీయ బహుమతులును, జూనియరు శాఖలో శ్రీ నందూరి నాగేశ్వరి, వై. సీతాదేవిగార్లకు, ప్రథమ, ద్వితీయ బహుమతులు ఇవ్వబడెను.

*　　*　　*

### గాన కళలో పోటీలు

నిర్వాహణ :—శ్రీమతి రత్నాలకమలాబాయిగారు.
శ్రీ ఎస్. సుబ్బలక్ష్మమ్మగారు.

పరీక్షాధిపతులు:
- శ్రీ మంత్రాల గోపాలకృష్ణమూర్తిగారు.
- శ్రీమతి పి. శకుంతలమ్మగారు.
- శ్రీమతి యస్. సి. ద్వారకా పార్థసారథిగారు.

29-9-49. సాయంత్రము గానకళలో పోటీలు జరిగినవి. ఇందు 27 గురు పాల్గొనిరి. పోటీలు గాత్ర, వాయిద్యములలో జరిగినవి. గాత్రములో జూనియరు శాఖలో యస్. గాయత్రి, యం. లక్ష్మిలకు ప్రథమ, ద్వితీయబహుమతులును, సీనియరు శాఖలో గిడుగు భారతి, మృణాళినిగార్లు ప్రథమ ద్వితీయ బహుమతులను పొందిరి. వీణ వాయిద్య పోటీలో ఇ. లక్ష్మి, సి. సీతాకమల ప్రథమ, ద్వితీయ బహుమతులను పొందిరి. జూనియరు శాఖపాటలో జి. అన్నపూర్ణకు ప్రత్యేక బహుమతి ఇవ్వబడెను.

### విద్యార్థినుల నాటక ప్రదర్శన పోటీలు

పరీక్షాధిపతులు:
- శ్రీమతి గో. కమలామణిగారు.
- శ్రీమతి కో. పద్మావతిగారు.

# దసరా ఉత్సవాలు

మహార్నవమి శుక్రవారము (ది 30-9-49) ఉదయము యథా ప్రకారముగా దేవీ పూజ జరుప బడెను. ఆ దినము సాయంత్రము విద్యార్థినుల నాటక పోటీల ప్రదర్శనము జరిగినది. మహిళాసభ విద్యార్థినులు తమ స్వప్రయత్నముచే ఎంతో నేర్పుతో తమ నటనా చాతుర్యములను చూపిరి. ఈ నాటకములలో సీనియర్, జూనియర్, సబ్ జూనియర్, పారిశ్రామికశాఖా విద్యార్థినులు పాల్గొనిరి. ఒక అరవ నాటకము, హిందీ నాటకము కూడా ప్రదర్శింపబడినవి. నాటకములలో ప్రథమ బహుమతిని పారిశ్రామిక విద్యార్థినులు ప్రదర్శించిన "వారసత్త్వము" నకు బహుకరించిరి. ఈ నాటక ప్రదర్శనములందు నటనా కౌశలమునకు మహంకాళి జయ లక్ష్మి, పిడికిడి గిరికుమారి, కొండపల్లి లోలాక్షి, యం. జానకీదేవిగార్లకు బహుమతులు ఇవ్వబడినవి. వర్ధమాను అన్నపూర్ణ, సుఖలకు ప్రత్యేక బహుమతులు ఇవ్వబడెను.

*　　　*　　　*

## హిందీ వక్తృత్వపు పోటీలు

పరీక్షాధిపతులు:
- శ్రీ ఎ. గిరిజగారు.
- శ్రీ యం. కుంజమ్మగారు.
- శ్రీ ఆర్. రంగనాయకమ్మగారు.

విజయదశమి. శనివారము (1-10-49) ఉదయము దేవీ సహస్రనామ పూజానంతరము హిందీ వక్తృత్వపు పోటీలు జరిగినవి. ఈ పోటీలలో హిందీ ప్రచారక సభ విద్యార్థినులు మహిళాసభ విద్యార్థినులు పాల్గొనిరి. ఈ పోటీలలో ఈ క్రింది శీర్షికలపై మాట్లాడిరి.

1. సంఘసేవారంగమున స్త్రీలబాధ్యత.
2. కళయొక్క ప్రయోజనము.
3. విజ్ఞానమువల్ల ప్రపంచమునకు జరుగు హితా హితములు.

ఈ పోటీలలో శ్రీమతి కనకం, సుశీలా జోషిలకు ప్రథమ ద్వితీయ బహుమతులు ఇవ్వబడినవి.

*　　　*　　　*

ఆ దినము సాయంత్రము సభ్యురాండ్రు వారి పిల్లలచే నృత్యము గానము, నాటక ప్రదర్శనములు జరిగినవి. నృత్యములో పప్పు కామాక్షికి ప్రత్యేక బహుమతి ఇవ్వబడెను. నాటకములయిన పిదప శ్రీమతి నిడమర్తి వెంకట నరసమ్మగారిచేత పోటీలలో గెల్పొందిన వారికి బహుమతులు ఇవ్వబడినవి. ఆ నాటితో దసరా కార్యక్రమము 'జనగనమన' మంగళ గీతముతో సమాప్తి అయినది.

# గాంధీ జయంతి

మహిళాసభ సభ్యురాండ్రు ది. 2-10-49 న గాంధీజీ 81 వ జయంత్యుత్సవమును జరిపించిరి.

మధ్యాహ్నము 3-15 నుండి విద్యార్థినులు, సభ్యురాండ్రు 4-15 వరకూ సూత్రయజ్ఞముచేసిరి. తదుపరి ప్రార్థన గీతాలాపన యనంతరము, శ్రీమతి అమ్మన్న రాజాగారు పతాకా విష్కరణమును జేసిరి. విద్యార్థినుల జండా వందనము కాగా, చి. గిడుగు భారతి, చెల్లాయిలు జాతియ గీతముల నాలాపించిరి.

అనంతరము శ్రీమతి అమన్న రాజాగారు, మన జాతీయ పతాకము, సత్య, అహింస, శౌర్య త్యాగములకు, ధర్మమునకు చిహ్నముగా ఏర్పడినదనియు, త్యాగశీలుర త్యాగముచే సంపాదింపబడిన స్వేచ్ఛను, యీ పతాక ఆవిష్కరణ రూపముగా నిరూపించు కొనుచున్నామనియు, అందు సూచింపబడుచున్న అమూల్య గుణగణములన్నియు మనలో ప్రతిబింబించిననాడే, యీ పతాకా విష్కరణము సార్థకము కాగలదనియు నొక్కి చెప్పిరి.

అనంతరము, సభాధ్యక్షులైన శ్రీ రామకృష్ణ రాజుగారు గాంధీజీ అనన్య సాధారణమైన, అహింసా అస్త్రముతో, రక్తపాతమించుకయులేక, భారత దాస్య శృంఖలములను విడగొట్టగలిగినారంటే, ఆయన దైవభక్తియే దీనికి కారణమనియు అచంచలమైన దైవభక్తిచే సాధింపలేని విషయముండబోదని యీ విధముగ ఋజువగుచున్నదనియు, మన మందఱము, గాంధీజీ ననుసరించి, దైవభక్తిని మన నిత్యజీవితములో అలవరచుకొనుట మన కర్తవ్యము కాగలదనియు చెప్పిరి. తమ బిడ్డలను భక్తి మార్గములో పెంచుట స్త్రీలయొక్క ముఖ్య బాధ్యతయనియు చెప్పిరి.

తరువాత, శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు ప్రసంగిస్తూ, కృష్ణజయంతి, రామజయంతి యనునటుల, గాంధీజీజయంతి యనుటలోని ఔచిత్యమును విశద పరచుచూ, గాంధీజీ కత్యంత ప్రియమైన శ్రీమద్భగవద్గీత రెండవ అధ్యాయమునుండి కొన్ని శ్లోకములను చదివి వినిపించిరి.

జనగణమన గానముతో ఉత్సవము ముగిసినది.

# మహాత్ముఁడు

* శ్రీమతి ఆ. భాస్కరమ్మగారు *



లోకపితయగు పూజ్యబాపూజీ జన్మదిన యుత్సవ సందర్భంలో సమావేశమైన నేటి యీ మహాసభలో ఆయనను గూర్చి స్మరించుటకు నాకుఁగూడ నవకాశ మొసగినందుకు ఈ కార్య కర్తలకు నా ధన్యవాదములు.

అధ్యక్షమహాశయా! సోదరీ సోదరులారా!

గాంధీ మహాత్ముఁడు ఒక విషయము నను సరించి మాత్రమేకాదు మహాత్ముఁడయినది. ఆయన సర్వతోముఖ మహాత్ముఁడు. ఆయనతో పోల్చుటకు మరియొక మహానుభావుఁడెవరూ లేడనియే చెప్పవచ్చును. ఆయనకాయనయే సాటి.

ఆయన గొప్ప రాజకీయవేత్త, నీతిబోధ కుఁడు, సంఘసంస్కారి, అర్థశాస్త్ర నిపుణుఁడు, దీనులపాలిటి కల్పవృక్షము, దేశమునకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములను ప్రసాదించిన మహానాయ కుఁడు, అవతారమూర్తి.

ఇటువంటి మహనీయుఁడగు మహాత్ముని యుగములోని స్త్రీలస్థానము అనునది నా ప్రస్తుత ప్రసంగాంశము.

గాంధీజీ మహనీయుఁడగుటచేతనే అట్టి మహనీయుని జన్మకు మూలమైన స్త్రీమూర్తి యొక్క విలువను ఆయన చక్కఁగా గుర్తించారు. ఆయన తల్లి నపరిమితంగా గౌరవించే వారు. తాను పరదేశములో నున్నప్పుడు తన దేశమును విడిచేముందు తల్లికిచ్చిన మూడు వాగ్దానములను మరచిపోక పాటించుటలోనే ఆయనకు తల్లియందెట్టి భక్తి గౌరవములున్నవో వెల్లడియగుచున్నది. తన పేరుతోపాటు, తన ఖ్యాతితోపాటు తన అర్ధాంగియైన కస్తూరిబా యొక్క పేరు ప్రఖ్యాతులు లోకములో శాశ్వ తముగా నుండునట్లు ఆమె పేరిట ధనమును వసూలుచేసి స్థాపింపఁజేసిన యనేక కస్తూర్బా సంస్థలే ఆయనకు భార్యయందుఁగల గౌరవ ప్రేమలను జాటుచున్నవి.

మహాత్ముఁడు సాత్విక నిరోధ సమరమును నడపుటకు స్త్రీనే ఆదర్శముగా తీసికొన్నారు. బలవంతుఁడు, సమర్థుఁడు, ధనవంతుఁడు, సర్వ స్వతంత్రుఁడు, స్వేచ్ఛా విహారియైన పురుషుని నిరంకుశత్వమును జయించుటకు అబల, అసమర్థు రాలు, పరాధీన, అస్వతంత్రురాలు అగు స్త్రీయే యే పద్ధతుల నవలంభించునో ఆ పద్ధతులవలననే గాని ప్రబల బల పరాక్రమవంతమగు బ్రిటిషు సామ్రాజ్య పారతంత్ర్యమునుండి విడివడి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను పొందుటకు మరియొక మార్గము అసంభవమని గ్రహించారు.

దేశమునకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములను సంపాదించుటలో, దేశమును ఔన్నత్యస్థితికి దెచ్చుటలో, స్త్రీ పురుషులిరువురూ కలసి పని చేస్తేనే తప్ప సాధ్యముకాదని తెలిసికొన్నారు.

అందులోనూ అసాధారణమైన, విలక్షణమైన, సాటిలేని, యీ సాత్త్వికనిరోధ సంగ్రామమును నడపుటకు పురుషులకన్న స్త్రీలే యెక్కువ సమర్థురాండ్రని యూహించారు. యుద్ధరంగమున పురుషులతో సమంగా స్త్రీలుకూడా నడుములు కట్టి ప్రవేశించారు. వారిని ముందు పెట్టుకొనే మహాత్ముఁడు సమరాన్ని సాగించారు.

అంతఃక్రితము పరపురుషునితో మాట్లాడుటే, పరపురుషుని యెదుటపడుటే తప్పని యనుకొనే స్త్రీలు, వీధి మొగమెరుగని స్త్రీలు, త్రాగుబోతులను జూచి భయపడే స్త్రీలు, పురుషులతో సమంగా వీధులలో నగర సంకీర్తనలు చేశారు. షాపులయొద్ద విదేశీ బట్టలను కొనవద్దని పికెటింగు చేసినారు. విదేశీవస్త్ర వ్యామోహమెంత యెక్కువగా నున్నవారైనను, స్వదేశీ బట్టలనిన యెంత అసహ్యించుకొనేవారైనను, స్త్రీలనిన యెంత నిర్లక్ష్యము, అసహన భావము కలవారైనను, ఎంత పెంకివారైనను, ఈ స్త్రీల యొక్క సాత్త్విక బోధవలన, దీనాలాపముల వలన ముగ్ధులై మానసిక పరివర్తన చెందునట్లు చేశారు. త్రాగుడు మాన్పుటకు నిర్భయముగా త్రాగుబోతుల యొద్దకువెళ్లి, హృదయములను కరిగించే తమ అనునయ వినయప్రార్థనలతో వారు సిగ్గుపడి తమ ప్రవర్తనను మార్చుకొన ప్రయత్నించునట్లు చేశారు. ఎంత గొప్పయింటి బిడ్డలైనను, ఎట్టి ఘోషా పద్ధతిలోనున్న వారైననూ, తమ వంశగౌరవమును, ఘోషాపద్ధతిని పాటింపక, ఐశ్వర్యవంతులమనే గర్వమును విడిచిపెట్టి సంగర రంగములో ప్రవేశించి లాఠీదెబ్బలు తిన్నారు, శత్రువులు చేయు అవమానములను భరించారు, జైళ్లకు వెళ్లారు, ఆస్థిపాస్తులను గొల్పోయారు, పలుకష్టముల పాలయారు. భారత స్త్రీలయొక్క ధైర్యసాహసములను, మనోబలమును, సహన శీలతను లోకమునకు ప్రదర్శించారు.

ఈ విప్లవములో, ఈ సంగరములో స్త్రీలు పురుషులు తాము పరస్త్రీలు పరపురుషులు అనే మాటనే మరచిపోయారు. ఒక కుటుంబములోని సోదరీ సోదరులవలెనే అన్యోన్య గౌరవ ప్రేమలతో కలసిమెలసి పనిచేశారు. స్త్రీ పురుషులకుఁగల సంబంధము ఒకటే తప్ప యిక వేరు లేదని యనుకొనే దేశీయులకు ఆ మానసిక వికారములు లేకుండా స్త్రీలు పురుషులు పవిత్రమైన గౌరవ ప్రేమభావములతో కలసిమెలసి పనిచేయుట యెట్లో చూపించారు. స్త్రీ పురుషులలో నిట్టి నైతిక పరివర్తన మేర్పడుటకు, స్త్రీలలో నింత వేగముగా నిట్టి ధైర్య స్థైర్య సాహసాది వీరోచిత లక్షణములు కలుగుటకు కారణము? మహాత్ముని నీతిబోధ, క్రమశిక్షణలే.

నేటి స్వతంత్ర భారతములో నాగరికతకు ప్రఖ్యాతిగాంచిన యే పాశ్చాత్య స్త్రీలు పొందని గౌరవపదవులను, ఉన్నతస్థానములను భారత స్త్రీలు పొందారు అంటే గాంధీ మహాత్ముని ఆశయములే కారణము. ఈ గాంధీ యుగములో మృదుమధురమై రసవంతమైన కవిత్వములోనే గాక, రాజకీయరంగములో కూడ ప్రవేశించి సంయుక్త పరగణాలకు గవర్నరై తన రాజకీయ

(16 వ పేజీ చూడుడు)

# ఆస్థానకవి సమ్మాన మహోత్సవ సమీక్ష

శ్రీ వాడ్రేవు జోగిపంతులుగారు

విజయవాడలో సెప్టెంబరు 17, 18, 19 తేదీలలో మద్రాసు ప్రభుత్వాంధ్రాస్థానకవి, శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి చరణులకు వైభవోపేతంగా సమ్మాన మహోత్సవం జరిగింది. ఆ మూడు రోజులూ విజయవాడ పట్టణమంతా కలకలలాడి పోయింది. ఏ సందులో చూసినా ఈ ప్రసక్తే; ఎవరి నోట విన్నా ఈ మాటే! మొదట శేషుమహల్లో అని ప్రకటించినా కార్యక్రమాలన్నీ గాంధీజీ మ్యునిసిపల్ హైస్కూలులోనే జరిగినవి. కాకినాడ పీఠికాపుర రాజ కళాశాల విద్యార్థిసంఘం తరఫునా, యువ సాహితీసమితి తరఫున ఈ సమ్మాన మహోత్సవాలలో పాల్గొనే మహదవకాశం నాకు కలిగింది.

ఆంధ్రదేశంలోని కవులు, రచయితలు, చిత్రకారులు, గాయకులు ఈ విధంగా ఒకేసారి సమ్మేళనం కావడం ఇంతవరకూ చూడలేదు. ఇక ముందైనా చూడ బోము కూడా! బసలకుగాను ఇచ్చిన గదులలో ఏ గదిలో చూచినా సాహిత్య గోష్టియే; సారస్వత చర్చలే! సమావేశానికి హాజరయిన వ్యక్తుల్లో అందరూ-కవో, రచయితో, గాయకుడో, చిత్రకారుడో, అయేవున్నట్టుగా కనబడ్డారు.

మొదటి రోజున అనగా 16వ తేదీ సాయంకాలము నాగస్వరకోవిదులు దాలిపర్తి పిచ్చిహరి సోదరుల మంగళాచరణంతో మహోత్సవాలు ప్రారంభమయినవి. సమావేశానికి శ్రీ గో ఆర్. బి. రామకృష్ణం రాజుగారధ్యక్షత వహించారు. తెలుగు భాషా సమితివారి ప్రదర్శనాన్ని శ్రీ కొంతి రామమూర్తిపంతులుగారు ప్రారంభిస్తూ, సమితివారి అవిరళకృషిని ప్రశంసించారు. ఆంధ్రపత్రికా గ్రంథ ప్రదర్శనాన్ని, శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు ప్రారంభించారు. ఈ సభలో నాగార్జున శిల్పం గురించి శ్రీ గుర్రం మల్లయ్యగారు ప్రసంగించారు.

17వ తేదీ ఉదయం 9 గంటలకు ఆంధ్ర కవి మూర్ధన్యాభిషేకం, మద్రాసు తెలుగు భాషా సమితి ఉత్సవం ప్రారంభమయినయి. శ్రీ దాలిపర్తి పిచ్చిహరి సోదరు మంగళాచరణంతో, శ్రీమతులు అనసూయ, సీత-"రావమా కవితా" అనే వింజమూరి శివరామరావుగారి గీతాన్ని చక్కగా పాడారు. తరువాత ఆస్థానకవి సమ్మాన సంఘాధ్యక్షుడు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు స్వాగతోపన్యాసం చేస్తూ, శ్రీ శాస్త్రిగార్ని ఆస్థానకవిగా ఎన్నుకొని ప్రభుత్వం ఎంతో సబబుగా ప్రవర్తించిందన్నారు. వీరిది ఎనిమిది పేజీల గ్రంథం. తరువాత మద్రాసు తెలుగు భాషా సమితి అధ్యక్షులు బెజవాడ గోపాలరెడ్డిగారు స్వాగత వచనాలు పలికారు. మద్రాసు ప్రభుత్వం ఆస్థానకవుల పట్ల ప్రధానోత్సవ సందర్భమున శ్రీ శాస్త్రిగారి తరఫున ఆ బిరుదు గౌరవాలన్నీ తాను స్వీకరించాననీ, ఇక్కడ మద్రాసు ప్రధానిగానే వున్నందున వారే శ్రీ శాస్త్రిగారికి సమర్పించ వలసినదని అన్నారు. తరువాత—శ్రీ శాస్త్రిగారిని సభా వేదికమీదికి తీసుకు రావడం, వారు కారులోనుంచి క్రిందికి దిగే పరిస్థితిలోనైనా లేకపోవడంచేత వారి శిష్యులు కారులోనికి ఎక్కి వారిని సాయం పట్టి బయటవున్న సింహాసనం మీద కూర్చుండబెట్టి—నలుగురు శిష్యులు నాలుగు కాళ్లూ మోస్తుంటే, ఒకరు ఛత్రం పట్టుకుని, మరొకరు చామరం వీస్తూంటే పిచ్చిహరి సోదరులు నాగస్వరం వాయిస్తూ ముందు నడుస్తూవుంటే, తమ ప్రియశిష్యులు కొందరు వివిధములైన పుష్పాలు వారిమీదికి జల్లుతూంటే—చూచే వారికి కన్నుల పండువు చేస్తూ-శ్రీ శాస్త్రిగారు సభావేదిక సమీపించారు.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఛలోక్తులతో చక్కగా ఉపన్యసించారు. శాస్త్రిగారు వ్రాసిన పద్యాలు రెడ్డిగారు చదువుతూంటే, శ్రీ శాస్త్రిగారు మైక్ అందుకొని తామే చెప్పారు రెండు మూడుసార్లు. శ్రీ శాస్త్రిగారి శతావధానం, మొట్టమొదట కాకినాడలో జరిగిందని, ఆ గౌరవం కాకినాడకే దక్కిందనీ, తదుపరి అనేక ప్రదేశాల్లో శతావధానాలు జరిపి, ఆంధ్రగీర్వాణ భాషలలో తమకు సములు

# ఆస్థానకవి సమ్మాన మహోత్సవ సమీక్ష

లేరని సవాల్ చేసారని ప్రశంసించారు. తదుపరి అరవ లిపిలో వున్న ఉపన్యాసాన్ని తెలుగున శ్రీ కుమారస్వామి రాజాగారు చదువుతూ, కవుల పరమైవున్న సాహిత్య సంపదను కొల్లగొట్టి ప్రజలందరకు పంచడమే ఆస్థానకవుల నియామకంలోని ఆంతర్యం అన్నారు. తరువాత—శ్రీ రాజాగారు ఆస్థానకవి బిరుదు, గౌరవాలను, పండిత శాలువను, వేయి రూపాయల చెక్కును శ్రీ శాస్త్రిగార్కి సమర్పించారు. తరువాత ఆంధ్ర దేశంలోని వివిధ సంస్థలు—కాకినాడ పీఠికాపుర రాజావారి కళాశాల విద్యార్థిసంఘం, కాకినాడ యువ సాహితీ సమితి మొదలైన సంస్థలు సమ్మాన పత్రాలు సమర్పించినవి. శాస్త్రిగారు తామింక కూర్చుండలేమని, ప్రత్యభినందన పద్యాలుచదివి వెళ్ళిపోయారు.

ఆనాటి సాయంకాలం సభలకు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అధ్యక్షతవహించారు. శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు సభను ప్రారంభిస్తూ, ఇట్లాంటి సభలకు కొన్ని కొన్ని విషయములు నేర్చుకుందామనే తాను వస్తాననీ తానేమీ చెప్పడానికి రాలేదని అన్నారు. నాటకాలపోటీలలో గెలుపొందిన వారికి శ్రీ ప్రకాశంగారు బహుమానాలు పంచిపెట్టారు. తరువాత శ్రీ శాస్త్రిగారు ఆస్థాన కవిగా నియమింపబడినందుకు అభినందిస్తూ, కాశీ కృష్ణాచార్యులు, చిలుకూరి నారాయణరావు, శివశంకరస్వామి, గడియారం వేంకటశేషశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మొదలైన వారు ప్రసంగించారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ పండిత పెమ్మెచ్చ సత్యనారాయణ రాజుగారు తమ కావ్యాలను వరుసగా శ్రీ శాస్త్రిగారికి, ప్రధాని కుమార స్వామిగారికి అంకితమిచ్చారు. తరువాత శ్రీ శాస్త్రి శిష్యులలో కొందరు శ్రావ్యంగా పద్యపఠనం చేశారు. తిరువాత, కౌన్సిల్ అధ్యక్షులు గౌ॥ రామకృష్ణ రాజుగారు ద్వారం వేంకటస్వామి నాయుడుగారి సమ్మాన సంచికను శ్రీనాయుడుగారికి శ్రీ సి. ఆర్ రెడ్డిగారి ద్వారా సమర్పించారు. తదుపరి శ్రీ నాయుడు గారు తమ బృందంతో ఫిడేలు వాయించారు. ఆ రాత్రి 11 గంటలకు నాటకాల పోటీలలో గెలుపొందిన బృందంవారు శ్రీ శాస్త్రిగారు రచించిన "పాండవోద్యోగ విజయాలు" నాటకం చక్కగా ప్రదర్శించారు. నాటకానికి వచ్చిన ప్రేక్షకుల్ని చూస్తే నేల ఈనినదా అన్నట్టుగావుంది. సుమారు 20 వేలమంది వచ్చారు!

ఆఖరురోజు 18 వ తేదీ ఉదయం—దక్షిణ దేశ కవి పండిత సమ్మేళనం జరిగింది. ఈ సమ్మేళనమునకు ఇతర ఆస్థాన కవులూ వచ్చారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ నాయకులు బూర్గుల రామకృష్ణరావుగారు ఈ సభకు అధ్యక్షత వహిస్తూ ఆంధ్రులంతా ఏకత్రాటి మీద నడవాలనీ, తెలంగాణా ప్రజలంతా విశాలాంధ్రలో కలవాలని ఆకాంక్షిస్తూన్నారని అన్నారు.

సంస్కృతాస్థానకవి ఉపన్యాసాన్ని శ్రీ జమ్ముల మడక మాధవరామ శర్మగారు తెనుగులోకి అనువదించారు. గిడుగు సీతాపతిగారు ప్రసంగిస్తూ, శ్రీ శాస్త్రిగారు తమ రచనలతో పాతకు భరతవాక్యం, నవీనతకు నాంది పాడారని అన్నారు. ప్రసంగించవలసిన వారింకా కొందరు వున్నప్పటికీ, కాలాతీత మవడంచేత మధ్యాహ్నానికి సభలు వాయిదా వేశారు.

మధ్యాహ్నం నిజాం ఆంధ్ర సారస్వత పరిషత్తువారు సమావేశం జరిపి నిజాం రచయితల్నందర్నీ ఎరుక పరచారు. తరువాత అల్పాహార విందుచేశారు.

సాయంకాలం ఆంధ్ర సారస్వత సభ జస్టిస్ చింతగుంట రాఘవరావుగారి అధ్యక్షతన ప్రారంభమయినది. మైసూరు ప్రధాని చెంగల్రాయ రెడ్డి ఆలస్యంగా వచ్చి, మధ్యలో ప్రారంభోపన్యాసం చేశారు. భావరాజు వేంకట కృష్ణరావు గారు చారిత్రకాంశాలు విపులీకరిస్తూ ప్రసంగించారు. తరువాత అచంట లక్ష్మీపతి, కవికొండల వెంకటరావు, శ్రీరంగం నారాయణ బాబుగార్లు ప్రసంగించారు. తరువాత దేవులపల్లి రామానుజరావు, గరికపాటి మల్లావధాని, పిలకా గణపతిశాస్త్రి ప్రభృతులు అభినందనలర్పిస్తూ ప్రసంగించారు.

రాత్రి 10 గం॥కు వేదాంతం జగన్నాథ శర్మగారు తమ బృందంతో భరతనాట్యం చేశారు. తరువాత భామా కలాపం జరిగింది.

వస్తారని అనుకున్న వారిలో గౌ. మాధవమీనన్, మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీశ్రీగారలు రాలేదు. కార్యక్రమంలో

## ఆస్థానకవి సమ్మాన మహోత్సవ సమీక్ష

శేషుండానే, నిడుదవోలు వేంకటరావు, పెద్దాడ రామస్వామిగారలు ప్రసంగించారు.

ఇతరములైన ఏర్పాట్లు అన్నిటికంటె మోడరన్ కేఫ్‌వారి భోజన సౌకర్యాలు మాత్రం చక్కగా వున్నవి. మూడు రోజులు షడ్రసోపేతంగా—హల్వా సేమ్యా మొ॥వాటితో పెట్టారు. సరిగాకూర్చుంటే 500 మందికంటె పట్టని శేషు మహల్లో సభలు జరుగుతవని ప్రకటించారు. ఆహ్వాన సంఘం వారు ఏమనుకున్నారో? జనాన్ని చూసి అన్ని కార్యక్రమాలూ మున్సిపల్ హైస్కూల్లోనే జరిగినయి. మూడు రోజులు కూడా—ఉత్సవ కార్య క్రమాలన్నీ ఆలిండియా రేడియోవారు రికార్డు చేశారు. ఏది ఏమైనా—ఆంధ్ర దేశంలోని అన్ని ఇతర పట్టణాలకన్న విజయవాడలో సభలకు హాజరయే వారి సంఖ్య తక్కువే! పోతే—నాటకాని కంటూరా—ఛీ! పెద్దసెట్టువారు ప్రదర్శిస్తున్నారు—రాకుండా వుంటారా!

ముఖ్యంగా అందర్నీ ఆకర్షించినది—కళా ప్రదర్శనమూ, భాషాసమితివారి ప్రదర్శనమూ చక్కటి చిత్రాలూ తాళపత్రాలూ ప్రదర్శించారు. తాండవకృష్ణ, బాపిరాజు, బాషినీడు, సీతాపతిగార్లదీ భారమంతా! ప్రకాశం, నార్లగారలు మూడురోజులు వున్నారు.

సమ్మాన మహోత్సవాలకి—మూల కారకులైన అయ్యదేవర కాళేశ్వరరావు, కాటూరి వేంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లకు యావదాంధ్రుల కృతజ్ఞతాభి వందనములు.

జీవితంలో మరుపురాని మహోత్సవాలు—చూచినవారు ధన్యులు!



(13 వ పేజీ తరువాయి)

చాతుర్యమును కూడా చూపకలిగింది సరోజినీ దేవి. భారతదేశము తరఫున రాయబారిగా వెళ్లి విదేశములలో తన ప్రతిభా కౌశలమును ప్రకటించుచు నక్షత్రమై ప్రకాశిస్తోంది విజయలక్ష్మీ పండిట్. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి, రాజకుమారి అమృతకౌరు మొదలగువారు మంత్రి పదవుల నలంకరించారు. శాసనసభలలో స్త్రీలు పాల్గొని పనిచేస్తున్నారు.

మూడు దశాబ్దములలో దేశీయ సంచలనము తోఁబాటు స్త్రీలలోఁగూడా నిట్టి యద్భుతమైన సంచలనమేర్పడింది. అంటే దీనికి మూలమెవరు?

కాని యిది చాలదు. ఎక్కడో ఒకరిద్దరు ప్రతిభావంతులైనంతమాత్రమున, ఉన్నత స్థానముల నలంకరించినంతమాత్రమున దేశము మహోన్నతస్థితికి రాజాలదు. పురుషులలో సగభాగమగు స్త్రీలుకూడా పురుషులతో సమంగా ప్రతిభ, విజ్ఞానము, హక్కు, అధికారము గౌరవములను పొందఁగలిగియుండాలి.

"A light on earth has been quenched,
But a star has been lit that will illumine
the universe, and the ages."

అని గాంధిగారిని గూర్చి యొక ఆంగ్లేయ పెద్దమనిషి అన్నాఁడు. ఆ మాట యదార్థము. ఆయన భౌతికశరీరము మననుండి వేరయినా ఆయన ఆత్మ మనయందరి హృదయములలోనూ ప్రకాశిస్తోనే యున్నది.

ఈ విషయమును మరచిపోక భారతీయులు ఆయన ఆశయములను నెరవేర్చెదరు గాక!

నమస్తే

[రాజమహేంద్రవరము విక్రమహాలులో 19-9-49 నుండి 2-10-49 వరకు జరిగిన గాంధీ మహాత్ముని 81 వ వర్ధంత్యుత్సవ సందర్భంలో ప్రారంభ దినమున యొసగిన యుపన్యాసము.]



ఏకాంకిక

* * *

# ఛత్రపతి శివాజీ

* * *

ఆర్. కె. రావ్.

[ఇది చారిత్రిక నాటకము—క్రీ. శ. 1627-80 ప్రాంతంనాటి మహారాష్ట్ర జాతీయ చైతన్యం ఇందులో చిత్రితం—నాటి జాతీయ వికాసానికి శివాజీ నాయకుడు—ఆనాటి దౌర్జన్య శక్తులను ప్రతి ఘటించి హైందవ జాతీయత నిలిపికొన్న విప్లవ వీరుడు—శివాజీ సాగించిన చారిత్రాత్మక ప్రతిఘటనా విశేషాలు కొన్ని ఈ నాటికలో ప్రదర్శితమగును.]

## రంగము ౧.

[క్రీ. శ. 1655 సంవత్సర ప్రాంతం—లోహఘట్ట దుర్గ సమీపంలో శివాజీ సైనిక శిబిరం శివాజీ—ఆసీనుడై ఉంటాడు]

ప్రతీహారి : (ప్రవేశించి) మహాప్రభూ! స్థానాపతి నేతాజీ ప్రభుసందర్శనార్థం వచ్చియున్నారు.

శివాజీ : ఓయీ! ప్రవేశపెట్టుము.

నేతాజీ : (ప్రవేశించి) మహానాయకా! మహారాష్ట్ర మహీపతీ! విజయోపేతులగు ప్రభువునకు ఇవే నా ప్రణామములు (నమస్కరించును).

శివా : స్థానాపతీ! మనకు విశేష ధన సహాయము చేసిన, దాతాజీ, పుత్రిక కాశీబాయితో, మొగలాయీల నిర్బంధమున నున్నట్లు వార్త వచ్చినది. మొగలుల దౌర్జన్యం విన్నావా?

నేతా : ప్రభూ! మొగలుల కండకావరము ఎక్కువైనది—ఏమి దౌర్జన్యము!—బీజపూర్, ఢిల్లీ సుల్తానుల సేనలు యుద్ధనైపుణ్యములేని వృద్ధులను నిర్బంధించుట చాల హాస్యాస్పదముగ నున్నది! వారికి పౌరుషము లేదు—ప్రగల్భ ప్రలాపములలో మొగలులే కడు ప్రవీణులు—ప్రభువుల ఆజ్ఞయైనచో తక్షణము దాతాజీని, కాశీబాయిని చెరనుండి విడిపించగలను—

శివా : నేతాజీ! అవసరములేదు—కాగల కార్యము గంధర్వులే చేసిరి—మన సైనికుడు గోపాలుడే వారిని విడిపించుకొని వచ్చినాడు సుమా! వారు హనుమంత దుర్గంలో సురక్షితంగా ఉన్నారు.

నేతా : ప్రభూ! మంచిపని జరిగినది! మొగలాయీ ప్రభువు పరిహాసమునకు పాత్రుడైనాడు—గోపాలుని నేర్పు ప్రశంసనీయముగా నున్నది!

శివా : మహారాష్ట్రులకు పౌరుష స్వభావము సహజ సిద్ధమైనది—కాని—మన విజయయాత్రకు ఆర్థిక సహాయము, ఆయుధసంపద లభ్యం కావడంలేదు!—ఒక్క దాతాజీ చేసిన ధన సహాయంతో, దక్కను, కొంకణాలలోని ప్రధాన దుర్గాలను మనం వశపరచుకొన్నాం—ఇప్పుడు ధరణికోట ముట్టడించుటకు మనకు ఆయుధములు లభించునా?

నేతా : ప్రభూ! మీరు చింతిల నవసరంలేదు—నేడు నాతో మన లోహ ఘట్టానికి వచ్చిన ఫిరంగి వర్తకుడు, మనకు ఆయుధములను అందచేస్తానని వాగ్దానము చేసినాడు—ప్రభువుల విజయ యాత్రకు, భవానీదేవి ప్రస

న్న వీక్షణమే అమేయ రత్షణము—మన వద్దనున్న మణి మయరాసులు వెచ్చించి ఆయుధాలను సేకరించాలి ప్రభూ! ఆజ్ఞయైనచో ధరణికోట ముట్టడికి తగిన సన్నాహములు చేసెదను—

ప్రతీ: మహాప్రభూ! ఎవరో ఫిరంగి వర్తకుడు దుర్గద్వారము వద్ద ప్రభు దర్శనార్థము వేచియున్నాడు.

శివా: (ఆత్మగతంలో) సమయమునకే వర్తకుడు వచ్చినాడు (ప్రకాశముగా) ప్రవేశపెట్టుము.

ఫిరంగి వర్తకుడు: (ప్రవేశం) ప్రభువులకు నమస్కారం— మహారాజా! నేను పోర్చుగీసు వర్తకుడ్ని—మా దేశం నుండి ఓడలో ఆయుధసామగ్రిని బొంబాయి నగరానికి తీసికొని వచ్చాను—కళ్యాణ దుర్గ రక్షణాధి పతులు ఈ ఆయుధములకు సరియైన వెల నీయలేదు—మార్గ మధ్యములో ప్రభువుల పరాక్రమ శక్తినిగూర్చి విని, ఆయుధములను తమకే విక్రయించుటకు నిశ్చయించుకొన్నాను కాబట్టి ప్రభువులు నాపై దయఉంచి...

శివా: సేనాధిపతీ! ఫిరంగి వర్తకుని వద్దనున్న ఆయుధములను సురక్షితముగా తానా దుర్గమున భద్రపరచి తగిన రక్షణసేనను నిలుపుము!

నేతా: చిత్తము! మహాప్రభూ!

(ఇరువురు నిష్క్రమింతురు)

## రంగము ౨.

(గౌరీఘట్టదుర్గం—సమీపంలో పాతాళ గంగ ప్రవహిస్తూ ఉంటుంది—భవానీ దేవి ఆలయం—విగ్రహం వద్ద పూజారులు, ఉచ్చైస్వరంలో "మాతారమ్ దుర్గామ్ మహాకాళీమ్ దశశస్త్రాస్త్ర ధారిణీం—గౌరీం మానసపంకజే భగవతీం భక్తేప్సదాం తాంభజే"—గర్భ గుడిలో గంటల శబ్దం—)

ఒక సైనికుడు: (ఆలయం ముందు నిలచి)—జయము! జయము! మహారాష్ట్ర ప్రభువులకు జయము!—తొలగండి—తొలగండి!—భవానీ దేవిని సేవించడానికి, శివాజీ ప్రభువు స్వయంగా వస్తున్నారు—

(దూరంలో అశ్వహేష)

(కోలాహలం తగ్గుతుంది)

శివా: (ఆలయంలో ప్రవేశించి)—హే జననీ!—భవానీ! పరమ పావనమైన నీపాద సన్నిధిలో, మా గురువు రామదాసుగారి ఆదేశానుసారం శత్రుసంహార దీక్ష స్వీకరిస్తున్నాను—"స్వదేశ భక్త పాలనీం భవానీం—నవ దూర్వాసదృశీం భజే భవానీం నమామి"—

(విగ్రహము ముందు ప్రణమిల్లును)

సైనికులు: (ఆలయ సమీపంలో) ఉచ్చైస్వరంలో— విశాల మహీమండల మండన మహారాష్ట్ర సామ్రాజ్యాధిపతీ! మొగలాయీ శత్రువిధ్వంసకా! మహారాష్ట్ర ధర్మరక్షకా!! విజయీభవ!

(దూరంగా) ప్రజలందరూ: జై! శివాజీ మహారాజుకి జై!

(నిశ్శబ్దం).

శివా: (స్వగతం) మొగలాయీలు రాజమాచి దుర్గాన్ని ముట్టడించినట్లు తెలుస్తున్నది— ఆ దుర్గాన్ని ముట్టడించి వశపరచు కోవాలి—మొగలు సైన్యాలు కళ్యాణ దుర్గం నుండి బీజపూర్‌నకు ధనరాసులు చేరుస్తున్నవని కూడా తెలుస్తున్నది—వెంటనే ధరణి కోట ముట్టడించాలి— నేతాజీని ఈ కార్యానికై నియోగించెదనుగాక!

(సమీపంలో ప్రజల కలకలం వినిపిస్తుంది—దేవాలయం లోని గంటలు శబ్దం మధ్యమధ్య వినిపిస్తుంది)

భటులు: (కోలాహలంగా)—సేనాధిపతి నేతాజీ ఆలయాభిముఖంగా వస్తున్నారు—అదుగో తొలగండి— (గుర్రపు గిట్టలశబ్దం)

ప్రజలు: (ఉచ్చైః స్వరంతో) మహారాష్ట్ర సేనాధిపతి నేతాజీకి జై! (కలకలారావం)

శివా: ఏమిటీ కలకలం? ఆలయ ద్వారం వద్ద ఏం జరుగుతున్నది?—అచట నిలుచున్నది నేతాజీయేనా? నేను తలపెట్టిన కార్యసాధనకై భవానీ కరుణించి యీతనిని పంపినట్లున్నది. కనుక దేవీచరణ సన్నిధిలోనే, నేతా

జీని ఈ పనికై నియోగించెదను గాక ! (స్వాగతంలో)
అవసరమైనచో స్వయముగా ధరణికోట ముట్టడికి బయలు వెడలెదను—

(గుర్రమునుండి దిగినశబ్దం)

నేతా : ప్రభూ ! నమస్కారం—ఆహా ! భవానీ ఆలయంలో ప్రభు దర్శనము నాకు లభించినది. నేడెంత సుదినము !—శత్రు స్థావరాలను ముట్టడించి వశపరచుకోవడానికి భవానీమాత అనుగ్రహించుగాక !

శివా : నేతాజీ : మొగలు సైన్యాలు కళ్యాణ దుర్గంనుండి బీజపూర్ వెడతున్నట్లు తెలుస్తున్నది—మన వద్దనున్న ఆయుధ సంపత్తిని వినియోగించి మనము ధరణి కోటను వశపరచుకోవాలి—నీవు యుద్ధసన్నద్ధుడవు కావాలి—నీకు దేవీ అనుగ్రహము లభించునుగాక !

(ఆశీర్వాదం)

నేతా : ధన్యోస్మి ! ప్రభువుల ఆదేశానుసారం దారుణమైన శత్రువిధ్వంసక శక్తులను నిర్మూలించి, మహారాష్ట్రమును శత్రునిర్ముక్తం చేస్తాను—ఇదే దీక్షా ప్రమాణం స్వీకరిస్తున్నాను—హే అంబికా ! భవానీ !! నీ పవిత్ర పాద పద్మ సన్నిధిని శత్రుసంహార దీక్ష స్వీకరిస్తున్నాను—సుస్థిర మహారాష్ట్రం ప్రతిష్ఠించడానికై నా సర్వస్వం ధారపోస్తాను—ఇది నా ఏకైకలక్ష్యం !

(ఒరనుండి ఖడ్గంతీసిన శబ్దం)

## రంగము ౩.

(లోహ ఘట్టదుర్గం—సమీపంలో హనుమంతదుర్గంలో దాతాజీ ప్రార్థనా నిమగ్నుడై ఉంటాడు—కొంచెం దూరంలో శైల పీఠంపై కూర్చొని కాశీబాయి పాడుతూ వుంటుంది.

గానం—(కాశీబాయి)

అహో !
ప్రణయ నాయకా
ప్రవిమల ప్రమోద
భువన మోహనా ! (అహో)
విజయ వైభవా
సుజన జీవనా !
సదమల ప్రణయ
హృదయ నాయకా ! (అహో)
కరుణింపవా !
పరిమళ వైభవ
తరుణ యవ్వనపు
సౌఖ్యము పొందే
సమయము రాదా ! (అహో)
సమాగమ యుత
ప్రమోద భాగ్యము
లేదా......రాదా
ప్రణయ నాయకా !
అహో.........

(గుర్రపు డెక్కల శబ్దం)

నేతా : (ప్రవేశం)—ఓహో ! ప్రియా — పాట ఆపి వేశావేం ?

కాశీ : ఏమీలేదు !—అశ్వహేష వినపడిందని—

నేతా : కాశీ ! నీ ప్రణయగానం చాలబాగుంది సుమా !

కాశీ : సరే లెండి—కలం ఖడ్గం పట్టగల నేర్పు మీకున్నది మీ కవిత్వం బాగుంటుంది—మీరు వ్రాసిన గీతం పాడండి— (వీణారవం)

నేతా : ప్రియా ! నా కవిత్వానికి విన్నాణంలేదు—కాని...

గీతం : (నేతాజీ)

ఓహో !
ప్రేయసీ !
ఒడలు మరచి
ఒదిగిన ప్రణయ
మాధురీ
హృదయ స్పందన
సుషుప్తి సౌఖ్యం
వరియింతువా ? ప్రేయసీ !
ఉద్యానాంతర

ఉష కిరణారుణ
విషయ విశేషం
ప్రణయ వైభవం
విసుగూ... వేదన
వివరం తెలియని
విలాస ప్రాభవం
వరియింతువా—ప్రేయసీ!
మృదుల మధుర
సన్నిభ
విభవాస్పద
పరిమళ మంజుల
పరీరంభ
సుఖజీవము
నిరసింతువా—ప్రేయసీ—
ఓహో! ప్రేయసీ!!

కాశీబాయి: ఎంత చక్కని గీతం! ఏమి భావన! ఏమి కవనం—ఖడ్గ చాలనం ఒక్కటే కాదు—ఈ గీతంలో ప్రణయధ్వానం స్ఫుటంగా ప్రతిధ్వనిస్తోంది.

నేతా: కాశీ! నీ సొబగూ, సొగసూ చూస్తే ప్రణయ ధ్వానం దానంతట అదే ప్రతిధ్వనిస్తుంది—

కాశీ: స్వాభావికమైన మీ ప్రేమ హృదయం కాంతా కర్షణాబద్ధమై యున్నది—మన ప్రేమోదంతం శివాజీ ప్రభువుకి కూడా తెలిసినది.

నేతా: ప్రభువు మనపైగల వాత్సల్యమునకు నిదర్శనముగా తానే, మన ఇరువురి పరిణయమునకు సమ్మతించినట్లు తెలుస్తున్నది. ఈ విషయం మీ తండ్రిగారు వెల్లడిచేసినారు సుమా!

కాశీ: ప్రభువునకు నా ధన్యవాదాలు—మన ప్రేమకు విఘాతంలేనప్పుడే ప్రేమలోకానికి ప్రగతిఉంటుంది—

నేతా: నీవు నిజం చెప్పావు—కళ్యాణ దుర్గం ముట్టడికి సన్నాహాలు చేయాలి—ఇది ప్రభువు ఆజ్ఞ—

కాశీ: మీకు నమస్కారం—

(నేతాజీ నిష్క్రమణ)

## రంగము ౪.

(కులగణపట్టణంలో దసరా మహోత్సవం సాగుతూ ఉంటుంది—ప్రజల కోలాహలం తగ్గుతూ ఉంటుంది—దూరంగా గర్భాలయంలోని గంటలశబ్దం).

ఒకరు: నేడు విజయ దశమి—దసరా మహోత్సవం చాల వైభవోపేతంగా సాగుతున్నది—కాని శివాజీ మహారాజు ఉత్సవానికి రాలేదట!

మరొకరు: శివాజీ ప్రభువు హఠాత్తుగా రాజఘట్టానికి వెళ్లారట—ప్రభువు ఆజ్ఞానువర్తియై నేతాజీ వేయిమంది వీరులతో నిన్ననే మన కులగణ పట్టణం చేరుకున్నాడు. కళ్యాణదుర్గంపై దాడికి సన్నాహాలు జరుగుతున్నవట!

ఒక: అవును—నేటి ఉదయం, నేతాజీ భవానీదేవిని సందర్శించి, సైనికులతో కళ్యాణదుర్గానికి పయనమైనాడు.

మరొ: ధరణికోట ఏమైనది?

ఇంకొ: మన మహారాష్ట్రుల వశమైనది—ఆబాజీ సహాకారంతో, నేతాజీ, మొగలు ఆక్రమణలోనున్న ప్రధానదుర్గాలను ఎన్నో వశపరచుకొన్నాడట—

ఒక: అయితే—కళ్యాణదుర్గం మనకు వశమవుతుందా!—

మరొ: అందుకు సందేహమా!—కళ్యాణ దుర్గం ఒక్కటే కాదు—శ్రీవర్ధనం, రాజమాచి దుర్గాలు కూడా మనకు వశమవుతాయి—

ఇంకొ: కళ్యాణదుర్గంలోని రక్షణ సేనలపై వెంటనే దాడి జరిగించాలి—

ఒక: నేతాజీ సైనికులతో అమరనాథ్ నగరం చేరుకుని, అక్కడనుండి ఆబాజీ సహాయంతో కళ్యాణ దుర్గానికి బయలుదేరాడట—

మరొ: మన సైన్యాలు శక్తివంతమైనవని తెలుస్తున్నది—

ఇంకొ: (పరుగెత్తుకొనివచ్చి) మొగలు సైన్యాలకు మహారాష్ట్రులకు, కొల్హాపురంలో యుద్ధం జరుగుతూందట—

మరొ : తాణాదుర్గంలో ఆయుధ పూజలో నిమగ్నులైన మన సైనికులంతా కళ్యాణదుర్గం ముట్టడికై బయలుదేరినారు—

ఒక : శత్రుసైన్యాలతో సంఘర్షణ కూడా విజయ యాత్రకు మంచి అవకాశం—

మరొ : అందువల్లనే బీజపూర్ నుండి కళ్యాణ నగరం వెడుతూన్న మొగలు సైన్యాలను భేదించి, శివాజీ ప్రభువు ధనరాసులను వశపరచుకొన్నట్లు తెలుస్తున్నది—

ఇంకొ : అందువల్లనే కాబోలు—ప్రభువు అకస్మాత్తుగా రాజఘట్టానికి వెళ్లినారు—

అందరూ : (ఏకగ్రీవంగా) మనసేనలకు విజయం నిశ్చయం—

"జై! శివాజీ మహారాజుకీ జై!

"హర! హర! మహాదేవ!!

(గంటల శబ్దం)

## రంగము ౨.

(ఉల్లాసనదీతీరాన్ని ఆనుకొని కళ్యాణనగరం ఉంటుంది. సమీపంలో శివాజీ శిబిరం—కళ్యాణదుర్గంలో మహారాష్ట్ర సైనికుల రక్షణసేన ఉంటుంది)—

(గుర్రపు గిట్టల శబ్దం)

శివా : (శిబిరంలోనుండి)—ఎవరక్కడ? ఎవరక్కడ—

ప్రతీహారి : ప్రభూ! నేతాజీ ఇటువచ్చుచున్నారు—

నేతా : (ప్రవేశం) ప్రభువులకు నా ప్రణామం—ప్రభూ! కళ్యాణదుర్గం రక్షణసేనలను పరీక్షించాలి—

శివా : నేతాజీ! నీ కార్య దీక్ష ప్రశంసా పాత్రముగానున్నది—ఆ బాజీ రాజసేవా పరాయణత్వాన్ని ఏమని వర్ణించగలము?

నేతా : ప్రభూ! తమకు అందజేయమని ఆ బాజీ ఈ లేఖ యిచ్చినాడు—

శివా : (లేఖ అందుకొని)— "విశాల మహారాష్ట్ర మహీమండలాధిపతులైన ఛత్రపతి శివాజీ ప్రభువులకు ఆ బాజీ ప్రణామములు—తమ ఆజ్ఞానుసారము, నేతాజీ సహాయముతో, కొంకణంలోని సైన్యాలతో కళ్యాణ దుర్గాన్ని ముట్టడించాము—దారిలో ఉన్న కోన దుర్గం కూడా మనకు వశమైనది—ముట్టడి సమయంలో, నేతాజీ ప్రదర్శించిన కార్యదీక్ష నిరుపమానమైనది—మొగలు సైన్యాలు ఆయుధ విసర్జన చేసినవి—గవర్నరైన ముల్లానా అహమ్మదును నిర్బంధంలో ఉంచడమైనది. ప్రభువుల ఆజ్ఞ లభించు వరకు, నేను నా అనుచరులతో మన కళ్యాణదుర్గ శిబిరంలోనే ఉంటాను— చిత్తగించవలెను—

(క్షణం ఆగి మంచి శుభవార్త! కార్య దీక్షానిరతులై రాజసేవాపరాయణులైన నేతాజీ, ఆబాజీలుండగా మహారాష్ట్రానికి విజయం లభ్యంకాక పోతుందా!...

నేతా : ప్రభువు అనుగ్రహామునకు కృతజ్ఞులము—

శివా : నేతాజీ! మనం తక్షణమే కళ్యాణ దుర్గానికిబయలుదేరాలి—

నేతా : చిత్తము! ప్రభూ!

(సైనికులు కోలాహలంగా నడుస్తున్న శబ్దం—మధ్యమధ్య హేషారవం—శివాజీ, నేతాజీలు అశ్వారూఢులై వెడలుతూ ఉంటారు—మార్గమధ్యంలో ప్రజలు శివాజీపై పుష్పవర్షం కురిపిస్తారు—)

(నిశ్శబ్దం)

సైని : (ఉచ్చైస్స్వరంలో) మహారాష్ట్ర మహీపతికిజై! కళ్యాణదుర్గాధిపతికి జై!!

ప్రజలు : హర! హర! మహాదేవ! శంభో!

(శంఖారావం)

కొందరు : (దూరంలో)

శ్లో॥ అరిశంఖకృపాణ ఖేటబాణాన్
సధనుః శూలకతర్జనీం దధానాం
భయదాం మహిషోత్తమాంగ సంస్థాం
నవదూర్వాసదృశీం భజే భవానీమ్.



# ఆహారసమస్య - మహిళల కర్తవ్యం

❋ సత్య ❋

[శ్రీ సత్యగారు వ్యాసములో వివరించినట్లు ఆహార సమస్య ఈ నాడు ప్రపంచమంతటిలో, అందూ ముఖ్యముగా మన హిందూదేశములో కడు తీవ్రరూపమును దాల్చినది. ఎంతవరకూ దొరకని వస్తువులకై కనిపెట్టుకొని కూర్చుండుట గాని, వానిని లభింపజేయ నేరమికి ప్రభుత్వమును పదేపదే దూషించుటగాని, సమర్థతను చాటదు. ఉత్పత్తిని వృద్ధిజేయుట ఉత్తమోత్తమమే యయ్యూ, ఫలలబ్ధికి కాలవ్యాపనయగును గనుక, యింతలోగా సులభముగా లభ్యమగు పదార్థములను, ఆహార విలువనుబట్టి, వరిగోధుమలకుబదులు వినియోగించుట ప్రస్తుత కర్తవ్యము. ఇది మహిళల ముఖ్యకర్తవ్యమని వేరుగ చాటనక్కరలేదు. ఈ విధానములలో చక్కని యనుభవము గల ధీరలు, తమతోటి సోదరీమణుల ఉపయోగమునకై తమకు తెలిసిన విజ్ఞానమును, మా మహిళ 'పాకకళ' శీర్షిక ముఖంగా వ్యాప్తిని జేయవలసినదిగా, శ్రీ సత్యగారి కోర్కెను బలపరచుచూ మనవి చేయుచున్నాను.]

—సం॥

"మాటలు కోటలు దాటుతాయి, చేతలకి మాత్రం చేతుల్లేవవు" ఇది నేటి మన పరిస్థితి. ఏ వ్యక్తిని పరిశీలించండి, ఏ సంఘాన్ని తిలకించండి, ఇదే విషయం బోధపడుతుంది. ఏ రాచకీయ నాయకుని ఉపన్యాసాన్ని విన్నా, ఆచరణా విధానాన్ని పరిశీలించినా, వారి ఆశయాల్ని ఎంతవరకూ ఆచరణలో పెడుతున్నారో పెట్టగలుగుతున్నారో, తెలిసికోవచ్చు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి, చూస్తే దేశానికిక మోక్షమేలేదేమో, అనిపిస్తుంది.

'భారత ప్రధాని' ప్రబోధిస్తున్నారు, ప్రపంచ ఆర్థిక వేత్తదలందరూ ఘోషిస్తున్నారు. భారత మాత స్వయం సమృద్ధి కాజాలని పక్షంలో, ఆహార సమస్య దృష్ట్యా సర్వ నాశనం తప్పదు. ఆనక చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదు" అని. ఒక్క రాజకీయవేత్తకు ఒక్క మంత్రి మాన్యునికీ, ఒక్క భారతీయునికీ, చీమ కుట్టినట్లు లేదు. ఈ విధంగా అన్ని సమస్యల నలక్ష్యం చేసినట్లే ఆహార సమస్యను కూడ నిర్లక్ష్యము చేశామా, తదుపరి ఈ జాతీయ ప్రభుత్వము శవాలను, స్మశానాలను, పరిపాలించవలసి యుంటుంది. ఇట్టి మహోపద్రవ పరిస్థితిలో ప్రభుత్వము, ప్రమత్తతతో ప్రవర్తిస్తూంటే, ప్రజలే ప్రభుత్వ కర్తవ్యాన్ని ప్రభోదించాలి. నిద్రాముద్రణమైన ప్రభుత్వానికి మేల్కొలుపులు పాడాలి. ఇందుకు ప్రతి ఒక్క భారతీయుడు నడుము కట్టాలి. శపథం చెయ్యాలి. తను ఉపయోగించే ఆహార పదార్థాలను ప్రమాణాన్ని తగ్గించుటే ఒక వీర కృత్యముగా భావించాలి. కోట్లాది భారతీయులను, సోదరులను క్షామ పీడనుంచి కాపాడడమే దేశభక్తికి తార్కాణముగా పరిగణించాలి. ఈ విధంగా ఆహార సమస్య నెదుర్కోవడానికి చేసే సాముదాయక కృషిలో తన భాగ్యాన్ని గుర్తించి ప్రతి భారతీయుడూ ప్రవర్తించి నపుడే, ఈ క్లిష్ట పరిస్థితులనుండి నిర్గమించగలము. ఈ సాముదాయక కృషిలో మహిళల పాత్ర అతి ప్రాముఖ్యమైనది. మహిళా సహకారము లేనిదే ఏ సమస్యా, ముఖ్యముగా ఆహార సమస్య పరిష్కరించబడదు.

అసలు ఆహార సమస్య దృష్ట్యా ప్రజలను రెండు విధాలుగా భాగించవచ్చు. ఒకరు ఉత్పత్తి దారులు, వేరొకరు కొనుగోలు దారులు. ఉత్పత్తి దారులు తమ ఉత్పత్తిని హెచ్చించి, కొనుగోలుదారులు తమ ఖర్చును పొదుపుగా చేసికొని ఆహార పదార్థాల వాడకాన్ని తగ్గిస్తే, ఆహార సమస్య వెంటనే అతి సులభంగా పరిష్కరింప బడుతుంది

# ఆహారసమస్య-మహిళల కర్తవ్యం

ఉత్పత్తి దారులుగాను కొనుగోలు దారులుగాను మహిళల పాత్ర అతి ముఖ్యమైనది. కనుక, పెద్ద పెద్ద రాజకీయ వేత్తలు పరిష్కరించ లేక తలలు బ్రద్దలు చేసికొంటున్న ఆహార సమస్య, మహిళలు నడుంకడితే వెంటనే పరిష్కరింపబడుతుంది. ఇది నగ్న సత్యం. అందువలన మహిళామణు లందరూ ఆహార సమస్యా పరిష్కారానికి తామవలంబించ వలసిన విధానాలను గుర్తించి, ఆచరించినట్లైన, తమ సంసారాన్ని క్షామంనుండి కాపాడేభాగ్యము తమకేదక్కుతుంది— అది తమకు గర్వకారణం. అందుకుగాను మహిళ లందరూ కొన్ని ప్రాథమిక విషయాలను గుర్తించాలి!!

ప్రప్రథమమున గుర్తించవలసినది, ఆహారసమస్య జాతికంతకూ సంబంధించినది కాని వ్యక్తిగతమైనదికాదు. అనే విషయం. కనుక అహార సమస్యా పరిష్కారములో జాతియొక్క సాముదాయక కృషి అత్యావసరము. "నా ఒక్కరి వలన పరిష్కరింపబడుతుందా?" అని ఆలోచించుట వివేక రహితము. ఎవరిమట్టుకి వారు సహకరించండి—సమస్యా పరిష్కారమెందుకు కాదో చూదాము. 1951 నాటికి దేశం స్వయం సమృద్ధికావాలంటే ప్రజలు కొంత వరకూ త్యాగం చెయ్యవలసిన అవసరం ఉంది. తమ ఆహార పదార్థాల్లో 'వరి' 'గోధుమ' వాడకాల్ని తగ్గించాలి. దేశానికి కావలసిన వరి గోధుమల్లో నేడు నాలుగు మిలియను టన్నులకొరత ఏర్పడిఉంది. ఈ కొరత పూర్తి కావాలంటే వరి గోధుమ పంటలు అభివృద్ధి చెందాలి. నిస్సారవంతమైన భూములకు బలం చేకూర్చి, సారవంతముచేసి సాగుచేసి పంటపండించాలి. అందుకుగాను నీటివసతి కల్గించాలి. కాని ఈ పని అంతా ఒక్కమాటు జరిగేదికాదు. కొన్ని సంవత్సరాలు ఓపిక పడితేనేగాని, వరి గోధుమలధికంగా పండించలేము; కాని 'వరి' 'గోధుమ' అధికోత్పత్తి కోసం, యోచిస్తూ కూర్చున్నామంటే "ఇల్లు కాలిన తర్వాత నుయ్యి తవ్వడానికి పంచాగం తిరగవేసినట్లు"వుతుంది. కనుక ప్రస్తుత పరిస్థితుల్లో 'వరి' 'గోధుమ' వాడకాల్ని తగ్గించడమే వివేకవంతము. కాని శరీరానికి కావలసిన అన్ని ఆహార పదార్థాలలోనూ ఏ ఒక్క పదార్థం లోటయినా, శరీర శక్తి క్షీణిస్తుంది. తద్వారా జాతి నిర్వీర్యమౌతుంది. కనుక ఆహార సమస్య పరిష్కరింపబోయి శరీరానికి కావలసిన పిండి పదార్థములు, మాంస కృత్తులు, లవణములు, నీరు, విటమినులులో ఏ ఒక్క పదార్థాన్ని తగ్గించినా మన ఆశయానికే విఘాతం కలుగుతుంది. 'వరి' 'గోధుమలు' తగ్గిస్తే శరీరానికి కావలసిన పిండి పదార్థం లభ్యం కాదు. కనుక వాటిని భర్తీచేసుకోవాలంటే ఎలాగ?

"చిలగడదుంపలు, వేరుసెనగపప్పు శరీరానికి కావలసిన పిండిపదార్థాన్ని సమకూర్చి పెడతాయ"ని పదార్థ పరిశోధకులు వక్కాణిస్తున్నారు. కనుక వరి గోధుమ వాడకాలను తగ్గించి వాటికి బదులు చిలగడ దుంపలు, వేరు శెనగ వాడినట్లైన, ఉభయతారకంగా పనిజేస్తాయి—ఇటు వరి, గోధుమలు లేని లోటును పూర్తి చేయవచ్చు—అటు శరీరానికి కావలసిన పదార్థాన్నీ సేకరించవచ్చు. పైగా చిలగడదుంప, వేరుశెనగ పంటలు అతి త్వరితంగానూ, అధికంగానూ కూడ పండుతాయి.

కనుక మహిళలు వరి, గోధుమ వాడకాలనుతగ్గించి వాటికి బదులు చిలగడదుంపలు వేరుశెనగనువాడి దేశాన్నీ, సంసారాన్నీ రక్షించుకోవాలి. రుచ్యంగా చేస్తే చిలగడ, వేరుశెనగల వంటచేతనే, భర్తను మెప్పించి, పిల్లలకు ఆశక్తి పుట్టింపజేసి, తన ఆశయాన్ని సిద్ధింపజేసుకోవచ్చు. (ఇందుకుగాను ఏ మహిళా సోదరియైనాసరే, "పాకకళ" శీర్షికలో చిలగడ వేరుశెనగ ఉపయోగాలు వాటితోచేసే వంటక విధానాలను వివరించి సహకరిస్తారని ఆశిస్తా!)

ఆహార పదార్థాల మార్పు విషయంలోనే కాకుండా వాటిని వండివడ్డించే విధానంలో కూడా అతి జాగ్రత్తగా పొదుపుగా వ్యవహరించాలి. పదార్థాలను తన కుటుంబానికి సరిగా సరిపడే విధంగా వండటం, ప్రతి మహిళా అభ్యసించాలి. క్షమిస్తే, అమితంగానూ అధికంగాను వండి పెంటల మీద పోసి ఆహార పదార్థాలను దుర్వినియోగం చేసేది, ధనిక కుటుంబాలకు చెందిన మహిళలే! తీరిక సమయాల్లో అనవసరమైన సంభాషణలకు స్వస్తి చెప్పి, దొడ్లో ఏ కూరగాయచెట్లో, పాదులో పెట్టి మహిళలు తమ యోపిన కొలది అధికాహారోత్పత్తిని చేయవచ్చు.

ఈ విధంగా మహిళలు నడుంకట్టి దొడ్లలో పాదులు

పెంచి, వరి గోధుమ వాడకాన్ని ఆహార పదార్థాల వాడకాన్ని తగ్గించి పొదుపుచేస్తే ఆహార సమస్య పూర్తిగా పరిష్కరింప బడుతుంది. మాటలవలన, ఉపన్యాసాలవలన, వ్యాసములవలన ఆహార సమస్య పరిష్కరింపబడదు. నిర్మాణకార్యక్రమం జరగాలి—లేనినాడు నాశనమై పోతాము. తిండి లేక అల్లాడిపోతాము. కనుక జ్యోతిర్మయమైన ఈ దీపావళినాడు శపథం చెయ్యండి! "ఆహార సమస్యా పరిష్కారంలో మా కర్తవ్యాలను మేము నెరవేరుస్తాము"ని— ఆ నాడు 'సత్యభామ' నరకాసురుని బాధనుండి దేశాన్ని తప్పించింది. నేడు మీరు క్షామరాక్షసి ఇనుప పిడికిలినుంచి దేశాన్ని రక్షించండి! ఏ నాటికైనా మహిళా సహకారం లేనిదే మహత్తర కార్యాల్ని సాధించలేరని ప్రపంచమంతా చాటండి లేవండి! మహిళా మణులారా!! లేచి ఆహార సమస్యాపరిష్కారానికి నడుములు బిగించండి!!!



# దాంపత్యము

విరులలో సౌరభము
వెల్లి విరిసిన యట్లు,
మాటలో యర్థంబు,
మణగి యున్నట్లు,
తంత్రిలో నాదంబు
దవిలి యున్నట్లు
గీతిలో భావంబు
గులుకు చున్నట్లు,
ఒండొరుల భావంబు
లొక్కటై పొలుపొంద
అదిగదా దాంపత్య
మాదర్శమై యుండు.

కనక సౌధంబులు
కలిగి యుండిన నేమి,
తులలేని భాగ్యముల
తూగుచుండిన నేమి,
సతి రతియైననూ
ధవుడు మన్మథుడైన
మనసులు వేరైన
మహి నేమి సుఖము?

ఇహపరంబుల త్రోవ
యిల్లాలు యనియెంచి,
వంశవృద్ధికి మార్గ
మువిదయే యనితలచి,
సిరులకు మూలంబు
సతియె యౌనంచు
గౌరవంబున చూడ
గలుగునాతడె ధవుడు.

పతియె తనువు ధనము
పతియె తనకీ జగము
పతియె సకలంబంచు
సతి యెంచవలయు.

తామె యధికులమంచు
తామస పడక
సతిపతు లిరువురు
సమమని తలచుచు
నిట్టి భావములున్న
దంపతులు తాము
అనురాగ సంద్రంపు
అలల నూగెదరు.

చుండూరి రమాదేవిగారు





బాలానందము

కుమారి శ్రీపాద గాయత్రి

# మా జానీ

నాకో కుక్కపిల్ల వుంది. దానిపేరు 'జానీ.' తెల్లటి ఒళ్ళు, నల్లనల్లటి మచ్చలూ — అది చాలా అందంగా వుంటుంది. అదంటే నాకెంతో ఇష్టం. రోజూ పొద్దున్న నేను చదువుకుంటూ వుంటే ఏదో తెలిసినట్లు వింటూ కూర్చునేది. బడి వేళ అవగానే ఇంత సేపూ బుద్ధిగా కూర్చుని వున్న జానీ, అవీ ఇవీ తీసి అల్లరిచేసేది. పక్కనే వున్న రమ ఇంటికి వెళ్ళి అరిచేది. దాని అరుపు వినగానే రమ మా ఇంటికి వచ్చేది. రమ, నేను కలసి బడికి వెళ్ళేవారం.

రమ నా తరగతే. మా ఇంటిపక్కనే వాళ్ళ ఇల్లు. రమకు, నాకు ఎంతో స్నేహం. రమకి మా జానీ అంటే ఎంత ఇష్టమో ఇక చెప్ప లేము. మేము సరిగ్గా బడిలో కాలు పెట్టేసరికి గంట కొట్టేవారు. మేము సరిగ్గా బడి వేళకి వచ్చినందుకు స్నేహితులందరూ ఆశ్చర్యపడే వారు. నేను, రమా మా జానీని గురించి చెప్పేసరికి వారొక్కొక్కరు "నాకు జానీలాంటి కుక్క పిల్లవుంటే ఎంత బాగుండును?" అని అనుకొనేవారు. సాయంత్రం బడినుంచి రాగానే నేను, జానీ, రమ కలసి బీచికి వెళ్ళేవాళ్ళం. ఇంకా బీచికి స్నేహితు లెందరో వచ్చేవారు. వారందరూ జానీని చూచి ముచ్చటపడేవారు. అందరం బంతి ఆడేవారం. బంతి దూరంగాపడితే మా అందరికంటే ముందుబంతి నోటితో పట్టుకొచ్చేది. ఈ విధంగా రోజూ దానితో ఆడుకునేవాళ్ళం.

ఒకరోజు నేను బడినుంచి రాగానే జానీ ఎదురు రాలేదు. ఎందుకా అనుకుంటూ లోపలికి వెళ్ళేను. జానీలేదు. ఇల్లంతా వెతికేను. రమ కూడా వచ్చి నాకంటే ఖంగారుగా వెతికింది. బీచికివెళ్ళి చూసేము. లేదు. బడిదగ్గర మాకోసం చూస్తోందేమో నని చూసేము. లేదు. చీకటి పడింది. ఎంతో వెతికేను, కనిపించలేదు. ఎంతో ఏడ్చేను. అన్నం తిననన్నాను. అమ్మ తిట్టింది. ఏదో సయించక పోయినా అమ్మ పోరువల్ల మూడు మెతుకులు ముట్టించు కున్నాను.

మర్నాడు రమరాలేదు. నేను కూడా పిలవ లేదు. ఒక్కర్తినే బడికి వెడుతున్నాను. మనస్సు ఎలాగోవుంది. ఇంతలో ఎక్కడినుంచో రమ ఒగర్చుకుంటూ పరిగెత్తు కొచ్చింది. మొహం చూస్తే చాలా సంతోషంగా వుంది. రమ నా దగ్గరకొచ్చి "నేను జానీని చూచేను. దాన్ని ఒక లారీలో పెట్టి కుక్కల వాళ్ళు తీసు కెడు తున్నారు. ఈ కుక్క మాది ఇవ్వండి అంటే వాళ్ళు 'పెంపుడుకుక్కకి మెడలో పట్టీ వుంటుంది దీని కదిలే'దని నమ్మకుండా తీసుకెడుతున్నారు. ఎక్కడికంటే మునిసిపల్ ఆఫీసుకన్నారు. నన్ను చూసి జానీ ఎలా అరచిందో! పాపం! రా అడు గుదాం" అంది.

నాకు మొన్న పట్ట తెగి పోతే తీసి వేసిన సంగతి జ్ఞాపకమొచ్చింది. వెంటనే ఇద్దరము పరి గెత్తి అక్కడికి వెళ్ళేము. జానీ లారీ లోంచే నన్నుచూసి ఎంతో అరచింది. కొంత సేపట్లో ఎవరో ఇద్దరు లారీవాళ్ళు వచ్చేరు. వాళ్ళని "ఇది నా కుక్క. నిన్ననే తప్పిపోయింది. ఇవ్వ రూ ?" అని అడిగేను. వాళ్ళు "ఇది పిచ్చిది. దీన్ని చంపేస్తారు" అన్నారు. "అయ్యో ఇది పిచ్చిదికాదు. మా జానీ. నాకివ్వండి" అని అడి గేను. కానీ వారు "అమ్మాయీ, మేము ఈ కుక్కని వాళ్ళకిస్తే వాళ్ళుమాకు ఒక రూపాయ ఇస్తారు. నీ కుక్క కావాలంటే రూపాయిమాకు ముందు ఇచ్చి మరీ తీసికెళ్ళు", అని ఖచ్చితంగా చెప్పేశారు. నేను "వుండండి పట్టుకొస్తాన"ని రమని అక్కడే నిలపెట్టి ఇంటికి పరిగెత్తేను.

లోపలికి వెళ్ళి అమ్మతో చెప్పి రూపాయి ఇయ్యమన్నాను. అమ్మ "దీనికోసం బడి మాను కొని ఇంతదూరం వచ్చేవా ? వెధవ కుక్కపిల్ల కోసం రూపాయి తగలేస్తానంటూ వేమిటే ? మరీ పొగరెక్కి ఏడుస్తున్నావు ?" అని మొదలెట్టింది. అమ్మ కొంచం పల్లెటూరు పిల్ల. పట్నవాసంలో వున్నా కొంచం ఆ అంశంపోలేదు. కుక్కకంటే రూపాయి విలువగా తోచింది, అమ్మకి. ఇక లాభంలేదని నాన్నగారి దగ్గరకెళ్ళి అడిగేను. నాన్నగారు అడగ్గానే రూపాయిఇచ్చి "త్వరగా వెళ్ళు జానీ ఏమైనదో" అని హెచ్చరించేరు. సంతోషంతో పరిగెత్తేను. ఆఫీను కొంతదూరం లోవుందనగా రమ విచార ముఖముతో ఎదురు వచ్చి "వారు నువ్వు రావడం ఆలశ్యమైనదని, ఇక నువ్వు రావని, నిశ్చయించి నేనెంత మొర పెట్టినా వినలేదు. నా కాళ్ళు గట్టిగా పట్టుకొని వున్న జానీని, నన్ను ఏడిపించి బలవంతగా లోప లకి తీసుకు వెళ్ళేరు. త్వరగా రా. సమయం దాటిందంటే చంపేస్తారు." అని చెప్పి నాతో సరిగా పరుగెత్తింది.

ఇద్దరం ఆఫీసు దగ్గర కొచ్చేము. అక్కడ ఒకడు "లారీలో కుక్కలను ఆ గది దగ్గరకి తీసు కెళ్ళేరు. వేగిరం వెళ్ళి నీ కుక్కని తెచ్చుకో" అన్నాడు. కాళ్ళకి వీలైనంతత్వరగా పరిగెత్తేము. ఇకగది 4 గజాల దూరంలో వుందనగా ఆఖంగా రులో ఏదో తగిలి ముందుకు పడ్డాను. లేచి చూచే సరికి పట్టరాని దుఃఖము వచ్చింది. రమ అలాగే నిల్చుని పోయింది. కళ్ళల్లోనించి నీరు వస్తోంది. నేను దుఃఖము ఆపుకోలేక పోయాను. అది మా జానీ కళేబరము.



# క్విజ్

ఈ క్రిందవున్న ఒక్కొక్క ప్రశ్న క్రింద, 3 జవాబులున్నాయి. వాటిలో ఏదో ఒకటే సరియైనది. అది ఏదో తెలిసికోండి.

1. ప్రపంచములో ఏ మతమువారి జనాభా ఎక్కువగా వుంది?

(1) హిందూ. (2) క్రైస్తవ.
(3) బౌద్ధ.

2. ఫౌంటను పెన్నును ఏ దేశస్థుడు కని పెట్టాడు?

(1) అమెరికా. (2) ఇంగ్లాడు.
(3) చైనా.

3. ప్రపచంలోని దేశాల్లో అధిక జనసంఖ్య గల దేశం ఏది?

(1) అమెరికా. (2) చైనా.
(3) ఇండియా.

4. మద్రాసు రాజధానికి శీతకాలపు రాజధాని నగరు ఏది?

(1) కూనూరు. (2) కొడైకెనాలు.
(3) ఉదకమండలము.

5. 1939 సం॥ న అఖిల ఇండియా కాంగ్రెసు ప్రెసిడెంటు ఎవరు?

(1) రాజేంద్ర ప్రసాద్. (2) పండిత నెహ్రూ. (3) సుభాస్‌బోస్.

6. మొట్ట మొదటి తెలుగు ఫిలిం ఏది?

(1) ప్రహ్లాద. (2) శకుంతల.
(3) పాదుకా పట్టాభిషేకము.

(1) క్రైస్తవ. (2) అమెరికా. (3) చైనా. (4) ఉదకమండలము.
(5) సుభాస్ బోస్. (6) ప్రహ్లాద.



# చిక్కు ప్రశ్న

ఆరు (6) రబ్బరు బంతులున్నవి. చూచుటకు అన్నియు ఒకే మాదిరిగా నున్నవి. ఐదింటి బరువు సమానమేగాని, ఒక్కబంతిమాత్రం, మిగతవానికన్నా కొద్దిగా తేలిక.

ఒక త్రాసునుమాత్రం, రెండేసార్లు ఉపయోగించి, ఆ బరువు తక్కువ ఉన్న బంతిని కని పెట్టాలి. ఆలోచించండి మరి.

కూర్పు : చిరంజీవి సుభాషిణి

# ఆగస్టు 15

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవి

దండపాణి దేశిగర్ స్వాతంత్ర్య గీతాల్ని అద్భుతంగా ఆలాపిస్తున్నాడు. మధ్యమధ్య కాస్త ఓమాదిరిగా వున్నా, మా రేడియో, స్వతంత్రోత్సవం నాడు తన విధిని త్రికరణ శుద్ధిగానే నెరవేరుస్తూవుంది.

మహా స్వతంత్రుల్లా మావాళ్లు లిటరేచర్ హుషారుగా ఆడేస్తున్నారు, మధ్య మధ్య "అమ్మా! సుబ్బలక్ష్మి పాట వచ్చినప్పుడు చెప్పేం" అంటూ. పిచ్చివాళ్లు! సుబ్బలక్ష్మి పాట వచ్చిందని చెప్తేనేగాని తెలియనపుడు గాన కోకిల పాట అయినా ఒకటే, గమళ్ల గంగమ్మపాట అయినావకటే ఆనందం. పేకాటలో సీటివ్వలేదని అలిగారు చెల్లెళ్లు. అవతల గదిలో కూర్చుని, "ఆంధ్ర రాష్ట్రము మనదేనోయ్" అని అతి సీరియస్‌గా పాడుతున్నారు, ఆదిలో అక్కర లేదన్న మదరాసు, మళ్ళీ కావాలని మదనపడుతూన్న మన ఆంధ్రత్వాన్నంతా జోడించి.

అపుడే మా భోజనాలయి, ఆంధ్ర పత్రికా, రిపబ్లిక్ భారతి దగ్గరపెట్టుకుని కూచున్నా రేడియోదగ్గర. పొద్దుటి నుంచీ విశ్రాంతిలేదు. శరీరం అలసి పోయింది. ఎదుట కుర్చీలో పడుకుని చదువుతూంది మా అమ్మ. ఆంధ్ర రాష్ట్రోద్యమం పూర్వాపరాలూ, భగ్నజీవి కథానికా, ఇరిగేషన్‌స్కీము, ఇత్యాదులన్నీ ఓసారి తిరిగేసా. ఆంధ్రోద్యమారంభంలో మనవారికి మదరాసు సంగతే పట్టలేదు. దాని అవసరం, పుట్టుపూర్వోత్తరాలు, దానిమజా, ఇప్పటికి తెల్సికుని మధనపడుతున్నాం. రిపబ్లిక్ తీశా. "అదేమిటే అమ్మా! "ఓ బాపూ, స్వతంత్ర భారతిలో నీ అవసరంచాలా ఉంది సుమీ" అని వ్రాశారు?

"బాపూజీ భౌతిక శరీరాన్ని విడచినా, మనం వారిని శాంతముగా వుండనీయదలచ లేదు. బాపూజీ ఇంకా ఏం చెయ్యాలే మనకు? మనవాళ్లు అన్నంపెడితే తినలేరు. ఇంకా కలిపి తినిపించాలి కాబోలు!" అన్నాడు మా తమ్ముడు గెల్చిన అరటిసెట్టు దగ్గరపెట్టుకూంటూ. 'The Relentl‹ss Mother' చదువుతున్నా. కథబాగానే నడుస్తూంది. ఎటొచ్చీ, ఈ దినంస్వతంత్రదినం. అసభ్యశృంగారం, అందులో నాయిక దేవతామూర్తి. ఆంగ్లంలో కథ. కథేమో పూర్తి చేశాను. మా అమ్మ నవల చాలా సీరియస్‌గా చదివేస్తోంది. మావాళ్లు మధ్య మధ్య 'స్వతంత్రదినమోయ్' అంటున్నారు.

ఏమిటో! 20 వ శతాబ్దంలో సగం గడుస్తుంది. ఇండియాకు స్వరాజ్యంవచ్చింది. మానవుడు ద్రష్ట లిఖితమైన ఈ సృష్టి మహా గ్రంథంలో ఆటం అధ్యాయం ఆరంభించాడు. కాని, మనం మాత్రం, 'మానవులు రావచ్చు, మానవులు పోవచ్చు—అయితే ఎప్పటికీ నాదారి నాదే' అన్నట్లు ఇంకా ఈ స్థూల దృష్టికి కనిపించే సౌందర్యానే ఆరాధిస్తున్నాం. అంగనల వయ్యారాన్నీ,అవయవ బింకాన్నీ, అసందర్భ ఘట్టాల్నీ, నాగరికులూ, అనాగరికులూ, కూడా సినీమాల్లో, నాటకాల్లో, కథల్లో, కావ్యాల్లో, పచ్చిపచ్చిగా, పశుప్రాయంగా, వ్రాశిన దానిని చదువుతూ, చూస్తూ ఆనందిస్తున్నాం. ఇంకా కాశీ మజిలీలు కామరాజు కథలు అంటేపడి చస్తున్నాం. మనం స్వతంత్రులమై 3 వ సం వచ్చింది. కాదు, 2 సం. లు వెళ్ళి పోయాయి. మనం ఏ విధంగా స్వతంత్రులం అయ్యాం? భౌతిక దాస్య విముక్తులమయి మూడు సంవత్సరాలయినా, పాకుడు గట్టిన భావదాస్యాన్ని మాత్రం కడగలేక పోతున్నాం. బహుశా భారత ప్రజలకు ఆ శుభముహూర్తం రావటానికి అధమపక్షం ఇంకా రెండు తరాలయినా గడవాలేమో! భారత దేశం ఎప్పుడో స్త్రీలను గౌరవించేదిట. కాని మధ్యయుగంనుంచి వ్యక్తిత్వం లేదు. స్త్రీఅంటే పురుషుడికి ఒక సైకిలూ, ఒక రిస్టువాచీ, ఒక వేళ్ళవుంగరము లాగ ఒక పనిముట్టు, ఒక అలంకారం. అయితే ఈ నీచాభిప్రాయాలకు పురుషుడి అవిద్య కారణమా? కాదు. పురుషులు తామెంత విద్యాజ్ఞానం ఆర్జించినా, తమనిజ ధర్మాని మాత్రం, తమకు అతి దూరంలో వుంచుకుంటున్నారు. మన దేశంలో ఎన్ని వుద్యమాలు వచ్చినా, ఎన్ని సంస్థలు పెట్టినా, ఎన్ని సంస్కా-

రణలు జరిగినా, ఎంత నాగరికత వ్యాపించినా, చివరకు దేశం స్వతంత్రం అయినా, పశుత్వం అభివృద్ధి అవుతూంది కాని, తగ్గటంలేదు. స్త్రీగృహానికి రాణీ కాదు. స్త్రీ గృహ దేవాలయములో మూగదేవత. ముందూ వెనుకా, తుదీ మొదలూ లేని త్యాగభారాన్ని వహించడమే ఆమె జీవయాత్ర...

దబదబ తలుపు చప్పుడయింది. ఊహా ప్రపంచంలోంచి వులిక్కిపడి లేచా. గానకోకిల గంధర్వగానం చేస్తూవుంది. మావాళ్ల పేకాటమజాలో గానకోకిలను గమనించనే లేదు. తలుపు విరిగి పోతానని చెప్తూంది. ఆ చప్పుడులో, తలుపు తీసా. మా నాన్నగారే. "అప్పుడే పూర్తిఅయ్యా యండీ స్వతంత్రోత్సవాలు" అన్నా. మా నాన్నగారు సాయంకాలం బయలుదేరేటప్పుడు "మా క్లబ్బులో విందు. 10½ అవుతుంది వచ్చేటప్పటికి" అని మా అమ్మతో అనగా విన్నా.

"ఆ! అయాయమ్మా" అన్నారు లాల్చీలైనుకు పెడ్తూ "బాగా జరిగాయా," అంది మా అమ్మ పుస్తకం టేబిలు మీద పెట్టూ.

"ఓ ఫస్టుగా జరిగాయి. స్వరాజ్యం వచ్చిన మూడో సంవత్సరం నాటికి, సర్వసమానత్వం అమలులోపెట్టారు మా క్లబు వారు" అన్నారు.

"ఏం చేశారేమిటండీ" అడిగాను నేను వుత్సాహంగా.

"అమ్మా! మాధా కబళమండీ అమ్మయ్యగారూ" అంటున్నాడు ముష్టివాడు వీధిలో.

"చూడండి. ఇది మూడవ స్వతంత్ర ఉగాది. రాత్రి 9 అయింది. సాటి సోదరుడు, తోటి సోదరుడిని భవాన్ భిక్షాం దేహి అంటున్నాడు. ఇంకా ఎన్నాళ్ళో ఈగర్భ దరిద్రం?" అన్నారు నాన్నగారు.

అవును నిజమే. వూరంతా స్వతంత్ర దినం అని ఇంతో అంతో వుత్సాహంగా విలాసంగా గడుపుతూంటే, ఈ దరిద్రనారాయణులింకా ఒక పట్టెడు అన్నంకోసం దేవులాడుతూనే వున్నారు.

ఏమనుకుందో మా అమ్మ, గబగబా వంటిట్లోకి వెళ్ళి పళ్ళెం తెస్తుంది.

"ఏమిటది?" అన్నారు నాన్నగారు.

"ఏమీలేదు, అన్నం కూరా వేస్తున్నా వాడికి" అంది సగర్వంగా మా అమ్మ.

"నాన్నగారూ! పిండివంటలు ఏంచేశారండీ విందులో?" అన్నాడు మా తమ్ముడు నిద్రలో పక్కకి వత్తిగిలుతూ.

"చాలా చేశారమ్మా! 5, 6 రకాలు చేశారు. ఒరేయ్ ఆట మానేశి పడుకోండి మీరంతా" అన్నారు నాన్నగారు.

అంతే! సైరనుమోత విన్న ప్రజానీకంలా ఎక్కడి వాళ్ళక్కడ గప్‌చిప్.

"అబ్బా! చాలా గ్రాడుంగా వుందన్న మాట" అంది మా అమ్మ చేతులు తుడుచుకుంటూ.

"అవునుగాని ఇప్పుడెవరయినా ఆకలితో అన్నార్థులు వస్తే ఏంచేస్తావు?" అన్నారు మా నాన్నగారు.

"ఏమిటీ అనేది? ఇందాకవుంది కనక పెట్టాం. ఇప్పుడు లేదు కనక పొమ్మంటాం" అంది ధీమాగా మా అమ్మ కెండోకుర్చీ ఆక్రమిస్తూ.

"ఇంతేనా! భారతస్త్రీలు అపర అన్నపూర్ణలాయెను. డొక్కా సీతమ్మగారు అన్నార్థి అర్ధరాత్రి వచ్చినా సరే అపుడు వంటచేసి పెట్టేదిగా!" అన్నారు నాన్నగారు పేపరు చదువుతూ.

"ఏమో! ఆ విడ ఎలా బాధ పడేదోగాని, అయినా, ఈ వేళ స్వతంత్ర దినమాయెను. ఒట్టి రోజుల్లో మానెత్తిమీద రాతేగాని, ఈ రోజయినా మాకు హాయిగా వుండకుండా ఎవరు మళ్లా వండగలరండీ!" అంది మా అమ్మ విసుగుతో.

స్వతంత్రమంటే ఏమిటా అని ఆలోచిస్తున్నాం.

"అయితే పొమ్మంటావన్నమాట!"

"ఆ! తప్పకుండా!" అంది మా అమ్మ ధీమాగా.

"పోనీ! అప్పుడు నేనువండిపెట్టుతానండీ నాన్నగారు" అన్నాను.

"అయితే! నేనే ఇప్పుడు నిన్ను భవతీ భిక్షాందేహి" అన్నాననుకో, అప్పుడు నా గతేమిటి?" అన్నారు నాన్నగారు చిరునవ్వుతో.

"అబ్బా! ఏమిటండీ గొడవ. ఈ రోజు ఎంత సుదినం! హాయిగా సుబ్బలక్ష్మి గానం వినకూడదూ"

"అవును. ఏదో చద్ది అన్నంతిన్న ఆవిడ... అంటారు"

"అవునట నిజమే! పిండి వంటలతో మిఠాయిలతో షడ్రసోపేతంగా విందుకదూ, అందుచేత కడుపు నిండ లేదట!" అంది అమ్మ తమలపాకులు చీలుస్తూ.

"అన్నం తింటే కడుపు నిండుతుంది కాని, అదనాలు తింటే కడుపు నిండుతుందా అన్నాడొక బుద్ధిమంతుడు" అన్నారు నాన్నగారు లేచి రేడియో ధ్వని హెచ్చిస్తూ.

"అబ్బ! బుర్ర పోతూందండీ! అసలు సంగతేమిటో ఇవతలకు రానిద్దురూ. మీ చమత్కారమంతా ఇపుడే ఏకరు పెట్టాలా? ఇంతకీ మీరు వడ్డన బ్రాహ్మణులయ్యారా యేం? సర్వీస్ అనుకుంటూ! అన్నం తిన్న కబుర్లే కనుపించటం లేదు!" అంది మా అమ్మ జంకుతో.

"అసలైన దారికొచ్చావు ఇప్పటికి. అక్కడ అన్నం వుంటేగా తినడం?" అన్నారు నాన్నగారు కొంటెగా నవ్వుతూ.

"అదేమిటండీ! విందుజరగలేదా?" అన్నాను అనుమానంతో.

"విందు జరిగిందిలే" అన్నారు.

"ఏం చేశారండీ ఇంత హంగామానూ?" అంది మా అమ్మ వెక్కిరింపుగా.

"అన్నంతప్ప అన్నీ చేశారు" అన్నారు నాన్నగారు అదోలాయాక్షన్ చేస్తూ.

"మరి అన్నం ఎందుకు వడ్డించలేదూ? రేషన్నా? అంది అమ్మ.

"కాదండీ ఫొంక్షన్స్" అన్నారు నాన్నగారు నవ్వుతూ.

"మంచి ఫొంక్షన్స్ వచ్చాయండి! ప్రభుత్వమూ బాగా నేవుంది, పరిపాలనా బాగానేవుంది. ప్రజల బుర్రతిరుగుడు అంతకన్నా బాగుంది. ఇల్లంతా పండించేస్తా నంటారు ఒకరు. తన ఆహారం తానే పండించుకుంటూ నంటారు మరొకరు. ఆహారం దుర్వినియోగంచేస్తే దండిస్తా మంటారు ఇంకొకరు. కోట్లకొలదీ ధనాన్ని యుద్ధాలకు వెచ్చిస్తారు కాని కొన్ని లక్షలయినా ప్రాజక్టులకు మినహాయిస్తే, ఇంత మంది దరిద్ర నారాయణులు పట్టెడు కూటికోసం, పుట్టెడు చీకట్లో దేవులాడ..."

"ఆగండాగండి! ఈ 'తెర మరుగున' శృతి మించి రాగాన్ని పడుతూంది. అయినా ఈ లెక్చరంతా నా మీద విసరకపోతే రాణీగారు రవంత తెల్ల కాగితాన్ని నల్లగాచేసి, మూడుకాన్ల బిళ్ళముడుపుకట్టి, ఏ పత్రికకో పంపకూడదూ!" అన్నారు నాన్నగారు హేళనగా, "పాపం! పడతులు వ్రాస్తే ప్రాధాన్యాన్నిచ్చి, ప్రచురిస్తారు కదూ ఉండే పత్రికల్లో! సరేగాని, భోజనానికి లేద్దురూ!" అంది అమ్మ సీరియస్‌గా.

తలుపు తట్టుతున్నా రెవరో.

నాన్నగారే వెళ్లారు తలుపుతీసేందుకు.

"తాయారమ్మగారి భర్త కాబోలునే! తాళం చెవి యివ్వాలి" అంటూ అమ్మ వంటింట్లోకి వెళ్లింది.

పాపం! అసలే ఆయన రవంత పెద్ద మోతాదు మనిషి. ఆవిడేమో పుట్టింటికి, ఆయనేమో క్లబ్బుకి విందులకు వెళ్లారు.

"అమ్మాయ్! మాష్టారు ఇంటితాళం మన కిచ్చారా" అంటూ లోపలికి వచ్చారు నాన్నగారు.

"ఆ! ఆయన్ని పిలవండి కాస్త భోజనం చేస్తారేమో. అసలే అన్నగత ప్రాణి పాపం! ఆవిడ రెండో ఆట సినీమాకు వెళ్లి తమ్ముణ్ణి తీసికుని వస్తానంది. వాళ్ళింట్లో ఏమీ వుండదు" అంది అమ్మ నెమ్మదిగా.

అసలు చాలా మొహమాటస్థుడాయన, కాని ఎన్ని తిన్నా రవంత అన్నం తింటేగాని వుండలేని రకం. ఏం చేస్తారు? ఆయన తత్వం అటువంటిది. లేక పోతే పైత్యం చేసి వాంతులు వెడతాయట.

వద్దన్నారు కాని ఎల్లాగో నాన్నగారు భోజనానికి వప్పించారు. రవంత మజ్జిగా అన్నమూ తీసికుంటారట వడ్డించమన్నారు. ఇంతకీ వాళ్ళకీ మాకూ వున్న పరిచయం అటువంటిది కనక ఆయన 'ఊ' అన్నారు.

ఏదో రవంత మజ్జిగా అన్నంతో అతిథీ, గ్లాసుడు చారుతో నాన్నగారూ, పిండివంటలతూ, మోడరన్ డిన్నరుతూ బుద్ధిచెప్పారు. "క్లబ్బులోవిందు వున్నప్పుడల్లా, ఇంటి దగ్గర వంటచేయించిభోజనం వుంచాలని ఇక్కణ్ణుంచి చెప్పుకోవాలి", అనుకుంటూ ఆ అతిథి తాళంచెవి పుచ్చుకుని వెళ్లారు.

"అన్నం లేదన్నావ్. ఎవరైనా వస్తే పొమ్మంటానన్నావు! మళ్లా ఎలావచ్చింది?" అన్నారు నాన్నగారు, తమలపాకులు వేసుకుంటూ.

"చెప్పుకోండి చూదాం" అన్నాను నేను.

"ఆర్యావర్తపు స్త్రీలు అన్నపూర్ణ అన్నారు గదండీ! ఇంతకీ మీదీవన అటువంటిది. వెంటనే ఫలించింది" అంది అమ్మ నవ్వుతూ.

"అబ్బ చెప్పుదూ, నీ మహత్యమే అని ఒప్పేసుకుంటాం"

"ఏమీలేదండీ! అన్నటైము కన్నా త్వరగా రావటం, వెటకారంగా మాటాడటం, మాధాకవళం వేస్తుంటే ఏమిటని అడగడం చూస్తే అనుమానం వేసింది. ఎందుకేనా మంచిదని అరసోలెడు బియ్యం కుంపటి మీద పడేశా. అంతే నండీ!" అంది నవ్వుతూ.

"సూక్ష్మగ్రాహివి! మాట దక్కించావు. పాపం! ఆ బ్రాహ్మడు రేపల్లా బాధపడును" అన్నారు, రేడియో ఆపు చేస్తూ.



# స్వాతంత్ర్య జ్యోతి

శ్రీమతి పొణకా కనకమ్మ

నవ స్వతంత్ర మహా మహోత్సవ రథమ్ము
విమల కల్యాణ రాజ మార్గముల దిరుగ
వచ్చె దినమణి ప్రాభాత వర్తనముల
అమ్మ! నీచేతి కాగడాయై—వెలుంగ.

విశ్వ సాగర కల్లోల వీచి లోన
నవ్య భారత స్వాతంత్ర్య నౌకద్రిప్పి,
విజయ తీరాల లంగరు విడియ నదిగో,
ఖరకరుడు వచ్చె తల్లి! చుక్కాని పట్టె!

ఈ మహానంత యాన మందే యమోఘ
పరమ సౌభాగ్య సీమ జూపగనో? స్వయము
పుష్పకము దెచ్చి యంజలి మోడ్చి, లోక
బాంధవుడు నిల్చె జనని! స్వాగతముల.

ఇది స్వతంత్ర మహా జ్యోతి ఈ యశేష
భువనముల కేక దీపిక పుణ్య భార
తోర్వి నుదయించె ప్రాగ్జోళము జ్వలింప,
జయము! భారత జనయిత్రి! జయము! జయము!!

సత్యమును ధర్మమును నహింసయును ప్రేమ
త్యాగమును పంచ ప్రాణములై స్వరూప
మవతరించిన బాపూ మహాత్మ తేజ
మెపుడు ముందయి మము నడిపించు గాక!!

శ్రీ కస్తూరిదేవి విద్యాలయములో స్వాతంత్ర్యోత్సవమునాడు విద్యార్థినులు చదివినది 15-8-49.



# మనస్తత్వాలు

"వాసుతమ్ముని"
అమ్మకొడ్తే
వాడేడుస్తు
కూర్చున్నాడు.
ఇదేసందు
వీడ్నుడికిస్తే
అమ్మేమందని
"అచ్చా" అంటూ
చంకలుకొట్టా.
వాడు "రాగాలు"
ఇల్లెక్కించ
అమ్మొచ్చి
కొట్టినంత
పనిచేసింది నన్ను.
ఇదో మన స్తత్వం.

* * *

ఇంట్లోపోయిన
అయిద్రూపాయల
నోటుకోసం
అమ్మానాన్నా
కాలుకాలిన
పిల్లుల్లా
ఇల్లంత
తిరిగేరు
నాకేం ?
సిగరెట్లుకోసం
ఉంచుకొన్న
అణాకాసు
పోయిందండి
నాబుర్రచెడింది.
ఇదో మన స్తత్వం.

* * *

కామంతో
కళ్ళుకానక
మీదచెయ్యేసి
చెప్పుదెబ్బలు
తిని, పైగా
"నేనే, కొట్టా
సాధించా
విజయం"
అంటూ
ప్రచారం.
ఇదో మన స్తత్వం.

* * *

కాలుజారి
నేపడగ
దారిపోయే
వానికి నవ్వొచ్చింది.
అటుకెక్కి
నిచ్చెనజార
"అమ్మోబాబో" అంటూ
అటుకుపట్టుక
వ్రేళ్ళాడు
"అమ్మ"నిచూసి
నవ్వేను నేను.
ఇదో మన స్తత్వం

వంగపండు అంగార్కరావు

# భాగవత కాలక్షేపము

దసరా వుత్సవముల మూలంగా, యీ మధ్యలో కాలక్షేపమునకు కొంత విరామము కలిగింది. తిరిగి ప్రతి శనివారము సభలో భాగవత కాలక్షేపము జరుగును. సభ్యురాండ్రు ఉపన్యాసములకు తప్పక విచ్చేసి యీ అవకాశమును పురస్కరించుకొనినచో వుపన్యాసకులకు నిర్వాహకులకు కొంత యెక్కువ వుత్సాహమును కలిగించినవారగుదురు.




ఆధారం:

శ్రీమతి ప్రమీలారాణి

"ఊఁ, తరవాత" అన్నాను. సుబ్రహ్మణ్యం చెబుతున్నాడు. తనెరిగిన, తన ఆత్మీయురాలైన 'రూప'నిగురించి 'సహనం'మీద చర్చించుకుంటూండగా అతను ఆడాళ్ళకి సహనం ఎక్కువనీ, నేను మగాళ్ళకి ఎక్కువనీ అనటములో అతని ప్రత్యక్ష అనుభవాన్ని చెబుతూ నిట్టూర్చాడు. మళ్ళీ అందుకున్నాడు.

"ఏం? తరువాయి.. రెండు మూడేళ్ళ దాకా 'రూప'ని కలుసుకోలేదు. వెనకటి వేసంకాలంలో వెళ్ళాను. 'రూప'కీ నాకూ ఉండే బాంధవ్యంకోసం నువ్వంత బాధపడక్కర్లేదు. కాని అది మాత్రం చాలాదగ్గిర బాంధవ్యం. బాంధవ్యంకంటె మా యిద్దరిమధ్య ఒక విధమైన స్నేహం ఉందంటే బావుంటుందేమో. అంతే నన్నొక బంధువులా కాకుండా ఆప్త మిత్రుడులా భావించింది 'రూప'—స్కూల్ ఫైనల్ పూర్తికాగానే చదువు మానేసింది. చాలా పట్టు పట్టారు యింట్లోవాళ్ళు చదువుకోవద్దని.

మొన్న నేను వెళ్ళగానే మొదటిమాట "చదువు మానేసాను. చాలా మంచి పని చేసాను కాదూ?" అంది నవ్వుతూ.

నేను అభినందిస్తానని ఆమె యూహ కాని, "ఏం అంత ఘనకార్యంగా తోచదు. చదువుతేనేం?" అన్నా నవ్వుతూనే.

"సరదాక్కాదు కాని ఈ చదువువల్ల లాభమేమిటి చెప్పు?" అంది నవ్వు నాపుచేసి ఎంతో సీరియస్‌గా చూస్తూ.

"ఆ! దానికేంలే మంచి పనే చేసావు. ఏమిటి విశేషాలు?" అన్నా కుర్చీలోంచి లేస్తూ.

"అప్పుడే బయల్దేరుతున్నావేమిటి? చాలా రోజులైంది రావడం మానేసి, కూర్చో." అంది కూచున్నాను. ఏదో మాట్లాడింది. 'రూప' అతిమితిగ్గా మాట్లాడే మనిషి. మనం పది మాట్లాడితే ఆమె ఒక 'మాట' మాట్లాడుతుంది. ఎదుటి వాడికి చాలా కోపమూ, విసుగూ కలుగుతాయిలే. దాంతో లేచిపోతాడు కూడా. అందుకోసమే అలామాట్లాడుతుందేమో! లేక పోతే అసలు వాళ్ళతో మాట్లాట్టం యిష్టం వుండదా? నేను మాట్లాడేప్పుడు మాత్రం చాలా యిదిగా మాట్లాడుతుంది. నేనెంత తగ్గిద్దామనుకుంటే అంత పెంచుతుంది. ఆమె దగ్గర కూచొని మాట్లాట్టంకూడా ఒక 'కళే' అంటాను. ఒక్కొక్కప్పుడు ఆమె ప్రశ్నలికి సమాధానం చెప్పటం చాలాకష్టంగా తోస్తుంది. వికటంగా చెప్పి తప్పించుకో వొచ్చు కాదా అంటావు నువ్వు. కాని వికటు సమాధానం అసామర్థ్యాన్ని సూచిస్తుంది అంటుంది. నిజంకూడా అంతే. సరైన ప్రశ్నకి వికటు సమాధానం చెప్పటం మన అశక్తతకి సూచనే. ఏ చొప్పదంటు ప్రశ్నలకన్నా అయితే నీ సిద్ధాంతం పనిచేస్తుంది కాని, ఆమె విషయంలో మాత్రం అది ఏపాటి పనిచేయదు. ఒక వ్యక్తితో ఎక్కువసేపు మాట్లాట్టమంటే నాకు చెడ్డ విసుగని యినివరలోనే నీకు తెలిసి ఉంటుంది. ఒక్కనీ దగ్గరమాత్రం చాలా సేపుంటాను. అది నాబుద్ధిపూర్వక నిర్ణయం. మళ్ళీ 'రూప' విషయంలో అలా ప్రవర్తించాల్సి వచ్చింది. అది నా నిర్ణయం

కాదు. ఆమె నన్ను ఆ కట్టుకో గలిగింది. కూచున్న మనిషిని ఆమె యిష్టం లేకుండా నించోకుండా చేయ గలదు. అది ఆమెలోఉండే ఏ భయంకర శక్తివల్లాకాదు. ఆమెలో ఉండే మాటకారితనపు చాకచక్యం వల్ల మాత్రమే. ఏవేవో విషయాంతరాలు ఎంతెంత సేపో చెబుతుంది. చాలా సరదాగా చెపుతుంది. వింటూన్న కొద్దీ వినాలని ఉంటుంది. మధ్య మధ్య తనుచెప్పేదాన్ని తనేవిమర్శిస్తుంది. తప్పొస్తే సమర్థించుకుంటానని చెప్పి సమర్థించుకుంటుంది. ఆ వేళ కూడా ఏమో చెప్పింది.

పెళ్ళిన మరునాడు మధ్యాహ్నం మూడుగంటలకి యిద్దరం ఓ గదిలో కూచున్నాం. ఇంట్లో 'రూప' తల్లి మినహాగా ఎవరూ లేరు. ఆవిడ కూడా గాఢంగా కునుకు తీస్తోంది వంటింట్లో. ఎండ తీవ్రంగాఉంది. చొక్కా తీసేసి బనీను తోటి, నిక్కరుతోటి మంచంమీద పడుకుని విసురుకుంటున్నాను. ఎదురుగా ఉన్న టేబిల్ దగ్గర కుర్చీలో కూర్చుని స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి కాబోలు ఏదో పుస్తకం చదివి చెపుతోంది రూప. అక్కడక్కడ తన అభిప్రాయాలు కూడా యిస్తోంది. వింటున్నాను. ఆమె చదువుతూన్నప్పుడుమాత్రం బాగా విసురుకునేవాణ్ణి. మాట్లాడ్తూ విమర్శిస్తూ వుంటే చాలా శ్రద్ధగా వినటంలో చెమట పట్టినట్టు కూడా తెలీక విసురుకోటంకూడా మానేసేవాణ్ణి. అంత సరదాగా చెపుతుంది విషయాలు. ఆమె చెప్పే విషయాలు మనకి తెలియనివికావు. అయినా చెప్పే మనిషిలో ఉండే చాకచక్యం అదే అనుకుంటా. తెలిసిన విషయాలు కూడా మనకి తెలియనట్టుగా చేసేసి చెప్పటం కూడా ఆమె నేర్చుకున్న విద్యలలో ఒకటి.

చెబుతూ చెబుతూ "ఆడది పెళ్ళిచేసికోగూడ దంటాను," అంది సమాధానం కోసం ఎదురు చూస్తూన్న ముఖం నా వైపుకు త్రిప్పి.

పడుకున్న వాణ్ణిలేచి కూచున్నాను. ఏదో మాట్లాడ్తోంది అనే అనుకున్నానుగాని ఇంత యిదిగా ప్రశ్నిస్తుందనుకోలేదు. అది అంటోన్నప్పుడు మాత్రం బాగా పరీక్షించి చూసాను. సరదాగా అనటంలేదు. చాలా సీరియస్‌గా అంటున్నట్టు కళ్ళుచెబుతున్నై. సరదాగానే అంటే కళ్ళు చిలిపిగా నవ్వుతై. అది నాకు తెలుసు. అటువంటిదేమీలేదు. ఒక గాఢ విశ్వాసాన్ని, ఒక సమర్థ నిర్ణయాన్ని చెప్పేటప్పటి ధ్వని, చూపులు ప్రత్యక్షమైనై—చూసాను కాస్సేపు.

"రూపా! నీ భావం నాకు బోధపడలేదు. నువ్వు పెళ్ళి చేసికోననే గూఢార్థమేమన్నా అక్కడుందా?" అని ప్రశ్నించాను తీవ్రంగాచూస్తూ.

"ఉంటే ఉండొచ్చు. ఏం? నువ్వు పెళ్ళి చేసికోనప్పుడు నేను మాత్రం ఎందుకు చేసు కోవాలి?" చాలా సాగదీసి ప్రశ్నించింది. ప్రశ్నించిన వ్యక్తి సమాధానం ఆపేక్షించినట్టు గాకుండా ఉపేక్షగా పుస్తకం వైపు చూడ నారంభించింది చాలా నిర్లక్ష్యంగా.

"అంటే నేను పెళ్ళి చేసుకోటం లేదు కనుక నువ్వూ మానేస్తావా? ఒకవేళ నేను పెళ్ళాడితే నువ్వూ పెళ్ళాడ్తావా?" అని ప్రక్కకి తిరిగి ప్రశ్నించాను.

"ఆ నిర్ణయాన్ని యివాళ తేల్చలేను. ఒకవేళ నీ నిర్ణయానికి స్థావరత్వం లేకపోతే లేక పోవొచ్చు. కాని నా నిర్ణయం ఎప్పటికీ నిర్ణయమే..." అంది. అప్పట్లో ఆమె మాటల్లో ఏ విధమైన భావమూ మరుగుపడ్డట్టు ధ్వని కూడా చెప్పలేదు.

"అయితే నేను పెళ్ళాడితే నీ కిష్టమేనా?" మళ్ళీ ప్రశ్నించా.

"అంటే నాతో నీ పెళ్ళా?" చాలా తీవ్రమైన చూపులతో అడిగింది.

"నా పెళ్ళినిర్ణయాన్ని బట్టికదా నీ నిర్ణయం. ఈ నిర్ణయాలు రెంటికీ మధ్యఏదో ఒక పరస్పర సంబంధం ఉండి ఉండాలి. ఆ సంబంధం నేను నిన్ను పెళ్ళి..." ఇంకా ఏమో అందును కాని ఆపుచేసింది—

"అటువంటి ఆపోహాలు కలిగించుకోకు—నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. అంతే" అంది గొంతులో కొద్దిగా మార్చింది—

"పెళ్ళి చేసుకోవాలని లేదు. బాగానే ఉంది. చేసుకోవాలని లేక పోవటానికి కారణం?" అన్నాను ఏం సమా

ధాన మిస్తుందోనని ఆతురతగా చూస్తూ, రెండు నిమిషా లాలోచించింది.

"నీ నిర్ణయానికి కారణం ?" మళ్ళీ ప్రశ్నించింది. నా సమాధానమే తన సమాధానంగా కూడా తీసికోమని అనే స్తుంది. అదే ఆమె భావం.

"నా యిష్టంమీద నా నిర్ణయం జరిగింది" అన్నాను ఏ ఆలోచనా లేకుండా. "అంతే నేనూనూ" అనేసింది. పెద్దబాధలేకుండా మాటలకోసం.

"ఆ యిష్టానిక్కూడా కారణాలుండాలిగా ?" అను కోకుండా ప్రశ్నించాను. నాకే ఈ ప్రశ్నతగిల్తే ఏం జవా బుచెప్పాలో మాత్రం తెలీదు.

"అన్నీ నేను చెప్పడం ఎందుకు ? నీ నిర్ణయాలమీదా- వాటి కారణాలమీదా - కారణాలకి హేతువులమీదా నా నిర్ణయాలు జరిగినై" చాలా హేళనగా, అనవసర ప్రశ్నగా సమాధాన మిచ్చింది.

"రూపా ! చాలా పొరబడుతున్నావ్. నానిర్ణయాలూ, హేతువులూ నీవూ అన్వయించుకుందుకు వీల్లేదు. నేను మగాణ్ణి నేనెలాపోయినా బాధలేదు..." ఉపన్యాస ధోర ణిలోపోనిద్దును. కాని అడ్డేసింది, నే చెప్పిందంతా సత్యం అనిమాత్రం తెలుసు.

"ఈ లేని ఆధిక్యత మగాళ్ళకెక్కణ్ణుంచి వచ్చింది ?" కోపంగా విచార రేఖలుకూడా వచ్చినై. ఉడుకు మోత్తనం వల్లకాదు. జరిగే అన్యాయంవల్ల—

"ఎవరికి తెలుసు, తరతరాలనుంచీ నరనరాల జీర్ణించిన సత్యం అది" అన్నా, నే బాధలేనట్లు.

"నువ్వుకూడా సమర్థిస్తున్నావన్న మాట ఈ దౌర్జన్యా న్ని", విచారంతో కుర్చీలోంచి పోబోయింది కాని కూచో పెట్టి తలుపు వేశ్లేసా.

"దౌర్జన్యమా ? సౌజన్యమా ? అనాదినుంచి వస్తోందన్నాను కాని సమర్థించలేదే. అదీ కాక ఉన్న స్వాతంత్ర్యా న్ని లేనివాళ్ళకోసం వదలుకోటంవల్ల యిద్దరూ బాధపడాలి. ఆ నాడు జరిగేదేమీలేదు. నన్ను నీ ఛాయలకి దిగమంటం కంటె నువ్వు నా ఛాయల్లోకి ఎక్కడానికి ప్రయత్నించు ..." అన్నాను. కొంత తృప్తిపడ్డట్టుంది. వేడి నిట్టూర్పుతో విచారాన్నీ, కళ్ళనీళ్ళనీ, బాధనీకూడా వదిలేసింది. కాని సంతోష రేఖలు మాత్రంలేదు.

"అయితే నన్ను పెళ్ళిచేసికోమనకు" అని బ్రతిమలాడు తూన్నట్లు అడిగింది.

"కారణం చెప్పు రూపా ? నేను మానేసినా లోకం ఏమీ అనలేదు. నువ్వుమానేస్తానంటే లోకందాకా అక్క ర్లేదు. కన్నతల్లి దండ్రులకే బరువుచేటవుతావ్. నువ్వెంత పద్దన్నా మీ నాన్న అంగీకరించడు," అన్నాను బరువుగా అడుగులేస్తూ పచారుతో.

"అమ్మకీ నాన్నకీ బరువా ? తల్లి దండ్రుల హృదయా లనే రాళ్ళల్లా మార్చేసే సంఘం పోనీ నువ్వు..." ఏదో ఆశగా అడగబోయింది.

"ఎంతోఘట్టిగా నవ్వాలనుంది రూపా ! కాని రావటం లేదు. చాలా తేల్గ్గా నా ఓపిక నిర్ణయం చేసావ్ ? ఎంతటి అప్రయోజకుణ్ణో ఒక్కమాటలో తేలిపోతుంది. ఇన్నాళ్ళూ ఏమో అనుకున్నానే కాని యిటువంటి కష్టతర సమస్యలు ఎదురౌతాయని ఊహించలేదు. కనీసం కలగన లేదు. అయినా పరిస్థితులు విషమిస్తే ఆ పాటి సహాయం చేయ గలన్లే" అన్నాను—

అంతే చాలన్నట్లు ఎంతో సంతోషంగా "అమ్మయ్య ! జీవితంలో ఎవర్ని నమ్మకుంటే నిశ్చిత నిర్ణయాలు నిశ్చి తంగా నెరవేరుతయో వెతుక్కో గలిగినందుకు నన్ను నేను అభినందించుకుంటున్నాను. కాని సాయం చేయగలను అనే మాటమాత్రం మరిచిపోకు" అంది.

అప్పుడు చూసా నామె ముఖంలో నవ్వు. నా బుర్రలో గిర్రుగిర్రున చెరుకుగానుగలు తిరుగుతునై. మనస్సు ఎన్నె న్నో ఆలోచనలమీద పోతోంది. అనుకోని సమస్య లడ్డ మైతే కలిగే విపరీతమే యిదేమో ? ఆమె హృదయం ఎంత శాంతంగా ఉందో నాదంత భారంగా ఉంది. "సాయం చేయగలను" మాట నేసాను. నిజంగా అటువంటి పరిస్థితులే ఏర్పడితే ఏమన్నా చేయగలనా ? ఏమో ? ఏమో ఏమిటి ? చేయగలను. ఇంత చదువూ చదివి ఒక్క స్త్రీని పోషించ

లేక పోతానా? ఈ విశాల విశ్వంలో ఇరువురు వ్యక్తుల జీవనోపాధికే ఆటంకమా? ఆలోచిస్తూ పడుకున్నాను. మళ్ళీ బుర్రమళ్ళింది. అటువంటి పరిస్థితులొచ్చి నప్పటి మాటకదా? ఆ—ఎంత నిర్ణయాలైనా "రూప" నిశ్చితంగా ఉంచుకుంటుంద నేమిటి? ఏదో ఆషా మాషీ నిర్ణయాలు కాదు. ఆషా మాషీ నిర్ణయాలయితే అంత బాధతో చెప్పదు. ఆమె నిర్ణయం నిశ్చితమైనదే కాకుండా కఠినతరమైనది. అందుకే నాసాయా న్నపేక్షించింది. ఇంతసేపు విచారంగా ఉన్నదంతా నిర్ణయాన్ని నిర్ణయంగా ఉంచుకుందుకి తనకి కావలసిన సాయం కోసమే. కానీ—మాట యిచ్చాం—

౨

రోజులు దొర్లాయి—రెండు మూడు నెలలు అలానే ఏవోఏవో సమస్యల్ని గూర్చి చర్చిస్తూ సరదాగా కాలం గడిపేవాళ్ళం. ఇంత విజ్ఞానం ఈమెకెలా కలిగిందా? అనే ఆశ్చర్యంకూడా అప్పుడప్పుడు కలిగేది. కాని అంతలోనే ఆమెలో చాలా మార్పులు గోచరించాయి. ఆ మార్పులు చాలా ప్రమాద పరిస్థితులకి దారితీయగల వనటంలో సందేహంలేదు. రాను రాను ఆమె ప్రవర్తన చాలా అసహ్యంగా కనపడేది. అవి నీతికి దారితొక్కేదిగా కూడా కనపడింది. దూరదూరంగా ఉండి మాట్లాడేవ్యక్తి మీదిమీదికి రా నారంభించింది. కూచుని చదువు కుంటూంటే "ఏం చదువుతున్నావ్?" అని అడిగే వ్యక్తి బుజంమీద చేతులాని వెన్నువంచి వంగిచూచేది. మంచినీళ్ళడిగినప్పుడు తెచ్చి టేబిల్ మీద పెట్టే వ్యక్తి చేతికందిచ్చేది. అందుకున్నాక కూడా వదిలేదికాదు. విసువెత్తి నేను విదిలేస్తే తనూ కాళ్ళమీద పడేలావదిలేసి "దెబ్బతగిలిందా?" అని కాలిమీద రాసేది. రాత్రివేళల్లో దొడ్లో పచారు చేద్దామనేది. ఒకటేమిటి ఈ రీతిగా ఒక్కొక్కప్పుడు కుర్చీలో కూచుంటే పక్కగా కూచుని బుజంమీద చేతులేసి చక్కిరిగింతలు పెట్టేది. ఎన్ని రకాలుగానో నన్ను ఆకర్షిద్దామని ప్రయత్నించింది. ఆమె ఏ ప్రయత్నానికీ నేను లొంగలేదు, సరిగదా ఆమె ప్రయత్నాల విషయంలో చాలా అసహ్య భావం కూడా చూపేవాణ్ణి. ఈ ప్రవర్తనలో అణగిఉన్న ఆమె ఆశఏమిటో నాకు బోధపడలేదు. నాలుగు రోజులు యవ్వనంలో ఉన్న మనిషి యింట్లోవుంటేనే యింత కామానికి లోబడే వ్యక్తి ఎంతకాలం పెళ్ళి చేసుకోకుండా ఉంటుంది? ఈ పాటి తాహతుగల వ్యక్తేనా జీవితాన్ని బ్రహ్మచర్యంతో గడపటానికి నిశ్చయంచేసుకున్న, నిర్ణయంచేసుకున్న వ్యక్తి? ఈ నెలల్లోనే యింత బాధపడితే జీవితంలో యింకా యింకా ఎటువంటి విషమ పరిస్థితుల్ని ఎదుర్కో వలసి వస్తుంది. కోరికల్ని అణచిపెట్టుకోలేని అబల ఆ జన్మాంతం అవివాహితగా ఉంటుందంటే నమ్మడం కష్టతరం. ఎలా నమ్మడం? ప్రత్యక్షంగా తన అశక్తత వ్యక్తీకరింప బడుతుంటే! ఈపాటిదానికి ప్రమాద పరిస్థితులు—నేను సహాయపడ్డం? అనేవి—ఆమె అవినీతికి పాల్పడుతూ అది వెల్లడవకుండా కాపాడడానికా? తాను నైతిక పతనం పొంది తన్మూలంగా తనకు తానై కోరి ఏరి నడచే ముళ్ళ బాటను బాగు చేయడానికా నేను? షెభాస్—తను చేయ బోయే మహోపాలన్నిటినీ నేను అడ్డుతూండాలన్న మాట! ఈ ఉద్దేశాలన్నీ హృదయంలో ఉంచుకునే నావాగ్దానం తీసుకుంటూ ఇంతటి కుటిలబుద్ధితో ప్రవర్తిస్తుందని తెలిసుంటే ఆనాడే తగిన ప్రాయశ్చిత్తంచేసి ఉండేవాణ్ణి. లేకపోతే ఈ పాటికి ఆమెను ఏ యింటి కోడలుగానో చేయడానికి ప్రయత్నించి ఉండేవాణ్ణే. అదీ అసాధ్యమైతే మా యిద్దరి మధ్యనున్న 'మైత్రి'ని పటాపంచలు చేసేవాణ్ణే—

మైత్రి తలపుకొచ్చేప్పటికి ఒక్కసారి ఆ ఊహలన్నీ మాయమైనై—నన్ను పెళ్ళి చేసుకోవాలనే తలంపుతో కాని ఈ రీతిగా ప్రవర్తించటంలేదు కదా! దానికి ఆస్కారంలేదే! నా నిర్ణయాన్ని నే నెన్నడూ మార్చుకోలేననీ మార్చుకోనని కూడా ఆమెకు తెలుసే. అయినా మార్చలేమా? అని ఆమె ప్రయత్నమే అయితే దాని ఫలితం శూన్యం మాత్రమేనని గ్రహించి ఉండాలి. గ్రహించికూడా చేసేటంతటి అజ్ఞానికాదు, వ్యర్థజీవి కాదు. మరి?—అదే తెక్కుండావుంది. ఒకవేళ నానిర్ణయాలే తనకీ ఉన్నాయని నటిస్తే ఆమెకు లోబడి పోతాననే తెలివి తక్కువ అభిప్రాయం ఏమీలేదు కదా! అంత తెలివి తక్కువదై యుండదు. ఉండక పోతే ఈ ప్రవర్తనలో యిమిడి ఉన్న స్వార్థం? అంతే—అదే అభిప్రాయం "మన అభిప్రాయా లేకీభవిం

చాయి కనక మనిద్దరం కలిసి ఉదాం" అనేద్దాం అనుకుం టోందేమో? ఏమో? ఏదీ బోధపట్టంలేదు. తీవ్రంగా ఆలోచించాను—ఆలోచించిన కొద్దీ రకరకాల ఊహాలుచకచకా సాగుతున్నై.. ఒకటీ నిశ్చయంగా నిలవటం లేదు. మళ్ళీ ఇంకో ఊహ తట్టింది. ఒకవేళ నా శీలం విషయంలో ఆమె కేమన్నా అనుమానం కలిగి ఈ రీతిగా ప్రత్యక్ష ప్రమాణం కోసం ప్రయత్నించటం లేదు కదా? ఏ విధమైన అనుమానమూలేని నా విషయంలో ఆమె కనుమానం కలగడానికి ఆస్కారం ఎక్కడిదీ? ఇది చాలా తెలివితక్కువ ఆలోచనగా తోచింది. మన విషయంలో మన కనుమానం లేక పోయినా లోకం అనుమానించకపోదు. అయితే 'రూప' లోకంలోని మనిషే అయితే రూపకీనాకు మధ్య ఈ మైత్రిలో ఉండే విలువేమిటి? కాదు. రూప లోకంలోని అందరిలాంటిదీకాదు. కాకపోతే మరెందుకిలా ప్రవర్తిస్తోంది? యిన్నాళ్ళూలేంది ఆమెలో ఈ మార్పెందుకు కలగాలి?

ఎటు చూసినా కాని నిశ్చయంగా ఆమెకు నన్ను పెళ్ళి చేసికోవాలనే భావమే బాగా కనపడుతోంది. తప్పితే మరోటి లేదు—" ఇంకా ఏదో చెప్ప బోతూండగానే "అయితే ఆమె ఆ అభిప్రాయంతోటే ఉంటే పెళ్ళి చేసు కుందుకి నువ్వు సిద్ధపడేవాడివా?" అని ప్రశ్నించా నతని నిర్ణయ పరీక్షకోసం. "అది యిప్పుడు చెప్పలేను పరిస్థితులెలా ఉండేవో? ఏం చేసేవాణ్ణో. అడ్డులావుంచు చెప్పేది విను—

"ఆమె నన్ను పెళ్ళాట్టానికే ఈ ప్రయత్నం చేస్తోందో? కాక నన్ను పరీక్షిస్తోందో? లేక తన అవసరాలకి నన్నొక ఆటబొమ్మగా ఉంచుకోవాలని తలుస్తోందో? ఈ మూడు సమస్యలతోటి సతమతమౌతూ ఆమె ప్రయత్నాలన్నీ తీవ్రంగా కనిపెట్టి చూస్తున్నాను. ఎప్పుడు చూసినా ఆమూడే కన బడ్తున్నాయికాని ఏ ఒక్కటి నిశ్చయించే అవకాశం చిక్క టంలేదు. అక్కడికీ నాకు నేనై అడిగితే చులకనగా ఉంటుం దని చాలా ఓపికతో ఆమె ప్రవర్తనని పరిశోధించాను. రోజులు గడిచాయ్—వారాలు కూడా దొర్లాయి కాని ఏమీ అంతు చిక్కలేదు. ఆ గంభీర హృదయపు లోతులు తెలుసు కుందుకు ప్రయత్నించడం వ్యర్థ యత్నంగానే తోచింది. ఆమె ద్వారానే నిర్ణయింప జేసుకోవాలనే నిశ్చ యానికి వచ్చేసాను. రాత్రి ఎనిమిదింటికి యింటికి వచ్చాను. ఇంట్లో అంతా సినిమాకు వెళ్ళారు. 'రూప' మాత్రం మంచంమీద పడుకుని దీర్ఘంగా ఆలోచిస్తోంది. లోపలికెళ్ళి తలుపు గడియవేసాను. ఇంట్లో అంతా సినిమా ప్రయత్నంలో ఉన్నట్లు సాయంత్రమే తెలుసు. కాని 'రూప' వెళ్ళదనుకోలేదు—

"ఏం రూపా! సినీమాల మీద్ద మోజు తగ్గిందా?" కుర్చీలో కూచుంటూ ప్రశ్నించా. ఒక్కసారిగా మంచం మీంచి లేచివచ్చి కుర్చీచేతిమీద కూచుని బుజం మీద చేతులూని నడుంవాల్చి ఆవలించి "వెధవ సినీమాలు పోనిద్దూ!" ఏదో ఆశ అంతర్భూతమైనట్లు తోస్తోంది. ఇప్పుడే నిర్ణయించుకోవాలను కొన్నాను. ఈ ముసుగుల్లో గుద్దులాట నాకేం నచ్చలేదు. తనకు తాను ఫలానా అని చెప్పదు. 'ఫలానా' అని చెప్పలేదేమో! అడిగినా చెప్పదా? చెపుతుంది. చెప్పేదాకా వదలదల్చుకోలేదు. అడిగినప్పుడుకూడా కప్పిపుచ్చాల్సినంత అవసరం ఏమిటి?

"రూపా! కొంచెం అలా మంచంమీద కూచుంటావ్- నీతో ఒక అత్యవసర విషయాన్ని మాట్లాడాలి. ఇలా కూచుంటేమాత్రం నేను చెప్ప లేను" ఆజ్ఞాపిస్తూన్న కంఠ స్వరంతో అన్నాను.

"ఏం? అంత అత్యవసర విషయం దగ్గిరుండగానే ఎందుకు చెప్పకూడదు" చాలా హేళనగా వెన్ను తల మీద ఆనుతూ అందేకాని లేవలేదు. నేనే కుర్చీలోంచి లేద్దామనుకొన్నాను. కాని తకీమని తలబద్దలయేటంత దెబ్బ తగిలేలా వెనక్కిపడ్తుంది. అంచేత జాగ్రత్తగా చేతులతో తల నదిమిపట్టి కుర్చీలోంచి లేచి ఆమెనందులోకి దింపిపోయి బల్లమీద కూచుని "రూపా" అని పిలిచా. ఈ సారి 'రూపా'లో ఒక రకమైన భావం కనపడ్తోంది. ఇందాకా వున్న ఖులాసా, సంతోషం కొంత వరకూ తగ్గినై—చాలా తీవ్రంగా నావైపుచూస్తూ "ఆ" అంది.

"నా ప్రశ్నలికి సమాధానం యివ్వాల్సిన బాధ్యత నీకుం దనుకుంటా?" అన్నా తలవాల్చి పుస్తకంలోని పుటలు తిరగేస్తూ.

"బాధ్యతలూ—ఖారారులూ నామీద ఏమీ ఉంచరు" అంది.

"నీకు నీవై తెచ్చుకుంటే ?" ప్రశ్నించాను.

"నే నింతవరకూ అటువంటివేమీ తెచ్చుకో లేదు—" ఇంకా ఏదో అనబోతోంది కాని సమయం కాస్తా సమాధానాలతో పోనిస్తే అసలు విషయం తెలుసుకుందుకి ఆలస్య మౌతుంది.

"రూపా ! కాస్సేపు వేళాకోళం ఆపుచేయి. ప్రశ్నకి ప్రశ్నలో సమాధానం పెద్దతెలివైన పనికాదు. అదీకాక యిప్పుడు నీతో వాగ్వాదానికి రాలేదు. నా సందేహానికి సమాధానం చెప్తావా ?" చాలా సీరియస్‌గా అడిగాను.

"నువ్వంత కోపంగా మాట్లాడ్తే నేనసలు సమాధాన మివ్వను" అంది.

"కోపం కాదు—ఇప్పటికి నెల్లాళ్ళ నుంచి ఓపికతో చూస్తున్నాను. నీ ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. వచ్చిన రోజుల్లో నువ్వు నన్నడిగిన సాయం ఇందు కోసమేనా ?" అని కాగితాలు గబగబా తిప్పుతూ ప్రశ్నించా. రెండు నిమిషాలు 'రూప' స్తబ్ధయై కూర్చుంది మళ్ళీ.

"అంటే నీ ఉద్దేశ్యం ?" ప్రశ్నించింది.

"ఆ నాడు నాసాయాన్ని నువ్వు అపేక్షించుటలో నన్ను పెళ్ళాడాలనే తలంపు ఏమన్నా ఉందా ?" ఆమె కేసి చూస్తూ అడిగాను.

"ఉంటే ?" చాలా నిరసనగా కుర్చీలోంచిలేచి పచారు చేస్తూ అడిగింది.

"ఉంటే ఏమిటి ? ఉందా ? అని అడుగుతున్నాను. కాకపోతే నీ ప్రవర్తనలోని ఆంతర్యం ?" బొమలు ముడి వేసి అడిగాను.

పకపకా నవ్వింది. "పిచ్చివాడా !" అంది.

"నిజంగా నీ ప్రవర్తన నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది. నీకు నన్ను పెళ్ళాడాలనుంటే నాన్నతో చెప్పి రేపే ఖాయం చేయిస్తాను" నాకున్న అధికారాన్ని నా అభిప్రాయాన్నీ కూడా ఆమెకు చూపాలనే భావంతో చాలా సౌమ్యంగా అడిగా.

"నువ్వింత చులకనగా చూస్తావనుకోలేదు" కళ్ళ నీళ్ళు మాత్రం రాలేదంతే. అంత విచార ముఖంతో అడిగింది నిలబడి.

"నీ ప్రవర్తన నిన్నింత చులకనచేస్తోంది" చాలా కర్కశంగా అన్నా.

"నా ప్రవర్తనలో ఉన్న ఆంతర్యం నీకేం తెలిసింది ?" అడిగిందామె.

"తెలీకనే యిన్ని సమస్యలెదురై నీ ద్వారా నిర్ణయించుకుందుకి వచ్చాను" బల్లమీంచి దిగి నిలబడి అడిగాను.

"పుష్పవేణిని ఎరుగుదువనుకుంటా. నీకన్న రెండు క్లాసులు తక్కువగా ఉండేది హైస్కూల్లో. ఆమె నీ ప్రవర్తన విషయంలో చాలా అనుమానాస్పదంగా ఒక కథలా ఇంకా నీచుడిలా చెప్పింది. అదేమిటో నిర్ణయించుకుందుకి నేనిలామారాను. కాని వేణి చాలా పొరబడింది. అయితే వేణికి ఆ భావం ఎందుకు కలిగిందో ఊహించడం కష్టం—ఊహించను కూడా" అంది కుర్చీలో కూచుంటూ.

"చెప్పుడు మాటల నిర్ణయాల కోసం చెడదల్చుకున్నావా ?" అన్నాను.

"చెడేట్టయితే చెప్పువిప్పేదాన్ని" అని ధీమాగా అంది. అయిదు నిమిషాలు నిశ్చలంగా కూచున్నాం. నా బుర్ర ప్రశాంతంగా తయారైంది. దురూహాలన్నీ పోయినై. అలా నేపోయి మంచంమీద పడుకున్నా. నిద్రపట్టేసింది—

3

ఎంతకాలం ఈడొచ్చిన పిల్లని యింట్లో పెట్టుకుక్కూచుంటారు తల్లిదండ్రులు ? అయినా పిల్లకంత యిష్టం లేనప్పుడు సంఘాన్ని తిరస్కరించాల్సిందనే నా అభిప్రాయం. కాని మన పిల్లకాదుకా ! తండ్రి ప్రయత్నించాడు—ప్రయత్నించాడు—ప్రయత్నానికి ఫలితం ఉండక పోదు. ఫలితం లేదంటే అది ప్రయత్నలోపమే. మొత్తం మీద పెళ్ళికొడుకుని తీసుకొచ్చారు. చూసింది పిల్ల. బజారుకెళ్ళి నప్పుడు ఏదన్నా వస్తువుకొనాల్నుంటే ఏ వస్తువు బాగుంటుంది అని చూస్తాంకాని అసలు ఏ వస్తువూ అక్కర్లేనప్పుడు బాగోగు

లతో పనేమిటి ? ఆ భావాన్నే చూపించింది. కాని తండ్రి అంగీకరించలే. ఫిడేల్ వాయించమన్నాడు. శృతి వేస్తూనే తీగలు తెంపేసింది. పాడమన్నాడు. అసావేరి ఆలాపించింది పెళ్ళికొడుకు 'గ్రాడ్యుయేట్' అన్న మాటే కాని వాడికి ప్రపంచ జ్ఞానం లేదు. సాయంకాలం 'రూప'ని కలుసుకున్నాను.

"ఏం ? పెళ్ళిచేసుకుంటావా ? ' తలకాయవాల్చి అడిగాను ఎంతో బాధపడుతుందని తెలుసు—

"పెళ్ళిచేసుకోటం తప్పని సరయితే ఈ మనిషికంటే వీధివెంబడిపోయే బిచ్చగాణ్ణి చేసికోటం నాకిష్టం ?" అంది చాలా బాధతో.

"వాళ్ళతో ఏమన్నావ్ ?" ప్రశ్నించా—

"మీా యిష్టంమీాద జరపండి నాకు మాత్రం ఈషత్తూ యిష్టంలేదని చెప్పాను" అంది విచారిస్తూ.

"నాతో అన్న మాటే వాళ్ళతోను అనలేక పోయినావ్ ?" అని అడిగాను.

"కన్నవాళ్ళయినా నీ అంతగా నా కష్టాల్నివాళ్ళు పంచుకోరు—సరేలే. ఇదివరలో నిన్ను నేనొక సహాయం అడిగాను. అది ఇప్పట్లో అవసరం ఏమంటావ్?" అంది నెమ్మదిగా.

ఆలోచనలు ఆవరించాయ్. ఆమె యే సహాయం కోరుతుందో నాకు తెలుసు. "అడుగు...అన్నాను—

"పెళ్ళి నిశ్చయమయితే ఆ నికృష్ట జీవితాన్ని నేను ఈడవలేను. చస్తూ బ్రతుకుటకంటె చావటంమేలు. అంచేత ఆ విషయంలో—నువ్వు సైన్సు స్టూడెంట్వి కనుక చాలా దగ్గర మార్గంచూపు" అని ఎంతో బాధతో అడిగింది— "బాకైనాసరే—పొటాషియమ్ సైనైడ్ అయినా సరే" అని మళ్ళీ అడిగింది.

"రూపా! అంతసాహసంవద్దు..." అన్నా.

"నా సాహసంతో నీకు సంబంధం లేదు—సహాయం చేస్తానన్నావ్ కనుక అడిగా" అంది. ఆమె దుఃఖవదనాన్ని చూసి సహించలేక "సరే" అన్నా.

"మరచిపోక" అంది.

ఆ మరునాడే నే నింకక్కడ ఉండలేక వెళ్ళిపోయ్యా— పెళ్ళినిశ్చయమైనట్టూ బయల్దేరి రమ్మనట్టూ ఉత్తరం వచ్చింది ఈలోగా వెడితే విపరీత పరిస్థితుల్ని ఏర్పరిచిన వాణ్ణవుతానని వెళ్ళలేదు. నాకు చెప్పకుండా 'రూప' సాహసించదు. పెళ్ళినాటికి వెళ్ళాను. ఏడుస్తూంది రూప.

"రూపా! వంశమర్యాద కోసం నీ జీవితాన్ని త్యాగం చేయి. నీ కిష్టంలేని బాధల్ని సహించు" అన్నా. చాలా కర్కశ శిక్ష అని తెలుసు.

"సహనానికే స్త్రీ జన్మించింది కాబోలు. తప్పదు. నీ మాట మీాద సహనాన్ని నేర్చుకుంటా" నంది. పెళ్ళై ఏడాదవుతోంది. సహిస్తూనేఉంది కష్ట జీవితాన్ని, ఇష్టం లేని భర్తతో కాపురంచేసే భగ్నజీవి ఆమె అని నిట్టూర్చాడు—



(40 వ పేజీ తరువాత)

సుభద్రమ్మ : ఈమె కొన్ని శతకాలు, దండకాలు చేసింది. వాటిలో ప్రధానమైనవి : కేశవ శతకము, కృష్ణ శతకము.

పందొమ్మిదవ శతాబ్దంలోని కవయిత్రుల శ్రేణి ఒకటి కూడాఉంది.

బండి బాపమ్మ : మీనాక్షి శతకం చేసింది.

రత్నాంబ : వెంకట రమణ శతక కర్త్రి.

చెలికాని చెల్లాయమ్మ : జానకీ శతకము, పార్థసారథి శతకము, ఈమె రచనలు.

—శ్రీ చింతగుంట హనుమంతరావు.



# స్త్రీలు : కవనము

సాహిత్య విభాగంలో స్త్రీ పురుష భేదం లేక పోవడమన్నది ఒక సంతృప్తికరమైన సంగతి. తక్కిన దేశాల్లో వలె, మన దేశంలోనూ, సరస్వతీదేవి తన పుత్రికల చేత న్యాయంగానే సత్కరింపబడ్డది. స్త్రీలు, తమ యొక్క నైపుణ్యానికి ఉచిత బహూకరణ పొందుటకు, సంఘంయొక్క స్థితిగతులు, కాలంయొక్క పక్షపాత బుద్ధి, దేశం యొక్క ఆచార వ్యవహారాలు, అడ్డగిస్తాయని చెప్పక తప్పదు. అయినప్పటికీ ఆంధ్రసారస్వతంలో కవయిత్రులు పూర్తిగా కరువై పోలేదు.

కవయిత్రులకన్నా, సాహిత్య విజ్ఞానంగల వనితారత్నములనే, మనం అధికంగా ఎన్నుకొనగలమేమో! కాకతీయ రాజ్ఞి రుద్రమదేవి లాంటి, అధికారంలోకి వచ్చిన స్త్రీలు, సామాన్యంగా సారస్వతాభిమానులే, సాహిత్య పోషకులే. ఉచ్చస్థితికిరాలేని మహానాను కంప ప్రదర్శకులయొక్క, విమర్శకులయొక్క, కరుణాపూరిత సాహాయ్యం, అప్పటికి ఇప్పటికి మనతో ఉండనేవుంది. దృష్టికి అగోచరంగా, తెరల మాటున తమ కవిత్వాన్ని వినేందుకు శ్రమ తీసుకొంటూన్న కర్ణ పుటాలున్నాయన్న జ్ఞానం, ఎందరో కవులకు విశ్వాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించేది. మన కవులయొక్క ఉద్రేక కారణమైనటువంటి, జ్ఞాన సంస్కారం కలిగిన స్త్రీల జ్ఞాపక చిహ్నాలను, పారంపర్యత మనకు ప్రసాదించినది. కృష్ణరాయని అంతఃపుర స్థితిగతులు రాచవనితల ఉన్నత విజ్ఞాన సంస్కారాలను ధృఢపరచ గలవు. మన కవయిత్రులలో ముఖ్యంగా వీరిని పేర్కొనవచ్చు.

కుప్పమ్మ : ఈమె నన్నయభట్టు మిత్రుడైన నారాయణభట్టు తనూజ, ప్రశంసనీయమైన కవయిత్రి.

కుప్పమ్మ : బుద్ధరాజు (1230-40) కూతురింకో ఆమె ఈమె, ఒక ద్విపద రామాయణం వ్రాయడంలో రంగనాథ కవికి సాయ పడ్డది. ఇంతే కాక బాలవితంతువుగా తాను పొందిన కష్టాలను గూర్చిన, హృదయాన్ని కరిగించేటి, శోకరస భరితమైన పద్యాలనుకొన్ని కవనం చేసింది. దమయంతి తన భర్తను ఎడబాసి పోతూ, దుఃఖించిన సందర్భంలో కుప్పమ్మ వ్రాసిన పద్యాలను అయ్యలరాజు రామభద్రకవి తన "సకల కథా సారసంగ్రహం"లో ఒకటిగా చేర్చాడు.

మొల్ల : (1509-30) ఈమె ఒక కుమ్మరి స్త్రీ. మొల్ల రామాయణం ఆంధ్ర సాహిత్యోత్తమ గ్రంథాలతోపాటు తనస్థానాన్ని అలంకరించింది. తెనుగు రామాయణాలన్నిటిలోకి మొల్లరామాయణమే జన సామాన్యంచేత విస్తారంగా పఠింపబడుతోంది. ఆమెయొక్క ఉత్తమశైలి, ఆమెను, తక్కిన ప్రసిద్ధ కవులతోపాటు తులతూగేలా చేస్తోంది.

మోహనాంగి : ఈమె కృష్ణ దేవ రాయని తనయ. "మరీచీపరిణయ"మనే శృంగార ప్రబంధ కవయిత్రి. నిండు సభలోకవుల విమర్శకోసం ఈ తన, గ్రంథాన్ని బయటు పెట్టింది మోహనాంగి. దాన్ని ఒక సద్గ్రంథంగా కవులందరు ఏకగ్రీవంగా అంగీకరించేరు. ప్రస్తుతం ఆ పుస్తకం లేక పోయినా, దాని ఉనికి మటుకు సాక్ష్య నిర్ధారితమే. సంకుశాల నృసింహకవి అనే నిరుపేదవద్ద ఓ పద్యాన్ని మోహనాంగి కొనడమనేది, ఆమె సత్కవనాభి నందనాబుద్ధిని విస్పష్టము చేస్తోన్నది.

ముద్దుపళని : తంజావూరు ప్రతాపసింహుని ఆస్థానానికిసంబంధిచినవేశ్య. "రాధికాస్వాంతము" లేక "ఎలాదేవీయము" అను గ్రంధాన్ని ఆనంద సంధాయక వాఘ్ఝరీ పరిపూర్ణంగా కవనం చేసింది. తక్కిన దాక్షిణాత్య రచనల వలెనే ఈ గ్రంథం చెడు సంస్కారంతో, చెడగొట్ట బడ్డదని వక్కాణించక తప్పదు.

తరికొండ వెంకమ్మ : ఈమె రచించిన కావ్యాల్లో ముఖ్యంగా పేర్కొన్న తగ్గవి, ద్విపద భాగవతము, రాజయోగసారము, వెంకటాచల మహాత్మ్యము, కృష్ణ మంజరి మొదలయినవి. ఉన్నత భావ గుంభితమైన ఆమె పద్యాలు, ఆ కాలపు నీచమైన సారస్వతాభి రుచులను వాగ్ధాటితో ఖండించాయి.

(39 వ పేజీ చూడుడు).

# పిల్లల శిక్షణ - శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిశి సుభద్రమ్మ

## మాతా శిశువులు

శిశువు తల్లిని ప్రేమించటం కూడా నోటిమూలకంగానే, తల్లి ప్రేమను పరిగ్రహించటం కూడా నోటితోనే. ఉదా :— బిడ్డ తల్లి పాలను త్రాగుతూ కొంత ఆకలి తీరగానే తల్లి పాలిండ్లలో ఆనందంగా ఆడుకోటం అందరం ఎరిగిన విషయమే. పాలను మ్రింగకుండా అట్టే నోట్లో పెట్టుకొని వింతవింతగా శబ్దాలు చేయటం, కాళ్లు చేతులను ఆనందంతో ఆడించటం, పాలు త్రాగుతూ, మానుచూ ఆడటం మొదలయినవి మనం చూస్తూవుంటాము.

ఇది "బిడ్డయొక్క ప్రథమ ప్రేమ ప్రదర్శనం" అన్న మాట. ఈ తథ్యాన్ని గుర్తించలేని తల్లికి ఓపిక ఉండదు. విసుగుతో పాలిచ్చుట మానివేసి చీదరించుకొనును. అట్టి సందర్భంలో బిడ్డ ముఖం ముడుచుకొని, ఎఱ్ఱబారిపోతుంది. పిడికిలి బిగించుకొంటుంది. దేహాన్ని బిఱ్ఱుగ బిగదీసుకొంటూ కెవ్వున కేకపెట్టుతుంది. మరల తల్లిపాలివ్వబోగానే బిడ్డయొక్క దేహం సడలి, ముఖంలో సంతృప్తి సంతోషాలు కనబడుతవి; అతి ఆతురతతో పాలు త్రాగుతూ ఆకలిని మాత్రమేగాక తన ప్రేమతృష్ణను తృప్తి పరచుకొంటుంది. ఇందువల్ల రెండు ముఖ్యవిషయాలు విదితమవుతవి. తల్లి బిడ్డకు స్తన్యమివ్వట మనేది ఆహారమివ్వటమే కాదు. తన ప్రేమనుకూడ ఇవ్వటం అన్నమాట. బిడ్డ ప్రదర్శించే ప్రేమకు అవకాశమివ్వకుండా విసుగుకొనుటగాని, అసలే స్తన్యము నివ్వక పోవటంగాని సంభవిస్తే, తల్లి బిడ్డకు తన ప్రేమను ఇవ్వక నిరాకరించినట్లు అవుతుంది. తల్లి తన బిడ్డకు పాల నిమిచ్చుటచేతనే, మాతా శిశువుల మధ్య సన్నిహిత సంబంధం, ఆత్మీయత పవిత్ర ప్రేమ ఏర్పడుతవి. కాబట్టి, తల్లి పిల్లకు స్తన్యమిచ్చి పెంచటం ఎంతఅవసరం, అమోఘం, పవిత్రకార్యం అనేది తల్లి గ్రహించుట అత్యవసరం. అయితే తల్లికి ఏ కారణం చేతనైనా పాలు లేక పోయిన యెడల, బిడ్డకు పోతపాలే ఆధారమవుతుంది. అలాంటి సందర్భంలో సాధారణంగా తల్లులు పాలబుడ్డిని పిల్లల నోటికి అందించి, అవసరవసరంగా త్రాగేలాగు చేస్తుంటారు; లేక పాలబుడ్డి బిడ్డ నోటినుండి జారిపోకుండేలాగున ఏర్పాటుచేసి తమతమ పనులమీద వెళ్లి పోతుంటారు. ఇలా చేసినందువల్ల బిడ్డ ఆకలి తీరవచ్చునుగాని తనివి దీరదు. తల్లి శరీర స్పర్శవల్ల కలిగే సుఖం కలుగదు. ప్రేమ తృప్తి చెందదు. (శిశువుకు ఆరంభంలోనే స్పర్శేంద్రియజ్ఞానం అభివృద్ధి చెందుతుందన్న విషయం గుర్తు తెచ్చుకోవాలి). అందుచేత, తల్లీ పిల్లల మధ్య దినదినాభివృద్ధి చెందే సన్నిహిత సంబంధం, అనురాగం, ఆత్మీయత, కొంత అరికట్టబడుతవి. ఇంతేగాదు. శిశు శారీరకాభివృద్ధికీ ఆటంకం కలుగుతుంది. ఒక దృష్టాంతం తీసుకొందాం. ఇంగ్లాండులోని ఒకానొక శిశు వైద్యశాలలో చేర్చబడిన కొందరు బిడ్డలకు రోగనివారణమయింది. కాని బలం కలుగ లేదు. తూకం హెచ్చలేదు. దినాలు గడచి పోతున్నాయి. డాక్టర్లు ఆలోచించసాగారు. తుదకొక నిర్ణయానికివచ్చారు.

"కేవలం టానిక్కులు, పుష్టికర ఆహార పానీయాదులు మాత్రం చాలవు. వానితోపాటు ప్రేమ అవసరం" అనే తథ్యాన్ని గ్రహించారు. బిడ్డలకు పాలు త్రాగించే సమయంలో లాలన చేస్తూ ముద్దులాడుట అత్యవసరమని నర్సులకు సలహా నిచ్చారు. అలా కొంతకాలం చేయగా బిడ్డలు చక్కగా కోలుకొన్నారు. తూకం అధికమగుతూ చక్కగ పెరిగారు. కాబట్టి, తల్లి స్తన్యమిచ్చే టప్పుడు చేయులాగే

బిడ్డను ఒళ్ళోపడుకో బెట్టుకొని బుజ్జగిస్తూ, ముద్దులాడుతూ పాలబుడ్డిని నోటికి అందించాలి. లాలించుతూ నెమ్మదిగా పాలను త్రాగించాలి.

కాని, బిడ్డను విడిచి పెట్టి పోకూడదు. అయితే, ఉద్యోగాలు, కూలినాలి చేసుకొని జీవించే స్త్రీలకంత తీరుబాటుకు అవకాశమేది అనే ప్రశ్న కలుగుతుంది. నిజమేను. పాశ్చాత్య దేశాల్లో మాతా శిశువుల శ్రేయస్సు కోసం అనేక సంస్థలు, సదుపాయాలు ఏర్పరుప బడియున్నవట. ముఖ్యంగా, సోవియట్ రష్యాలో, ప్రతి ప్రభుత్వశాఖకు, మిల్లుకు, ఫ్యాక్టరీకి సంబంధించినట్టుగా శిశుసంరక్షణ శాలలు స్థాపింపబడియున్నవట. ఆయా శాఖల్లో, మిల్లుల్లో, ఫ్యాక్టరీలలో పనిచేయు స్త్రీలు, తమ బిడ్డలను శిశుసంరక్షణ శాలల్లో చక్కని శిక్షణ పొందిన నర్సులకు అప్పగించి తమ పనులకు వెళ్ళిపోతారు. బిడ్డ వయస్సును బట్టి ప్రతి మూడులేక నాలుగు గంటల కొకపర్యాయం తమ బిడ్డలవద్దకు వెళ్లి పాలిస్తూ లాలన పాలన చేస్తూ కొంతకాలం గడిపిపోతారు అలాంటి సంస్థలను, సౌకర్యాలను సాధ్యమైనంత వరకు వెంటనే స్థాపించుట మన ప్రభుత్వ ప్రధాన కర్తవ్యం.

కాని, అంతవరకు ఏ శాస్త్రముకాని వృద్ధికాకుండ అట్టే కనిపెట్టుకొని కూర్చో జాలదు. అలాగే మానసిక శాస్త్రం కూడాను. ఈ నాడు ఈ శాస్త్రం, ధనికులూ, విజ్ఞానవంతులు అయిన ఏ కొద్దిమందికో ఉపయోగపడ వచ్చును. కాని ఉత్తరోత్తర సర్వప్రజలకు అందుబాటులోకి వస్తుంది. ఈ విషయాన్ని చక్కగా గ్రహించిన యడల బిడ్డకు స్తన్యమిచ్చుటలోగాని, పోతపాలతో బిడ్డను పెంచవలసిన సందర్భము ఏర్పడినపుడుగాని. తల్లి ఎంత మెలకువతో ప్రవర్తించుట అవసరమనే విషయాన్ని గుర్తించుకొంటుంది.

కొరకడం : సాధారణంగా బిడ్డకు ఆరవనెలలో పళ్లు రావటం ప్రారంభమవుతుంది. ఈ పళ్లు రావటంతో బిడ్డ మానసిక జీవితంలోనె మరొక నూతనదశ ఆరంభమవుతుంది. బిడ్డకు ఇంతవరకూ, నోటితో స్పృశించి గ్రహించుకొనుట, పాలను త్రాగుట మొదలగు వాంఛలు, లేక ప్రేరేపణలు (Impulses) మాత్రమే వుండినవి. ఇప్పుడు కొరకటం అంటే అధిక ఇష్టం.

నోటికి అందిన వస్తువులన్నిటిని కొరకటం. నమలటం పరిపాటి అయిపోతుంది. తల్లి పాలిండ్లను, తల్లి వ్రేలును, ఆట వస్తువులను—ఏది నోటి కందినా సరే—కొరకటమే ప్రధాన లక్షణమవుతుంది. బిడ్డకు మొదట పాలు త్రాగటం అనేది ఎంత ఆనందదాయకముగా వుండినదో, ఇప్పుడు కొరకటమనేది అంత ఆప్యాయంగా వుంటుంది. బిడ్డ ఈలా కొరకటానికి కారణాలు రెండు :

ఒకటి : పళ్లురావటానికి కలిగే దురదను తీర్చుకొంటుంది.

రెండవది : అనురాగాన్నీ, ఆగ్రహాన్నీ వెలిబుచ్చటానికీ, వస్తుగ్రహణం కొఱకూ కొరుకుతుంది.

బిడ్డలు, సాధారణంగా, తల్లి స్తన్య పానంచేస్తూ చటుక్కున కొరుకుతారు. కారణం, తల్లిమీద ప్రేమను ప్రదర్శించటానికి ఈలా కొరుకుతారు. లేక, తల్లి బిడ్డ నోటినుండి స్తనమును తప్పించితే ఆగ్రహంతో కొరుకుతారు. ఏడుస్తారు ఈలాంటి సందర్భంలో నోటికి శుభ్రమైన ఆటవస్తువు నొకటిని అందించి నెమ్మదిగా స్తనమును తప్పించాలి. బిడ్డ వద్దనే కూర్చుని కొంతసేపు లాలించి ఆలాచేస్తే బిడ్డకోపం చల్లారుతుంది ; కొరికే వాంఛ తృప్తిచెందుతుంది ; పళ్ల దురద తీరుతుంది. ఇంతేగాదు, బిడ్డకు కొరికే వాంఛ కలగటంలో దాని మానసిక జీవితంలో మరొక ముఖ్య దశ ప్రారంభమయిందని గ్రహించుకొని, తల్లి బిడ్డ అభివృద్ధికి తోడ్పడాలి.

(సశేషము).



# పిచ్చిమనిషి

మూలం : మొపాసా :: అనువాదం : ఆర్. రామనాథ రెడ్డి.

ఇదిగో...ఫ్రాంకో-ప్రష్యన్ యుద్ధం గురించి మీకో విచిత్రమైన కథ చెబుతాను...వినండి", అన్నాడు మాన్‌సేర్ డీ యెండోలిన్ తన స్నేహితుల నుద్దేశించి. ఎండోలిన్ చుట్టూ తన స్నేహితులు కొంతమంది కూచున్నారు. ఆ గది నిండా పొగబారి నల్లగాఉంది. అతనిలా కథను చెప్పడం మొదలెట్టాడు.

"పార్గుడీ కోర్‌మేల్‌లో ఉన్న మా యిల్లు మీరంతా యెరుగుదురు కదూ! ప్రష్యనుల ఆక్రమణ జరిగేటప్పటికి నేనక్కడనే యుంటున్నాను. మా యింటికి ప్రక్కగానే ఒకావిడ ఉంటుండేది. ఆమెకు ఒక విధమైన పిచ్చి. జీవితములో యెడతెరపిలేని విపత్తులవల్లనూ, బాధలవల్లనూ ఆమెకు మతి తప్పింది. ఆమె తండ్రి చనిపోయేటప్పటికి ఆమెకు యిరువది యేడేండ్ల వయస్సు. అప్పుడే ఆమె భర్తపోయాడు. పిమ్మట క్రొత్తగా పుట్టిన ఆమె ముద్దుల బిడ్డడుకూడ ఆమెకు దక్కకుండా పోయేడు. ఇవన్నీ ఒక్క మాసం వ్యవధిలో జరిగి పోయాయి. ఇల్లాంటి విషయాలన్నీ ఆమె జీవితాన్ని విషాదకరంగా మార్చివేసినాయి.

ఒక యింట్లో మృత్యువు సంభవించిందంటే ఆ యిల్లు అదోరకంగా ఉంటుంది కిళతప్పి. ఆమె యింటిలోని వారంతా పోయారు. ఇక మిగిలిందామె ఒకతే. అప్పటి నుండి ఆమె దుఃఖంతో మునిగి పోయి మంచం పట్టింది. తర్వాతామె ఆరు వారాలపాటు జ్వరంతో బాధ పడింది. అప్పుడామె స్థితి మరీ విషమించి పోయింది. కదిలేది కాదు. కళ్లు మాత్రం నీరసంగా కదిలేవి. మంచంపై అలానే జీవచ్ఛవంలా పడిఉండేది. ఇరుగు పొరుగు వాళ్లంతా ప్రయత్నించేవారు ఆమెను లేపడానికి, కాని వాళ్లు తన్ను చంపేస్తున్నారని భ్రమపడి వెర్రిగా పెద్ద పెట్టున కేకలు పెట్టేది. అదేమి ప్రమాదానికి దారి తీస్తుందో అని వాళ్లంతా ఆ ప్రయత్నం మానుకొనే వారు. ఇక ఆమె యెప్పటిలా మంచాన్నే కౌగలించుకొనేది. స్నానం చేయించడానికి బట్టలు మార్చుకొనడానికి పరుపు సరదడానికి మాత్రము ఆమెను లేపుతుండేవారు. ఆమెలో ఒక ముసలి నౌకరు కూడ ఉండి పోయింది. త్రాగడానికి నీళ్లూ అవీ అందిస్తుండేదామె.

ఆమె మనస్సులో ఆందోళన కలగడానికి కారణమేమై యుంటుందో యెవ్వరికీ తెలియదు. ఆమెకు యితరులతో సంబంధమేమీలేదు. ఎవ్వరితోనూ మాట్లాడేది కాదు.

ఒక వేళ, చనిపోయిన ఆమె బంధుగుల గురించి మనోవ్యాధిపట్టిందేమొ? లేక మరి విషాదచ్ఛాయల్లో ఆమె కలలు గంటుందా? కాక, ఆమె మేధస్సుచలనం ఆగిపోయిందా? ఏమైతే గానీయండి—ఆమెమాత్రం పదిహేను సంవత్సరాలపాటు అల్లా అచేతనంగానూ, పర సంపర్కం లేకుండాను ఉండి పోయింది.

అంతలో యుద్ధం వచ్చి పడింది. ఆంతే డిశంబరు మొదటి వారంలోనే జర్మనులు, కోర్‌మేలులో ప్రవేశించారు. వారికదంతా జ్ఞాపకమే. నిన్ననే జరిగినట్టుగా అనిపిస్తోంది నాకు. అప్పుడు నేను రాతి బండలుంటే—ముక్కలు చేదామని ఉపక్రమించాను. కాని అవి శీతలంలో ఘనీభవించి ఉండుటవల్ల ముట్టుకోడం నాతరం కాలేదు. అప్పటికే నాకు వాతం చేయడం మూలకంగా ప్రక్క కుర్చీలో జేరగిల బడ్డాను కిటికీగుండా విశాలాన్ని చూస్తూ! అప్పుడే దూరంగా పోతూన్న జర్మన్ సైనికుల అడుగుల చప్పుడు వినబడింది. చూస్తునుగదా! యెంతోమంది సైనికులు పోతున్నారు. నా కళ్ల ముందువాళ్ళు తమ ఆక్రమిత ప్రాంతాల్లోని తీగలపై తమ గుర్తులు పెట్టుకొంటూ పోతూన్నారు. ఆ యధికారులు-తమ సైన్యాల్ని స్థానికగృహాల్లో సరిదారు. నా మట్టుకు పదిహేడుమంది భాగం వచ్చారు. మా యింటిప్రక్క పిచ్చిమనిషి యింటికి డజనుమంది సిపాయిలు వచ్చారు. అందులో సేనాధిపతి గూడ ఉన్నాడు. అతడు ముక్కోపి...చాల దుడుకు మనిషి.

"మామూలుగా మొదట కొన్ని దినాలు శాంతంగానే గడిచి పోయింది. ఆ మనిషికి జబ్బుగా ఉందని అధికారులకు తెలిసింది. తెలిసినా ఆమెను చూడలేదు వాళ్ళు. ఆమెను గురించి అంత బాధపడనూ లేదు.—కాని ఆమె వీళ్ల సంగతి విని మండిపడేది. ఇష్టం వచ్చినట్లు తిట్టిపోసేది.

వాళ్ళు అడిగారు ఆమె జబ్బు యేమిటని—తీవ్రతరమైన విషాద పరిస్థితుల ఫలితంగా పదిహేను సంవత్సరాల పాటు అలానే ఆమె నీర్సపడి పోయిందని చెప్పారు. వాళ్ళదేమీ నమ్మలేదు. ఆమె అహంకారం కొద్ది పండుకుని లేవదని మాత్రం వాళ్లు అనుకున్నారు—ఆమె వాళ్ళ దగ్గిరకెప్పుడూ రాలేదు—వాళ్ళతో మాట్లాడనూ లేదు—

ఒకసారి సేనాధిపతి ఆమెను పలుకరించి చూడాలని వెళ్లి అన్నాడు "మీరు తప్పక లేవాలని నా ప్రార్థన. మీరు దిగి క్రింది గదిలోనికి వస్తే మేమంతా చూస్తాము." కాని ఆమె నీరసంగా అతన్ని చూసి ఊరుకొంది బదులు చెప్పకుండా. మళ్ళీ అతను "మీరు అహంకారంతో లేవకుండా ఉంటే సహించే వాడిని కాను. మీయంత మీరిపుడు లేవాలి. లేకపోతే లేచేటట్లు నేను చేస్తాను", అని హుంకరించాడు. కాని ఆమె వానిమాటలు వినిపించుకున్నట్లుగా కనబడలేదు. మాటమంతీ లేకుండా పరుండిపోయింది దాంతో అధికారికి మండిపోయింది. ఆమె అల్లా మాట్లాడకుండా ఉండడం తన ఆజ్ఞను తిరస్కరించినట్లుగా తోచిందా తనికి. చివరికి అతనన్నాడు: "సరే—నీవు గనక రేపు క్రిందికి రాకపోతే చూస్తానుగా" అని వెళ్లి పోయేడు రుస రుసలాడుతూ.

ఆ మర్నాడు నౌకరు ఆమెను దుస్తులు మార్చాలని తయారు పడింది. కాని ఆమె నిరాకరిస్తూ—వాళ్ళను సణగడం ఆరంభించింది. ఇంతలో ఆఫీసరు చటుక్కున పైకి వచ్చేడు. అంత ఆ నౌకరు—అతని కాళ్ళపైబడి యేడుస్తూ యిలా ప్రార్థించింది:

"అయ్యా! ఆమె క్రిందికి రాలేదు... ఆమెను... క్షమించండి. ఆమె చాల దుఃఖంలో మునిగిపోయి ఉంది." ఏమోగాని ఆ సిపాయికి కోపం వచ్చినట్లుగా కనబడలేదు. కాని—వెంటనే విరగబడి నవ్వడం ఆరంభించాడు. ఆ, తర్వాత, జర్మన్ భాషలో యేవో కొన్ని ఆజ్ఞలు యివ్వగానే వెంటనే కొంతమంది సైనికులు వచ్చి—ఆమె పరున్న పరుపు నాల్గువేపులా పట్టుకొని గాయపడ్డ మనిషిని తీసుకుపోతున్నట్లు మోసుకుపోయేరు—అయినా ఆ మనిషి కదలడంలేదు—ఎవరేం చేసినా సరే. వెనకాలే ఒక సిపాయి ఆమె కోకలూ, యితర బట్టలూ తెస్తున్నాడు. అప్పుడధికారి అన్నాడు: "నీవు బట్టలు యెల్లా మార్చుకోవో యెల్లా నడవవో యిప్పుడు చూస్తాంగా!"

అప్పుడు వాళ్లంతా "యిమవిల్లీ" అడవికేసి దారి తీసి సాగి పోయేరు—రెండు గంటల అనంతరం—వెళ్ళిన సిపాయిలంతా తిరిగి వచ్చేసారు. ఆమె నేం చేసారో, యెక్కడికి తీసుకు పొయ్యారో—యేమిటో యెవ్వడికీ తెలియదు. అంత మళ్లీ ఆమె జాడేలేదు."

"రాత్రనక పగలనక మంచు కురుస్తూనే ఉంది. విస్తారమైన మంచునురుగుల్లో, అడవులు, మైదానాలు కప్పబడి ఉన్నాయి. తోడేళ్లు అరుస్తూ మా యిళ్ల తలుపుల వరకూ వస్తుండేవి—కాని ఆ నిర్భాగ్యురాలు యేమై పోయిందో అన్న ఆలోచన నన్ను విడువలేదు. నేను ఆ తర్వాత ప్రష్యన్ అధికారులకెన్నో అర్జీలు పెట్టుకున్నాను; ఆమె గురించి వైనం తెలియజేయమని—కాని లాభం లేక పోయింది."

"వసంతకాలం రాగానే ప్రష్యన్ సైనికదళాలన్నీ మరలి పోయినాయి. దాంతో ఆవిడ యిల్లు పూర్తిగా ఖాళీఅయి పోయింది. ఆమె యింటి పెరటిలో గడ్డి దట్టంగా పెరిగి పోయింది. ఆమె వెంటనుండే ముసలిది ఆ శీతాకాలంలోనే చచ్చిపోయింది. ఆమె విషయమై యెవ్వరూ అంత బాధ పడినట్టుగా కనపడలేదు. నే నొక్కడినే ఆ విషయాన్ని గూర్చి ఆలోచిస్తూ ఉండేవాడిని. ఆ మనిషిని వాళ్లేచేసుంటారో లేక ఆ యడివినుండి తప్పించుకు పారి పోయిందా! లేక ఎవరేనా చూసి ఆమెను ఆసుపత్రిలో చేర్చారా! అని. కాని యే ఆలోచనా నా సందియాన్ని తీర్చలేక పోయింది. కాలం గడిచేకొద్దీ నాకాభయం, ఆలోచనా పోయింది.

"ఆకురాలుకాలం సమీపించడంతోటే అడవి పక్షులు కొల్లలుగా రావడం మొదలెట్టాయి. అప్పటికి నా వాత రోగం నిమ్మళించింది. అంచేత ఒంటరిగానే అడవికి బయలు

దేరాను వేట సరదామీద. కొంత సేపటిలోనే—లావుగా బలసిన నాలుగైదు పిట్టలను కొట్టాను. పిమ్మట మరోదాన్ని కొట్టేసరికి అది ప్రక గుంటలో పడిపోయింది. దాని నిండా చెట్లకొమ్మలూ ఆకులూ పడిఉన్నై. దారీ తెన్నూ లేదు. దానిని తీయాలనే తలంపుతో ఆ గుంటలోనికి వెళ్లనుగదా! ఒక మనుష్యశవం ప్రక్కన పడివుంది. నాకు వెంటనే పూర్వపు పిచ్చిమనిషి జ్ఞప్తికొచ్చింది. ఆ యుద్ధ కాలంలో చాలమంది చచ్చి ఉంటారు యీ అడవిలో. కాని నేను నిష్కర్షగా చెప్పగలను. ఆ శవం ఆ మనిషిదేనని.

హఠాత్తుగా నాకంతా అర్థం అయినట్లుగా అయింది. వాళ్లామెను ఆ ఘోరమైన చలిలో వదిలి పెట్టారు. ఆమె ఆ మంచులోనే తన ప్రాణాల్ని విడిచి పెట్టింది—తర్వాత శవాన్ని తోడేళ్లు పీక్కుతిన్నాయి. ఆమె పరుపు పెకళించి ఊలుతో పిట్టలు గూండ్లు అల్లుతున్నాయి—నేనప్పుడు చూడగలిగిందంతా ఆమె యొముకలు మాత్రమే."

—యుద్ధంవల్ల చాల అనర్థాలు కలుగుతాయి. ఇంతకీ మన పిల్లలు యెప్పటికీ యుద్ధాన్ని చూడకుండా ఉండాలని కోరుకుంటున్నాను."—



# దసరా పండుగ

శ్రీ. వి. లక్ష్మీ పార్వతిగారు

దసరా పండుగకు ముఖ్యమైన శోభను గూర్చునది బొమ్మల ప్రదర్శనము; దీని ప్రాధాన్యమును బట్టియే నవరాత్రి బొమ్మల కొలువు అని పేరు వచ్చినది. ఇదియొక కళా ప్రదర్శనము. ఈ ప్రదర్శనములో, ప్రతిగృహము, తన కళాభినివేశమును వెల్లడించుకొనును. ఇందు ప్రదర్శింప బడునవి, ఒక్క బొమ్మలు మాత్రమే కాదు. చేతితో తయారు చేయబడు అనేక రకములైన చిత్ర విచిత్రము లైనవి, ఎన్నో విధములుగా ప్రదర్శించ బడును. కళా పోషణమే దీని ప్రధాన లక్షణమని, బోధపడును, కళల యభివృద్ధికి రాజపోషణమును, ప్రజా పోషణమును, గూడ అవుసరము.

మన ప్రాచీనులు, నోములు, వ్రతములు మొదలగు, పండుగలను, ఆచరణలో పెట్టినారు. జాతీయ భావము, ఆనందోత్సాహము, పొంగి పొరలుటకై పండుగలనియు, పబ్బములనియు నేర్పరచినారు. ప్రజల సర్వతోముఖ జీవనమునకు, వారు ధర్మ కర్తలై, శాసనకర్తలై, ప్రజలయోగ క్షేమములను వహించిరి. తమ పనికాదని, వారుపేక్షించుకున్న జీవిత ఘట్టము లేదు. మత విషయములలోను, ఆర్థిక, సాంఘిక, లౌకిక, రాజకీయాది విషయములందును కూడ ప్రవేశించిరి. ఈ పండుగ, పబ్బములన్నీ, మన పూర్వులు ఆ చరణలో పెట్టిన ప్రకారము మనము జరుపు కుంటున్నాము.

మనము బొమ్మల ప్రదర్శనము చేసుకొనుటకు, శిల్పకర్మకారులు తమ ప్రజ్ఞాన కౌశలములను రూపింపచేస్తూ, మన నేత్రములకు, ఎంతో ఆకర్షణగా, తయారు చేయుచుందురు. శిల్పిలు తమ వస్తువుల ప్రచారమునకై, యాదృచ్ఛికముగ, నెచటనో యొక్కచోట, జరుపబడు ప్రదర్శనములపై, నాధార పడియుండనక్కర లేదు. దేశములోని ప్రతి గ్రామములోను, ప్రతి గృహమునందు కూడ, ఈ ప్రదర్శనము జరుగును, అందుచేత ప్రతివారికి బొమ్మలు మొదలగు ఆకర్షణ వస్తువుల కొరకు, నేత్రములు పటుగులెత్త గలవు. మనము ఎన్నో రకములైన చిత్ర విచిత్రములుగల వస్తువులను కొని, బీరువాలలో అమర్చి ఉంచుకుంటూ ఉందుము. ఇందుచే, శిల్ప, కర్మాగారులకు పోషణమునకు, మంచి మార్గమని కూడా చెప్పుటకు సందియము లేదు.

ఇది ముఖ్యముగా, బాల, బాలికల పండుగయను మాట మరువదగదు. పిన్నలను కేవలము సంతోష పెట్టుటయే కాదు. వారి రుచుల నుచిత మార్గముల నడిపింప జేయుటయు, పెద్ద వారి విధి. బాల బాలికల సహజములైన యానం దోత్సాహములను, పాలలో మజ్జిగ చుక్కలను జల్లి, విఱిచినట్లు, విఱిచి వేయను కూడదు. పిన్నల ఉత్సాహము, వాత్సల్యము, నవలోకించి వారికి సర్వవిధముల దోడ్పడుచు, ప్రసన్న చిత్తులైన పెద్దలను కనుగొని ఆనందించుట కన్న నెక్కువ నిదర్శనమేమి కావలెను ?



# మధ్య తరగతి స్త్రీలు ఉద్యోగాలు

* పి. సుశీల *

ప్రస్తుత విద్యావిధానం మన దేశానికిగాని, మన నిత్యజీవితంలో వుపయోగ పడడానికి గాని ఏమాత్రం అవకాశాలు లేవు. అందులో ఒక వృత్తిపై ఆధారపడే వారికి చదువుతో బాటే స్కూళ్లలో ఆ వృత్తిని నేర్చుకోవాలంటే, ఇప్పటి ప్రాథమిక విద్యగాని, ప్రణాళికలుగాని ఏ మాత్రం ఉపయుక్తంగా లేవు. నిత్య జీవితంలో జీవనోపాధిలో ప్రవేశించాలంటే ఇటు చదువుకే నాస్వస్తి చెప్పకోవాలి. లేదా! అటు వృత్తికేనా స్వస్తి చెప్పుకోవాలి. చదువుకుంటే తరువాత తాము చేయబోయే వృత్తి నిపుణత్వంకోసం కొంతకాలం శిక్షణపొందవలసిన అవసరం ఏర్పడుతూంది. ఈ రకంగా అన్ని తరగతుల ప్రజలకూ అందు బాటులోలేని ఈ ప్రస్తుత విద్యావిధానం, కొద్ది మందికే కొంచంగా వుపయోగపడటం ద్వారా చాలామంది తల్లి దండ్రులకు ఈ విద్యపైమోజు తగ్గింది. నామ మాత్రంగా ఎందుకూ వినియోగ పడని ఈ ప్రస్తుత ప్రాథమిక విద్యావిధానం, నిరక్షరాస్యత నిర్మూలనకు ఎన్ని స్కీములు వేసినా ఆ చరణలో ఫలితం కనిపించడం లేదు. ఇదివరలో బ్రిటిష్‌వారు తమ రాజ్యాంగ యంత్రానికి కావలసిన విధంగా విద్యా విధానాన్ని మార్చుకున్నారు. ఆ బానిస విద్యా విధానమే మనందరిపై రుద్దారు. ఇంక మనకు స్వతంత్రం వచ్చినా విద్యావిధానంలో ఏ మాత్రం మార్పు రాలేదు. ప్రణాళికలు, విద్యావిధానం మార్చక పోగా విద్యార్థులపై అంతు లెక్కువయ్యాయి. తల్లిదండ్రులపై పన్ను లెక్కు వయ్యాయి. తద్వారా విద్యాభివృద్ధి. స్త్రీ పురుషుల్లో ఎంత వరకు జరుగు తూందో ఆలోచించ వలసినదే!

ఈ పరిస్థితుల్లో ప్రస్తుత ప్రాథమిక విద్య మాత్రం స్త్రీలకు ఏదో చాకలి పద్దుకు, నిత్య జీవితంలో కావలసిన కొన్ని అవసరాలకు మాత్రమే వినియోగించేదిగా వుందిగాని, ముఖ్యంగా స్త్రీలకు, గృహావసరాలకు కావలసిన పనులలో తరిఫీదుగాని ఆరోగ్య శిక్షణ, మొదలయిన విషయాలుగాని, తమకు కావలసిన విధంగా నేర్చుకునే అవకాశాలు తక్కువ వడంవల్ల స్త్రీలకు నేటి విద్యావిధానం మీదమోజు తగ్గింది. కొన్ని కుటుంబాలు మాత్రం బాలికల్ని కూడా ఇంకా బడికి పంపుతున్నారు. గాని కేవలం నిత్య జీవితంలో సమస్యల్ని పరిష్కరించుకోడానికి యీ విద్య వుపయుక్తంగా లేదని అందరికీ తెలుసు.

కార్మిక కుటుంబాల్లోగాని మరీ పేదకుటుంబాల్లో కాని నూటికి ఎంత మంది చదువను వ్రాయను నేర్చు కుంటున్నారు? ఆలోచిస్తే వేయికి ఇద్దరికి మించి వుండరు! వీరికి కావలసినది ప్రస్తుతం నేర్పే లెక్కలు, తెలుగు, భూగోళం, కథలు, మొదలయినవి కావు. ఈ వర్గానికి కండరాలు బల పడే వయసు వచ్చింది మొదలు, జీవిత సమస్య పరిష్కారానికి కావలసిన వృత్తి విద్యలు కావాలి. ఇంక మధ్య తరగతి బాలికలకు అక్షరజ్ఞానం కల్గించుకునేంత వరకే యీ విద్య ఉపయోగ పడుతుంది.

ఈ నాడు స్త్రీలకు ఈ రకమైన విద్యా పునాదులుండడం వల్ల నూటికి ఇద్దరో, ముగ్గురో, చదువు కుంటున్నారు. మిగతా స్త్రీలంతా నిరక్షరాస్యతతో మ్రగ్గుతున్నారు!

ప్రాథమిక విద్య నభ్యసించే స్త్రీలే తక్కువయి నపుడు, వున్నతవిద్య నభ్యసించే స్త్రీల సంగతేమిటి? ఆర్థిక స్థితి బాగున్న కుటుంబాలకు మాత్రమే, ఈ వున్నత విద్య నభ్యసించడానికి అవకాశా లుంటాయి. ఈ రకంగా ఏ ఐదు వందలమందికో ఒక్క స్త్రీ మాత్రమే వున్నత విద్య నభ్యసించే పరిస్థితులున్నాయి, దీనికి మూల కారణం చాలా కుటుంబాలు దారిద్ర్యంతో భాధ పడడమే. పోనీ ఆ చదువుకుని వున్నతవిద్య నభ్యసించిన ఆ కొద్దిమంది స్త్రీలేనా ఆర్థిక స్వతంత్రం ఎంతవరకు పొందుతున్నారో ఆలోచిద్దాం!

నేడు సామాజిక ఆచారాలు స్త్రీల చుట్టూ చాలా అభివృద్ధి నిరోధకంగా తయారయి, కొంతమంది పురుషులు

# మధ్య తరగతి స్త్రీలు ఉద్యోగాలు

విద్యావతులైన స్త్రీలను వివాహం చేసుకున్నప్పుడు, వారిని కుటుంబ నిర్వహణలో సమానావకాశాలు కల్పించక బదులు తామే ఆ భారాన్ని మోయడానికి సిద్ధమవుతున్నారు. ఆ స్త్రీకి వుద్యోగాభిలాష వున్నా వుద్యోగం చెయడాన్కి అంగీకరించని కుటుంబాలు కొన్ని, పురుషులు కొందరు వున్నారు. ఈ రకంగా చదివిన చదువు వంటయింటి లోకే వినియోగపడుతూంది గాని, దేశానికిగాని, అటు సమాజాభివృద్ధికిగాని, ఇటు తాము ఆర్థిక స్వయం పోషకత్వంపొందడానికి గాని అవకాశాలు చాలా తక్కువగా వున్నాయి.

గ్రామాల్లో చదువుకున్న స్త్రీలకున్న అవకాశా లేమిటి? నర్సుగానో, టీచరుగానో, ఈ వుద్యోగాలు చేయడాన్కి కొద్దిగా అవకాశాలున్నాయి. ఉన్నతవిద్యావతులు గ్రామాల్లో అత్తవారు స్వంత ఆస్థిపాలును. భర్తలు కదిలి బయటకు రాలేని పరిస్థితులున్నప్పుడు ఇవన్నీ దూరం చేసుకొని ఏపట్టణంలోనో వుద్యోగం నిర్వహించడం కష్టం కదా! ఆ పరిస్థితుల్లో భర్త కూడా ఏ పట్టణవాసమునకో బయలు దేరాలి, అంతేకాని వున్న చోట భార్యా భర్తలు సమాన హోదాతో ఆర్థికసమానత్వం పొందడానికి అవకాశాలులేవు.

చదువుకున్న స్త్రీలు ఏ వుద్యోగమైనా నిర్వహించే అవకాశాలున్నాయా అంటే, అదీలేదు. ఈ మధ్య స్త్రీలకు అన్ని డిపార్టుమెంటుల్లో అవకాశాలంటూ ట్రాములు, బస్సులు మొదలయిన వాటిలో కండక్టర్లగాను, పోలీసుశాఖలోను స్త్రీలను నియమించారు. ఈ శాఖల్లో ఎంత మంది స్త్రీలు చేరి పనిచేసే అవకాశా లున్నాయి? చదువుకున్న స్త్రీలు టీచర్లుగా, నర్సులుగా కళాశాలల్లో స్కూళ్లల్లో వుద్యోగాలకోసం మోతపెడుతూంటే దిక్కులేకుండావుంది. సంస్కరణ అని అందుబాటులోలేని శాఖల్లో స్త్రీలను పిలిస్తే ప్రయోజనం ఏమైనా వుంటుందా? టైపిస్టులుగా, టెక్నీషియన్స్‌గా, ఇంకా తంతి, తపాలశాఖల్లో, ఆఫీసుల్లో స్త్రీలకు వుద్యోగాలిచ్చే అవకాశాలు కలుగ చేస్తే, బాగుంటుంది కాని, యీ కండక్టర్ల పనులెందుకు?

ఇదే ఇతరదేశాలకీ మనకీవున్న తేడా! నాగరికతదృష్టితోనేమి, సమానత్వ దృష్టితోనేమి, అన్ని రంగాల్లో స్త్రీలకు సమానంగా వుద్యోగాలుచేసే అవకాశా లున్నాయి. టైపిస్టులు, పరిశోధకులు, కళా వేత్తలు, డాక్టర్సు, టీచర్సు, ఇంజనీర్సు, ఒకటేమిటి అన్ని డిపార్టుమెంటుల్లో వుద్యోగనిర్వహణావకాశాలు కల్పించబడ్డాయి. ఇక్కడ మనకువున్న అవకాశాలైనా వినియోగించుకునే విధంగా ప్రభుత్వ విధానంలేదు. ఒంటరి స్త్రీలు ఏదైనా వుద్యోగం చేయడానికి అవకాశాలున్నాయేమోగాని సంసారాలతోనున్న స్త్రీలు వుద్యోగాలు నిర్వహించే అవకాశాలులేవు. ఎంతో శ్రమపడవలసిన అవసరం కల్గుతూంది. అందుకనే స్త్రీల అవకాశాలు దృష్టిలో పెట్టుకొన్న రష్యా, మొదలైనదేశాల్లో నర్సులను, క్రెషేలను ఏర్పాటుచేసి పనుల్లోకిపోయే స్త్రీలకుగాని ఆ బిడ్డల బాధ్యత తిరిగివచ్చే వరకులేకుండాచేసి సమాజాభివృద్ధికి కృషి చేస్తున్నాయ్! అ అవకాశాలు మనకిలేవుకదా! వున్న అవకాశాల్లో పని మనుష్యుల్ని నియోగించుకుందామన్నా చాలీ చాలని జీతాలతో ఆ సమస్య పరిష్కరిస్తూంది మన ప్రజాప్రభుత్వం.

స్త్రీలు ఆర్థికసమానత్వం పొందాలన్నా, సమాజంలో దేశంలో వుపయోగడాలన్నా, దేశంలో ఎంతో మార్పు అవసరం. దీనికిగాను విద్యకుపునాది అయిన ప్రాథమిక విద్యనుండేమార్పు తీసుకురావడం అవసరం. మనదేశాలలో ప్రాథమిక విద్య నభ్యసించే స్త్రీలే తక్కువ. పునాదే లేనిదే ఉన్నత విద్యనభ్యసించే స్త్రీలెంత తక్కువుంటారో ఆలోచించండి! వృత్తుల్లో ప్రవేశించే స్త్రీలకు విద్యా విజ్ఞానం కల్గించాలంటే ప్రాథమిక విద్యనుండి వృత్తివిద్యకు సంబధం కల్పించాలి.

చదువు పూర్తిఅయిన తర్వాతగాని, లేదా చదువు మానికాని కొంతకాలం ఆ యా వృత్తుల్లోవారు తరిఫీదు పొందనవసరం వుండదు. దీనిద్వారా అన్నివర్గాల స్త్రీలకు అవకాశాలుండుటచే నిరక్షరాస్యత నిర్మూలమౌతుంది. అసలు విద్యా రుసుముతో మగపిల్లలే చదువుకునే అవకాశాలు లేక నిరక్షరాస్యులవుతూంటే ఇంకా ఈ భారాన్ని పెంచడం ద్వారా విద్యాభివృద్ధికి ఒక పెద్దగొడ్డలి పెట్టయింది. ఈ పరిస్థితుల్లో ఆడపిల్లల విషయంలో చాలా అవరోధా లేర్పడుతున్నాయి. అన్నివర్గాల స్త్రీలకు ప్రాథమిక విద్యతో

బాటు వున్నత విద్యకూడా అందుబాటులో వుండాలంటే విద్యా రుసుము తొలగించాలి. చిన్న తరగతి కుటుంబాలకు కూడా అందుబాటులో వుంచాలి. మధ్య తరగతి స్త్రీలు కుటుంబాల్లో తమవంతు భాద్యత నిర్వహిస్తూ ఆర్థికంగా కూడ తమవంతు భాద్యత నెరవేర్చుకునే అవకాశాలు కలుగాలి. కొన్ని అనువైన వృత్తి విద్యలు చిన్న పనులు చూపించి స్త్రీలను కేంద్రీకరించాలి. ఉన్నత విద్య నభ్యసించిన స్త్రీలు గ్రామాల్లోకూడా తమవంతు కర్తవ్యం నెరవేర్చుకునే అవకాశాలు కలుగచేయాలి. ముఖ్యంగా చిన్న వుద్యోగాల్లోనున్న స్త్రీలు ఆర్థికంగా అవస్థలు పడుతున్నారు. రెండోప్రక్క కుటుంబ నిర్వహణ. ఉద్యోగం కష్టతరమౌతూంది. చాలీచాలని జీతాలతో అధిక ధరలతో అనారోగ్యాలపాలు కావలసివస్తూంది. వృత్తుల్లోకి వెళ్ళి నప్పుడు బిడ్డల భాధ్యత ప్రభుత్వమే నిర్వహించే అవకాశాలు కల్గించాలి. అప్పుడే స్త్రీలు వుత్సాహంతో వుద్యోగాలు చేయడానికి ముందుకు వస్తారు. దీనికి స్త్రీలంతా సంఘటితపడి విద్యా విధానములో మార్పుకు, ప్రభుత్వ వుద్యోగశాఖల్లో స్త్రీల కనుగుణ్యమైన మార్పుకు, ఆందోళన చేయాలి. స్త్రీల సమస్యల్ని ఇప్పటికేనా ప్రభుత్వము గుర్తించి సహకరిస్తుందా ? అనేదే నేటి సమస్య !



# పిలుపు



రచన: "రాజ్యశ్రీ"

బృందావన భూమిలో
సంధ్యారుణ ఛాయలో
పొన్నకడ కలుసుకో
పొరపడకుము క్రిష్ణయా.
పంటచేని నుండి గాలి
పసందుగ వచ్చేవేళ
పక్షులన్ని గూళ్లకొరకు
పరుగున పోయేవేళ
గొల్లబిడ్డ లావులతో
ఇల్లకు మళ్ళేవేళ
చందమామ తోడనే
చిన్ని చుక్కతోడనే
పొన్నకడ కలుసుకో
పొరపడకుము క్రిష్ణయా.
అత్తమాడ కుండగను
అతను చూడకుండగను
పాలు వెన్న మీగడలు

పంచదార ఫలములతో
తట్టనెత్తి నెట్టుకొని
త్వరత్వరగా నడచుకుని
దొడ్డి దారిగుండనే
త్రోవ తప్పకుండగనే
నిక్కముగ వచ్చెదను
నీతోడే క్రిష్ణయా.
నీ మురళి రవము వినగ
నిలచిపోయి మైమరతు
నీ కనుల కాంతిలో
నిలువలేక కరగిపోదు
ఎందులకో యీ వలపు
ఎరుగలేక బాధపడుదు
మాయగాడ కాదువో
మంత్రగాడ వౌదువో
కల్లగాదు నామాట
నల్లని క్రిష్ణయా.





బిస్కత్తులు అల్పాహారవిందులలో ఆదర్శమైన పదార్థము. జాతీయమైన తీపి, కారపు పిండివంటలను తయారుచేసికొనునట్లే మనము బిస్కత్తులుకూడ తయారు చేసికొనవచ్చును. ఒంటా, రెంటా చెడ్డప్పటికీ, యీ దిగువనసూచించిన విధంగా ప్రయత్నిస్తే, చక్కటి రుచికరమైన బిస్కత్తులు చేయలేకపోము. మైసూరుపాకు, జిలేబీ, బాదాం హల్వాలకన్న ఇది ఏమంత కష్టతరమైన పిండివంటకాదు. పూరీ, చపాతీ చేసికొనినంత సులభముగనే చేయవచ్చును. గనుక, ప్రయత్నించి చూడండి.

## మామూలు తియ్య బిస్కత్తులు

½ పా॥ గోధుమపిండి.
1 టీ స్పూన్ ఉప్పు.
4 టీ స్పూన్ల చక్కెఱ.
1 కాలు పడి పాలు.
4 టీ స్పూన్ల అప్పడాల సోడా.
2 పెద్ద చెంచాల నెయ్యి గాని 2 ఔన్సుల వెన్నగాని.

పిండిలో ఉప్పు చక్కెఱవేసి, అప్పడాల సోడా, నెయ్యివేసి, పొడిపొడిగా కలుపవలెను. కొంచముగా పాలుపోసి ముద్దచేయవలెను. దానిని పీటమీదవేసి చక్కగా సర్దించుకొనవలెను. ఒక పీటమీద పలుచగా పిండి జల్లుకొని, యీ సర్దించిన ముద్దను, అరంగుళము దళసరిగా వత్తవలెను. ఆ తరువాత, కావలసిన ఆకారములో ముక్కలుగా కోయవచ్చును. అటుపైన, ఒక పెనమునకు నెయ్యిపూసి, వీనిని దానిపైనుంచి, ఆ పెనమునంతయు, ఒక రొట్టెల పొయ్యిలో పెట్టవలెను. ఇట్లు 15 నిముషములుండునప్పటికి, ఆ బిస్కత్తులు చక్కగా కాలును.

ఏ సువాసన కావలెనన్న ఆ ఎస్సెన్సు కొంచముగా కలుపవచ్చు. కొంచముగా పాలు తడివి, పొయ్యిలో కాల్చిన, పైభాగమునకు మెరుపువచ్చును.

వలసినవారు, గుడ్డుయొక్క తెల్లసొనలో, తగుమాత్రము చక్కెఱ, నిమ్మరసముజేర్చి, బిస్కత్తులపై తడివికాల్చిన, యింకనూ రుచికరముగా నుండును.

## జామ్ బిస్కత్తులు

అంతయూ పైచెప్పినవిధముగాచేసి, ఆఖరున పిండిని పావు అంగుళము మందపు అప్పడముగా వత్తుకొని, అంతనూ సమానమైన గుండ్రని బిళ్లలుగా కోయవలెను. అందులో సగము బిళ్లలపై

మీరుకోరిన జామ్‌నుపరచి, జామ్ పై తిరిగి యింకొకబిళ్లను పెట్టి మెల్లగానొక్కి, అంచుల యందు పాలచేతితో నొక్కవలెను. కావలెనన్న పప్పులు, ద్రాక్ష కిస్‌మిస్ వగైరా పండ్లు, యీ జామ్‌తో జేర్చవచ్చును. అటుపైన పైవిధముగా కాల్చవలెను.

సెమోలినా బిస్కత్తులు

ఇప్పుడు మనరేషన్ షాపులలో దొరికేది సెమోలినాయే. దీనితోకూడ బిస్కత్తులు చేయ వచ్చును.

4 పెద్ద చెంచాల సెమోలినా.

6 పెద్ద చెంచాల మైదాపిండి.

వెనిల్లాగాని, బాదాం ఎస్సెన్సుగాని.

4 పెద్ద చెంచాల మెత్తని చక్కెఱ.

1 పెద్ద చెంచా రొట్టెల సోడా.

4 చెంచాల నెయ్యి.

మొదట చెప్పినట్లే యీ దినుసులన్నీ కలిపి సద్దించి, ఒక పెద్ద బల్లమీదపరచి, ముక్కలుగా కోయవలెను తరువాత బిస్కట్లు పొయ్యిలో కాల్చవలెను.



# ప్లాస్టిక్ సంచులు

20-వ శతాబ్దమున నవతరించిన వికారపు వస్తువులలో, ప్లాస్టిక్ సంచులను తప్పకుండా ప్రథమంలో వ్రాయాలి. తేలికగా నుండును, నీళ్ళతో కడగవచ్చును అని తప్పితే, దానిలోని అతిశయమేమీ కానరాదు.

రంగులలోనేమి, ఆకారములోనేమి, యీ సంచులు, భారత స్త్రీల చీర్లకు శృంగారమును బొత్తిగా కలిగించవు. గులాబి రంగులో కడుపు ఉబ్బిన చేప ఆకారాన్ని సూచిస్తూ, నట్టనడుమన ఒకజిప్‌తో బిగింపబడిన ప్లాస్టిక్ సంచికన్న వికార మైన వస్తువు, ఇంకొకటిలేదు. ఇట్లాంటి వెఱ్ఱికల్ప నలకు మితమే గాన రాకున్నది.

మరి అదెందుకో, ఆధునికులమనే స్త్రీల చేతిలో యిది ఒక పెద్ద అలంకారముగా భావిం పబడుతూఉంది. ఇది ఏమి వెఱ్ఱో—ఒక్కొక్క మారు, విమాన ప్రయాణపుసంచి అంతంత పెద్ద సంచులను కూడ మన స్త్రీలు భుజములకు వ్రేళ్ళాడకట్టుకుని, మురిసి పోవుచున్నారు—తీరా తెఱచిచూస్తే అందు టాయిలెట్ సెట్టుకన్న వేరొక సామాను ఉండదుగదా!

వీనికంటె, బర్మా సంచులే మన దుస్తులకు తగియున్నదనిపిస్తుంది. చేయటం సుళువు. ఉతికి, చక్కగా ఇస్త్రీ చేయవచ్చు. ఏదైనా లేత రం గులో చక్కగా ఎంబ్రాయిడరీ చేసికొని, ఓరలు కుట్టుకొనినచో, ఇది అన్నిరంగుల చీరతోనూ శృంగారముగానే సరి పోతుంది— చాలా చవుక కూడా. మన పరిస్థితులకు, పద్ధతులకు అనుకూ లంగా ఉంటుంది.

—పద్మ.



# పుణ్యస్త్రీ దే పూచీ

## (పుణ్యస్త్రీ చేయవలసిన సంఘసంస్కారం)

పుణ్యస్త్రీ చేయవలసిన సంఘసంస్కారములో ముఖ్యమైనది, అనాథస్త్రీ దుస్థితి నంతరింప జేయడం! ఈ పూచీ ఆమెదే! అసలు హిందూ సంఘములో వ్యక్తిత్వముగల ఆడదిగా పుట్టడంకంటే అడివిలో బండగా పుట్టడం మేలు. అందులోను మగడులేని మగువగా బ్రతకడంకంటే భగభగ మండే మంటలోపడి మండిపోవడం కోటిరెట్లు మేలు. ఇంక ఆ స్త్రీ, అగ్రకులాల్లో పుట్టినదైతే,—రామ రామ!— ఆ దురదృష్టవంతురాలు సాటి ఆడువాళ్ల నడుమపడే అవస్థా ఆవేదనా, అవమానమూ పరమ పాతకులు గూడా అనుభవించరానివిగదా!

ప్రాణానికి ప్రాణమై జీవనాధారమైన భర్త మరణించినందుకు భరించలేని బాధతో, అసహాయ స్థితితో నిలువెల్లా దహించుకొని పోతూన్న దానిని, సంఘం ఆచారాలనే పేరుతో పెడుతూన్న బాధ, చేస్తూన్న అన్యాయం, నాగరిక ప్రపంచములో వేరెక్కడైనా వుంటుందా?

మగడుపోతే జుట్టుండగూడదు, బొట్టుపెట్టుకోగూడదు, కళ్లకుకాటుక కరువు గావలసినదే. చివరికి కాస్త తిన్ననైన చీరైనా కట్టగూడదు. ఇక, యితర అలంకారాల మాట చెప్పేదేమిటి?

లేవగానె దానిమొగము జూస్తేపాపము, ఎదురైతే అపశకునము. పెండ్లిపేరంటాలలో తాంబూలార్హత లేదు సరిగదా, నలుగురి మధ్య నిలువడానికి గూడా తగదు!

దేనికింత శిక్ష? మగడు మరణించిడమనేది మహాపదగాని, మహాపరాధముగాదె!

పెండ్లాముచచ్చిన మగవాడికన్నా, మగడు పోయిన మగువజేసిన ఘోరపాతకమేమిటి? భార్యపోతే, చిన్నబోయిన మొగముతో ప్రాపంచిక విషయాలన్నీ విసర్జించి, యింట్లోనే కూర్చోవాలన్న నిర్బంధము లేదే మగవాడికి. "అలా మతిచెదర గొట్టుకుంటే యెలాగ? ఏదో వ్యాపకము కలిగించుకుని మరిచిపోవాలిగాని" అని ప్రోత్సహించి ప్రపంచంలోకి తిరిగి తీసుకువచ్చి ఆదరిస్తారే మగవాడిని. కాని, అదే ఆడుదైతే, (భరింపలేని బాధతో మగ్గిపోయే ఆకొత్త రోజుల్లో ముఖ్యంగా,) యే చిన్నవ్యాపకము మీదికిగూడా రవ్వంతైనా మనసు మళ్లించడానికి సావకాశము లేకుండా, మూలగదిలోనె గూచుని, తలుచుకు తలుచుకు కుమిలి కృశిల్లిపోవడమేగదా మర్యాద లక్షణం! భర్త పోయిన దానిని మూలబడినదనడము లోకోక్తియే గదు? ఇదెంతటి కటిక ఆచారమో వేరేచెప్పాలా?

అతిచిత్రంగదా మన స్త్రీ సంఘం! పైల రోజులైనా వెళ్ళకుండగానే పెళ్లిమాటలు మొదలుపెడతారు మగవాడికి వీధిలోని పెద్దలే గాకుండా, యింటిలో ముసలమ్మలు గూడాను. కాని, అది ఆడదానికే మారుమనుమంటే,— అమ్మయ్యో!—ఇంకేమైనావుందా! అమ్మలక్కలందరూ సొట్టపడేలాగ బుగ్గలు నొక్కుకుంటూ నిర్ఘాంత పోరూ? దేనికో అంతనీచం, అంత ఆశ్చర్యమూను? ఆ మాటకువస్తే, ప్రస్తుత పరిస్థితులలో, మగవాడికన్నా ఆడదానికే మళ్ళీ పెళ్లి తప్పనిసరి అవసరమేమో? చచ్చిన తర్వాత మరో లోకంలో గలిగే ఆముష్మిక సమస్యా పరిష్కారం గురించి నాకు తెలియదుగాని, బ్రతికుండగా యీలోకంలో ఆర్థిక సమస్యా పరిష్కారం పెళ్లివల్లతీరుతోంది, నూటికి తొంభైమంది ఆడవాళ్లకి. గణించుకునే వాడు గనుక భార్యలేక పోయినా, మగవాడు తన అవసరాలన్నీ యెలాగైనా తీర్చుకో గలడు. కాని, బాధ్యతవహించి భరించే భర్తగతిస్తే, గణనలేని ఆడుది బ్రతికేదెలాగు? దాని బాధ్యతవహించి పోషించేదెవరు? చిన్నతనమునుంచి గృహిణి ఉద్యోగానికే దిద్దితీర్చబడ్డ ఆడది, మధ్యలో దురదృష్ట వశాత్తూ ఆ యజమానిని కోలుపోతే అది యింకేమి పనిజేసి బ్రతక గలదు? ఏ చుట్టపక్కాల అండనో యింత చాకిరి జేస్తూ జీవచ్ఛవములాగ బ్రతుకు సాగించ వలసినదేగాదూ? అంతకన్నా, యిం

కోకడిని గట్టుకొని, చాకిరీ ఆ ప్రభువుకే జేస్తే యింతకన్నా నయమని అనిపించడం తప్పా? అసహజమా? ఆలోచనా శక్తిగల ప్రతివారూ ఎవరి మట్టుకువారు ఆలోచించి యీ విషయం తమదిగా ఆలోచించుమని చూడండి. ఏదీ మన స్ఫూర్తిగాచెప్పండి, అది తప్పనీ, అసహజమనీ అనగలరా?

ఇలాగనడం, మగడు మరణించిన ప్రతి ఆడుదీ మళ్ళీ పెళ్లి జేసుకుని, తీరాలనిగాదు సుమండీ. వేలకువేలు కట్నాలు గుమ్మరిస్తేనేగాని, నవయవ్వనలైన కన్నెలకే కల్యాణం గావడం బ్రహ్మాండమంత పనిగానున్నప్పుడు, నలుగురి బిడ్డల తల్లై, నడి వయసులోనున్న వితంతువును పెండ్లాడడానికి పెండ్లికొడుకు సిద్ధంగా యెదురు వస్తాడనీగాదు. సిద్ధంగా ఎదురు వస్తాడా? రాడా? అన్నది వేరు మాట. కాని, యెవరైనా సరే మారుమనువు జేసుకోదలచితే చేసుకో గలిగితే, వెక్కిరించి వెలిబెట్టరాదన్నదే నా యుద్దేశము. పెండ్లి ఆడడమనేది ప్రత్యేకవ్యక్తి సమస్య. అది యెవరి పరిస్థితుల బట్టి వారు నిర్ణయించుకోవలసిన విషయం.

ఇక జుట్టు దియ్యడమంటే శిరచ్ఛేదం జేయడమన్న మాటగామా? ఏ ఘాతుక కృత్యము జేసినదని యీ శిక్ష? అది అంతా సన్యాసాశ్రమ స్వీకారలక్షణమన్నారు కొందరు. ఓహో! ఎంత ఘనత!! అయితే, మగవాడి కక్కరలేని యీ బలాత్కార సన్యాస మాడదాని కెందుకో? సర్వ సౌఖ్యాలూ త్యజింపజేసి, బలాత్కార సన్యాస మిప్పించి, యీ మహాపదవి గల్పించి అదనంగా అనాథకిచ్చిన విశేషావకాశాలు, మహాగౌరవము యేమిటో యెవరైనా చెప్పితే యెంతో సంతోషిస్తాను. జంధ్యాలు తెంపుకున్న మగవాడికి సమస్త బాధ్యతలూ వదలి పోతున్నాయి. పూట కొకరింట, పిండివంటలతో, (పాదపూజలతోసహా) నిర్భీచీగా, మహాగౌరవంగా జన్మసాగిపోతోంది. కాని, అనాథ మెడలో మగడు గట్టిన త్రాడు తెంపి, తల్లి పెట్టిన బొట్టు జెరిపి, సువాసినికి గలిగే గౌరవ సౌఖ్యాలే వదలించారుగాని యే బాధ్యత వదలించారు? దానిని కూర్చోబెట్టి పూజిస్తున్న యిల్లేదీ నాకు కనుపడలేదు.

మగడులేని ఆడది చావకూడదు, పూర్తిగా బ్రతకగూడదు, సగముచచ్చి బ్రతకాలి. దేనికో? అన్నదమ్ముల యింటనో, అక్కచెల్లెండ్ల యింటనో, బిడ్డల దగ్గరనో, ఆ జన్మాంతం చాకిరి చెయ్యడానికా?

ప్రియ వియోగమువల్ల కలిగె హృదయావేదన, స్త్రీపురుషులిద్దరికి వుంటుంది. సంఘం జాలితో ఆదరించవలసిన సమయమే అది. అటువంటప్పుడు, అబలయైన ఆడుదాని జీవితంలో, బాహ్య వేషములో యెన్నెన్నో హృదయ విదారకమైన మార్పులు దెచ్చి, యింత క్రూరంగా వెలితి బెట్టడము మహాఘోరము గాదూ?

“ఆ! ఎప్పటిమాటలో చెప్తున్నావు, ఇప్పుడివన్నీ వున్నాయేమిటి? మరేం మగ్గిపోవడం లేదు. చదువు సంధ్యలు నేర్చుకుని నిక్షేపంలా తిరుగుతున్నారు” అనవచ్చును, కొందరు. పట్టణాలలోనున్న ఇప్పటి బాల వితంతువుల విషయంలోనైతే కొంతవరకూ నిజమేగాని, పల్లెల్లోనున్న మధ్యవయస్కుల అవస్థలో (ఒక్క జుట్టు విషయం తప్ప.) అట్టే మార్పేమీ లేదనడం యెంత మాత్రమూ అతిశయోక్తి గాదు. ఒకవేళ, కాస్త వ్యక్తిత్వమున్న యే యువతైనా, ఆ ఆచారాలకు రవ్వంత వ్యతిరేకంగా మసలితే, దానిని హృదయమేలేని తెంపరిగా భావించి, నిరసనతోనె చూస్తారు. ఇటేడు తరాలకూ అటేడు తరాలకూ తలవంపులుదెచ్చినదని యనుకుంటారు. బాల వితంతువులకైనా, చదివి స్వతంత్రముగా బ్రతికే సావకాశాలు పురుషులిచ్చారేగాని, తమతోమామూలుగా కలిసిమెలసి సమానంగా బ్రతికే సావకాశాలు గృహిణీ సంఘ మియ్యలేదు. పదిహేనేళ్ల బాలికగానియ్యండి, పదిమందిబిడ్డల తల్లిగానియ్యండి, భర్త పోతే, యికనా స్త్రీకి గృహిణీ సంఘంలో సమాన స్థానమే లేదు.

సహగమన నిషేధంవల్ల, వితంతు స్త్రీ శరీరం మంటలోబడి కాలిపోకుండా మహాపురుషులాపగలిగారు. కాని, మానావమానాలకు కదిలే హృదయమూ, సుఖ సంతోషాలు కోరే మనస్సుతో వెచ్చటి నెత్తురు ప్రవహించే తనువు, అనాథవన్నదన్న మాట, దయామయులైన సాటి స్త్రీలేమరచినప్పుడిక ఆ శరీరముండి మాత్రమేమి సుఖము? ఇన్ని మార్పులతో ఆ తనువుండీ, ఆ కష్ట జీవితము నిల్పుకొని మాత్రము పొందే సౌఖ్యమేమిటి? ఆహీనతతో, నిరాశతో, అనుక్షణ

## పుణ్యాస్త్రీ దేపూచీ

మూ అంగుళ పంగుళము చొప్పున కనపడని మంటలతో దహించుకుని పోతూ సాటివారిలో నాసిగా బ్రతికే కన్నా, ఆ వెనకటి సహగమనమే సౌఖ్యమేమో!

ఈ బాధలన్నీ శాసనాలు చెయ్యడంవల్ల పూర్తిగా నశించేవిగావు. మాటవరుసకు, వితంతు వివాహ చట్టం వున్నది. కాని, దానికి సంఘామోదము లేదు. పునర్వివాహం జేసుకున్న స్త్రీ, సంఘంలో వెలిగానే బ్రతుకవలసి వస్తోంది. దానికీ పిల్లలకూ, చట్ట ప్రకారం వారసత్వపు హక్కే గలిగిందిగాని, సంఘంలో సమాన స్థానము గలుగలేదు. కనుక, యిటువంటివి కేవలం చట్టాల మార్పుతో తీరవు. సంఘ దృష్టిలో మార్పు గలగాలి. అభివృద్ధికి మార్పత్యవసరమని వేరే చెప్పేదేమిటి? అది ప్రత్యేకం పురుషులొక్కరే తలపెడితే నెరవేరేవి గావు. పూబోడులు గూడా పూనుకుంటేనే కొనసాగుతుంది. భర్తలేని భామపడే సాంఘికమైన అవస్థా, ఆర్తీ, స్త్రీయే తీర్చాలిగాని, పురుషుని నెపపెట్ట నవసరంలేదు. స్మృతులూ, ధర్మశాస్త్రాలూ, వ్రాసిన పూర్వీకులేమివ్రాశారో నాకు సరిగ్గా తెలియదుగాని, ప్రస్తుతం శాసనాలుజేస్తున్న పురుషులు, యేకష్ట పరిస్థితిలోనున్న స్త్రీనైనా ఆదరించాలని ఆత్రపడుతూనె యున్నారు. అదేమి కర్మవిశేషమోగాని, సహజకరుణాంత రంగలూ, క్షమాశీలలూ అయిన తరుణుల సహకారమే తక్కువగా నున్నది. కనుక కోమలాంగులందరకూ, అందులోనూ ముఖ్యముగా...కడిపెడు బిడ్డలగని, కష్టసుఖములునాటి, దయార్ద్ర హృదయలని పేరుమోసిన పుణ్యాంగనలందరకూ నా విన్నపమేమంటే ...మగడు పోవడమనేది మహత్తరమైన ఆపదగాని, మహత్తరాపరాధముగాదని గట్టిగా గుర్తించండి. ఆ ఆపదపైబడకుండ గడచి బ్రతకడ మెకరి నెర్పులో లేదు సుమండీ! ఆ దురదృష్టవంతురాలి నాదరించండిగాని ఆచారాల పేరిట మరింత చిన్నబుచ్చి, ఆర్తి బెట్టకండి. ఆమె బాహ్య వేషములో యేవిధమైన మార్పులనూ అంగీకరించకండి. అదే ఆపదలోనున్న పురుషునెలాగ జూస్తారో స్త్రీని గూడా ఆ తీరునే జూడడమలవాటు జేసుకొనండి! పెండ్లి పేరంటములకింటికి బిల్చి, బొట్టు తాంబూలములిచ్చి సమాన గౌరవాదరాలు చూపండి. బొట్టు, ఒక్క సువాసినీ లక్షణమేనని తలవకండి. బొట్టు మన జాతీయ చిహ్నము. బొట్టిచ్చుట గౌరవసూచన! పురిటిశుద్ధినాడు పసుపురాసి నీళ్లుబోసి నూరేళ్లు వర్ధిల్లమని దీవించిపెట్టినవి, బొట్టు కాటుకలు—ముచ్చటతో, శ్రద్ధగా తల్లి పెంచినవి పెన్నెరులు. మగనితో మగడేయియ్యగలిగిన సుఖసంతోషాలు సమాప్తమై పోయినది చాలక, వీటన్నిటిని గూడా లేకుండజేసి నొప్పించడమన్యాయముగాదూ!

ఇంటికిబిల్చి ఆదరించవలసినదిల్లాలు. అనాథదుస్థితి నంతరింపజేయడం గూడ గృహిణికి సంఘ బాధ్యతలలో ముఖ్యమైనదని భావించండి. ఆపదలోనున్న వారి నాదరించడం మానవజన్మఫలం. ఆర్తిలోనున్న వారి నాదరించి అర్థముజేసుకున్న వారే పరమేశ్వరునికి సన్నిహితాప్తులని మరవకండి... విశాల హృదయులగు పురుషులీ ఆశయాలని ప్రోత్సహిస్తారని, ఉత్తమ యిల్లాండ్రందరూ యిది కొనసాగిస్తారనీ నమ్మికతో నే నిప్పటికి సెలవు దీసుకుంటునాన్నాను.

—వి. కె. మణి.



### మా చందాదార్లకు, చదువర్లకు, తదితరులకు

దీపావళిసంచిక అన్నప్రకారము 10 వ తేదికి అందజేయలేకపోతిమి. 15 వ తేదికి అందరకు జేరునట్లు ఏర్పాట్లు చేయుచున్నాము. ఈ కారణముచే నవంబరు సంచిక గూడ నాల్గురోజులాలస్యమగును. తరువాతనుండి యథాప్రకారముగా ప్రతీనెలా 1 వ తేదికి పత్రిక ప్రచురింపబడును.

—సంపాదకురాలు.

# భారతమహిళలు

* శ్రీ చామర్తి కనకయ్య *

ప్రపంచమునందు అనాదినుండియు భారతనారిదే అగ్రశ్రేణి. ఆమె శాసనమునకు తిరుగు లేదు. ఆమె పరాక్రమమునకు అడ్డులేదు. ఆమె వాంఛకు కొఱతలేదు. ప్రాచీనమునుండియు భారత మహిళ స్వతంత్రురాలే!

ఆనాటి సంఘములో ఆమె కత్యంత గౌరవ ముండి. "స్త్రీ పురుషునకేవిధముగనూ తీసిపోదు" అని ఋజువుపరచిన మహిళామణులానాడు భారతదేశములో వేలకొలది ప్రభవించిరి, ప్రాచీన కాలములోనే అన నేల? మధ్యకాలములో, నేటికికూడ భారతనారికి ప్రపంచ మహిళలలో విశిష్ట స్థానం ఉంది—

భర్త అలసటచెంది మూర్ఛపోగా తన విశఖమ్మునచే శత్రువును జయించిన వీరనారీ శిరోమణి 'సత్యభామ' భారత మహిళా రత్నము.

కింకర్తవ్యతా విమూఢులై, తలలు వాల్చి యుద్ధసన్నద్ధతకు విముఖులై తటపటాయించుచున్న భర్తలను ప్రోత్సహించి పౌరుషోపేయులనుచేసి, విస్మరించిన రాజనీతిని జ్ఞాపకముచేసిన విదూషీమణి 'ద్రౌపది', భారతనారీ తేజఃపుంజము.

వీరిరువురే యననేల? ఇంకనూ పెక్కుమంది స్త్రీలు ప్రాచీన కాలములో పురుషులకు కూడ నీతిగఱపుచు స్వేచ్ఛామారుతముల నాస్వాదించలేదా?

ఇవియన్నియు పురాణ కథలందురు—పోనీ, మొన్న మొన్నటి వీర ఝాన్సీలక్ష్మీభాయి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరములో నొక విద్యుత్కాంతి కాదా? ఆ రోజులలోనూ, ఈ నాడుకూడ, పాశ్చాత్య చరిత్ర కారులకు గూడ గుండెదల్లడించునటుల యుద్ధము చేసినదికదా? ఒకయుద్ధమేయననేల? సంపూర్ణరాజనీతి ప్రౌఢిమ, దాస్యచ్ఛేదనాతత్పరత, బలశౌర్య సమైక్యతా సమ్మేళనమేకదా వీరభారత ఝాన్సీ?—

నేటి అరుణా అసఫాలీ, విజయలక్ష్మి పండిట్, చనిపోయిన సరోజినీదేవి భారత నారీ మణులలో అగ్రగాములు. ఒకామె ఆకలిగొన్న ఆడసింహమయితే, మరియొకతె అత్యంత మేధావి, విదూషీమణి; వేరొకతె అపరసరస్వతి. వీరి నామములు దశదిశల మారు మ్రోగుట లేదా?

కాని, ప్రాచీనకాలమునుండీయు నేటివఱకు భారతనారి, ప్రపంచ మహిళలలో విశిష్టతనాక్రమించుకొన్నదన్న, ఆమె భారతీయ సంస్కృతిని విస్మరించక పోవటమే; పాశ్చాత్య దేశాలకు గుడ్డకట్టుట నేర్పిన భారతీయ నాగరికతావలంబనమున అప్రమత్తతగా నుండుటయే, ప్రబలకారణము? జైహింద్!



వినోద రచన

వై. ఎస్. రావు.

# అనుకోండి

ఒకప్పుడు నా గురించి చాలా చాలా అనుకునే వాడ్ని. కాని కాలం మారుతున్న కొద్దీ, విజ్ఞానం అలవడుతున్న కొలదీ, నేను మొదట్లో అనుకున్న వాటిని మార్చుకునే ఈ "అనుకోవడం" అనే పదం, ఒకసారి నాకు పెద్ద విప్లవాన్ని కలుగ చేసింది. అనుకోవడం రెండు విధాలను కుంటాను! ఒకటి, మనస్సులో అనుకుని, దాన్ని పైకి తెలియ పర్చడం. రెండు, మన మనస్సులోనే ఉంచుకోవడం. ఇందులో రెండవది కొంచెము ప్రమాదకరమైనదని నేనను కుంటాను. ఎందుకంటే ఒక వస్తువును గూర్చో లేక ఒక సంఘటను గురించో ఒక విధమైన అభిప్రాయాన్ని మన మనస్సులో అనుకుని, పైకి చెప్పక, దాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేక లోపల బాధ పడుతాము. నేను చెప్పేది పురాణం కాదండి. నా కళ్ళ ముందు, నా స్నేహితులు మొదలైన వారికి, ఆఖరికి నాకే, ఈ అనుకోవడం లోనే జరిగిన సంగతులు చెప్తాను వినండి.

"హల్లో! మీరేనా ఈ కళామందిరం డాన్సుటీచర్?" అని అన్నాడు, ఒకతను కారు తలుపు తోస్తూ బయటికి వచ్చి.

"నో, సారీ! నేను కాదండి! నేను మైలాపూర్ లేడీస్ క్లబ్ సెక్రటరీనండి" అన్నది, ఒక నడివయస్సు స్త్రీ వయ్యారంగా తల వూపుతూ"

"అరెరే! పొరపాటైంది క్షమించాలి. మీరు కళామందిరంనుండి బయటికి రావడం చూసి, మీరే డాన్సు టీచరయి వుండాలి అని అనుకున్నాను"

"అబ్బే దానికేం లెండి, ఫరవాలేదు. నమస్తే"

"పొరపాటుగా మిమ్మల్ని డాన్సు టీచరనుకొని పలుకరించాను; యిప్పట్నుండీ మనం పరిచయులం. నా కారులోనే మిమ్మల్ని మీ యింటిదాక దిగబెడతాను రండి"

"థేంక్స్" అంటూ ఆమె కారులో కూర్చుంది. చూసారా! ఈ అనుకోవడం ఎంత గమ్మత్తైన పరిచయం చేసిందో. యిలాగే యింకా కొన్ని రకములైన అనుకోడాలు వున్నాయి.

యిద్దరు యువకులు ఒక రోడ్డుమీద పేవ్‌మెంట్ మీద సిగరట్లు కాల్చుకుంటూ యిలా మాట్లాడుకుంటున్నారు.

"ఒరేయ్ మూర్తీ, అటు చూడరా...అటు...అటు"

"ఏం లేదే"

"ఏడిశావ్... వెధవా"

"అక్కడ ఏమీలేందే"

"ఏం లేదేమిటి నీ మొఖం...అదుగో వస్తున్న అమ్మాయిని చూడరా"

"ఆ! చూశాను చాలా బాగుందిరా"

"ఆ అదేరా ఎప్పుడు చూసినా, అలా తల వంచుకునే పోతుందిరా. ఒకసారైనా యిటు చూస్తుందేమో అని రోజూ యిక్కడే వుంటానురా. కాని ఏమి లాభం కనుపించదు.

"ఒరేయ్ నువ్వు యిక్కడే వుండు, నేను ఆ అమ్మాయితో మాట్లాడుతాను"

"ఆ అమ్మాయిని నువ్వు ఎరుగుదువురా!"

"అదంతా నీ కెందుకు చూస్తూ వుండు" అంటూ మూర్తి గబగబా, ఆమెను వెనకాలే సమీపించి, వెనకనుండే "ప్రభా, ప్రభా" అని అరుస్తూ ఆమె ముందు నిలబడ్డాడు. ఆ యువతి కళ్ళెఱ్ఱజేసి ముఖం చిట్లించింది.

మూర్తి చాల బాధపడ్డ వానివలె నటిస్తూ "అయ్యో మీరా, నా చెల్లెలు ప్రభ అచ్చంగా మీలాగే వుంటుందండి. కాకినాడకి వెళ్ళింది. మాకు తెలియపర్చకుండా వచ్చిందేమో నని భ్రమపడ్డాను. చాలా దగ్గరికి వస్తేగాని తేడా కనపడ

లేదు. వృధాశ్రమ కలిగించినందుకు క్షమించాలి" అన్నాడు నొజుకుంటూ.

ఆమె ముఖంలో వెంటనే ఒక చిరునవ్వు కనపడింది. "నిజంగా! మీ చెల్లెలు ప్రభ నాలాగే ఉంటుందాండి?"

"ప్రమాణంగా మీలాగే వుంటుదండి!"

"అలా అయితే ఈసారి మీరు మీ చెల్లెలు వస్తే నాకు తప్పక చూపాలి. అదుగో, అదే మా యిల్లు. నాకు కవలలన్నా లేక యిద్దరు స్త్రీలు ఒకే పోలికవున్నా చూడ్డానికి మహాసరదా."

"తప్పకుండాను మా చెల్లెలనుకొని మిమ్మల్ని దారిలో ఆపినందుకు క్షమించాలి"

"అయ్యో! దానికేమి లెండి. నన్నుకూడా మీచెల్లెలనే అనుకోండి." అంటూ ఆమె వెళ్ళిపోయింది.

మూర్తి తన స్నేహితుడ్ని విజయ గర్వంతో చూసి నవ్వేడు.

చూశారా యిక్కడ అనుకోవడం ఎలావుందో.

నేను వ్రాస్తూ, వ్రాస్తూ తలపైకెత్తి చూశాను. ఎదురుగుండా కూర్చొని చదువుకుంటూన్న నా చెల్లెలు, తలపైకెత్తి నాకేసిచూసి, చిటికె వేసింది.

"ఏమిటి సంగతి" అన్నాను. ఏమీ లేదు. యిందాక నాన్నగారు డబ్బిచ్చారే, దాంతో రేపు ఏ చీర కొందామా అని అనుకుంటున్నాను" అని అనేసి తలవంచుకొని చదువులో మునిగింది.

నేను నాలో నే నవ్వుకుంటూ మళ్ళీ ప్రారంభించాను. చూశారా ఈ అనుకోవడం నామీద కూడ దెబ్బతీసింది.

ఒక డైరక్టరు ఒక తారనుచూచి, యిలా అంటున్నాడు, "యిలా చూడండి. మీ అమ్మాయి కారు క్రింద పడిందని మీకు ఎవరాన్నా వార్త తెచ్చారనుకోండి! అప్పుడు మీరు ఎలా బయటకు పరుగెడతారు, కాస్త నటించి చూపండి" అని అన్నాడు.

ఈ అనుకోవడం ఒక్క చోటేమిటి, ఒక్క సందర్భమేమిటి, ఒక్క సంఘమునేమిటి? అన్నిటిలోను వస్తుంది.

ఒక ఉపన్యాసి, ఉపన్యాసము ప్రారంభించే టప్పుడు "నన్నుగూర్చి మీరు వేరేవిధంగా అనుకోకుండా సావధానంగా నా ఉపన్యాసం విన ప్రార్థన" అని ప్రారంభిస్తాడు.

ఎవరైనా తమ పతిభక్తి యితరులకు చెప్పేటప్పుడు, "నేను బడాయి కొడుతున్నానని అనుకోకండి. నే చెప్పేది అంతా నిజంగా జరిగిందే" అని ముందుగానే అనుకోకండి అని ప్రారంభిస్తారు.

"ఏంరా! వెధవా నా గురించేమనుకున్నావ్"

"ఈ పిక్చర్ యింత చండాలంగా వుంటుందనుకోలేదు బ్రదర్"

"సార్ ఈ చీర ఎంత బాగుందను కున్నారు... మీ భార్యగారు తప్పకుండా దీన్ని బాగుందనే అంటారనుకుంటాను"

ఈ అనుకోవడం అనే పదం ప్రతి రోజు జీవితంలో ఏ వందసార్లన్నా ఒక్కొక్కరి నోటినుండి వస్తుంది. దీనిని వాడుతున్నప్పుడు కాస్త జాగ్రత్తగా వాడితే బాగుంటుంది. దీనిని చదివి మీరు నన్ను గురించి ఏమైనా అనుకోండి!



## కీ. శే. పత్తిపాటి రత్నమ్మగారు

శ్రీ న్యాయపతి సత్యనారాయణగారి ధర్మపత్నియు, ఆంధ్ర మహిళాసభ యావజ్జీవ సభ్యురాలును అగు శ్రీ పత్తిపాటి రత్నమ్మగారు, శ్రీ కృష్ణజయంతీ పర్వదినమున దివంగతులైరి. వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచూ, వారి కుటుంబమునకును, యితర బంధుమిత్ర వర్గమునకును, 'ఆంధ్ర మహిళ' సానుభూతిని తెలియజేయుచున్నది.

# గ్రంథసమీక్ష



## "కిన్నెర"

స్వాతంత్రదిన ప్రత్యేకసంచిక.

సంపాదకులు శ్రీ మల్లికార్జున రావుగారు. 33 జోన్సుస్ట్రీట్ మద్రాసు.

మా కార్యాలయానికి 'కిన్నెర' ఆగష్టుసంచిక చేరింది. ఈ ఆగష్టు సంచిక చక్కని కథలు, నాటిక, అనువాదము, రాజకీయములు, సాహిత్యము, జీవితకథ మొదలైన రచనలతో వెలువడింది. సుప్రసిద్ధ రచయితలైన మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ శ్రీ, కవికొండల వెంకట్రావు మొదలైన వారి రచనలున్నవి.

ముఖ్యముగా శ్రీ శ్రీ రచియించిన "ఆంధ్ర దేశంలో సాహిత్య సంఘాలు" సోమశేఖర శర్మగారి "ఆంధ్ర దేశపు నాడులు, శాఖాభేదములు," బులుసు వెంకట రమణయ్యగారి "ఫిర్యాదులపెట్టి" రాధాకృష్ణమూర్తి గారి 'సన్యాసి' బాగా ఉన్నవి. కిన్నెరలో చక్కని సాహిత్యం ఉంది. కిన్నెరలో 'స్త్రీ'ల సమస్యల మీద రచనలులేవు. ఇకనుండి 'స్త్రీ' సమస్యలపై చక్కనిరచనలు రచయితలచే వ్రాయించిన బాగుండవచ్చు. స్త్రీ రచయితలకు ప్రోత్సాహమీ విధముగా కలుగగలదు.

అక్కడక్కడ అచ్చు తప్పులున్నవి. 'కిన్నెర' ప్రజలకు చక్కని సాహిత్యాన్ని అందచేయ గలదనే నమ్మకం ప్రజలలో బాగుగా ప్రచారమునకు వచ్చేలాగున ఇంకా చక్కని రచనలతో వెలువడగలదని ఆశించుచున్నాము.

—జి. ప్రభ.

* * *

## సందేశం

సంపాదకుడు. డి. గోపాలరావుగారు 34, ఆచారప్పన్ వీధి, మద్రాసు. వెల పావలా.

'సందేశం' నూతనముగా వెలువడిన అభ్యుదయ వారపత్రిక. 'తెలుసుకోదగ్గ సంగతులు, సుభాషితాలు విస్సన్న చెప్పిందే వేదం, దేశ సమాచారములు, చిన్నకథ, రెండు ప్రపంచాలు, ఆర్థికవిషయాలు, ఆహారం, ప్రజాభిప్రాయం, గాలిదుమారం, సినిమా, కార్మిక ప్రపంచం, యువలోకం, జగత్పరిణామం, మాటపాట, బొంగ్రాలతి ముచ్చట్లు అనే శీర్షికలతో వెలువడింది.

తొలి సంచిక గొప్పగానే ఉంది, మిగతా వచ్చే సంచికలన్నీ ఆ విధంగానే ఉంటే త్వరలో 'సందేశం' ప్రజల ఆదరాభిమానాలను పొంద కలుగుతుంది. సంపాదకులు శీర్షికలకు తగినట్లుగా చక్కని భావములతో పత్రికను ప్రచురింపకలిగినారు పత్రికలో అన్ని విషయాలు ఇమిడి ఉన్నవి.

'సందేశం' త్వరలో ప్రజలకు చక్కని వార్తలను అందజేస్తూ ప్రాముఖ్యానికి రావాలని కోరుతున్నాము.

—జి. ప్రభ.

* * *

## రాజ్యాంగయంత్రం

మూలం—వి. ఐ. లెనిన్. అనువాదకులు—మహీధర జగన్మోహన్. వెల 0-4-0. పేజీలు 33. ప్రచురణాలయము అవంతీప్రెస్, రాజమండ్రి.

జగన్మోహన్‌గారు రాజ్యాంగ యంత్రం అనువాదకులు. లెనిన్ ఆంగ్లమునయిచ్చిన వుపన్యాసమును ఈయన, చాకచక్యముగ తెనిగించి కథ రూపకముగ, ఎంతో రమ్యముగ వ్రాసిరి. రాజ్యాంగ యంత్రము ఇందు సుబోధకముగానున్నది. రాజ్యాంగ యంత్రం అంటే ఏమి? అది ఎప్పుడు, ఏవిధంగా బయలుదేరి, బలపడింది? కార్మికవర్గ పక్షమైన కమ్యూనిష్టు పార్టీయొక్క వైఖరి రాజ్యాంగ యంత్రం పట్ల ఎట్లా వుండాలి? అనే సమస్యలన్నిటికీ విశదంగా జవాబులియ్యబడినవి. రాజ్యాంగయంత్రం లేనికాలం ఒకటివుండని, అప్పట్లో సమాజమంతా క్రమానుగతంగా వస్తూన్న ఆచారములు, అలవాట్లమూలంగాను, నాయకత్వం వహించి, అందరి భక్తి విశ్వాసాలకూ పాత్రుడైన కుల పెద్దయొక్క అధికారానికి లోబడి జరిగి పోతూండేదని, పురుషులతో సమాన ప్రపత్తికలిగి, వాళ్లకంటె అధిక గౌరవాస్పదులైన స్త్రీలు కూడా కులపెద్దలుగాయుండి, కార్య నిర్వాహణం చేయడం వుండేదని, అంతేకాని ప్రత్యేక కార్యదర్శులు, "పాలక

వర్గం" అప్పట్లోవుండేదే కాదని, ఎప్పుడు మానవసమాజము రెండు వర్గాలుగ చీలిపోయినదో, అప్పుడే, ఆ సమాజంలోనే "రాజ్యాంగ యంత్రం" బయలు దేరిందని, ఈ విధంగా వివిధములయిన వుదాహరణలతో వ్రాయబడి యున్నది. ఇంకా ఎన్నో రాజకీయాలను గురించి విపులముగ వ్రాయబడి యున్నది. కాని యిందులోని చిన్న లోపమేమన అచ్చు చిన్నది. అందుచే చూడగనే చదువుటకు వుత్సాహకరముగ తోచదు. కాని చదివిన అన్ని సంగతులు విపులముగ తెలియును.

—రా. లక్ష్మి.

## ప్రేమపూజ

రచన—తలమర్ల కళానిధి, తలమర్ల (అనంతపురం జిల్లా) వెల 0-8-0

"ప్రేమపూజ" ఈ పొత్తమును రచయిత తన జననీ జనకుల కంకితమిచ్చెను. ఇందు సుమలత, విహంగ యానమను రెండు శీర్షికలున్నవి. సుమలతలో, ఒక బీద హరిజన బాలిక యొక్క కష్టములు, హరిజనులన్న ఎంత హీనముగ చూచు చున్నారోయను విషయము తెల్లమగుచున్నది.

అక్కలనే హరిజన బాలిక అంధులైన తల్లి దండ్రులను కష్టపడి పోషించుకొనుట, ఆ దీనులు మృతులైన తరి, ఒక ధర్మకర్త సహాయముపై ఆమె వివాహమాడి సుఖించుట, యిందలి కథా వస్తువు.

విహంగయానములో ఒక ప్రేమికుడు తన ప్రియురాలికి విహంగముల ద్వారా తన విరహతాపమును వెలిబుచ్చుట వర్ణింపబడినది మొత్తము మీద గ్రంథము చదువుట కింపుగ నున్నది. కాని అచ్చు తప్పులెక్కుడుగ నున్నవి.

—రా. లక్ష్మి.

టెలిఫోన్ :
నెం. 2918

టెలిగ్రాములు :
"INSEC"

# మైసూరు
# గవర్నమెంటు ఇన్సూరెన్సు డిపార్టుమెంటు

పబ్లిక్ బ్రాంచ్



## సంఖ్యలు సమాచారము చూస్తే సంగతులు మీకే తెలుస్తాయి

(క్రొత్త వ్యాపారపు లెక్కలు)

| సంవత్సరము. | జరిగిన భీమాలు. | ఖరారు చేసిన మొత్తాలు |
|---|---|---|
| 1942-43 | 5393 | 60,08,200 |
| 1943-44 | 7377 | 82,39,200 |
| 1944-45 | 11011 | 1,24,20,100 |
| 1945-46 | 11936 | 1,46,81,700 |
| 1946-47 | 12936 | 1,64,85,100 |

చెల్లించిన మొత్తాలు (మరణము, పరిపక్వము ఐనవి)
రూ. 70 లక్షలకంటె హెచ్చే

కడచినసారి యిచ్చిన బోనస్ — సాలీనా వెయ్యికి 18 రూపాయలు

(ఇండియాలోకల్ల ఎక్కువ మొత్తం)

30-6-48 నాటికి తేలే లెక్కలు మంచి ఫలితాలు ఇవ్వనున్నాయి

## భీమాచేసి భవిష్యత్తుకు భద్రపడండి

దయచేసి బెంగుళూరు కార్యదర్శినిగాని దగ్గర ఏజెంటునుగాని దర్యాప్తు చేయండి

## MYSORE GOVERNMENT INSURANCE DEPT.

# మీ ఆరోగ్యానికి సేవించండి

బోర్న్ వీటా పాలపానీయాల కంటె ఎంతో ఉత్తమమైనది. శక్తిని కలిగించే విటమినులు మరియు క్యాలిషియం కల్గి ఉంటుంది. ఆటగాళ్లకు, దుర్బలులకు కూడా ఆదర్శమైనది. దాని చాకొలేట్ రుచిని పసిబిడ్డలు కోరతారు. ఒక కప్పుడో, గ్లాసుడో వేడి లేక చల్లని పాలలో రెండు టీస్పూనులు పొద్దున్నా సాయంకాలమూ తీసికొనండి.







ఆరోగ్యవృక్షం




కాడ్బరీస్

## బోర్న్ - వీటా

క్యాల్షియం మరియు ఎ, డి విటమినులతో నిండి ఉన్నది.




# అమృతాంజనము

గాని,

" యథాయథా.................. కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తిముల్లోకములను దెల్పుఁజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# ఆంధ్రమహిళాసభ

## స్త్రీ, శిశువులకు, రోగిసంరక్షణశాల,

## ఉచితవైద్యశాల.

అడయారులో, రాష్ట్రప్రభుత్వమువారిచ్చిన స్థలములో, ఆంధ్రమహిళాసభవారు, స్త్రీ శిశువులకు రోగిసంరక్షణశాల, ఉచితవైద్యశాల నిర్మింప నుద్యమించిరి. స్థలములో నిర్మాణము కొద్దిగా ప్రారంభమైనది. డిసెంబరునాటికి, శంఖుస్థాపన జరుగవలెనను సంకల్పము. కొంతమంది సోదరీమణులు ధనవిరాళము లిచ్చి ముందంజ వేసిరి. తదితరులుకూడ, తమకు తోచిన విరాళము లొసగి యీ నిర్మాణమునందు ఇతోధిక సేవ జేయవలెననియు, ఇది యొక పుణ్యకార్యముగా తలంచవలెననియు మనవిచేయుచున్నాము.

మీ మీ యర్థము సార్థకమగుట కిది యొక మార్గము సుమండీ!

దుర్గాబాయి.



ఆంధ్రమహిళా సభ వాన్—విద్యార్థినులు
(శ్రీ. శ్రీ. పర్లాకిమిడి జమీందారుగారి బహుమానము).



శ్రీమతి రామకృష్ణమ్మగారు
దసరా తెలుగు వక్తృత్వపు పోటీలలో
ప్రథమ బహుమానమును పొందిరి.





[illegible] ఇ [illegible]క్ష్మి
వీణ పోటీలలో ప్రథమ బహుమానమును
పొందినది.

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: నవంబరు '49 :: సంచిక 7

ముఖచిత్రం :: లాగారియా విమాన కేంద్రంలో పండిత నెహ్రూకు భారత మహిళల స్వాగతము.




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా అయిదు రూపాయలు




సంపుటి 6 నవంబరు 1949 సంచిక 7

# ప్రథమ ప్రపంచ పౌరుడు

భారత ప్రధాని పండిట్ నెహ్రూ అమెరికా యాత్ర, అపూర్వమైన ప్రాక్పశ్చిమ సంధాన సంఘటనగా, ప్రపంచ శాంత్యవతరణనాందీ ప్రస్తావనగా, శాంతియుత విప్లవ మహానాయకుడైన మహాత్ముని దివ్య సందేశమును విశ్వవ్యాప్తముచేసి, నైతిక బలప్రాశస్త్యాన్ని, పాశవబల అబలత్వాన్ని, నిరూపించునదిగా, ఒక దిగ్విజయ యాత్రయై, భారత చరిత్రలోనేగాక, ప్రపంచ చరిత్రలోనే ఒక ప్రధానాధ్యాయముగా పరిణమించగలదు.

అద్భుతమైన రాజనీతి పాశ్చాత్యులది. సకలవిధములైన భౌతిక విజ్ఞానమూ, పారిశ్రామిక అభివృద్ధి కలిగి, అఖండ సిరిసంపదలలో, స్వయం సమృద్ధిలో తుల తూగుతున్నారువారు. త్రుటికాలంలో ప్రపంచాన్నంతా భస్మీభూతము చేయగల మారణాస్త్రాలన్నీ వారి సొమ్ము. అయితే, ప్రజా విప్లవాన్ని అణచగలిగారా! సాంబ్రాజ్య బలముచే, కుటిల రాజనీతిచే, ప్రపంచములో సగభాగము నాక్రమించుకో గలిగారు గాని, ప్రజా హృదయాల నాక్రమించుకోలేక పోయినారు. సహకార సుహృద్భావ రహితమైన అంతర్జాతీయ రాజనీతిగాని, పరదేశ పీడనాశక్తిగల సాంబ్రాజ్య పశుబలముగాని, ప్రజా విప్లవము నణచలేవనుటకు, ప్రస్తుతపు చైనా, ఇండో చైనా, ఇండోనీషియా, ఆఫ్రికాలే ప్రబల సాక్షి. నీతి నియమబద్ధమైన అహింసాతత్వ బలము అస్త్రబలమునకన్న మిన్నయనుటకు భారతదేశము సాగించిన శాంతియుత విప్లవము, సాధించిన స్వాతంత్ర్యం, స్థాపించిన సర్వాధికార ప్రజాస్వామ్య ప్రజారాజ్యములే ప్రత్యక్ష ప్రమాణములు.

అగ్రరాజ్యాలవారు అణుశక్తి భీతితో అల్లాడిపోవుచున్నారు. అమెరికా రష్యన్ వర్గముల మధ్య దినదిన ప్రవర్థమానములగుచున్న వైషమ్యములచే లోకమంతా క్షుభిత మగుచున్నది. ప్రాగ్దేశాలలో చెలరేగుచున్న ప్రజా విప్లవము, ప్రపంచాన్నంతా మ్రింగివేయునేమో యను భయము పాశ్చాత్య సామ్రాజ్యబలములను కలవరపెట్టుచున్నది. మూడవ ప్రపంచ సంగ్రామ ప్రళయరుద్ర తాండవమునకు వేదికా నిర్మాణము సంపూర్ణ మగుచున్నది.

ఈ వాతావరణలో, యుద్ధ విరమణకు, ప్రపంచ శాంతి స్థాపనకు వారనుసరించుచున్న విధానములన్నియును విఫలములగుచున్నవను జ్ఞానోదయము కలిగినది పాశ్చాత్యులకు. ప్రాగ్దేశ

# ప్రథమ ప్రపంచ పౌరుడు



వాషింగ్టన్‌లో రాయబార కార్యాలయపు. పిల్లలతో ప్రధాని నెహ్రూ.

ఆ బాంధవ్య సూత్రములో ప్రధాన పతకం భారతభూమేనని విజ్ఞుల ఏకాభిప్రాయం. భారత పిత బాపూజీ అమోఘ నాయకత్వముతో, భారతప్రజ మ్రోయించిన సత్య అహింసల జయభేరీ దశదిశలు మారుమ్రోగుచుండుటయే భారతదేశపు యీ ప్రతిష్టకు పునాది. కలుష రహితమైన, నీతినియమబద్ధ రాజనీతియే పునాదివేళ్లుగా, రామరాజ్యమే మహాకాండముగా, విశ్వమానవ కళ్యాణమే దివ్యఫలముగా, విశ్వసాంభ్రాజ్య మహాతరువునుగూర్చి కలలుగాంచిన పుణ్యవ్యక్తిని దాల్చిన యీ భరతభూమి కట్టి ప్రతిష్ట అతిసహజమే. ముప్పై ఐదుకోట్ల భారతీయులకు తలమానికమై, పీడిత ప్రజానీకమునకు ఏకైక ప్రతినిధియై, అంతర్జాతీయ రాజకీయ రంగములలో అఘటితఘటనా ప్రతిభను జూపుచున్న, బాపూజీ అడుగుజాడల ననుసరించుటకన్న కర్తవ్యము వేరొండు లేదను శాంతి సందేశమును జగద్వ్యాప్తి చేయుచున్న, నెహ్రూకన్న యీ విశ్వ బాంధవ సూత్రధారిత్వమును నిర్వహించగలిగినది వేరొకరు లేరనుటలో అతిశయోక్తి గాదు.

ఈ వాతావరణలో పండిట్‌జీ అమెరికా యాత్ర, దేశకళ్యాణమునకు ప్రథమసోపానము కాగల దేమోయని యాశించుట అతి సమంజసమైనదే. ఇట్టి మహత్తర కార్యసాధనా సమర్థుడుగా తలంప బడుచున్న భారత ప్రధానికి, అమెరికాలో, రాజాధి రాజులకు లాంఛన మాత్రముగా జరిగే అసమాన సన్మానమును వ్యక్తిగతంగా, ఉత్తమోత్తమ పురుషుడని, ప్రభుత్వము ప్రజాకూడ జరిపించారు.

# ప్రధమ ప్రపంచ పౌరుడు

ప్రాగ్దేశములతో మైత్రికై తమ తహతహను వెలిబుచ్చారు అమెరికా ప్రభుత్వం. యుద్ధ విరమణ, ప్రపంచశాంతి స్థాపన తమ లక్ష్యములని నొక్కి-చెప్పారు. రాజనీతి కోవిదుఁడైన నెహ్రూ, యీ ఆదర్శ లబ్ధికి మార్గములను సూచించాడు. నీతి రహితమైన భౌతిక సంపద స్థిరముకాదన్నాడు. శాంతి స్థాపనకు ముఖ్యంగా, యుద్ధ విరమణకన్న యుద్ధ కారణములను కూకటి వ్రేళ్లతో పెల్లగించుట అత్యావశ్యకమని నొక్కి- చెప్పాడు. భవిష్యత్తును గురించిన భయముగాని, గతాన్ని పురస్కరించుకొని మనోవైకల్యముగాని, యుద్ధము నాపుచేయవు ఒక దేశము మరొక దేశముపైన, ఒకజాతి మరొకజాతిపైన అధికారము చలాయింప జూచుట యుద్ధమునకు ప్రధమ కారణము. కోటానుకోట్ల ప్రజ అనుభవించుచున్న దారిద్ర్యము రెండవ కారణము. ముఖ్యంగా, ఆసియా ఖండంలో ప్రారంభమైన ప్రజా విప్లవములకు యీ పరదాస్యము దారిద్ర్యము కారణములు. శతాబ్దాల బానిసత్వములో, విద్యా, విజ్ఞాన, పారిశ్రామిక అభివృద్ధులు లేక, దుర్భర దారిద్ర్యము ననుభవించుచున్న పీడితప్రజ జాతీయ చైతన్యంతో, విప్లవ ప్రవాహములో కొట్టుకొని పోవుచున్నది. ఈ ప్రవాహాన్ని అరికట్టే బాధ్యత, సమృద్ధ పాశ్చాత్య దేశాలపైనున్నది. ఈ బాధ్యతను విస్మరించినచో, ఆ విప్లవ ప్రవాహమువలన వారికే ముప్పుకలుగనున్నది. నైతిక పథావలంబనతో యీ పరపీడనను విడచి, పరస్పర సుహృద్భావ మలవరచుకొనిననాడే, యుద్ధమువలన భయము తగ్గునుగాని మారణాస్త్ర సంగ్రహణవలన యుద్ధభయ నిర్మూల మెప్పటికినీ కాబోదని నెహ్రూజీ, నిర్మొగమాటంగా, నిర్భయంగా, శాంతిస్థాపనకు వలసిన రాజనీతిని విపులీకరించాడు. ఈ పథము తక్క, ఏకప్రపంచ వ్యవస్థ స్థాపనకు వేరొండు మార్గము లేదనియు, ఏకప్రపంచ స్థాపన తక్క- ప్రపంచశాంతి లబ్ధికి గత్యంతరము లేదనియు, పండిట్‌జీ వాస్తవాన్ని తేల్చి చెప్పారు.

ఏక ప్రపంచ వ్యవస్థలో, శాంతి ధ్వజాన్ని ప్రతిష్ఠింపగల మహావ్యక్తి ఇతఁడేనని పరులు నుతింప, తన సామర్థ్యాన్ని చాటిచెప్పుకొన్న ప్రధమ ప్రపంచ పౌరుఁడు, భారత ప్రధాని.



## విజయం

ఆంధ్ర మహిళా హిందీ విద్యాలయమునుండి మధ్యమ పరీక్ష వ్రాసిన ఐదుగురు విద్యార్థినులలో నలుగురు ద్వితీయ శ్రేణిలో కృతార్థులైరి. ఎనమండ్రు ప్రాథమిక విద్యార్థినులలో, నలుగురు ప్రథమ శ్రేణియందు, ఇరువురు ద్వితీయ శ్రేణియందును కృతార్థులైరి.

| | | |
|---|---|---|
| మధ్యమ : | జ. సత్యనారాయణమ్మ. | జి. గంగాబాయి. |
| | టి. బంగారమ్మ. | పి. వరలక్ష్మి. |
| ప్రాథమిక : | ప్ర. శ్రే. టి. కమలకుమారి. | బి. సత్యనారాయణమ్మ. |
| | ఆర్. హైమవతీదేవి. | పి. భానుమతి. |
| | ద్వి. శ్రే. డి. జనకలక్ష్మి. | వి. ఎస్. సరళ. |

వీర్లకు మా అభినందనములు.

కరెస్పాండెంటు.

# అమెరికాలో భారతప్రధాని నెహ్రూ

శ్రీమతి రామకృష్ణమ్మ, బి.ఎ., బి. ఇడి.

నెహ్రూ తన జీవితమునంతను మాతృదేశము కొరకై వినియోగించుచున్నాడు అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. మొట్టమొదట నుండియు ఆయన చాల గొప్ప దేశభక్తుడనియు, అన్ని విధముల త్యాగము చేసిన జీవి అని యీ రోజులలో ప్రతీవారికి తెలియును. వజ్రమునకు మెరుగు పెట్టినట్లు నెహ్రూ భారత ప్రధాన మంత్రి అయినప్పటినుండి ఆయన ప్రతిభ దేదీప్యముగా వెలుగుచున్నది. అన్నిటికన్న ముఖ్యముగా యిటీవల ఇండియా, అమెరికాలకు నెహ్రూ చేకూర్చిన స్నేహభావము వర్ణనాతీతము. పూర్వమునుండియు భారతదేశమునకు అమెరికాకు సంబంధము గలదు. నాలుగు శతాబ్దులనాడు కొలంబస్ అనే నావికుడు భరత ఖండానికి నూతన మార్గమును కనిపెట్టవలెనన్న కుతూహలముతో ప్రయత్నించుచుండగా ఆయన పశ్చిమ దిక్కుగా ప్రయాణము సాగించుట వలన అమెరికాను కనిపెట్టినాడు. ఆ తరువాత బ్రిటన్ మొదలగు దేశాలనుండి లక్షలాది ప్రజలు పోయి అచ్చట వలస రాజ్యములు ఏర్పరచుకొని 18వ శతాబ్దము చివరకు అమెరికా, యింగ్లండులో పోరాడి స్వతంత్ర రిపబ్లిక్కును




న్యూయార్కు, లాగార్డియా విమాన కేంద్రములో ప్రధాని నెహ్రూకు ఆహ్వానమిస్తున్న భారతీయులు.

# అమెరికాలో భారత ప్రధాని నెహ్రూ



న్యూయార్కు అధికారాహ్వాన సందర్భములో సైనిక వందనాలను స్వీకరించుచున్న ప్రధాని నెహ్రూ.

స్థాపించెను. అమెరికా అట్లు చేసిన తరువాత ప్రపంచంలోని తదితర స్వాతంత్ర్య ప్రియదేశము లన్నియుకూడ స్వాతంత్ర్యమును సంపాదించుట కొరకై ప్రయత్నములు చేసెను.

భారత నాయకుడైన శ్రీ లజపతిరాయి అనేక సంవత్సరాలు అమెరికాలో గడిపి అక్కడి రాజకీయ, సాంఘిక విషయములను వర్ణిస్తూ ఒక గొప్ప గ్రంథమును వ్రాసిరి. అనేకులైన అమెరికా రచయితలు సండర్లాండు మొదలగు వారు కూడ భారత స్వాతంత్ర్యాన్ని గురించి అనేక గ్రంథములు రచించినారు. రాజకీయాల లోనే గాదు, సాంస్కృతిక విషయములలో కూడ శ్రీ వివేకానంద, శ్రీ రాధాకృష్ణన్ మొద లైన తత్వవేత్తల మూలంగా ఇండియా—అమెరికాలకు సన్నిహిత సంబంధం ఏర్పడినది.

ఈ విధముగా చేకూరిన స్నేహమును గట్టి పరుచుచు ట్రూమెన్ - నెహ్రూ సమావేశం అమెరికా భారతదేశ చరిత్రలలో నూతన అధ్యాయాన్ని కల్పించ వచ్చునేమో! రష్యా, అమెరికాలకు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం మునుపున్న మన స్పర్థలకన్న పదిరెట్లు పెరిగినది. అమెరికా, ఇంగ్లండులు, ఇండియా తమ తరుపు చేరి రష్యాతో యుద్ధము చేయుటకు సిద్ధపడునేమో అని భ్రమపెట్టుకొనియున్నారు. కాని నెహ్రూయొక్క ప్రకటనలవలన అమెరికనులకు ఒక విషయము బాగుగా తెలియవచ్చినది.

# అమెరికాలో భారత ప్రధాని నెహ్రూ

అదేమిటంటే, భారతదేశం ఎల్లప్పుడూ ప్రపంచ మందు శాంతిని వృద్ధిపరచుటకే ప్రయత్నించు ననియు, ప్రత్యేకంగా ఒక పక్షంలోచేరి, రెండవ దానిపై పగ సాధించడానికి అంగీకరించదనియు బ్రిటిష్ కామన్వెల్తులో నిలిచిపోయి నంత మాత్రాన తప్పనిసరిగా ప్రతి సందర్భంలోనూ, ఇంగ్లండు అమెరికాలనే అనుసరిస్తుందనే వొట్టి అపోహలను జనులయొక్క మనస్సుల నుండి తొలగింపచేసాడు నెహ్రూ. చిట్టచివరకు యుద్ధమేగాని సంభవించిన ధర్మరక్షును కాపాడుటకై భరతవర్షం కూడ యుద్ధంలో పాల్గొన వలసి వచ్చునేమో అనికూడా నెహ్రూ స్పష్ట పరిచాడు. నెహ్రూ ఒక్క భారత ప్రధానియే గాదు—ఆశియా ఖండాని కంతకూ ప్రతినిధి. తూర్పు దేశాలలో పాశ్చాత్యులు వలస రాజ్యములను స్థాపించి యింతవరకు యిష్టము వచ్చినఆట ఆడినారు. కాని యికముందు అటువంటి సంగతి జరగబోదని నెహ్రూ అంటు న్నాడు.

భారతదేశం పారిశ్రామికంగా చాల వెనకబడి యున్నది. ఇక్కడ పరిశ్రమలను అభివృద్ధిలోనికి తీసుకు రావలెనంటే ధనాన్ని, యంత్రసామగ్రినీ, నిపుణుల సహాయాన్నీ మనం అమెరికానుండి తీసుకొన వలెను. ఇంతమాత్రంచే రాజకీయాల లోకూడ మనము అమెరికాకు లోబడివుంటాము అన్నమాటకాదు. స్వేచ్ఛగా, బుద్ధిపూర్వకంగా మనము మన అభివృద్ధికొరకై కొంతకాలము పాటు అమెరికా సహాయాన్ని పొందుట ఉభయ



లాగార్డియా విమాన కేంద్రంనుంచి మోటారులో వచ్చి న్యూయార్కు నగరంలో దిగుతూఉన్న ప్రధాని నెహ్రూ.

# అమెరికాలో భారత ప్రధాని నెహ్రూ



అమెరికా శాసన సభల సమావేశములో, నెహ్రూ ఉపన్యాసానంతరము జరిగిన విందులో నెహ్రూ డీన్ అచిసన్, కొనల్లీ గార్లతో సంప్రతింపు.

దేశాలకూ శ్రేయస్కరం. నెహ్రూ యింకొక ముఖ్యమైన విషయము స్పష్టపరచెను. అదేమంటే భారతదేశం ఎప్పుడుకూడ, ఎటువంటి విషయములలోనైనా సరే, వాస్తవిక స్థితిగతులను గుర్తింపకుండ పనులను చేయదు. ఈ విధముగా పండిట్ నెహ్రూ మన దేశము తరపున మహోన్నతమైన సందేశమును అమెరికాకు అందజేసెను. అమెరికాలో నెహ్రూకు జరిగిన గొప్ప సన్మానానికి భారతదేశం నిజంగా చాల గర్వించవచ్చును. అమెరికా యాత్రలో నెహ్రూ స్పష్టపరచిన సౌమనస్యమూ, రాజనీతి, ప్రశంశార్హములు. ప్రపంచంలోనికెల్ల ప్రథమ పౌరుడని చాల మేధావులైన అమెరికనులతనిని అభినందించారు. మొన్న మొన్నటివరకు ఇంగ్లండుతో స్వాతంత్ర్యము కొరకు పోరాడి, ఈనాడు ఇంగ్లండు పట్ల మిక్కిలి స్నేహ భావంతో నెహ్రూ మెలగుట అమెరికనులకు చాల ఆశ్చర్యమును గల్గించినది.

నెహ్రూ ముఖ్యముగా శాంతి దూతయని చెప్పవచ్చును. నవంబరు 14కు వారికి షష్టిపూర్తి. 4 దశాబ్దాలు, మాతృదేశపు సేవజేసి, స్వాతంత్రమును సంపాదించాడు. పశ్చిమ ఖండాలవారు ఈతనిని ప్రపంచనాయకుడుగా పరిగణించునట్టి బుద్ధి శక్తిని ప్రస్తుతపు అమెరికా పర్యటనములో విదితముజేశాడు. గాంధీజీ వారసుడుగా, శాంతిదూతగా, ప్రపంచశాంతిని నెలకొల్పుటకు దైవ మీతనికి పరిపూర్ణ ఆయురారోగ్యములను ప్రసాదించుగాక.

# పిల్లల శిక్షణ-శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిశి సుభద్రమ్మ

## భయం కోపం మొదలైన మనః ప్రవృత్తులు

తల్లి స్తన్యపానమువల్ల, అందిన పదార్థాల్ని నోటిలో పెట్టుకొని కొరకాలన్న వాంఛవల్ల, బిడ్డకు కొన్ని అనుభవాలు కలిగినవి. అదే విధంగా భయం, కోపం మొదలైన మనో ప్రవృత్తులవల్ల (Emotions) మరి కొన్ని అనుభవాలు కలుగుతాయి.

భయం :—

ప్రారంభదశలో, మనచేతుల్లోనున్న శిశువును తటాలున క్రిందపడుకో బెట్టినగాని, బిడ్డ క్రిందనున్న పక్క బట్టల్ని చటుక్కున లాగినగాని, భయంతో బిడ్డ ఉలిక్కిపడుతుంది. తలుపులు తెరచేటప్పుడు మూసేటప్పుడు అయ్యే చప్పుడుకు, చేతిలోని పాత్ర మొదలైన వస్తువులు క్రిందబడి టంగుమని శబ్దమయినపుడు, బిడ్డ ఉలిక్కి పడుతుంది. ముఖ్యంగా బిడ్డ నిద్రలోనున్నప్పుడు ఈలాంటి కఠోర శబ్దములయితే, బిడ్డ అత్యధిక భయాన్ని వెలిబుచ్చుతుంది.

కోపం :—

బిడ్డ తలను అటునిటు త్రిప్పకుండ అట్టే పట్టుకొన్నా, కాళ్లు చేతులను ఆడించకుండేటట్టు పట్టుకొన్నా, అది అసహాయతవల్ల ఆగ్రహాన్ని చూబెట్టుతుంది. కొంత పెరిగి గ్రహించే శక్తి అభివృద్ధియైనపుడు బిడ్డ వాంఛలు కోరికలు (Desires) నెరవేరని సమయాల్లోమాత్రమే కోపోద్రేకాన్ని వెలిబుచ్చుతుంది. ఈలాంటి విషయాల్లోనే గాక తన కపరిచితమైన, అయిష్టమైన సందర్భాలన్నిటిలో గూడ బిడ్డ భయం కోపం మున్నగు ఉద్రేకాల్ని వ్యక్త పరుస్తుంది.

ఆతురత :—

బిడ్డ ఆకలికీ, నిద్రకూ, మరేదైన అవసర మయినపుడూ, హఠాత్తుగా ఏడ్వటం మొదలెట్టుతుంది. ఒకే పోరు పెట్టుకుంది. తనకు కావలసినది తక్షణమే లభించాలి. అలా లభించకపోతే కోపం, లభించితేసంతోషం చూబెట్టుతుంది. అనగా బిడ్డ వాంఛలు కోర్కెలు (Impulses, desires) ఒక త్రుటి కాలంలో తృప్తి చెందాలి. ఎంత మాత్రం ఆలస్యమయినా సరే, అది ఓర్చుకోజాలదు. పైగా ఎంతో బాధపడి పోతుంది. ఇంతేగాదు, తను కోరిన పదార్థమంతా కావాలని కూడ పోరుపెట్టుతుంది. బిడ్డయొక్క ఇట్టి ప్రవర్తనల్ని తల్లి పరిశీలించుట అవసరం. బిడ్డకు కాల దేశ పరిమాణం ఎంత మాత్రం తెలియదు :—ఆకలి అవుతుండగా ఆహారం కడుపులో పడాలి. నిద్రవస్తుండగా నిరాటంకంగా నిద్ర పోవాలి. ఏ పదార్థమైనా సరే, అది ఎంతదూరంలో నున్నా సరే, కోరినక్షణమే తనచేతుల్లో పడాలి. వేయేందుకు! బిడ్డలో వాంఛలు కోరికలు (Impulses, desires) ఉద్భవమందిన తక్షణం నెరవేరాలి, కాని వేచివుండటం అనే విషయం బిడ్డలకు తెలియదు. అనగా, కోర్కెలు పుట్టటం నెరవేరటం అనే వాటి మధ్య కాలాన్ని బిడ్డ ఎరుగదన్నమాట. (నిత్య వర్తమన్న మాట.) తనకు అవసరమైన పదార్థము లభించుతుంది కాని వేచివుండాలన్న జ్ఞానంగాని, తనకది ఎంత అవసరం అన్న విచక్షణగాని బిడ్డకుండవు. కాబట్టే, వెంటనే తనకోర్కెలు తృప్తిచెందకపోతే ఆ బాధ దానికి అపరిమితంగా గోచరిస్తుంది. సంతృప్తి చెందితే సంతోషం కూడ అపరిమితంగానే వుంటుంది. కనుక తల్లి బిడ్డవాంఛల్ని, కోరికల్ని వెంటనే తీర్చినయెడల బిడ్డయొక్క సంతృప్తికి సంతోషానికి కారణ భూతురాలవుతుంది. అలక్ష్యంచేస్తేగాని ఆలస్యంచేస్తేగాని, బిడ్డ అసంతృప్తికి, ఆశాభంగం, ఆగ్రహం, నిర్నిమిత్తమైన భీతి మొదలైన బాధకరమైన ఉద్రేకాలకు కారణురాలవుతుంది. అంచేతనే తల్లి శిశు మనస్తత్వాన్ని చక్కగా నెఱిగి మెలకువతో మెలగాలి.

ఒక ఉదాహారణం తీసికొందాం:—ఒక యువతి తన సుమారు ఆరునెలల బిడ్డను తోపుడుబండిచుట్టు దిండ్లు వేసి (అనగా వెనక ఒత్తుకుదిండు, ఇరు ప్రక్కల రెండు దిండ్లు) కూర్చుండ బెట్టి, తన భర్తతో మాట్లాడుతూ నిలుచుంది, ఆడుకోటానికి బిడ్డచేతిలో ఒక ఆటువస్తువునుకూడ పెట్టింది. కాని, బిడ్డ ఆట వస్తువును పారవేసి, తన తల్లినీ, తండ్రిని అట్టే చూడసాగింది. వారుదాన్ని గమనించ లేదు. వింత వింత శబ్దాలుచేయసాగింది కాని లాభం లేక పోయింది. మెల్ల మెల్లన ఏడ్వ నారంభించింది. అప్పటికీ తల్లి గమనించ లేదు. ముందుకూ, వెనుకకూ పడుతూ పోరు పెట్టసాగింది. మాటలలో మునిగిపోయిన తల్లి వినిపించుకో లేదు. ఎవరో కొట్టినట్టు తటాలున కెవ్వుమని కేక పెట్టింది. తల్లి తిరిగి చూచింది ఓరిగిల పడుకోబెట్టిన బిడ్డపిడికిలి బిగించి కోపంతో తల్లిని చురచుర చూస్తూ కూర్చుని ఉంది. ముఖం యెఱ్ఱగా కంది పోయింది. దాని కోపం, తక్షణమే చల్లారి దాని ముఖంలో సంతృప్తి సంతోషాలు వ్యక్తమయినాయి.

బిడ్డ పెరుగుతూ, గ్రహణశక్తి వృద్ధి అయిన కొలదీ, అనుభవముల ఫలితంగా బిడ్డయొక్క వాంఛలు కోరికలలో, కోపతాపములలో తీవ్రత తగ్గుతూవస్తుంది. క్రమేణ ఆతురత తగ్గి, కాలదేశ పరిజ్ఞానము, తన కోర్కెలు ఈరేడుతవి అనే నిరీక్షణ, నమ్మకం కలుగుతూ వస్తాయి. కోపం కలిగి నప్పటికీ, కొద్దికాలం క్రితమే తనకు లభ్యమయిన తల్లి వాత్సల్యం గురుతుకు రావటం ప్రారంభమవుతుంది. తనకు త్వరలో తృప్తి కలుగుతుందని నిరీక్షణ ఏర్పడుతుంది. మరింత విపులంగా చెప్పాలంటే, తల్లి కాళ్ల చప్పుడువలన, కంఠధ్వని వలన, స్పర్శమున, తనకు పాలివ్వటానికి ముందు స్నానం చేయించే సన్నాహము శబ్దంవలన (నీళ్లుతోడునపుడు అయ్యే చప్పుడు వగైరా) తన కోర్కె నెరవేరుతుందనే నిరీక్షణ ఏర్పడుతుంది. కనుక, బిడ్డ కిదివరకున్న కోపం, ఆతురత తగ్గుతూ, ఓర్పు నిరీక్షణ, నమ్మకం మొదలైన గుణాలు పట్టుబడుతాయి.

## తల్లికి ఓర్పు అత్యవసరము :—

బిడ్డ శారీరకంగా, మానసికంగా అనుక్షణం పెరుగుతూ వుంటుంది. ఆలా పెరగటంలో అది అనేక దశలను గడపవలసి వున్నది. అందువల్ల తల్లి బిడ్డయొక్క అభివృద్ధి క్రమంలోని ప్రతిదశను పరికించుతూ, పరిశీలించుతూ విజ్ఞాన విచక్షణలతో తోడ్పడాలి. ఎంతో ఓర్పు ఉండాలి. అయితే ఆ ఓర్పు విజ్ఞాన యుక్తమయినదిగా వుండాలి అనే విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి.

శైశవదశలో, బాల్యదశలో, బిడ్డయందు ప్రదర్శితమయ్యే కొన్ని ప్రవర్తనలు, పెద్దవాళ్లకు చాల వింతగానూ, విచారకరంగాను గోచరించవచ్చును. కాని అవి బిడ్డయొక్క అభివృద్ధి క్రమంలో సహజమైన ప్రవర్తనలు. ఉదాహారణకు బిడ్డ కొరికే ప్రవర్తనను తీసికొందాము. ఇదివరకే తెలుసు కొన్నట్లుగా, అది బిడ్డయొక్క అభివృద్ధి క్రమంలో అవసరమైన ఒకనొక కదా! అంటే, పళ్లురావటానికీ, పదార్థ పరిజ్ఞానానికీ ఆలా కొరుకుతుందన్న మాట, (శారీరక మానసిక అభివృద్ధికి. ఆ విధంగానే, బిడ్డ, ఒకానొక దశలో తన మల మూత్రాలతో అసహ్యతన్న మాట లేక ఆడుకొంటుంది. దేహాన్నీ, దుస్తులనూ మురికి చేసుకొంటుంది. బిడ్డకు అసహ్యత, అశుభ్రత అనేవి తెలియవు. ఆ రీతిగానే కోపం పెంకితనం వెలిబుచ్చుతుంది. తల్లి ప్రశాంతంగా వుండి, బిడ్డకు మెళకువతో తోడ్పడితే, ఈ దశలు క్రమ క్రమంగా గడచిపోతవి. ఆలా చేయకుండా, తల్లి బిడ్డను మందలించితే మరింత పెంకెతనం చూబెట్టుతుంది. అతి బాల్యంలోనే బిడ్డలు సహజంగా సూక్ష్మగ్రాహులు. విసుకునూ, ఆగ్రహాన్నీ, ఆతురతనూ తల్లి ముఖంలో, కంఠధ్వనిలో, స్పర్శలో చక్కగ గ్రహించి మరింత ఎక్కువగా పెంకె తనాన్ని చూబెట్టుతారు. చీటికీ మాటికీ చీదరపడు తల్లిని మరింత ఎక్కువగా చీకాకు బెట్టుతారు. ప్రశాంతంగా ప్రేమతో తోడ్పడే తల్లిని చీకాకు పెట్టరు. పిల్లలు పెద్దలవలే ప్రవర్తించాలనుకోటం కేవలం అజ్ఞానాన్ని సూచించుతుంది. అట్లనుకొను వారియందు శాస్త్రీయ దృక్పథం ఎంత మాత్రం లేదనుట తేట తెల్లం! కాబట్టితల్లి, తన మాటలలోగాని, చేతలలోగాని, ఆగ్రహం, అసంతృప్తి ఎంత మాత్రం చూబెట్టకుండా మంచి తెలివి తేటలతో, సహనంతో బిడ్డయొక్క అభివృద్ధికి తోడ్పడాలి,

(సశేషము)

# మృత్యువు - మానవుడు

రచన: రామరత్న బడోలా. అనువాదం: ఆర్. సోమసుందర్రావు.

అతడు దీర్ఘకాయుడు, భసితాంగుడు, పల్లవారుణ జటాభరుడు, శంకధరుడు, కమండలహస్తుడు, అశాంతి మయ రేఖాంకితఫాలుడు.

మానవుడు భయంకర కందరంనుండి వెలువడి సమీప మందలి సెలయేటి నీరుతో కమండలమును నింపినాడు.

కందరమందలి ప్రతివస్తువూ నిబిడ తిమిరాచ్ఛాదితమై యుంది. అనేక విష ప్రాణికోటులు అందు విచ్చల విడిగా విహరిస్తున్నాయి. మానవునికి వీని చింతేలేదు. వీని భయం లేదు. ఒక ఉన్నతశిలపై అతడు కఠోరదీక్షాపరతంత్రుడై నిర్వికల్పధ్యానసమాధియందు లీనమైనాడు.

శతాబ్దాలు గడచాయి. యుగాలు మారేయి. మానవుని నిశ్చలధ్యాన సమాధి నిరాటంకముగా సాగింది. అతనిపై వల్మీకం పుట్టుకొచ్చింది. ఆ వల్మీకంలో అతడు మునిగినాడు.

చిరునవ్వు చిందులు త్రొక్కు బాలభాస్కరుని ప్రసన్నతారోచిస్సులను మానవుడు పరికించాడు. అతని హృదయము ఆనందంతో నర్తించింది. అర్కుని అతడొక మహాశక్తిగా పరిగణించి అతనిని ఆరాధించాడు. ఉరుములు మెరుములతో వర్షమిచ్చు వరుణదేవుని ప్రశంశించాడు. పృథ్వియొక్క ఆకుపచ్చని ప్రదేశాలను అవలోకించాడు. రంగురంగుల పువ్వుల పూసురటి అతని నాసికారంధ్రాలలోని కెగసింది. ఇవన్నీ విశ్వ నిర్మాతయగు నీశ్వరుని జ్ఞప్తికి దెచ్చిరది.

ముగ్ధ మానవుడు వీనినన్నిటినీ ఆరాధించాడు. ఈశ్వర మహిమను భక్తిభావ రసాదులతో గీర్తించాడు. కాని అతనిలో మరేవిధమైన పరిణామమూ కలుగలేదు.

శతాబ్దాలు గడిచినాయి. యుగాలుమారినాయి. అతడు కోరిన పరిపూర్ణ హృదయ సంతోషం, అమూల్యమనశ్శాంతి అతనికి లభింపలేదు. మృత్యు నిర్భయుడైన, చిరంజీవియైన ఆ మానవునిపై సదా చింతావర్షం కురిసింది.

"నేను అమరుడను; మృత్యువు నన్ను సమీపింప శక్తిలేదు. అంతా సరియే. అన్నీ నాకనుకూలమే. కాని నాకు శాంతి యెక్కడా లభించదే?" మానవుడు విలపించాడు.

తుపాను చెలరేగింది... పిడుగులు పడినాయి... హోరున వర్షం కురిసింది... భోరున గాలివాన పర్వతాలను, వృక్షాలను కూకటివ్రేళ్లతో పెల్లగించింది.... భూకంపం అగణిత పరివర్తనాలను వసుధపై ప్రసాదించింది. కాని మానవుని తపస్సున కెట్టి భంగమూ కలుగలేదు.

ఒకరోజు...

ఒక హీనస్వరం, క్షీణించు విషాద నిశ్వాసం అతని చెవులు సోకింది. తన తపస్సునకు భంగం కలుగకూడదని మానవుడెంతో యత్నించాడు. అతని ప్రయత్నం భగ్నమయింది. యంత్రంవలె అతడు లేచి మైదానాలను, నదీ గిరులను దాటి వెడలినాడు. ఎక్కడికో?...

కారణం అతనికే తెలీదు... బహుశా ఓసారి క్రిందపడినాడేమో. అతని పాదాలవద్దనుండి ఒక దీనస్వరం వెలువడింది.

మానవుడు కలయజూచినాడు. రక్తమాంసాలు గోల్పోయి అస్థిపంజరంతోవున్న ఒక స్త్రీమూర్తి దీర్ఘ ఉచ్ఛ్వాసం తీసుకొంటూవుంది.

"ఎవరు నువ్వు?"—అని మానవుడు ప్రశ్నించాడు.

"నేను... మృత్యువును"

మానవుడు జలదరించాడు.

"పాపీ! అమరమానవుని తాకుతావూ నీవు? వెళ్లు దూరం..."—మానవుడు కళ్లెర్రజేసినాడు.

నిస్సహాయ మృత్యువు అతన్ని చూసింది... అతని మాటల్ని విన్నది. మరి గ్రహించింది.

"ఇదుగో, నావద్ద శాంతియున్నది... ఈ అమూల్యనిధిని నా ఉపాసకులకూ, సేవకులకూ మాత్రమే యిస్తాను. నన్నారాధిస్తావూ? నన్ను ప్రేమించవూ?... హా...

## మృత్యువు — మానవుడు

నన్నెవ్వరూ దరిచేరరే ?"—మృత్యువు గద్గదికతో వాపోయింది.

అమరమానవుడు పటపట పండ్లుగీకినాడు. పిడికిలిని బంధించినాడు. "పిశాచీ ! వెళ్లు... వెళ్లు. నన్ను మోసగించుటకు వచ్చావూ ?" అంటూ ముందుకు సాగినాడు.

మృత్యువు తన క్రోధానలాన్ని మ్రింగింది..."వికారంలో సౌందర్యం వుందనీ, తిరస్కృతంలో శాంతియున్నదనీ బుద్ధిహీన మానవునికేం తెలుసు ?" అని అనుకొన్నది.

ఆది మానవునికి యెక్కడా శాంతి లభించలేదు. అతడు తన తపోజీవనంనుండి వెలిపడ్డాడు.

శాంతికోసమై మానవుడు తన జీవితగతిని మరోవైపుకు త్రిప్పినాడు. శరీరపుష్టికై పొలాలను పండించినాడు. అడవుల్లో మృగాలను వేటాడినాడు. వేటాడుటకు తగిన పరికరాలను సేకరించినాడు. విల్లమ్ములను వినియోగించినాడు... వియోగ నారీమణిని కరుణాకంపముతో దరిజేర్చుకున్నాడు.

ఇరువురినుండి ముగ్గురైరి. ముగ్గురునుండి నలుగురైరి. ఇలాగే పరివారం పెరిగింది. వారి రక్షణకై, పోషణకై మానవుడు తన దేహబలాన్నీ, బుద్ధిబలాన్నీ అభివృద్ధి నొనరించాడు. తన పూర్వ చింతనలన్నీ విడిచి 'కర్మ'లో విలీనుడైనాడు. ఇప్పుడతడు శాంతికోసమై యెక్కువగా అలమటపడుటలేదు. తన స్త్రీ వ్యామోహంలోనూ, పసిబిడ్డల ముద్దుమాటల్లోనూ పూర్ణ సంతోషాన్ని పడయగల్గినాడు. పూర్వముకన్న సుఖమయ జీవుడైనాడు...

మానవుడు వృద్ధుడైనాడు. మృత్యువుయొక్క ఆవశ్యకతను గుర్తించినాడు, చిరంజీవిగానుండుటకు నిరసించినాడు. మృత్యువును యేవగించుకొనుటకు బదులు ప్రేమింప నారంభించినాడు. మృత్యువు ఒడిలో శాశ్వత శాంతినీ, నిజమైన ఆనందాన్నీ అనుభవించుటకు ఉత్సుకుడైనాడు...

మృత్యువు మానవునిపై విజయమందింది. మానవుడు పరాజయంలోకూడ విజయాన్ని చేపట్టినాడు.

ఒకరోజు రాత్రి నిద్రించు మానవుని మృత్యువు సమీపించింది...ఇప్పుడామె సర్వసుందరాంగియై, ప్రసన్నతా వదనయై వెలుగుతూవుంది.

మానవుడామెను సమీపించి యిలా అన్నాడు—"నా మునుపటి మూర్ఖతను మన్నించు తల్లీ !"

మృత్యువు చిరునవ్వు నవ్వుతూ అతని కపోలాన్ని చుంబించింది. మానవుడు చిరశాంతిని పొందినాడు.

[హిందీ మాసపత్రిక 'ఆంధీ' నుండి.]



# తెలుగు పడుచు

తెలుగువారి పిల్లవటే !
తీరెరిగిన కన్యవటే !
గోదావరి తల్లిపాట
గొంతునిండ పాడుకొనే ॥ తెలుగు ॥

పసుపుంబారాణి వెలుంగు
నొసటునగరు చుక్క వెలుగు
మిసిమి—నెమ్మోని వెలుగు
ముసికింతల నగవు వెలుగు ॥ తెలుగు ॥

ముచ్చటైన వాల్జడలో
మొగ్గమల్లె పులకరించి
మొయిలువన్నె కురులనడుమ
మొగలిరేకులందగించి ॥ తెలుగు ॥

జిలుగుపైట తెరచాటున
తెలుగు పాలకడవలొరసి
కలంగిజారు బరువుకనుల
తెలుగునీలి చూపుమెరసి ॥ తెలుగు ॥

శ్రీ సూరంపూడి భాస్కరరావు



# భ్రాంతి

* * *

స్వీయ సంస్కృత రచనానువాదమైన ఏకాంకిక

* * *

జ్యోశ్యుల సూర్యనారాయణమూర్తి

శంకర శాస్త్రి — ఒక పండితుడు
సుభద్ర — పండితుని భార్య
ఇందిర — శంకరశాస్త్రి కూతురు
రమేశుడు — ఇందిర భర్త
ఉమేశుడు, గోపాలుడు, కేశవుడు } రమేశుని మిత్రులు
ఒక బాలుడు — పరిచారకుడు

విద్యార్థులు.

## ౧ వ రంగము

(శంకరశాస్త్రి అనుష్ఠానమును పూర్తిచేసుకొని కూర్చుంటాడు. —భార్య వస్తుంది)

శం : ఇదిగో! నా జపమైపోయింది. విద్యార్థులు వస్తారు, వాళ్ళకి పాఠాలు చెప్పటం అయ్యేసరికి నువ్వు వంట కానివ్వాలి.

సుభద్ర : సరేగాని, ఇంకా విద్యార్థులు రాలేదుగదా! ఈ లోపుగా నేనో విన్నపము చెయ్యొచ్చా ?

శం : ఆహా! ఏం ? వంట ఏమన్నా చెయ్యాలా ?

సు : అబ్బే! అల్లాటిపని చెపుతానా ? అది నే చెయ్య లేనా ? మీ రెందుకు ? పిల్లకి పదేళ్లు వచ్చాయి. దానికి తగిన వరుణ్ణి చూచి వివాహం చెయ్యాలికదూ! ఆ విషయం ఏమన్నా ఆలోచిస్తున్నారా ? అని,

శం : ఇందిర పెళ్లిమాటా ? బాగా చెప్పావు. ప్రయత్నిస్తా. రాజమండ్రిలో ఒక పిల్లవాడున్నాట్ట. బి. ఏ. చదువు తున్నాడు. తల్లిదండ్రులు మంచివాళ్లు సదాచార సంపత్తి గలవాళ్లు అని వినికిడి.

సు : అల్లాగా! అయితే ప్రయత్నిస్తానంటారేం ? జరుగు తోందన్నమాటే ప్రయత్నం ? మరోలా అనుకోవద్దు. ఆడదాన్ని కనక నాకే తొందరున్నట్లు మాట్లాడాను.

శం : అబ్బెబ్బే!! అదేమిటి ? ఈ విషయంలో నాకేమీ స్వాతంత్ర్యం లేదు. కాళిదాసు "ప్రాయేణ గృహిణీ నేత్రాః కన్యార్థేషు కుటుంబినః" అన్నాడు కదూ!

సు : నాలాంటి ఆడవాళ్లు పతికి విరుద్ధమైన పద్ధతి ఆలో చించరు. ఆ మహాకవే అన్నాడుకదూ! "భవంత్య వ్యభిచారిణ్యో భర్తురిష్టే పతివ్రతాః" అని

శం : బాగుంది. ఇంకేం ? అయితే మన మిద్దఱం కలిసేలే - పిల్లని తగిన అల్లుణ్ణి వెదికి వప్పజెప్పేద్దాం. సరేనా ? ఇదిగో చూడూ! ఇప్పుడు ఎక్కడచూచినా ఇంగ్లీషు చదివినవాడే పండితుడు. సదాచారాలు అక్కర్లేదు. అంచేత నే చెప్పిన పిల్లవాడి సంగతి వివరాలు తెలిసి కొని వీలయితే ఆ సంబంధమే నిశ్చయిద్దామను కొంటు న్నాను. బి. ఏ. చదువుతున్నాడుగదా, తల్లిదండ్రులు మంచివారు సంప్రదాయంగల కుటుంబం—తరువాత వాళ్ల అదృష్టం.

సు : మీ యిష్టం. మీకు తెలియదా ఏమిటి ?

(సుభద్ర లోపలికి వెళ్ళిపోతుంది. ముగ్గురు విద్యార్థులు వచ్చి గురువందనంచేసి కూర్చుంటారు.)

1వ వాడు : గురువుగారూ ! మమ్మల్నంతా హేళన చేస్తున్నారు. తిడుతున్నారు. మాతో ఎవడూ స్నేహం చెయ్యటంలేదు.

శం : అదే ఎంచేతరా ?

2వ వాడు : మేము సంస్కృతం చదువుతున్నామని.

3వ వాడు : వాళ్లంతా సంస్కృత ద్వేషులండీ. సంస్కృతానికి చెందిన సంస్కారం వాళ్లకేం తెలుసు ? మా వేష భాషలు చూచి మాలో ఆధునిక నాగరికత కన పడకపోవటం వల్ల వెక్కిరిస్తున్నారు. దానితో వీళ్లు ఉడుక్కుంటున్నారు. నాకుమాత్రం వాళ్లతో స్నేహం లేకపోవటమే మంచిది అనిపిస్తుంది.

శం : నీ ఉద్దేశం బాగుంది. వాళ్లంతా వేషాభిలాషులేగాని భాషాభిలాషులు కారు. అల్లాంటివాళ్ల స్నేహం ఎందుకు? వాళ్ల నడత కేవలం చెడ్డదిగా మారుతుంది. వాళ్లతో స్నేహంచేస్తే మీరు పాడవుతారు. పైగా విద్యార్థులకు స్నేహాలతో ఏంపని ! ప్రవర్తన మంచి దుండాలి. అదే భూషణం. తరవాతే చదువుకూడా. "సంసర్గజాదోష గుణాభవంతి" అన్నారు పెద్దలు. దుస్సాంగత్యాలు పనికిరావు.

1వ వాడు : ఏం ! ఆంగ్లభాష భాష కాదాండి ! అది చదివేవాళ్లకి జ్ఞానం ఎంతుకుండదు ? కేవలం అది చదివిన మాత్రాన నడత ఎందుకు చెడుతుంది.

శం : అదీ భాషే. అది చదివేవాళ్లలోనూ మంచివాళ్లున్నారు. వాళ్లని మనం ద్వేషించకూడదు. కాని— అన్ని భాషలకీ మాతృస్థానం సంస్కృతానికి లభించింది. అందుచేత సంస్కృతం తెలిస్తే అన్ని భాషలు తెలుసుకోవటం తేలిక.

2వ వాడు : గురువుగారూ ! సంస్కృతంలోంచే భాషలన్నీ పుట్టాయంటారే ! అదెల్లాగ ? ఆంధ్రంలోంచో ఆంగ్ల లోంచో పుట్టాయనిగాని స్వయంగా పుట్టాయనిగాని ఎందు కనకూడదు ? కాస్త వివరించండి.

శం : సంస్కృతము చరిత్ర దృష్ట్యా అన్నిటికంటె ప్రాచీన మైనదిగదా ! పైగా—శ్రద్ధగా విను, సంస్కృతంలో మాతృశబ్దం ఉందా! అదే ఆంగ్లంలో "మదర్" అయింది, ఇల్లాగే "పితృ"లోంచి "ఫాదర్" భాతృలోంచి "బ్రదర్" "స్వసృ"లోంచి "సిస్టర్" మొదలయిన మాట లాంగ్లంలో తయారయ్యాయి అని ఊహించవచ్చు. ఆంధ్రంలో చాలామాటలు బెట్టదము, బీరము మొదలైనవి భీతిద,వీరాది శబ్దాలవి కృతులుగదా! అల్లాగే సంస్కృతంలోని పానీయం అనేదానిలో చివర "య" తీసేస్తే హిందీలో "పానీ" అయి ఊరుకుంది. పరశ్వః మొదలైనవి పరసో మొదలైన యితర హిందీ పదాలుగా మారాయి వాడుకలో అనుకోటం తేలికగా హేతు యుక్తంగా ఉందిగదా ! ఇంక సంస్కృత సమాలే చాల భాషలలో వ్యవహరింపబడుతున్నాయి. కనుక సంస్కృత విజ్ఞానం కలిగితే మిగిలినవి చాల తేలిక.

3వ వాడు : అంచేత తప్పక సంస్కృతం పూర్తిగ చదవటానికి యత్నిస్తాను. కృపగలిగి బోధించండి గురువుగారూ !

1, 2వ వాళ్లు : గురువుగారూ ! మేముకూడ సంస్కృత పాఠం మానము. ఆంగ్ల విద్యార్థులు మాతో స్నేహం చెయ్యకపోయినా సరే. వాళ్లతో మాట్లాడటంకూడా మాకు కిట్టదు.

శం : బాగుంది. బాగుంది. వాళ్లతో మాట్లాడినంతమాత్రాన తప్పేముంది ? సంభాషణ, మర్యాద, వగైరాలు చేస్తూనే వుండాలి. యింకా వాళ్లలో గుణవంతులు దగ్గరకుజేరి ఆ భాషా రహస్యాలు తెలిసికోవాలి. దుష్టులు ఎవరైనా వారితో స్నేహం మాత్రం పనికిరాదని నా తాత్పర్యం.

3వ వాడు : మేము మా పాఠాలు బాగా చదివి మధ్యాహ్నం పాఠానికి వస్తామండి.

శం : అల్లాగే—బాగా చదవండి.

(అంతా వెళ్లిపోతారు)

## 2 వ రంగము

(అద్దంలో చూచుకొంటూ ఇందిర ముస్తాబు చేసికొంటూండగా)

సు : (ప్రవేశించి) అమ్మాయీ! అదేమిటే ? అస్త మానం అద్దం దగ్గిరేనా ? ఏదైనా చదువుకోరాదూ, రామాయణమో భారతమో ?

ఇందిర : (తల్లినిచూచి బెదురుతూ) ఇప్పుడే వచ్చానే. చదువుతున్నాను. (పుస్తకం తీసుకొని) అమ్మా! సీత సౌశీల్యం ఎంత గొప్పగాఉందే! రాజభవనాలు విడచి భర్తతో అడవికి బయలుదేరింది.

సు : అదే భారత నారీలోకంలో ప్రశంశనీయమైన చరిత్ర. అమ్మాయీ ఒక్క సీతేనా ? ఇట్లాంటివాళ్లు దమయంతి, అరుంధతి మొదలైనవాళ్లు ఎంతోమంది సాధ్వీమణులున్నారమ్మా! చూడు వారి శీలాన్నే మనం అలవాటు చేసుకోవాలి.

(తొందరగా ప్రవేశిస్తారు శాస్త్రిగారు)

శం : ఇంకా, ఇల్లాగే ఉన్నావూ, తొందరలేదేం ? కార్య భారం పెద్దది. మూడురోజులు దాటితే పెళ్లి. నువ్వు అమ్మాయితో ఆడుకుంటున్నావు. ఇంక అమ్మాయి వధువు అయినట్టే !

సు : మీకోసం వస్తున్నాను. ఇంతలో అమ్మాయి రామా యణ గాథ చెపుతూ ఆపింది. పిల్లకి సాధ్వీ చరిత్రతో పరిచయం చేస్తున్నాను ఆమాటమీద. సరే, ఏమ యింది ? నిశ్చయించినట్టేనా ?

శం : ఇంకా సందేహమా! ముహూర్తంకూడా నిశ్చ యించాం. ఎల్లుండే ఇంక మనం త్వరపడాలి. నడు, నడు, లోపలికి నడు, అంతా సిద్ధంచేయాలి.

(అని కూర్చుంటాడు. సుభద్ర లోపలికి పోతుంది)

ఇం : (సమీపించి) నాన్నా! అమ్మ అంటోంది సీత, అనసూయ అల్లాంటివాళ్ల మల్లే ఉండాలిట. అంటే ఎల్లాగ ?

శం : అమ్మా! బాగా అడిగావు తల్లీ. విను, నువ్వు రామా యణం చదువుతున్నావా ? అందులో సీత మంచి గుణాలు నడవడి తెలుస్తోందికదూ! పూర్వం సీత పతి భక్తితో తన సుఖాలు వదలి మగనితోపాటు కష్టమైనా అడవులకు వెళ్లింది. ఇల్లాంటి విషయం ఎక్కడెక్కడ కనిపిస్తే అక్కడల్లా శ్రద్ధగా అర్థంచేసుకోవాలి. అల్లాగే రేపు నువ్వుకూడా కష్టసుఖాలను భర్తతోపాటు పంచు కోవాలి. దాంతో బంగారుతల్లివలె అందరిచేత కొని యాడ బడతావు.

(ఇందిర సిగ్గుపడి నవ్వుతుంది)

తెరలో—అమ్మాయీ! ఇల్లారా !

ఇం : వచ్చే. (లోపలికి వెళుతుంది)

## 3 వ రంగము

(అత్తవారియింట ఇందిర రామాయణం చదువుతూ ఉంటుంది)

రమేశుడు : (వచ్చి) ఆ పుస్తకం ఏమిటి !

ఇం : (విధేయతతో లేచి నీళ్లు అందిస్తూ) ఇది సీతా చరితం. ఇది చూడగా పతివ్రతల మహిమాతిశయం ఎంత గొప్పదా అనిపిస్తుంది—వాల్మీకి వాగ్ధార అమృత ప్రాయం.

రమే : (కాళ్లుకడిగి కూర్చుంటాడు) మంచిది. మన ప్రాచీన కవులు వంద్యులు అయినా, షేక్స్పియర్, టెనిసన్, లాంటి ఇంగ్లీషు కవులు స్వాభావిక చిత్రం చేసినట్టు మనవాళ్లు చేయలేదనుకుంటా.

ఇం : నేను అల్పజ్ఞను. పైగా ఆంగ్లానభిజ్ఞను. నా కిదే ఆశ్చర్యంగా ఉంటుంది. నాఉద్దేశం—ఆంగ్ల సంప్ర దాయంకంటె భారతీయ సంప్రదాయంలో అన్ని విధాలా పవిత్రత, గొప్పదనం ఉందని.

రమే : నీ కింతమాత్రమే తెలుసు. మన పెద్దలుకూడ, పిల్ల లకు ఇంతే చెప్తారు. ఇంతకంటె ఎక్కువ వాళ్లకే తెలియదు. నువ్వు నేర్చుకోవాలి విశేషాలు.

ఇం : నేనా ? విశేషాలా!

రమే : ఇం... ఇక ఇది నీకు పుట్టినిల్లుకాదు మెట్టినిల్లు. అంచేత నా... అలవాటులు పద్ధతులు తెలిసికొని నాలాగే తయారవ్వా... నీలో కేవలం ఈ ప్రాచీనత నాకు కనబడకూడదు. ... పురాతనమైన లజ్జ, ఉపయోగంలేని వినయం, ముఖం చూచేసరికి స్వాతంత్ర్యం లేనట్టు కనిపించటం, ఇవి ఈ రోజుల్లో మనలాంటివాళ్లకి బాగుండవు.

ఇం : పురుషులకైతే మీరన్నది నిజమే. కాని, ఆడవాళ్లు ఈలాటి స్వాతంత్ర్యంపొంది ఏం చేస్తారు ? స్త్రీ పురుషునిలాగ సంచరిస్తే ఇంక దాని సౌశీల్యమేమిటి ?

రమే : ఏం ? స్త్రీ స్వాతంత్ర్యానికి తగదా ? ఇదే మీ తెలివితక్కువ. ఆడుది మగవాడితో సమానమైన అధికారం కలిగి ఉండాలి. నువ్వు యింక నా ఇష్టం వచ్చినట్టు నే చెప్పినట్టు నడుచుకో... అందులో ఉండే అందం నీకు తెలిస్తుంది. నే చూపిస్తానుగా.

ఇం : ఎట్లాగ ?

రమే : క్లబ్‌కి నాతో రావాలి. అక్కడ సాయంత్రం మేమంతా "బాట్ మింటన్" అవీ ఆడతాం. అక్కడికి నువ్వు వచ్చి చూస్తే తెలుస్తుంది. అందులో ఎంత మజా ఉందో, ఇంకోటి—నీ వేషం ఇల్లా ఉండకూడదు. ముసలివాళ్లున్నట్టుండకూడదు. నిన్నీ వేషంలో చూచారంటే నా "ఫ్రెండ్సం"తా నన్ను హాస్యం చేస్తారుకూడా. అంచేత తప్పకండా నే చెప్పినట్టు వినాలి.

ఇం : మీరన్నట్టు తప్పకండా చేయాలి. కాని, ఇల్లు వదలి అక్కడ కెందుకా అని ఆలోచిస్తున్నా—

రమే : ఇందిరా ! నామాట వినవూ ! నన్నర్థం చేసుకోటం లేదూ ! ఇదుగో ! తప్పకండా అల్లా చేయ్యవలసిందే సుమా !

ఇం : (భయంతో) మీకు కష్టంగా ఉంటే ఇల్లా ఎందుకుంటాను ? మీయిష్టం ఎల్లాగైతే అల్లాగే.

రమే : చూడు. నీకే తెలుస్తుందిగా, "క్లబ్‌కి" వెడదాము పద !

(ముందు రమేశ్ వెనుక మెల్లి మెల్లిగా ఇందిర వెడతారు)

## ౪ వ రంగము

(రమేశ్ కుర్చీలో కూర్చుంటాడు నాలుగైదు కుర్చీలతో అలంకారాలతో గది)

ఉమేశ్ : (ప్రవేశించి) గుడ్ మార్నింగ్.

రమేశ్ : హాలో—గుడ్ మార్నింగ్.

ఇం : (లోపలనించి వస్తూ) నమస్తే.

ఉమే : ఇందిరాదేవీ ! నమస్తే.

రమే : కూర్చో రా ! (ఉమేశ్ కూర్చుంటాడు)

(తరువాత ఇద్దరు మిత్రులరాక)

(రమేశు, ఇందిర లేచి స్వాగతం ఇస్తారు)

రమే—ఇందిర : రండి కూర్చోండి.

గోపాల్ : ఏం ? మీరింకా గ్రౌండుకి రారా ! ఇంకా టిఫిన్సు, గిఫిన్స్ ఉన్నాయా !

రమే : లేదు, లేదు, మేమూ వస్తున్నాం. అంతా అయిపోయింది. మీకోసమే...

కేశవుడు : అయితే లేవండి.

రమే : మన మీవేళ క్లబ్‌నుంచి త్వరగా గ్రౌండుకి పోయి, తరవాత చప్పున వచ్చేసి సినిమాకి వెళ్లాలండీ. అదీ కథ.

కేశ : తప్పకుండా చూడదగిన సినీమా.

రమే : ఏం ? ఇందిరా ? ఏమంటావు ?

ఇం : వెళ్లవలసిందే. నేను వంటవాడితో చెప్పే ఉంచానే త్వరగా తేల్చమని.

రమే : బాగుంది పోదామా ?

కేశ : రండి—

(అంతా పోతారు)

## ౫ వ రంగము

(అస్వస్థతగా రమేశుడు మంచంమీద)

రమే : అబ్బ, ఏం తలనొప్పి ? ఎక్కువవుతోందిగాని తగ్గదే ? ఒరే ! కుఱ్ఱాడా ! మంచినీళ్లు తెచ్చిపెట్టు.

కుర్రాడు : (నీళ్లు తెచ్చి) ఇదిగో (ఇస్తాడు)

రమే : ఏదీ! ఇందిర!

కు : క్లబ్ కెళ్లారండి. మఱేండి ఆరన్నారండి—ఈయాల ఆల్సింగా వత్తారంట, తొరగా వత్తారని కూకోక నన్ను తిండి తినేమన్నారండి. ఆరొచ్చి కేకేత్తే తలుపు తియ్యొచ్చంట పడుకోమన్నారండి—

రమే : ఆహా! నా బాధ నాదీ, దాని ఆట దానిదా? వెళ్లు, వెళ్లు, నువ్వుపోయి పడుకో. (బాధపడతాడు) (కుర్రాడు లోపలికి పోయాడు.)

(ఇందిర వయ్యారంగావస్తూ నిలువుటద్దం దగ్గఱ ఇటు అటు తిరిగి చూస్తుంది)

రమే : ఎవరు? ఇందిరా? ఇంతసేపెక్కడున్నావు? పొద్దుగూకి ఎంతసేపయ్యింది?

ఇం : ఆ, ఈవేళ వెన్నెలగా ఉందికదూ! అంచేత అక్కడే మఱి కాస్తసేపు బాట్మింటన్ ఆడి కూర్చున్నాం. ప్రోగ్రాం అయ్యేటప్పటి కీవేళయింది.

రమే : నేనిల్లా ఉన్నానుగదా!

ఇం : అవును. టయమయింది. నే లేకపోతే ఎల్లాగ అక్కడ సాగేది?

రమే : ఇందిరా! (అనుమానిస్తాడు)

ఇం : ఏం?

రమే : నీ ప్రవర్తన నాకు బాధకలిగిస్తోంది. నీవు తప్పకుండా వెళ్లాలే అనుకో-ఐనా నా సంగతి కాస్త ఆలోచించాలా? ఇంకేం చెప్పను? (కాస్త బాధతో నవ్వుతాడు) (ఆలోచించి) అసలు మొదట్లో నీకీ మాదిరిగా అలవాటుచేసిన ఉపాధ్యాయుణ్ణి నేనే. కాని, కాని నా కిప్పుడు తెలుస్తోంది. అనుపమ సుఖాన్ని వదలి నేను భ్రమ పడ్డాను. తెలుసుకుంటున్నా. నే నేది పరమ సుఖమని ఆనందమనీ అనుకున్నానో అదంతా అనుమాన భూయిష్టం స్వేచ్ఛారహితం. సుఖాభాస మాత్రమేగాని సుఖంకాదు. ఇదంతా నా భ్రాంతే. భ్రమ. (కాస్సేపు ఆలోచించి మళ్లీ) నా ఉద్దేశం చెపుతున్నాను. మళ్లీ నీ భారతీయతను చూడాలని ఉంది. మునుపటిలాగే నీవు నా ఆజ్ఞని కాదు కాదు విజ్ఞప్తిని పాలిస్తావని విశ్వాసం పొందచ్చా? ఏమంటావు? ఇదే బాధ అంతా. వ్యాధికూడా ఇదేనని వెల్లడిస్తున్నాను.

ఇం : (విని. ఆలోచనలో పడుతుంది)

రమే : ఇందిరా! మాట్లాడవూ?

ఇం : (సిగ్గు బెదురూ వ్యక్తం చేస్తూ) ఇదంతా మీకు నచ్చకపోతే నాకూ నచ్చదన్నమాటే. కాని ఈ మాదిరిగా అలవాటుపడ్డాను. కనుక విశ్రాంతికి అల్లా పోతున్నా. ఇది తప్పని మీరనుకుంటే నే పోనక్కఱలేదు, అక్కడికిగాని, ఇంకెక్కడికీగాని. మీ మిత్రులలా ఉన్నవాళ్లుకూడా ఇక్కడికి రాకపోతే మంచిదేమో! మీరుగూడా కొన్ని నియమాలు పాటించాలి. ఆ పైమెప్పుడు వస్తుందాఅని, ఈ సంగతి బోధపడేటట్టు చేయటానికే యత్నించాను. ఫలించిందనుకుంటా. ఇప్పటికి నా చిత్తానికి శాంతి లభించినది. సంతోషము. (దగ్గఱకుజేరి కూర్చుంటుంది)

రమే : అమ్మయ్య! ఇదే నా పాశ్చాత్య వాసనావ్యాప్తికి హద్దు. ఇంక భారతీయుడను కావాలి. అవుతా. (పరస్పర విలోకనము)

## ౬వ రంగము

(అనుష్టానము పూర్తిచేసివేస్తూ రమేశ్
గ్రంధం తెస్తూ ఇందిరా)

రమే : (లేచి) ఆ పుస్తకం ఏమిటి?

ఇం : ఇది శాకుంతలం నాటకం.

రమే : ఆ, షేక్స్పియర్ లాంటి కవిటగదూ! కాళిదాసు అతని నాటకమేనా? ఏదీ చదువు విందాం.

ఇం : ఆహాఁ. కాళిదాసులాంటివాడే. ఆ షేక్స్పియరేమో? అయినా ఈయన ఉపమా సౌభాగ్యం వాడికెల్లా సాధ్యమవుతుంది?

రమే! ఆఁ. ఎందుకు కాదు? ఆయన మహాకవే—

ఇం : కావచ్చు.

రమే : సరేగాని, కొంచెం చదువు. ఆయన సరసత నీ రసి కతా చూద్దాం.

ఇం : (రోషము నటిసూ)

"క్వభవాన్ క్వపరోక్షమన్మథా
మృగశాబైస్సమమేధితాప్యహం!

రమే : "పరిహాస విజల్పితం సఖి
పరమార్థేన న గృహ్యతాంవచః"

(ఇలా సంస్కృతంలో ఆ కాళిదాసు మాటలే తమ కన్వయించి మాట్లాడిన తరువాత పుస్తకం లాక్కుంటాడు)

ఇద్దరూ : ప్రవర్తతాం ప్రకృతి హితాయపార్థివః
సరస్వతీ శ్రుతిమహసాం మహీయసాం
మమాపిచక్షపయ మనీలలోహితః
పునర్భవం పరిగతశక్తి రాత్మభూః

ఇదే భరతవాక్యం.

(తెర)



# స్మరణాంజలి

* విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు *

పతినేత్రాలకు గోచరింపనిది యీపాపప్రపంచమ్ము సం
మతిఁ జూడందగ దింక నాకు ననుచున్ మాన్యంపు టాంధ్యమ్ముఁ గాం
చితి నీసాటి జగమ్మునందుకలదే స్త్రీలోకమందెన్నడై
న తలంపన్ స్మరణీయ శీలవతి గాంధారీ పురంధ్రీమణీ!

అతి ప్రేమంబున దిగ్జయంబు గను నా కాశీస్సు లిమ్మంచు నీ
సుతుఁ డేతేరఁగ భారతావని వసూసుశ్లోక ధర్మ స్వభా
వత రూపించుచు మాతృ మోహమును సంభావింప కేమాత్ర మా
గతి ధర్మంబె జయించు నెన్న డనుచున్ గావింపవా దీవనల్!

భారతగాథ ప్రపంచము
గారవముం గాంచు నంతకాలము వఱకున్
నీరమణీయ చరిత్ర మ
పార ముదావహము జనని భావింపంగన్.



# ఆస్థానకవి చెళ్లపిళ్ల

వెలమకన్ని శ్రీరామమూర్తిగారు

శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారికి నేటి మన ప్రజాప్రభుత్వము తెలుఁగు ఆస్థాన కవి పదవినిచ్చుట శ్లాఘ్యపాత్రము. 'అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యన్ గలదేశం'లో వారి పాండితి విస్ఫారింది. ఠాగూరు కాకినాడ వచ్చినప్పుడు వెంకట శాస్త్రిగారు ఆసుగా శ్లోకాలు చదివారు. రవీంద్రుడు వారిని మెచ్చుకొన్నాఁడు. ఈ సంఘటనే వారి అసమాన పాండితికి నిదర్శనము. ఇటు యింగ్లీషు వ్యరనడికీ అటు పండితాభిపక్కుల భాషా భేషజానికీ మధ్యపడి మనతెలుఁగు సాహిత్యమునలిగి — చినిగి పోతూ ఉన్న సందర్భములో తిరుపతి వెంకట కవులవతరించి ఉద్ధరించారు. నేడు కవిసిలబద్ధానికి ఆస్కారము కల్గించిన వారు వీరే! 'తిరుపతి అతండు, వెంకటేశ్వరుడనేను, వెరసి తిరుపతి వెంకటేశ్వరులమేము' అని చెప్పి అర్ధశతాబ్దా నాడు పాండితికున్న గౌరవాన్ని మించినదాన్ని పంచి యిచ్చినవారు తిరుపతి కవులే!

అర్థ శతాబ్దము క్రింద కవిత రాజాస్థానముల నాశ్రయించెడిది. కవిత ప్రజలజాతీయ జీవనానికి ప్రతిబింబమని గ్రహించి తత్ విధానమునందే కవిత్వము వ్రాసినవారు తిరుపతి వెంకటకవులే!

ప్రజల ఉపయోగార్థము ప్రజారంజకమైన భాషలో వ్రాసిందే ప్రజాసాహిత్యము — ప్రజా కవిత్వమూ అదే. తిరుపతి కవులు ఆంధ్ర కవిత్వమునకిచ్చిన నూతన రూపేయిది. అదే వారు కవిత్వములో తీసుకువచ్చిన మార్పు — దానినే అతినేర్పుతో చేసారు.

'కవనార్థ ముదయించితిన్ — సుకవితాకార్యంబె నావృత్తి' అనేగాఢ విశ్వాస పూరితమైన



శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

బాస తీసుకొని, కవితారంగమున నూతన పరిణామము సాధించుటకు పూనుకొని, ఢంకాలు వాయించి — శంఖాలు పూరించి మహోద్యమాన్ని సాగించి కృతకృత్యులైయ్యారు. 'తనకు నాల్గు నిఘంటు పదములువచ్చు — ననుచు బదిమందికీ దెలియంగ మారు-మూల పదములుగుప్పిన ముచ్చటగునె — ప్రతిపదమ్మున రసముట్టిపడినగాక' అని

వచించి, వారు రచించిన ప్రతికావ్యమూ రసమయము గావించారు. అప్పుడు వాడవాడల—ఎచ్చటచూచినా వీరికవిత్వపు పేనాళ్లే—అవధానాలే. దీనిమూలముగా ఆంధ్ర కవిత్వముపై పండిత పామరులకు సమానమైన భక్తి శ్రద్ధలలము కొన్నాయి.

'నీరుంగోరదు, గడ్డినడ్డదొక కొన్నేనుల్వలన్ వేడదు' అంటూ సైకిలుమీద—'కొండవడిన్ బరతెంచి, అంత ఉద్దండత దారికడ్డమయితాకి హాళోహళిసేయు, కొండలన్ పిండిజేసి, రైలు కడువేగమునన్ చనుదెంచునట్లు,' అంటూ గ్రామ శకటముమీద—'అన్నా వైనట, బ్రాందియంట, విసికీయంటక్కటా' అంటూ మద్యపానంమీద వారు పద్యాలు చెప్పారు. రామకృష్ణ పరమహంస, వివేకానంద, ఆలయ ప్రవేశము, హరిజనాభ్యుదయము మొదలగు విషయాలపైన అనేక పద్యాలు చెప్పారు. ఇలా చెప్పడములో శాస్త్రిగారి వుద్దేశము ప్రజా జీవితపు విషయాలు కవితావస్తువు కాదగిందని సోదాహరణంగా నిరూపించడమే!

శతావధానాలు చేయడమేకాకుండా 'శ్రవణానందము', 'పాణీగృహీత', 'దేవీభాగవతం', 'గుంటూరుసీమ', 'బుద్ధచరిత్ర', 'గీరతము', 'పాండవోద్యోగ విజయములు' 'పాండవ విజయము' మొదలైన కావ్యాలు, నాటకాలు రచించారు. 'విక్రమాంక దేవచరిత్ర' వీరి వచనరచనకు మచ్చుతునక. వీరి వచనరచనలు శిష్టవ్యవహారానికి వరవడి తునకలుగా యుంటాయి. 'వీరి కవిత్వము పాతపద్ధతికి భరతవాక్యమూ — నవ్యసాహిత్యానికి నాందీ పాఠమూ'.

శ్రీ శాస్త్రిగారి గ్రంథాలు పరికిస్తే వారిలో కవిత్రయమువారు—ప్రబంధకవులూ— మహాకవులూ—అందరూ ఏకమై ప్రవేశించి వ్రాయించారనిపించును. పింగళి, కాటూరి, విశ్వనాథ, వేలూరి, వేటూరి ప్రభృతులు చెళ్లపిళ్లవారి శిష్య రత్నాలలో ముఖ్యులు.

శ్రీ శాస్త్రిగారు కవిత్వసంస్కర్తగా—ఉద్ధారకుడుగా—శతావధానిగా—మహాపండితుడుగా—సంఘసంస్కర్తగా సాధించిన మహత్తర విజయాలనన్య సామాన్యములు. అట్టి విజయ సాధకుని ఆస్థానకవిగా జేసి గౌరవించడంవల్ల మన సారస్వతలలామను నూతనాభరణ భూషితురాలునిగా జేసితిమన్న మాట. ఇట్టి మహాపురుషుని గౌరవించిమన మద్రాసు ప్రభుత్వము తమ గౌరవము కాపాడుకున్నది.





# చిలకడదుంప వంటకాలు

## కూర

ఎఱ్ఱ చిలకడ దుంపలనుగాని, తెల్ల దుంప లనుగాని తీసుకొని నీళ్లలోవేసి బాగా కడిగి పలుచచి చక్రములవలె తరగవలెను. పై పొట్టు తీయనక్కరలేదు. ఆ ముక్కల్లో తగుమాత్రము ఉప్పు, పసుపు వేసి, ఎండుమిర్చి, మినపపప్పు, ఆవాలు, జీలకఱ్ఱ, కరివేపాకువేసి వేపిన పోపులో వేసి మూతవేయవలెను. సన్న మంటమీద ముక్కలు బాగా మగ్గిన తర్వాత, కొద్దిగా అల్లం పచ్చిమిర్చి కొతిమెర, నలియగొట్టి ఆ కూరలో వేసి కలియబెట్టి కుదిలిస్తూ ముక్క బాగా ఉడక్కపోతే కొద్దిగా నీళ్లుచల్లి ఉడికిన తరువాత దింపుకోవలెను.

ఈ ముక్కలలో లేత వంకాయలనుకూడా తరిగిపోసి పై విధముగానే చేయ్యవచ్చును.

## పచ్చడి

5 పలముల దుంపలను తీసికొని పై పొట్టు దీసి చిన్న చిన్న ముక్కలుగా తరగవలెను. 8 ఎండు మిరపకాయలు ½ తులం మినపపప్పు కొద్దిగా ఆవాలు, మెంతులు, కరివేపాకు వేసి పోపు బాగా బంగారుచాయ వచ్చే వరకు వేయించి దించుకొని ½ తు॥ చింతపండు, తగు మాత్రము ఉప్పువేసి రుబ్బి, పై ముక్కలను కూడా యీ పోపుతో కలిపి బాగా రుబ్బవలెను. ఇది కేవలము కొబ్బరి పచ్చడివలె చాల రుచ్య ముగా నుండును.

## వేపుడు

దుంపలను బాగా కడిగి పై పొట్టు చాకుతో గీకివేసి చిన్న చిన్న ముక్కలు చేయవలెను. నూనె బాణలిలోవేసి బాగా కాగిన తరువాత పై ముక్కల నా నూనెలో వేసి ఉప్పువేసి కొంచెము సేపు మూతబెట్టవలెను. ముక్క బాగా మగ్గిన తరువాత మూత తీసివేసి దోరగావేయించవలెను. తరువాత జీలకఱ్ఱవేసి కొట్టిన కారము పై ముక్కలమీద చల్లి దింపుకోవలెను.

## దుంప మిఠాయి

పది పలాలు దుంపలను బాగా కడిగి గిన్నె పొయిమీదబెట్టి దానిలో రెండు చెంచాలు నెయ్యివేసి, అది కాగినతరువాత దుంపల నా గిన్నెలో పేయవలెను. పది పలముల చక్కె-

రనుగాని, బెల్లమునుగాని వేసి కుదిలించి గిన్నె మీద కొంచెము లోతైన పళ్లెమును మూత బెట్టవలెను ఆ మూతవేసిన పళ్లెము నిండా నీళ్లు పోయవలెను. ఆ నీటివల్ల కలిగిన ఆవిరితో గిన్నెలోని దుంపలు బాగా ఉడికి చాలా రుచ్యముగా నుండును. (దుంపలు ముక్కలు చేయరాదు) ఇవి భోజనమునకు బదులుగాకూడా వాడవచ్చును.

## దుంప పూరి

దుంపలపై పొట్టుదీసి శుభ్రపరచి పెద్ద పెద్ద ముక్కలుగా కోసి, ఒక గిన్నెలో కొద్దిగా నెయ్యివేసి పొయిమీదపెట్టి నెయ్యి కాగిన తరువాత పై ముక్కల నా గిన్నెలోవేసి, మూత బెట్టవలెను. కొద్దిగా నీళ్లుజల్లి సన్న మంటమీద పెడితే దుంప బాగా మెత్తనవుతుంది. ఆ ఉడికిన ముక్కలు రోటిలోవేసి రుబ్బి, ఆ ముద్ద నొకచోట నుంచవలెను.

కొంచెము గోధుమ పిండిగాని, మైదాపిండి గాని తీసుకొని కొద్దిగా ఉప్పు, నెయ్యి వేసి, కొద్దిగా నీళ్లు జల్లుతూ ముద్దచేసి చిన్న చిన్న ఉండలుచేసి పీటమీాట వేసి పిండి జల్లుతూ అప్పడము చేయవలెను. ఆ యప్పడములో పైని తయారుచేసిన ముద్దనుండి చిన్న చిన్న యుండలు చేసి పూరీలో బెట్టి ఉండవలెచేసి, మరల సున్నితముగా పూరీవలె ఒత్తవలెను. అట్లు వత్తిన పూరీలను నెయ్యి బాగా మరగనిచ్చి నేతిలోవేసి వేయించి తీయవలెను. ఇష్టమున్న వారు ఆ వేడి పూరీలమీాద చక్కెరజల్లి భుజించిన చాలా రుచ్యముగా నుండును. వేడి వేడిగా భుజింపవలెను.

## బజ్జీలు

దుంపలను బాగా కడిగి పల్చని చక్రముల వలె తరగవలెను. కొంచెము శనగపిండి తీసుకొని దానిలో తగుమాత్రము ఉప్పు కారము వేసి, కొంచెము అల్లము పచ్చిమిర్చి మెత్తగా నూరి కొద్దిగా నీళ్లుపోసి పెరుగువలె కలుపవలెను. నూనె బాగా కాగిన తరువాత పై చక్రములను కలిపిన శనగపిండిలోముంచి మరుగుచున్న నూనెలోవేసి బాగా వేగిన తరువాత తీసి వాడవలెను. ఇవి వేడిగా భుజించవలెను.

మఱియు సాంబారు, ధప్పళం, మొదలైన పులుసుల్లో యీ దుంప విశేషంగా వాడతారు. పిండి, బెల్లము పెట్టి కూర మాదిరిగా కూడా వండవచ్చును.

ఈ దుంపలను కుమ్ములోబెట్టి ఉడికించి తినడం అందరికీ చాలాయిష్టము. పిల్లలకు చెప్పనక్కరలేదు. పొలాల్లో పనులుచేసేవారు పై జెప్పిన సంస్కారాలేమీ చేయకుండానే భక్షిస్తారు. గాన దీనిని మన ఆహార విధానములో బాగా యుపయోగించవచ్చును.

—వేదవల్లి తాయారమ్మ.

[ఇలాగే సోదరీమణులు తమకు తెలిసిన వంటకములను గూర్చి పత్రికాముఖముగా చదువరుల కెరింగింపవలెదని మాకోర్కె]. —సం॥



# తొలి బోణీ....

శ్రీ కె. సూర్యనారాయణ శాస్త్రిగారు

'ఇదిగో—మళ్లీ వచ్చిందినాన్నా! ఇంకో వుత్తరం.

'ఎక్కడనుంచే, లీలా?

'ఎక్కడనుంచేమిటి? మా బావవద్దనుంచే. కాళీ వుండాలిగాని—కార్డులు నింపటానికి ఆయన తరువాతే. అప్పుడే యిది 5వ వుత్తరం. అంత తీపి ఏమిటో అక్క మీద.

'ఏమని వ్రాశాడే?

'ఏముంది! మామగార్కి సహస్రవేల దండ ప్రణామాలుట. అందులో మామూలు రకంగాదు. మనఃపూర్వకంగా త్రికాలములూ ఆచరిస్తున్నాడుట. ఎక్కడ కంఠస్థం చేశాడో! యీ రెండు మాటలూ.

'ఊఁ! ఇంకా ఏమన్నాడే లీలా!

'అబ్బా! ఇంకా ఏం చెప్పనూ: పాతపాటే మళ్లీ పాడేడు. పుట్టింటికి పంపింది మొదలూ పురిటి సంగతేనా. పురుడు వచ్చిందో లేదో అని వుట్టిపడుతున్నాడు. ఉద్యోగానికి కృషి చేస్తున్నాడుటగూడా.

'ఏవూరు వెళ్లటానికి?—

'వూరూలేదు—పేరూలేదు. ఆ వుద్యోగంమాటా—ఆ పురిటి సంగతీ—మామగారి ఘనతా అన్నీ యిన్నీ అయిదు మాటలు వ్రాసి అందులో పార్లైమన్నాడు బంట్రోతుని. అంతేనేగాని, ఆ వుద్యోగం వూరేమిటో కనిందా యీ లోపులో ఆ కార్డు. ఏదో వ్రాశాడు. అదే చదివేం. సంతోషించాం. అంతకూ తెలియని విషయాలని విమర్శించాం: ఇంకా ఎక్కువగా యీ విషయాలే సాగదీస్తే కోరలువూడి పోయేటంత కోపంవస్తుంది అక్కకి. ఈ ఉత్తరం దానికియిచ్చి, పలకరించివస్తా' నంటూ చట్‌మని ఒక్క గంతులో వంటింట్లోకి వెళ్లింది లీల.

'అబ్బా ఎంతకోపమే లీలా! అంత చిరాకెందుకు? నువ్వే మొగాడవయితే ఎట్లావుండేవో నీ లీలలు. ఛండశాసనుడులా నిప్పులు చెదరకొడుదువు. ఏంచేస్తా! చెప్పు మీ యిద్దరు ఆడపిల్లల్నీ నా రెండు కండ్లలాగ చూచుకుంటున్నాను, దైవం మనయందుంటే నీ కూడా వుద్యోగం రాకూడదూ. ఇల్లు అలకగానే పండుగా అన్నట్టు డిగ్రీ రాగానే అయిందా! దానికి తగిన వుద్యోగం రావద్దూ. తరువాత నీ యిష్టం పెళ్లి చేసుకుంటావో చేసుకోవో—ఆ శాస్త్రా నా చేతిమీద చేద్దామనుకున్నా. ఇంతవరకూ వద్దో వద్దో అంటూ గెంటుకొచ్చావ్. తరువాత నీ తలరాత ఎట్లావుందో ఎవరు చెప్పగలరూ?' అంటూ జపమాలను చేత్తో పుచ్చుతున్నాడు తండ్రి పరదేశి. పరదేశికి పురుష సంతానం ఒసగలేదు భగవంతుడు.

లీల గిరుక్కుమని వంటింట్లోకి మళ్లి వాళ్లక్క సుభద్రకు వుత్తరం చూపింది. ఏహ్యాభావంలోవున్న లీలను చూచేసరికి సంతోషానందాలను హృదయంలో ఓమూల దాచుకుని పైకి 'ఎందుకూ యిన్ని వుత్తరాలు వ్రాయటం? కడుపుతో వున్నప్పుడు కనకుండా వుంటామా? అంత కంగారేం? ఇక్కడికి వచ్చి మంత్రసానితనం చేస్తారా?" అంటూ లేని క్రోధాన్ని వెలుపలికి విసరుతూ వెళ్లింది సుభద్ర.

ఆ మర్నాడే మరో సువార్త. కవరు చింపి చూచింది లీల. ఇంకా సంతోషానికి మేరలేదు. కళ్లల్లో ఆనందరేకలు మిసమిస లాడుతూ తొంగిచూస్తున్నాయ్. శరీరం అంతా సంతోసంతో స్థంభించి పోయింది. అట్టే అయిదు నిముషాలు అడ్డంగా చదివింది ఆర్డరు కాగితం. కరుడుగట్టిన ఆనందాన్ని కరిగిస్తూ, పకపక నవ్వుకుంటూ, బర్‌మని బయలుదేరి చకచకా వెళ్లింది వాళ్ల నాన్న దగ్గరికి. 'విన్నావా! నాన్నా! నన్ను బందరు హాస్పటల్లో అసిస్టెంటు డాక్టర్‌గా వేశారు. ఇదిగో శుభలేఖ. 5న, అక్కడ జాయను కావాలి. వుద్యోగమో, వుద్యోగమో అన్నంతసేపు పట్టలేదు. దేవుడనుగ్రహించాడు కాబట్టి చూసుకో: ఎంత త్వరగా వచ్చిందో కాగితం.

'అవునే అమ్మా! అదృష్టం అంటే నీదేనమ్మా. లేక పోతే యింత త్వరగా రావటం ఏమిటి? అనుకున్న ప్రకారం అంచెలమీద ప్రయాణం చేసినట్టుంది. కాని యిట్లాగే చూడనిద్దూ నీ పెళ్లికూడా...

'అదిగో! మళ్లీ మొదలా. పెళ్లీ వద్దూ. గిళ్లీ వద్దూ. నన్నిల్లా సుఖంగా స్వతంత్రంగా బ్రతకనిద్దూ. అయిందని సంతోషపడునాన్నా. కాలేదని కష్టపెట్టుకోకు నీ మనస్సుని. ఔనుగాని 4న బందరు వెళ్లాలి తెల్సా?'

అంటూనే సుభద్రవద్దకు వెళ్లి 'అక్కా: ఇంచక్కటి మాట. ఇట్లారా. ఇదిగో ఆర్డర్. నన్ను బందరులో డాక్టర్‌గా వేశారు. 4న వెళ్లి హాజరుకావాలి. ఈలోపులో నీకు అబ్బాయో, అమ్మాయో చూచి ముద్దుపెట్టుకుంటాలే. ఇంకా ఎంతో టైముగూడా లేదు. నాకా 'లక్ వుందో లేదో'. అంటూ టేబిలు దగ్గర కూర్చుంది కాగితాలేవో సర్దుతూ.

వెంకట్రావు వద్దనుంచి వచ్చినకార్డు ఆ రోజుకు ఆరు రోజులైంది. సుభద్ర ఆ రోజు బద్ధకంగావుంది. గంట గంటకే కడుపులో వాతపు నొప్పులు గట్టిగా పెట్టుకొస్తు న్నాయ్. శరీరం అలసిపోయింది. మంత్రసాన్ని పిలవ మన్నారు అక్కడ వున్నవాళ్లు. సుభద్ర గాభరా పడింది. కాని—సుఖ ప్రసవమే అయింది సుభద్ర. కెవ్వుమని ఏడ్పు వినిపించింది. హృదయం శాంతించింది పరదేశికి. 'అమ్మా! లీలా సులభంగా పురుడొచ్చిందా అక్కకి? 'ఆ చూచి వస్తా' అంటూ వెళ్లింది గదిలోకి లీల. అందరూ విరగబడి నవ్వుతున్నారు. సుభద్రకు మొగపిల్లవాడన్నారు. ఆ వార్త వినగానే మురిసిపోయాడు ముసలి పరదేశి.

'హనుమాయమ్మగారూ! ఇల్లా రండి ఏమిటి యీకాలు యిల్లాగవుంది అబ్బాయికి?' అంది మంత్రసాని. 'ఏమోనే నాకు సరిగ్గా తెలియదు. అండ్రాళ్లమ్మగారూ మీరు చూడండి?' అంది ఆవిడ. 'ఏమోనమ్మ నాకు మాత్రం కనిపిస్తుందా! తెలుస్తుందా?' 'ఆ! అదేమిటి? మీకంటే మా కెక్కువ తెలుసా. మునిమనుమళ్లను కన్న ముత్తైదువు మీరు. పుట్టెడు పురుళ్లు పోశారు. పెంచారు. కాస్త యిట్లా వచ్చి చూద్దురూ' అని ఆదుర్దాతో తీసికెళ్లింది అండాళ్లమ్మని సుభద్ర తల్లి. 'కాలు వంకరతిరిగిందమ్మా! కంగారేం అక్కర్లేదు. ఇట్లాగవుంటే పిల్లాడు మంచి తెలి వైనవాడవుతాడు అంటారు. ఇది పూర్వ జన్మదుష్కృతంలే. మనం అనుకుంటే ఏముంది. ఎంత తోమినా పోదు. దీన్నే 'తొండుకాలు' అంటారు. అమ్మాయీ ఏంభయవాలేదు.' అంటూ సుభద్ర తల్లికి ధైర్యం చెప్పింది ఆవిడ. కాస్సేపటికి అందరూ నిష్క్రమించారు అక్కడనుంచి పరదేశి పడిన సంతోషానికి పలాయనంచెప్పి, చివరికి విచారించి పూరు కుంటాడు. పుట్టిన బాలుడు అందచందాలు గలవాడే. కాని ఆ కాలు ఒక్కటే అనాకారానికి కారణం.

కారణాలు ఎట్లున్నప్పటికీ కాలచక్రం తన పని మాను తుందా! పురిటికోసం ఎదురుచూసే వెంకట్రావుకు జీతం వచ్చినట్లు పరులవల్ల తెలిసింది. కాని జన్మించింది మొగ శిశువో, ఆడశిశువో విశదంకాలేదు. సంతానంకోసం ఒడి గట్టుకు కూర్చున్నందుకు యీ వార్త వినగానే హృదయం పుప్పొంగి ఒళ్ళంతా సంతోషం కమ్మింది. మరునాడే ఏదో పనున్నట్టు వచ్చాడు అత్తవారింటికి. అప్పుడే కస్తూరివేసి కూర్చోబెట్టుకున్నారు పిల్లాణ్ణి. పాద ప్రక్షాళణచేసి పరు న్నాడు మంచంమీద అలసటకొద్ది. కుశల ప్రశ్నలడుగు తోంది వాళ్ళ బావను లీల. కొంతసేపయే సరికి నిశ్శబ్దంగా కూర్చున్నారు అందరూను.

'ఏం లీలా వుద్యోగంమాట ఏమైంది?' అన్నాడు. వెంకట్రావు.

'ఆ! నాకు వుద్యోగం ఏమిటి? అనుదాన్ని, పిల్లల్ని కంటానికి వుంటుంది కాని మాకు శక్తి. వుద్యోగం చేయ టానికి వుంటుందా మీలో యుక్తి.' అంది లీల.

'నీసంగతి ఏమైంది?' అని అడిగింది వెంకట్రావుని.

'నా సంగతా. అన్నింటికీ అప్లై చేశాను. ఒక్కటీ శాంక్షను కాలేదు. చివరకు డాక్టరు ప్రాక్టీసు పెట్టమన్నా రందరు. దాంట్లో ఎట్లా ప్రారంభించాలో తెలియలేదు. ఆ! అయినా యిన్నాళ్ళనుంచీ 'ట్రై' చేసే నాకేలేదు. నిన్నగాక మొన్న ప్యాసయావునీవు. ఆడదానవు నీకిస్తారా

ఉద్యోగం! స్త్రీలకి గృహకృత్యాల్లో గొప్పగానీ వుద్యోగంలో వస్తుందా చెప్పు! నాల్గు డబ్బులుండగానే నాస్తి అయేవరకు చదువు చెప్పిస్తారు స్త్రీలకు. ప్రయోజనం లేదు కదా—పర్యవసానం యిది. అయినా! ఆడవాళ్లకి చదువేమిటీ. అడుక్కు తింటానికి కాబోతే. ఏం! కోపం వచ్చిందా. మరదలు సరసంకోసం మాట్లాడుతున్నా. చెప్పు సమాధానం' అన్నాడు.

'అవును నీవన్నది నిజమే. కూటికి కరువైన వాళ్ళకి కుక్కమూతి పిందెలు పుడతారంటారు. అందులోనే జత. తైమూరు ప్రభుత్వం వచ్చిందీ—అంటే అందరికీ దొరుకుతాయి వుద్యోగాలు.' అని చెప్పింది లీల.

'ఏం అంత కోపమేం లీలా! పరిహాసానికంటే పట్టరాని కోపం ఎందుకు? ఎప్పుడో తైమూరు ప్రభుత్వాన్ని యిప్పుడు తలుస్తావేం?' అన్నాడు వెంకట్రావు.

'అబ్బే పరిహాసంకాదు. తప్పకుంటే నిజమే. ప్రభుత్వం గురించికాదు. గృహకృత్యంలోనే నే చెప్పేది. పాటోచ్చి పోల్చి చెప్పాలన్నమాట. ఇదుగో యీ కాగితం ఏమిటి చూడు? ఏం చదివావా?

'ఆ! నాకంటె లక్కీ ఫెలోవే. నీపనే బాగుంది లీలా.' అన్నాడు వెంకట్రావు.

'ఆ! యింకా విను. నీకొక వుపకారం బాకీ వున్నా.'

'ఏమిటీ అది?'

'అబ్బే—పూర్తిగా విను. పురుడో పురుడో అంటూ వుట్టూట లూగేవు. పురుడొచ్చింది మొగపిల్లాడు. అంతా బాగానేవుంది.'

'ఇంకేమిటి?

'వినవయ్యా సాంతంగా. నీ పూర్వపుణ్యంకొద్దీ పుట్టాడు తైమూరు. ఇదుగో చూడు.' అంటూ చూపింది పిల్లాణ్ణి.

'అరెరె? ఇదేమిటే. ఎంతో అందమైనవాడనుకున్నా. కాలు యిదేమిటి? ఇట్లా వుందేం? ఎంతనామర్దా లీలా నేను చూడలేను! నేను అసలు ఎత్తుకోలేను. తీసికెళ్లు నే వెడుతున్నా.' అన్నాడు కంగారుతో—

'బావా! నీ కిది భావ్యంకాదు. ఏమిటా పిచ్చివేషం? కర్మని మళ్లించే కర్త ఎవరు? ఎవళ్లు తవ్వుకున్న గోతులో వాళ్లే దిగాలి. ఎవరేం చేస్తారు? లే, ఎవ్వరైనా వింటే నవ్విపోతారు. ఫోంచేయి బయలుదేరుదాం.

'ఎక్కడికి?

'బందరు. రేపు అక్కడ హాజరు కావద్దూ. అక్కడికి తీసికెళ్లి అబ్బాయికి కాలు బాగుచేస్తాను.' అన్నది లీల.

'పుట్టుకతోవున్న వంకర పూర్తిగా వుంటుందంటారుగా' లీలా!' అన్నాడు వెంకట్రావు.

'ముసలివాళ్ళ పుక్కిటి పురాణాలు నాదగ్గర చదువకు. మళ్లీ మాట్లాడుతే నిన్ను మహిళా లోకంలోకి ఎక్కిస్తా. ఆ అనాకారం బాగుచేస్తేనే నాపేరు లీల. ఏం చేస్తాం. 'తొలిబోణీ—తోంటకాలు' అనుకుంటాం. లే!' అని గద్దించింది బావగార్ని. వెళ్లి ఫోంచేశాడు వెంకట్రావు.

'చూశావా: ఆడువారి సాహసం. నడూ.' అని బయలుదేర తీసింది వాళ్ళ బావనీ, అక్కయ్యనూ—

అనుకున్నట్టు 5వ తారీఖున హాజరయింది హాస్పటల్లో లీల. వెళ్లినప్పటినుంచీ వెంకట్రావు కొడుకుకి వేయికళ్లతో వైద్యం చేస్తూంది. ఇటు అక్క—అటు బావా. తనకు కొడుకయ్యే. తీసికెళ్లిన నెల రోజుల్లో తన నేర్పుచూపి, సుగుణం చేకూర్చింది కుఱ్ఱాడికి. సాక్షీగా తయారైంది సుభద్ర కొడుక్కి కాలు.

'బావా నిన్ను నిజంగా 'ఆంధ్రమహిళ'లో ప్రచురిస్తున్నానోయ్.'

'ఆ! చూశావా వద్దులీలా. ఇకముందెప్పుడూ అట్లా మాట్లాడను. ఊరుకుందూ.'



# సోదరి

అనువాదం : అల్లూరి అన్నపూర్ణాదేవి :: మూలం : డాక్టర్ ధనీరామ్



రజని, సతీష్ కాలేజిలో చదువుచున్నారు. రజని జూనియర్, సతీష్ సీనియర్. అసలు రజనికి డాక్టరీ చదవాలనే కోరిక లేక పోయినా బంధువుల బలవంతంవలన చదువ వలసి వచ్చినది. ఒక రోజున రజని జంతువులను కోసెడి డిసెక్షన్ హాలులోనికి వెళ్ళినది. ఆ పనిలోనికి ప్రవేశించటానికి అదే ఆమెకు మొదటిసారి కావటం వలన ఆ పని సరిగ చేయలేక పోయినది. ఆ సమయమునకే సతీష్ అక్కడకువచ్చి ఆమె పని సరిగా చేయక పోవటం చూచి వేళా కోళం చేసాడు. రజనికి చాల కోపం వచ్చింది. నిజంగా రజని కంత కోపం వస్తుందని సతీష్ అనుకొనలేదు. కోపం వచ్చినదని తెలిసిన వెంటనే క్షమార్పణ అడిగినాడు.

ఈ సంఘటన జరిగిన తరువాత ఇరువురు ప్రాణస్నేహితులయ్యారు. రజని సతీషుయొక్క సహాయము వలన ఆ సంవత్సరం పరీక్షలో పాసుఅయినది. స్నేహము ఆనాటికానాట వృద్ధియయి వారిరువురి హృదయములలోను నాటుకొని పోయి చివరకు అది గాఢమయిన ప్రేమగా మారిపోయినది. డాక్టరీ పరీక్ష పాసు అయిన వెంటనే తనను పెండ్లి చేసుకొంటానని సతీష్, రజనితోచెప్పి తన కోరిక ప్రకటించాడు. సతీషుని ప్రేమ చాల స్వేచ్ఛయైనది. సతీషు ఒక్కొక్కప్పుడు ప్రేమలోపడి పిచ్చివాడవుతూ వుండే వాడు. మరొక్కప్పుడు ఉదాసీన భావంతోవుంటూ వుండేవాడు. కాని రజని ప్రేమ సతీషుని ప్రేమవంటిది కాదు. ఆమె ప్రేమలో యెప్పుడు శాంతము, సత్యము, ఇమిడి వున్నట్లుగా ఒకే మాదిరిగా వుండెడిది. ఆ ప్రేమలో ఎప్పుడుకూడ క్షీణదశ అనేది కనిపించేదికాదు. సతీషుని ప్రేమ గోడమీద పిల్లి వాటమని ఆమెకు తెలియును. అప్పుడప్పుడు సందేహముకూడ కలుగుచుండేది. కాని ఆ సందేహమునకు ఆమె హృదయములో ఎక్కువ కాలము స్థానం వుండేదికాదు. వెంటనే దానిని మరచి పోయేది.

రజనికి లత అనేటటువంటి పేరుగల ఒక చెల్లెలువున్నది లత కొద్దిరోజుల క్రితమే ఇంటరు పాసయినది. రజని తల్లి దండ్రులు ఆమె చిన్నతనములోనే మరణించిరి. అందువలన రజనియే లత గార్డియన్ అయినందున ఆమె భారము కూడ రజని మీద పడినది. ఆమెను కూడ రజనియే చదివించుచుండెను. లతకు డాక్టరీ చదవాలనే కోరిక ఎక్కువగ వుంది. కాని రజని లతతో బి. ఎస్. సి. చదువ వలసినదని బలవంతము చేసినది. బి. ఏస్. సి. పాస అయిన తరువాత విదేశంకూడ చదువుకు పంపిస్తానని లతతో ఆమె చెప్పినది. అనేక పర్యాయములు లత బొంబాయి రావాలని ప్రయత్నముచేసినది. కాని లతయొక్క మనస్సు చాల చంచలమయినదని రజనికి తెలిసినందువలన ఆమెను బొంబాయికి రాకుండా చేసినది. అయినా లత తన అక్కగారి మాటయందు లక్ష్యముంచక బొంబాయి తనకుతానే వచ్చినది.

లత బొంబాయి వచ్చిన తరువాత అక్క స్నేహితుడైన సతీషునితో పరిచయమైనది. లతతో పరిచయమైనది మొదలు సతీషుని చంచల ప్రేమ రజనినుండి మరల లత వైపుకు తిరిగింది. రజనిలోనేకాక మరియేయితర స్త్రీలోను లేనటువంటి సౌందర్యము, ఆనందము సతీషునికి లతలో గోచరించాయి. ఆ ప్రేమలో ఎటువంటి ఆకర్షణ, మస్తు వున్నాయో మన కేమి తెలియును? సతీషు పూర్తిగా లత వైపు లాగబడినాడు. లతకూడ సతీషుని ప్రేమిస్తోంది. రజని కూడ తనప్రేమను సతీషునకు అప్పచెప్పినదన్న సంగతి ఏ మాత్రముకూడ లతకు తెలియదు. తన అక్కకూడ సతీషుని ప్రేమించినదన్న విషయము తెలిసి యుండినట్లయితే ఆమె సతీషుని ప్రేమను తిరస్కరించి యుండెడిది.

లత (తీగ) లతమాదిరిగానే ప్రేమించిన ప్రియుణ్ణి తన బాహువులలో బంధించి వేసుకున్నదని తెలిసిన వెంటనే రజని హృదయములో పగతీర్చు కోవాలనే కోరిక వుదయించింది.

# సోదరి

ఒక రోజున రజని బయటికి ఎక్కడికో పనివుండి వెళ్ళినది. ఆమెవచ్చే సరికి సతీష్, లత, గదిలో కూర్చుని సంభాషించు కొనుచున్నారు. వారిరువురు ఏమి సంభాషించు కొనుచున్నారో వినవలయుననే కుతూహలము అప్పుడే తిరిగివచ్చిన రజని హృదయములో జనియించినందున గది ద్వారము దగ్గరకు వెళ్ళి వారిరువురి మాటలు వినుచున్నది. లత తన అక్క కూడ సతీషునే ప్రేమించుచున్నదని తెలిసికొనిన వెంటనే చాల పశ్చాత్తాపపడి, తన సోదరి సుఖముకొరకై తన సుఖమును త్యాగముచేయుటకు సిద్ధమయినదని వారి సంభాషణనుబట్టి రజని తెలిసికొనెను. ఇంతే కాకుండా ఇంతవరకు జరిగిన వారి స్నేహమును కూడ మరచి పోవలసినదని లత సతీషునితో గట్టిగా చెప్పుచున్నది. లతయొక్క మాటలు విని రజని కొయ్యబారి పోయినది. తన సోదరిలో ఇంత త్యాగం ఇమిడివున్నదని ఆమె కలనైన తలచియుండలేదు. లత తనకు ద్రోహము చేయుచున్నదని తలచి అనేకసార్లు ఆమెను తన హృదయములో నిందించినది. నిజముగ లత నిర్దోషి. నిర్దోషి యని తలచిన సతీష్‌యే దోషి. లత ఎంత నచ్చ చెప్పినను సతీష్ రజనితో వివాహము చేసికొనుట కొప్పు కొనలేదు. తన ప్రాణముకంటె ఎక్కువగ ప్రేమించే సతీషు ఇలా అయి పోయాడేమిటా అని రజనికి ఆశ్చర్యం కలిగింది.

ఇక తను జీవించటం నిరర్థకం అనుకుంది. తను జీవించి యున్నప్పటికి సతీష్ తనను ప్రేమించటం అసంభవం. హృదయపూర్వకముగ తనను ప్రేమించిన ప్రియుడు మరొకరిని ప్రేమించటంచూచి ఆమె ఎట్లా జీవించగలదు. తను జీవించియుండగా తన చెల్లెలు లత అతనిని ప్రేమించదు. ఆమె తనను ప్రేమించక పోవటంచేత సతీషు పిచ్చివాడయి పోతాడు. తనవలన నిష్కారణముగ మూడు జీవితాలు భగ్నమయి పోతాయి. కనుక తన జీవితాన్ని బలి చేసినట్లయితే వాళ్ళిద్దరు సుఖజీవనం చేస్తారు అని ఆలోచించి ఆఖరికి తన సోదరి లత తన ప్రియుడు సతీష్‌యొక్క సుఖమును కోరి ఆమె సముద్రములోపడి మరణించినది.

లతా సతీషులు ఆమె కొరకు అనేక చోట్ల వెదికారు. కాని ఆమెజాడ ఎక్కడ కనుపించలేదు. మరుచటి రోజున పేపరులో ఒక ప్రకటన చేయబడినది. "ఎవరో ఒక యువతి సముద్రములోపడి మరణించినది. సముద్రపు ఒడ్డున ఒక చేతి సంచివున్నది. దానిలో ఒక వుత్తరం ఈ విధముగా వున్నది—నేను ఎవరిని గురించి మరణించుటలేదు. నా మరణమునకు నేనే కారకురాలను. దీనిన గురించి ఎవరిని బాధించ వలసిన అవుసరం లేదు. నా హృదయములో తీరని బాధ ఏర్పడినది. దానిని బాపుకొనుటకై నేను స్వయముగ ఆత్మ హత్య ప్రయత్నమునకు గడంగు చున్నానని—దానిలో వున్నది. అది పోలీసు అధికార్లకు వ్రాయబడినది. దానిమీద రజని సంతకముకూడ వున్నది.

ఈ ప్రకటన చూచిన వెంటనే లతా సతీషు లిరువురు కారుపై స్టేషనుకు వెళ్ళి రజని తమ తాలూకని చెప్పి ఆ చేతి సంచి యుత్తరము తీసికొని చదివి ఆమె త్యాగమునకు అబ్బురపడిరి. చిన్న వయస్సులోనే ఆమె జీవితము ఆ విధముగ బలియయి పోయినందుకు వారిరువురు చాల విచారించిరి. అప్రయత్నముగ వారి నయనములనుండి అశ్రు కణములు జారిపడినవి. ఒక క్షణములో ఆ కణములు మటుమాయమైనవి. ఏమైననేమి వారిరువురు ఇప్పుడు నవ దంపతులు. వారి ఆనందమునకు హద్దులేదు. ఎట్లైనను రజనియే అభాగ్య జీవిగదా? ఆమె విషయము స్మరించి నప్పుడు ఒక క్షణము విచారించేవారు. మరు క్షణము తమ ఆనందములో తాము మునిగిపోయేవారు. ఆహా! ప్రేమ ఎట్టి స్వార్థము గలది. ప్రేమ ఇంద్రజాలముకంటె ఎక్కువయినది. దీనికి మీరేమంటారు? చెప్పండి.





పిల్లల కథ

శ్రీమతి ఆ. భాస్కరమ్మగారు

# చిన్నలక్ష్మి కల

ఒకరోజున లక్ష్మి ప్రొద్దున్నే లేచి తనకు రాత్రివచ్చిన కలను ఈ విధంగా చెప్ప మొదలు పెట్టింది.

నేనొక ఎయిరోప్లేను మీద యెక్కాను. ఆ విమానం ఆలా యెక్కడికో మేఘాల్లోంచి పోతోంది. ఎంతదూరం పోయిందో? పోయి పోయి ఒకచోట దిగింది. అది దిగుతోఉంటే చలి విపరీతంగా వేస్తోంది. భరించలేనంతచలి. అబ్బా! అంతచలి యెప్పుడూ చూడలేదు. విపరీతమైన గాలికూడాను. ఆ గాలికి మన తలుపులైతే విరిగి పోవలసిండే. అది రాత్రో పగలో తెలియదు. ఆకాశంలో సూర్యుడూ లేడు, చంద్రుడూ లేడు. ఏదో తమాషా అయిన వెలుగు. ఆ వెలుగు రంగు రంగులుగా ఉంది. పట్టణాలలోని ఎడ్వర్టైజు బల్లలలో వస్తూ పోతూ మెరిసే ఎలెక్ట్రిక్కు దీపాలలాగ ధగ ధగ మెరసి పోయింది. ఆలాటి వెలుగును మన మెక్కడా చూడం.

క్రిందికి దిగేసరికి క్రిందంతా మంచుమయం గడ్డ కట్టి పోయియుంది. ఎక్కడా ఒక చెట్టుకాని, పుట్టకాని చివరికి ఒక పచ్చని గడ్డి పోచైనా కనపడలేదు. అక్కడ కొండలు, గుట్టలు, రాళ్లు అన్నీ మంచు మయమే. ప్లేనులో నుండి భూమి మీద అడుగు పెట్టాను కదా ఇక ఆ చలికి తట్టుకో లేక పోయాను. నేను కూడా ఆ మంచులో గడ్డ కట్టుకొని పోయానో ఏమో ఇక నాకు తెలివిలేదు.

నాకు తెలివివచ్చి కండ్లువిప్పి చూసేసరికి ఒక గుహలో ఉన్నాను. ఆ గుహఅంతా చీకటి. పైకప్పుకు మధ్యగా మినుకు మినుకుమంటూ ఒక చిన్నదీపం వెలుగుతోంది. ఆ గుహ కూడా మంచుమయమే. దానిలో నాలుగు ఎలుగు బంట్లున్నాయి. రెండు పెద్దవి, రెండు చిన్నవీను. వాటిని చూసేసరికి నాకు చాలా భయంవేసింది. పారి పోదామంటే దారిలేదే! ఏలా? కాని పాపం అవి నన్నేమి చేయలేదు.

అవన్నీ క్రింద తోళ్లమీద పడుకొని యున్నాయి. నన్ను చూచుకొందును కదా నేనూ ఒక తోలు మీఁదనే పడుకొని యున్నాను. నా కెదురుగా నున్న గోడకొక అద్దముంది. అదీ మంచుఅద్దమే. దానిలో నేనుకూడా ఎలుగు బంటిలాగే ఉన్నాను. ఇదేమిటి నేనుకూడా ఎలుగు బంటి నయి పోయాను కాబోలు ఈ ఎలుగు బంట్ల మధ్య అనుకొన్నాను. అసలు ఇక్కడికేలా వచ్చానో తెలియదు. ఎలుగుబంట్లన్నీ నిద్రపో తోన్నాయి. అవిలేస్తే నన్ను పీక్కు తింటా యేమోనని భయం. పారిపోవడానికి దారిలేదు. ఇక చచ్చిపోతాను కాబోలు, ఈ ఎలుగు బంట్లకు ఆహారమవుతాను కాఁబోలు భగవం తుఁడా అని ఆ భగవంతుని ప్రార్థిస్తో ఆలా చూస్తో పడుకొన్నాను.

కొంతసేపయేసరికి ఆ ఎలుగు బంట్లన్నీ లేచి కిచ కిచ లాడుతో ఏవో ధ్వనులు చేస్తున్నాయి. ఇక నాపని అయిపోయింది, ఇవన్నీ నామీఁద పడి తినేస్తాయి అనుకొన్నాను. కాని పాపం అవి నన్నేమీ చేయలేదు. ఒకమూల దాచి యుంచిన మాంసం ఇంత తీసికొచ్చాయి. నాకు కొంచెం మాంసం ఇచ్చి తక్కిన దానిని అవి పీక్కు తింటోన్నాయి. ఆ మాంసం నేనేలా తింటాను? నా కెప్పుడూ మాంసం తినటం అలవాటులేదే. అందులోనూ పచ్చిమాంసం. దానిలో ఉప్పా, కారమా, మసాలా, ఏమీలేదు. ఎక్కడైనా పళ్లైనా, రొట్టెలైనా ఏమయినా ఉన్నాయేమో తిందా మనుకొన్నాను. ఆ మాంసం తప్పితే ఎక్కడా యేమీలేదు. ఆకలి కడుపులో మాడి పోతోంది. ఏంచేయను? ఎల్లాగో కళ్లు మూసు కొని ఆ మాంసం కొంచెం తిన్నాను వికారమెప్పె ట్టింది. కడుపులో తిప్పింది. మళ్లీ కళ్లు మూసు కొని పడుకొన్నాను. కొంత సేపటికి సర్దు కొంది. కొంతకాలం గడచిపోయింది. ఆ ఎలుగు బంట్లు ఆలా ఆ గుహాలోనే ఉంటోన్నాయి కాని యెక్కడికీ వెళ్లడంలేదు. ఈలా ఉండగా ఒకరో జున ఏవో పొడుగాటి బల్లాలాంటివి తీసికొని రెండు ఎలుగుబంట్లు ఒక కన్నంలోంచి పైకి పోతోన్నాయి. వాటితోఁబాటు నేను కూడా ఆ కన్నంలోంచి దూరి పైకి వచ్చాను. బయట అంత చీకటిగా లేదు. నేను మొదట చెప్పానే ఆ వెలుగూ లేదు. ఆకాశంలో సూర్యుఁడు ఎఱ్ఱగా సగంమాత్రం కనబడుతో న్నాఁడు. ఎంతసేపయినా అంతే. ఇకపైకిగానడం లేదు. కొంచెం వెలుగుగా ఉంది. ఆ ఎలుగు బంట్లు నా విషయంలో చూపే దయచేత అవి నన్నేమీ చేయక పోవడంచేత నాకు కొంత భయంతీరింది. వాటి దగ్గరగా వెళ్లిచూస్తే ఎలుగు బంట్లు కావు. మనలాగే తల, ముక్కు, చెవులు, కళ్లు, నోరు, కాళ్లూ, చేతులూ అన్నీ ఉన్నాయి. కాని పొట్టిగా, తెల్లగా పాసిపోయిన వాళ్లలాగ ఉన్నారు. ముఖాలు తప్పితే శరీరమే మీ కనబడడం లేదు. శరీరమంతా బొచ్చుతో ఉన్నతోలు బట్టలు కాబోలు ఎలుగు బంట్లలాగే యున్నారు. నేను మొదట ఏరోప్లేను దిగినప్పుడు చలికి భరింపలేక పోయానా. ఇప్పుడు నామీద కూడా ఆలాటి దుస్తులే ఉండడంచేత కాబోలు చలిలేదు. వెచ్చగాఉంది. వాళ్ల ముఖాలు మన

ముఖాలలాగ సాఫుగాలేవు. ఏదో ముడతలు ముడతలుగా ఉన్నాయి. అక్కడి చలికి అలా ముడుచుకు పోతాయేమో. చేతుల్లో బల్లాలు పట్టుకొని రెండు కాళ్లతోటే నడుస్తున్నారు. తీరా చూస్తే వాళ్లూ మనుష్యులే. అయితే అదోజాతి మనుష్యులను కొంటాను.

మేము ముగ్గురమూ మంచుమీదే నడుస్తున్నాం. అక్కడమంచు తప్ప మరేమయినా ఉంటేగా. మేమీలా వెడుతోఉంటే ఇంకా కొంతమంది వచ్చి మమ్మల్ని కలుసుకొన్నారు. వాళ్లూ ఈలాగే యున్నారు. అలా వెడుతో ఉంటే ఏం జరిగిందనుకున్నారు! ఒకచోట ఒక కన్నంలోంచి ఏదో జంతువు తల పైకి వచ్చింది. వెంటనే అందులో ఒకడు అతి చురుగ్గా బలంగా బల్లెంతోటి దాని తలమీద పొడిచాడు. తక్కిన వాళ్లు గబగబా ఆ కన్నంచుట్టూ ఉన్న మంచునంతనూ బల్లాలతోటీ, చేతులతోటీ త్రవ్వి పైకి లాగేస్తోన్నారు మనం సముద్రపు వొడ్డున ఇసుకను లాగినట్లు. వీళ్లీలా చేస్తుంటే ఒక కొండమీదనుండి నిజంగా ఎలుగుబంటే పెద్ద అరపులు అరుస్తూ మా మీదికి వచ్చింది. నేను హడలిపోయి పారిపోతోన్నాను. అక్కడున్న ఆ చిన్న కుఱ్ఱాడు భయంలేదు ఏమీలేదు అంటూ అమాంతంగా దాన్ని బల్లెంతోపొడిచి చంపేశాడు. ఆ ఎలుగుబంటి నల్లగాలేదు. తెల్లగాఉంది. ఇక్కడ వీళ్లు ఆ మంచులోంచి ఆ జంతువును పైకి లాగిపడేశారు. పెద్ద జంతువు. అది చేపాకాదు. జంతువకాదు. ఏదో తమాషాగా ఉంది. చిన్న తల, చిన్నకళ్లు పెద్ద శరీరం సముద్రంలో ఉండే జంతువే. తరువాత ఒక బండిని తీసికొచ్చారు. ఆ బండికి చక్రాలు లేవు. కుక్కలు లాగుతోన్నాయి. ఈ ఎలుగుబంటిని, ఆ జంతువును ఆ బండిమీద పడేసి నేను మొదట ఉన్నానే వాళ్లింటికి తీసుకొచ్చారు. ఆయింట్లో ఇంకో ఇద్దరున్నారు కాదూ, వాళ్లుకూడా యివతలకు వచ్చారు. వాళ్లూ వీళ్ళూ కలిసి కత్తులతోటి జాగ్రత్తగా ఆ జంతువుల మీద చర్మమును తీసివేశారు. వాటి మాంసంముక్కలు కోసి జాగ్రత్త పెట్టారు. ఈ యింట్లో ఉన్నవాళ్లిద్దరూ ఆ తోళ్లను పళ్లతో నమలుతోన్నారు. ఎందుకు చెపమా అని నేను ఆశ్చర్యంగా చూస్తూఉన్నాను. అలా నమిలితే అక్కడ అది కొంచెం మెత్తపడింది. అక్కడి నుండి సూదీదారం తీసికొని వాటిని దుస్తులక్రింద కుట్టున్నారు. వాళ్లకి సూదీదారం ఏలా వచ్చాయి అనుకొన్నాను. అవి మన సూదులు లాంటి సూదులు, దారంకావు. వాళ్ల కత్తులూ, బల్లాలు, సూదులూ, బళ్ళూ అన్నీ యెముకలతో చేసినవే. వాళ్ల దారాలు అక్కడి జంతువుల నరాలు. వాళ్లందరి దుస్తులు ఒకలాగే ఉడండం చేత మగవాళ్లెవరో, ఆడవాళ్లెవరో తెలిసికోవడం కష్టం. కాని ఆహారంకోసం ఆ పైకి వెళ్లినవాళ్లు పురుషులని ఇంట్లో ఉండి ఈ దుస్తులూ అవి తయారుచేసే వాళ్లు స్త్రీలనీ తెలిసికొన్నాను.

మా చిన్న చెల్లాయివచ్చి అక్కా! అక్కా! అని వీపుమీద తట్టింది. కళ్లు విప్పిచూస్తిని కదా నేను నా మంచంమీదే ఉన్నాను. తెల్లవారింది. క్రితం రోజున చదివిన జాగ్రఫీ మహాత్యమనుకొని నవ్వుకున్నాను.



# సౌఖ్యమెక్కడున్నది!

సౌఖ్యమెక్కడున్నది ?

సంతృప్తినిచ్చు విజ్ఞానములో సౌఖ్యమున్నది !

విజ్ఞానార్జనకు విద్య అవసరమేగాని, కేవలపుస్తకపఠన మాత్రమున విజ్ఞానమలవడదు. పది పుస్తకములు చదివి, వానిలోని మాటలనే చిలుక పలుకులవలె రెట్టించెడి వారు, పండితులుగా పరిగణింప బడవచ్చునుగాని, విజ్ఞానులనుటకు వీలులేదు. హృదయాంతరములో నైజముగా నంకురించిన, ఉత్తమసంస్కారాభివృద్ధియే విజ్ఞాన మనదగును.

పదివేల పుస్తకములు జదివిన వారికన్నను, తమను తాము చదివినవారే విజ్ఞానులు ; సౌఖ్యజీవులు ! వారు ప్రపంచమును గుర్తించెదరేగాని, లెక్కచేయరు ; ఆత్మగౌరవమునే గాని అహంకారమును జూపబోరు; పూరిపుడకనైనను నిరసనతో విసరి వేయక, సమయానుకూలముగ నుపయోగించుకొనుచు,తమస్వశక్తితో నిలుపవలెనను ఆశింతురేగాని, ఎంతటి బలీయునైనను చీడపురుగువలె నీచముగా ఆశ్రయించి, బ్రతుక నిచ్చగింపరు ; ఏదియైనను, ప్రతిఫలమిచ్చియేగాని పుచ్చుకొన లేరు. ప్రేమకేగాని, అధికారమునకు లొంగనొల్లరు.

తాము నమ్మిన ఆదర్శముల నాచరణకు తెగలిగిన ధీరత్వముగలిగి, పైవారి విమర్శనలకు చెదరని స్థిరచిత్తముగల మానిసియే విజ్ఞాని ; పరమసుఖి ! అట్టివారికి, ఆదర, అనాదరణలు దారిలో నెదురుపడు బాటసారులేగాని, తమ మానస మందిరమున నివసింప వచ్చు ఆత్మీయులుగారు. దూషణ భూషణములకు వారి వీనులు సామాన్య బాటలేగాని, తమ తమ సుందర హృదయాగార ప్రవేశమునకు సింహద్వారములుగావు. వారు తమ అంతరంగమునకు తామే అధికారులై, హృదయ వాదముల వినుటకును, ఉచితానుచితముల విమర్శించుటకును, అలవాటుపడిన అసామాన్య ధీమంతులు. మనోదౌర్బల్యమున క్రుంగినవారిని అలుసు జేయక, సానుభూతితో ఆదరించి లేవనెత్తగోరు దయాంతఃకరణులు.

విజ్ఞానులు, భూభారమంతయు తమ భుజాస్కందముల పైననే నిలిచియున్నదని తలంచు విపరీతాహంభావపూరితులుగారుగాని, ఓపినకొలది సేవజేయగల ఉత్తమ సైనికులుగా తమ్ము భావించుకొను వీరాగ్రగణ్యులు. వారి కెదురగు అడ్డంకులే, యెత్తునకెగబ్రాకజేయు అసామాన్యావకాశములు ; కిట్టనివారి కట్టిడిమాటలు, సునిర్మితమగు సౌధాగ్రముపై బడిన వడగండ్లవలె, చెదరికరగి పోవునేగాని, వారినినొప్పింప జాలవు. వారికికలుగు ఆపదలు, యోధాగ్రేసరుల శరీరము మీది గాయములవలె మరింత వన్నెను, వాసినిగలిగించు అమూల్యాలంకారములు.

తమ ఉచ్ఛత్వముగాని, నీచత్వముగాని, పైవారి దృక్పథములోగాక, తమ నిజ జీవిత విధానములోనే గలదని గుర్తించి, మనసు ప్రబోధించునట్లు మసలువారే ఉన్నత విజ్ఞానులు ; నిత్యానంద జీవులు ! కాలమును, నిన్నటి గురువుగను, నేటి పరిచారికగను, రేపటి ఆప్తమిత్రముగను వినియోగించుకొని మేలొందగల నేర్పరులు. విఘ్న పరంపరలకు విసివి, మొదలిడినవి మధ్య విడచుట వారి యభిప్రాయములకు విరుద్ధము. ఆడినంతసేపు, జయకరమగునట్లుగా పట్టుదలతో ముద్దులొలుకుచూ ముచ్చటగా ఆడెడి విధానమే ప్రధానముగాని, చివరిగెలుపోటములే ముఖ్యముగా పరిగణించు మొరటు మానసులుగారు. తమ ప్రయత్న లోపమును, " విధి కృతము "అని, నిస్సారపు మాటలతో దేవుని తలపైన బాధ్యతమోపుట వారికలవిగానంత వెగటు గలిగించును. ప్రభువుగా పరమేశ్వరుని భావించునుగాని, తనజీవిత నౌకను త్రిప్పు కర్ణధారిని తానని అంగీకరించుట కొంత మాత్రము సంకోచింపడు. తన ప్రయత్నములు, విఫలమైనపుడు, " ఓహో ! ఈశ్వరాజ్ఞ యిట్లున్నదా ? నే నిప్పుడు తెలిసికొనలేకుండనున్నానేగాని, యిందేని గూఢార్థమిమిడియున్నదో ! ఇదే విశేష సాధనకని నిర్దేశింప బడినదో ! " అని, సమాధానబడి, క్రొత్త పరిస్థితుల కనువుగా, జీవయాత్ర సాగించ సమకట్టును.

ఆత్మ వంచనలేని వారగుటచే, వారికి పాపభీతియే లేదు. ఈ లోకమును వీడలేని మమకారమూలేదు ; మరొక లోకమునకు పోవలెనను కాంక్షలేదు. పరిపూర్ణజ్ఞానితనని, కష్ట పూరి

తము ప్రపంచమని, కోయడు ; పరమ పామరుడనని పశుతుల్యుడుగానూ ప్రవర్తించడు. ఐహికముల విసర్జించిననేగాని ఆముష్మికానందము సాధించలేమను విపరీతాశయములు లేవు. తామెచట నిలిచిన నదియే స్వర్గ సీమయనునట్లు, సంతోషముప్పతిల్లజేయగల కళాశీలురు.

ప్రకృతియే వారికారాధ్య దైవతము, ఆది శక్తియే యిలవేలుపు. "పరోపకారమే పుణ్యము, పరపీడనమే పాప" మన్నదే వారి మతము. లోకములోనున్న అన్నిటిలోని అందమునూ అర్థముజేసుకుని, అనుభవించుతూ పోవుటే వారి జీవిత లక్ష్యము. పగవానికి గూడ పంచదార పంచిబెట్టి, జీవితమాధుర్య మనుభవించగలుగుటే వారి ప్రత్యేక విశిష్టత.

పైవారి దూషణ భూషణముల లెక్క కొనక, యంతరంగము నిర్దేశించిన దారినిబోవుచు, బరులకు సుఖమిచ్చుటలోనే తమకు సౌఖ్యముగలదన్న ప్రకృతి రహస్య మెరుగుటే సిసలైన విజ్ఞానము. ఆ విమల విజ్ఞానమే సంతృప్తిసాధకము. అట్టి సంపూర్ణ సంతృప్తిలోనే సంతత సౌఖ్యమున్నది.

అదే బ్రహ్మానందము !

—శ్రీ వి. కె. మణి.



# దైవ, మానవ, దైత్య తత్వాలు

* దొప్పలపూడి అనసూయ *

అపకారికి ఉపకారము తలపెట్టునది, దైవబుద్ధి; ఉపకారికి ఉపకారము తలపెట్టునది మానవబుద్ధి ; ఉపకారికి అపకారము తలపెట్టునది, రాక్షసబుద్ధి.

* * *

తనసంపద పరోపకారమునకై వెచ్చించి తృప్తిపడునది దైవమానసము ; తనసంపదతానే వినియోగించుకొని తృప్తిపడునది మానవమానసము ; పరులసంపదను అపహరించి తృప్తిపడునది అసురమానసము.

* * *

అమృతరస పూరితములైన ఫలములభక్షింప గోరునది దైవజిహ్వ, ధాన్యములు, దుంపలు, శాకములు మొదలగువానితో చేయబడు పాకములను తినగోరునది మానవజిహ్వ, ఒకప్రాణి విలవిల తన్నుకొనుచుండ పట్టి కరకరకోసిన మాంస కండరములను ఆహారముగా మెసవ యువ్విళ్ళూరునది రాక్షసజిహ్వ.

* * *

ఋతుకాలమునందు సతీపతులు సంతానకాంక్షతో గూడునది దైవమిధునము ; ఆయాకాలములందు సతీపతులు పరస్పరానురాగముతో సంతోషార్థము కూడునది మానవమిధునము, కామాతురతతో నీమములేక బలవంతపరచియైన కూడునది రాక్షసమిధునము.

* * *

సుగుణ భూషణములతో ప్రశాంతప్రదమై సమీపించినకొలది సౌందర్యము చిందుచుండు సౌకుమార్యమూర్తి దైవస్వరూపము ; వన్నెవన్నెల దుస్తులతో సువర్ణాది భూషణములతో అందముగ కానుపించునది మానవస్వరూపము ; వస్త్రాది అలంకరణములున్ననూ దవ్వున నుండియె వికృతముగ గోచరించునది రాక్షసస్వరూపము.



# ఐక్యహృదయములు

✻ చల్లా సత్యేంద్రశంకర్ ✻



గణ...గణగణగణ... "అబ్బ! అప్పుడే రెండో బెల్లు కూడా అయింది. ఇంకెంతో టైము లేదు. స్కూలు కూడ పది నిమిషాల ప్రయాణ దూరంలో వుంది. వేళకు వెళ్లకపోతే మాష్టరుకి కోపం వస్తుంది. అయిన ఆలస్యాన్ని ఏదో మాదిరిగా సర్ది చెప్పేస్తాను. ఇహ మాత్రం ఆలస్యం కూడదు.

అమ్మకేమిటో పిచ్చికంగారు. నాకు వయస్సు వచ్చేసిందంటుంది. ఎంతో ఆరాటం ఎంతో భయం. ఇంత భయమయితో ఏలాగోకాని బాబూ...ఇల్లాటమ్మతో ఏలాగైనా చిక్కులున్నాయి. నాన్న చూడు యిపుడేమంత కంగారు అంటాడు. ఎంత దయ, ఎంత విశాల దృష్టి నాన్నకి. అమ్మకే యీకంగారు నా వయస్సులోని వుద్వేగాలను తనే అనుభవిస్తున్నట్లు మహా!

ఈ అబ్బాయి అల్లా చూస్తాడేమిటి బాబు. ఆ కోర చూపులు, ఆ వంకరగా బిగపట్టిన మాతృద్రోహి సినిమాలో శివరావు పెదబాబులా వున్నాడు. ఏం చదువు కొన్నాడో గాని అసలా మొహంలో చదువుకొన్న కళేలేదు. ప్రేత కళకు మాత్రం అవతారమూర్తి. ఇతడేలావుంది పెళ్ళి కొమారుడు.

అమ్మకెంత వుత్సాహం! అందమనే దాన్ని అమ్మ బుద్ధి అందుకోలేదా? అమ్మ కసలీ ఆలోచనే వుండి వుండకపోవచ్చు" ఇలా ఆలోచిస్తూ గడియారం వంక చూసింది సరళ. ఇంక ఒక నిమిషం మాత్రమే మూడో బెల్లు నాపు చేసింది. ఇలా అనుకొని ఎవరో పిలుస్తున్నట్లు గబగబా వెళ్లిపోయింది. వీధిలో రిక్షా కేకేసుకొని అందులో బయలుదేరింది.

సరళకు పదహేనవయేడు. ఆమెను చూసిన మొదటి చూపులోనే ముగ్ధులవ్వాలి. ఐదో ఫారం చదువుతూవుంది. సరళ తల్లికి రెండేండ్లయి పుట్టింది సరళకు పెండ్లి చేయవలెననే వుద్దేశం. రెండుమూడు సంబంధము లిప్పటికే వచ్చాయి. వారికి వీరికి కట్నం కానుకలలో తేడాలొచ్చి వుండుట చేసి సరళ వివాహం మప్పటికాపవలసొచ్చింది.

ఇది నాల్గవ సంబంధము. చాలా పెద్ద ఆస్తి పరులు. ఒక్కగా నొక్క కొడుకు. కట్నం అక్కర లేదట, గాని అందమంటే చాలుట. అసలిక్కడేవుంది పెండ్లికొమరునికి వుండవలసిన లోపాల కీలకం. కట్నాలంటే బెదిరే సర్వమంగళమ్మగారు సరళకి సంబంధంచేసిన సుఖపడుతుందని ఆశపడింది. అయినింటపుట్టింది, ఐశ్వర్యవంతుడింట పడుతుంది అని ఎంతో సంబరపడింది సర్వమంగళమ్మగారు. కూతురు వివాహ విషయంలో యీమెదే పెత్తనమంతా. అందమంటే డబ్బుండదు, డబ్బుంటే అందముండదు, అనే వుద్దేశాన్ని యీమె పూర్తిగా బలపరుస్తుంది. అయినా అందం కొరుక్కు తింటామా అని కూడ సమాధాన పర్చుకొంది. పక్కింటి సరమ్మగారి సరోజ అందమయిన వానిని చేసుకొని మహాసుఖ పడిందేమిటనే కొన్ని దృష్టాంతాలను కూడ ఆమె చూపగల్గింది.

పెళ్లివారికి మర్యాదలన్ని మర్యాదగా నడిపింది. ఇహ వారు వెళ్తామన్నారు. వెళ్లినవెంటనే తండ్రిగారి అనుమతిని కూడ పొంది వుత్తరంవ్రాయటం తప్ప యింక తనకే యభ్యంతరము లేదని పెండ్లికొడుకు శేషయ్యచెప్పి, తన కాబోయే అత్తగారికి మనసార నమస్కరించి సెలవు తీసుకొన్నాడు.

"త్వరగా తీసుకెళ్లు, ఫర్డుబెల్లుకూడ అయింది" అని రిక్షా వాణ్ణి సరళ త్వరపెట్టింది. రిక్షా పరుగెట్టుతూ వుంది...... "ఆరె రిక్షా రాయి! రాయి!" అని అరుపు. ఈ అరుపు రిక్షా వానిని చేరేసరికి రిక్షా తిరగపడింది. సరళ గాయపడకుండ తప్పించుకుంది. ఇంతలో పరుగెత్తుకుంటూ వచ్చాడు మోహన్. చెల్లా చెదరయిన పుస్తకాలను ప్రోగు చేసి సరళకిచ్చాడు. తనకీయాపత్తు జరుగకముందే తన రిక్షాకు కాషన్ నిచ్చిన మోహన్‌నుచూచి సరళ తన కృతజ్ఞత తెలియ పరచకుండ వుండలేక ఒకసారి అతనిలోకి తేలగా చూసింది. అదే

సమయానికి ఆమెలోకి చూస్తున్న మోహన్ కళ్లు ఆమె కనులతో కలిసాయి. "నన్ను గుర్తించుకో" అన్నట్లు మెరిశాయి. సరళ హృదయం ఎందుకో గబగబ కొట్టుకొంది. ఆమె తన మనస్సు మోహన్‌లో విడిచి స్కూల్లోకి వెళ్లింది.

పాఠాలు చెప్పబోతున్నారు మాష్టర్లు. సరళ మనస్సు మాత్రం ఎందుకో దేనికొరకో పరుగెత్తుతూంది. ఏదో మధురలమ ప్రణయాలవలపు చినుకులు చిందులాడాయి ఆమె మనోఫలకంపై.

ఇంటికి తిరిగి వచ్చింది. సర్వమంగళమ్మగారు ఎంతో వుత్సాహంతో తనకూతురును ముద్దుపెట్టుకొంది. తనకూతురే కదా త్వరలో జమీందారిణి అవుతుందని కాబోలు! అవును ఏ తల్లికి మాత్రముండదు తనకూతురు జమీందారుల కోడలవుతుందంటే ?

అంతా ప్రశాంతం. చీకటి తన తెరలను మరీ నలుపు చేస్తూంది. మాలతీ, శేరాణులు మధుర వాసనల గుబాళిస్తున్నాయి. పూదోటలు రాబోవు రోజుకై ముస్తాబవుతున్నాయి. ప్రకృతి ముగ్ధనారిలా మౌనంగా తనకార్యాన్ని నిర్వహిస్తూంది. అందం, ఐశ్వర్యాల మధ్య సరళ మనసు పెనుగులాడుతుంది. సరళకిదేయేమో రాబోవు జీవన్నాటకానికి నాంది ప్రస్తావన!

"మోహన్ ఎంత పరోపకారబుద్ధిగలవాడు! ఎంత అందం! అందానికి తగ్గ సౌష్టవం కూడ! ఏం చదువు తున్నాడో ఏమో! అవును మరచా. ఆ రోజున పెన్ను తీసుకొందామని అన్న దగ్గరకెళ్ళినప్పుడు బి.ఏ. క్లాసులో కూర్చున్నతడితడే! అన్ని నక్షత్రాలలోనూ చంద్రుడేగా మనకు కాంతి నిచ్చేది! అప్పుడు యథా లాపంగా చూచా. ఇప్పుడతడే పరిచయం చేసుకొన్నాడు. చంద్రుడేగా కుముదముల కొరకై వచ్చేది! ఈ పరిచయంయొక్క అంతిమ సందేశమేమో! ఏమయినా సరే యితడే నా యాశలకు రూపునొసగే నాణెకాడు. ఇతడు నేను జీవితంలో భాగస్తులమవుతే! ఛ! తప్పు, కాదు.

"మనసా! నీవెంత చిలిపిచేష్టకయిన వెఱవవు గదా! అతనెక్కడ నే నెక్కడ? ఈ సంగతి తల్లికి తెలుస్తే కోసెయ్యదూ! తల్లి ఏం చేసినా, ఏం చెప్పినా నేను మాత్రం ఆ-శేషయ్యను పెళ్లి చేసుకోను. నేను భారత నారిని. నా ముందు సావిత్రి, దమయంతిలాంటి దివ్య ప్రేమికులున్నారు. నేను వారికి వెనుకబోను. ఆ జమీందారును చేసుకోను. అతడి కోటలో యెన్ని యినుపపెట్టెల ధనమున్ననూ సరే!" అని సరళ మనస్సు ఒక నిశ్చయాని కొస్తూండగానే ఆమె నిద్రాదేవి ఒడిలో తలదాచుకుంది.

శేషయ్యకు వ్యతిరేకంగాను, మోహన్‌కు అనుకూలంగాను సరళ నిశ్చయించుకున్నదంటే ఆశ్చర్యమేముంది? 'కన్యావరయతే రూపమ్' అంటారుగా మన పూర్వీకులు!

ఆ రోజు సరళ తనకున్న వాటిలో అందమైన దుస్తుల ధరించింది. ఇది ఆమె ఎరుకలో చేసినట్లు తోచదు. సరళ నిజంగా ఆ రోజు మూర్తీభవించిన స్త్రీరత్నం. స్కూలు వైపు నడుస్తూంది.

మోహన్‌కూడ అప్పుడే ఒంటరిగా కాలేజికి బయలు వెడలుచున్నాడు. సరళ అతని కళ్ళ ఎదుట తొలకరి మెఱపులా మెఱసింది. కాని యీ మెఱుపు కళ్ళల్లోంచి మనసులో నాటుకొంది. తను ఎరుగకుండానే ఆమెలోకి చూస్తూనే వుండి పోయాడు, ఇది పసుకామ ప్రేరేపణ మాత్రంగాదు. ఆమె నేత్రాల్లో భారత గృహిణుల పరమ పాతివ్రత్యపు అమర గాథల నతడు చదివాడు. మధురానుభూతినొందాడు.

సరళకూడ అతన్ని మనసార చూచింది. అతని మోములోని సత్యప్రకర్ష గంభీరత ఆమె సాక్షరించాయి. మంత్రించాయి ఆ విశాల నేత్రాలు. అతను తన్ని తిరిగి చూచుచుండెనని తెలియుట తోడనే ఆమె సిగ్గుపడింది.

ఆహా! ప్రణయ పురాణంలో నేత్రాల పాత్ర యెంత ఘనమైనది!

* * *

ఏమీ తోచక పోతే సరళ దగ్గరలోనే వుంది కదా అని పార్కుకి వెళ్ళింది. మోహన్‌కూడ అదే స్థితిలో నుండుటచేసి అతనుగూడ ఆ పార్కులో ఒంటరి ప్రదేశంలో కూర్చున్నాడు. సరళ కూడ ప్రశాంతంగా వుంటుంది గదా ఏకాం

తంలో తన ఆలోచనలతో ఒకటై వుండవచ్చునని అదే ప్రదేశాని కొచ్చింది. మోహన్ ప్రక్కదుబ్బు మాటు నుండుటచే ఎవరూలేరని మూగగా కూర్చుంది. మోహన్‌కు ఎవరో వచ్చి కూర్చున్న వాసన తగులుటచే చకితుడై దుబ్బు సందుల్లోంచి సరళ వైపు పార జూచెను. ఆమె తన కొరకై వచ్చిందనే వూహాలో ఆమెవద్దకొచ్చి చిరపరిచితునివలె ఆసీనుడయ్యెను. కూర్చుని 'నీ పేరేమిటి?' అని సరళ నడిగెను.

సరళ తెల్లబోయి సిగ్గు పడెను. తను తెలివి తక్కువగా చూసుకొనకుండా కూర్చొన్నందుకు తన్ను తానే మందలించుకొన్నది. చెదరిన యెదను చేపట్టుకొన లేక వెంటనే సమాధానమీయలేదు.

'నీ పేరేమిటి' అన్న ఆ ప్రశ్నలో ఎంత నిర్మలత, మార్దవంవున్నాయి! ఏదో మంత్రం వున్నట్లు అనిపించిందా పూబోణికి!

నిజం, మోహన్ ఆకృతిలోనున్న అందం గొంతులో కూడ వున్నది. ఆ గొంతు తనలోకి ఆకర్షిస్తున్నట్లుంటుంది.

కొంత తరికి తన 'చెదరిన యెద'ను కూడ బట్టుకొని, మృదువుగా స...ర...ళ అని తనపేరు చెప్పింది.

మనసు కనులను హెచ్చరించింది. తిరిగి చూచుకొన్నాయి ఆ ప్రేమావృత నేత్రాలు. చిరునవ్వు నవ్వినయ్.

ప్రకృతి తన సంతోషాన్ని వెలిబుచ్చుటకేమో తన పిల్లతెమ్మెరల నా ప్రేమతో వేడెక్కిన హృదయములపై కలిపెను. అపుడే వికసితములయిన 'శేరాణి' పూగుత్తియలు, తామె యీ సందర్భంలో ముత్తయిదువులన్నట్లు కదిలాయి. తారకా, శశాంకులు తమ చల్లని కాంతితో సరళా, మోహన్‌ల నాశీర్వదించాయి. ప్రకృతే వీరి ఐక్య జీవితానికి సాక్షి.



# సుప్రభాతం

భాషాప్రవీణ శ్రీమతి అ. రాఘవమ్మ

ప్రాగ్దిశాకాంత ఆకాశ మందిరమున
బాల సూర్యు డన్నిసుగును బడసిమిగుల
మురియు చుండెను బాలెంత ముసుగు వైచి
నీలి మేఘాల నడికట్టు నీడలోన.

నాథు జాడను గని బోలు నవ్వుచుండె
పద్మినీ కాంత పుప్పొడి పసుపు రాసి
తేటి కాటుక లెట్టుక తేనెకాను
కలుగ గొని వచ్చె స్వాగతములుగ నేమొ

రాలుచున్నవి యింకను పూల పొదల
మంచు తుంపురల్ మెలమెల్ల మధుర మగుచు
పద్మినీ కాంత పెండ్లికి పరమశోభ
సురలు గురియించు చుండెడు విరులఁబోలె.

కుహుకుహూ యని కోయిలల్ కూయుచుండు
కూజితంతబుల బాజాలు కొమరు మిగిలె
ఏడు లోకాల నేలు నారేడు విశ్వ
సాక్షి మధుమూర్తి వారి పూజారి యయ్యె.

ఆప్రణవ మూర్తి దివ్య హృదంతరమున
జగతి దేదీప్యమానమై సొగసు గులికె
ఆదివ్యనాథు గాంచి ఆనంద తన్మ
యాత్ములై బయలు దేరిరి అఖిలజనులు.



# నేటి మార్వారు

**❋ మధ్వాచార్యుల శాంత ❋**

మార్వార్ దేశం రాజపుత్ర స్థానంలోనిది. ఈ దేశం సుమారు 3,120, చదరపు మైళ్ల వైశాల్యంతో రాజపుటానాకు గుండెవలె ఒప్పుతోంది. ఇండియాలోని సంస్థానాలన్నిటిలోను మార్వార్ మిక్కిలి పెద్దదనవచ్చు. కాని, కాశ్మీర్, హైదరాబాద్ సంస్థానాలతో పోలిస్తే మార్వార్ కొంచెం చిన్నదే. దీని జన సంఖ్య 25,55,904. ఆదాయం సంవత్సరానికి 2 కోట్ల 50 లక్షలు ఈ దేశం యొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులు విన ముచ్చటగా వుంటాయి.

అన్ని సంస్థానాలలో వలెనే, మార్వార్ రాజ్యాంగ విధానం కూడా ప్రధాని, ఉప ప్రధానుల మూలాన్నే జరుగుతూ వుంటుంది. జోధ్‌పూర్ మార్వార్‌కి రాజధాని. ఈ మంత్రులందరూ గొప్ప గొప్ప కాంగ్రెస్ నాయకులే. వీరందరూ ఒక్కొక్కరు, ఒక్కొక్క శాఖను తమ చేతికింద వుంచుకుని పాలించేవారు. మార్వార్ వ్యవసాయానికి పుట్టినిల్లు. వ్యవసాయదారులందరూ పెద్ద, పెద్ద భూస్వాములు. వీరు తమ క్రింది రైతులను తేలికగా చూసి, భూములను భాగములుగా విభజించి సేద్యం చేయిస్తూవుండే వారు. రైతులనేకవిధములైన పన్నులు కట్టవలసి వచ్చేది. దీనినే ఆంగ్లమున "ఫ్యూడలిజమ్" (feudalism) అంటారు. ఈ పద్ధతి ప్రజలందరిలోను అసంతృప్తి రేకెత్తిచింది. అందువలన ఈ మధ్య జయపూర్‌లో జరిగిన 55 వ కాంగ్రెస్ మహాసభ ఈ ఫ్యూడలిజమ్‌ను పూర్తిగా నిర్మూలించాలని శాసించింది. ఈ శాసనమును అమలులో పెట్టడానికి ప్రస్తుత మంత్రివర్గం చాలా ప్రయత్నిస్తున్నారు.

మార్వార్ దేశపు ప్రజాపరిపాలన చాలా కట్టు దిట్టంగా వుండేది. ప్రతిగ్రామ, పట్టణాలలోను పురపాలక సంఘాలు ఉండేవి. ఈ సంఘాలకి అధ్యక్షులను ఎన్నికల మూలంగా యేర్పచుకునే వారు. 1949 వ సం॥ నుంచి జిల్లా పరిపాలన కూడ ఆరంభించ బడెను. సంస్థానమంతా 6 జిల్లాలుగా విభాగింపబడింది. అందు ముఖ్యమైనవి, బార్‌మార్, జాలర్, జోధ్‌పూర్, పాలి, నాగూర్‌లు. మంత్రివర్గం ప్రజా సౌకర్యం హెచ్చించుటకు పలు పాట్లుపడేది. ఆదినుంచికూడా మార్వార్‌లో త్రాగుడు అధికంగా వుండేది. జనులు రకరకముల మత్తుకరమైన పానీయాలు, "ఆమల్ కాసుమ్భా" అను ఒక విధమైన మత్తు పదార్థము ఉపయోగిస్తూ వుండే వారు. ఈ త్రాగుడు అరికట్టటానికి ప్రభుత్వం అనేక నిబంధనలు అమలులో పెట్టింది.

1. దేశంలోవుండేకల్లు సారాయికొట్లు సంఖ్య తగ్గించి వేయ బడింది.

2. సారాయి అమ్మకము రోజుకి 7 గ॥ నుండి 5 గ॥లకు తగ్గించబడింది.

3. నల్లమందు యొక్క ఉపయోగము తగ్గుటకు ప్రభుత్వం దానిమీది పన్ను హెచ్చించింది.

జాతీయ పరిపాలనా విధానమెంత దృఢముగా వున్నా, మార్వార్ తరుచుగా కరువు, కాటకాల వలన బాధపడు చుండేది. ఇందుకు కారణమేమంటే, మార్వార్ కేవలం వ్యవసాయంమీద ఆధారపడి వుండటమే. ఈ వ్యవసాయం సరిగా సాగాలంటే, వర్షాలు బాగావుండాలికదా! 1949 వ సంవత్సరంలో మార్వార్‌కు పెద్ద క్షామం వచ్చింది. మార్వార్‌లోని నాగూర్, దిడ్‌వాన్హ్, ఫలోడి, షేర్‌గార్ మొదలగు జిల్లాలు బాగా నష్టపడ్డాయి. క్షామ నివారణ కోసం గవర్నమెంటు పలువిధములైన పాట్లుపడ్డ దనాలి. మార్వార్ ప్రభుత్వం ఇండియా గవర్నమెంటు మూలంగా ఆహార పదార్థాలు పొందింది. కాని ఇంత కరువులో కూడా మార్వార్ గవర్నమెంటు 3 లక్షల రూ॥లు గాంధి మెమోరియల్ ఫండుకి, ఒక లక్ష రూ॥లు జయపూర్ కాంగ్రెస్‌కి ఇవ్వగలిగిందటే, ఆ దేశపు సిరి, సంపదలెంత ఔన్నత్యంగా వున్నాయో తెలుస్తోంది. ఇంకా ప్రభుత్వం, పలుచని మిల్లువస్త్రాలమీదా, ఖాదీమీదకూడా కంట్రోలు విధి

చింది. ఈ విధంగా ప్రభుత్వం ప్రజావృద్ధికి పాటుపడుతూంటే, కొందరు దుర్మార్గులు ప్రజలలో లంచగొండితనం, బ్లాక్ మార్కెటింగ్ వ్యాపింపజేస్తూ వాళ్ళలో అసంతృప్తిని ప్రబలిస్తూవచ్చారు.

క్షామనివారణానంతరం ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధికి ప్రయత్నించింది. ఆరావళి పర్వతాలకి దక్షిణాన వున్న "జావాయ్" నదిమీద ఆనకట్టు కట్టారు. దీనివలన కేవలం వర్షాలమీదే ఆధారపడకుండా ఇర్రిగేషన్ మూలంగా వ్యవసాయం సాగుతోంది. ఈ రకమైన ప్రాజక్టు రాజపుటానాలో ఇదియే మొట్ట మొదటిది. ఈ ప్రాజక్టు నిర్మించడానికి 2 కోట్ల రూ॥ ఖర్చయింది. ఈ ప్రాజక్టు సుమారు 80,000 ఎకరాల పొడి నేలకు నీటివసతి కలిగించి, గోధుమ, పత్తి, పొగాకు, పంచదార, అపరదినుసులు, మొదలైనవి పండించడానికి వీలుకలుగజేసింది. కాని మార్వార్‌లోని భూస్వాములు (జాగీర్‌దార్) ఇర్రిగేషన్‌వల్ల భూసాగుబడికి యెంత మాత్రం ఒప్పుకో లేదు. భూమి చాలమటుకు వీరి చేతిలో వుండటంవలన, వీరి నరికట్టటానికి ప్రభుత్వం కొంచెం శ్రమ తీసుకోవలసి వచ్చింది. ఈ జాగీరుదారులకు నష్ట పరిహారం ఇవ్వటానికి గవర్నమెంటు "లాండ్ ఎక్విజిషన్ ఆఫీసర్‌ని" నియమించడానికి నిశ్చయించింది. కాని జాగీర్‌దారులు దానికిష్టపడక "కన్‌వార్" నాయకత్వం క్రింద గవర్నమెంటు కెదురు తిరిగి విమర్శించటం మొదలెట్టింది. ఇందుకు ప్రభుత్వం కన్‌వార్‌ని అరెస్టు చెయ్యవలసి వచ్చింది.

ప్రాచీనకాలంలో మార్వార్ దేశంలో విద్య క్షీణదశలో వుండేది. కాని రాను రాను ప్రభుత్వం పరిపాలనలో విద్యాభివృద్దే ముఖ్యమని యెంచింది. దేశంలో 6 సం॥ మొదలు 11 సం॥ బిడ్డలకు విద్య బహు శ్రద్ధతో చెప్పించి వారికి పునాది దిట్టపడేలాగు చూడాలని శాసించింది. వయోజన విద్యకూడ వున్నతస్థితిలోకి వచ్చింది. ప్రభుత్వం సం॥రానికి 12లక్షల రూ॥పైన విద్యాభివృద్ధికి హెచ్చించింది. ప్రయిమరీ, బేసిక్, మిడిల్, హైస్కూల్, కాలేజి విద్యలు బాగా వృద్ధయ్యాయి. బాలురకు సైనికశిక్షణ తప్పనిసరిగా యేర్పరిచింది. పూర్వపు విద్యా విధానంతో పోలిస్తే, ఈనాటి విద్య యెన్నోరెట్లు అభివృద్ధి చెందింది.

మార్వార్‌లోని జోధ్‌పూర్‌లోను, ఇతర జిల్లాలలోను ఆరోగ్యాభివృద్ధికి ప్రభుత్వం ఆస్పత్రుల మీద ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది. మామూలు ఆంగ్ల వైద్యమే కాకుండా, ఆయుర్వేదంకూడా పెంపొందింది. ప్రజలందరూ బలమైన ఆహారం తీసుకుని, క్రమమైన ఆరోగ్య సూత్రా లవలంబించేలా ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంది. అన్ని పూళ్ళలోను శిశు సంరక్షణాలయాలు నెలకొల్పింది. దేశంలో ఐస్ అమ్మకం కూడదని ఆజ్ఞాపించి, దాని మూలంగా బిడ్డలకుకలిగే టైఫాయిడ్, టాన్‌సిల్స్ మొదలగు జాడ్యాలనుంచి ప్రజల్ని రక్షించింది. 1949 సం॥ మే నెలలో సంస్థానంలో న్యూట్రిషన్ కమిటి స్థాపించబడింది.

మార్వార్ అన్నివిధాలా వృద్ధిచెందడానికి దాని ప్రభుత్వమే కారణ మనవచ్చు. ప్రభుత్వం రోడ్డు రహదారిని పెంపొందించటానికి చాలా ప్రయత్నించింది. ప్రధానమంత్రి జయ్‌నారాయణ్‌వ్యాసే కమ్యూనికేషన్స్‌కి ప్రెసిడెంటుగా వుంటూ వచ్చారు. జోధ్‌పూర్‌లో రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్ ఈ మధ్యనే కట్టారు. బొగ్గు గనులను కూడా కనిపెట్టడానికి యేర్పాటులు జరుగుతున్నాయి.

ఇండియా, పాకిస్థానుల విభాగానంతరం ఇండియాలో కాందిశీకుల సంఖ్య యెక్కువైంది గదా. మార్వార్ పాకిస్థానుకి సమీపంగా వుండటంవలన కాందిశీకుల ఒత్తిడి మరి యెక్కువైంది. ప్రస్తుతం మార్వార్‌లో 46,16,102 కాందిశీకులున్నారు. మంత్రివర్గం వీరికోసం 12 లక్షల రూ॥ ఖర్చుపెట్ట దలచింది. ఈ కాందిశీకులకు ఇండ్లు పాఠశాలలు, వ్యవసాయ, వాణిజ్యాభివృద్ధి మొదలగునవి ప్రభుత్వం, రెఫ్యూజీ ఎడ్వైజర్ కమిటీ సహాయంతో సాధించింది.

ఇండియా పాకిస్థానులు విభజింపబడిన తరువాత జోధ్‌పూర్‌లోని సింధు రైల్వేశాఖ పాకిస్థాను చేతిలో పడ్డది. కాని ప్రజా సౌకర్యం కోసం, రాజపుటానా, పాకిస్థాన్ ప్రభుత్వాలు రెండూ 1949 జూలై నెలలో ఒక ఒడంబడిక యేర్పరచుకున్నారు. దీని ప్రకారం జోధ్‌పూర్, సింధుల మధ్య ట్రెయిన్ సర్వీస్ సక్రమంగా జరుగుతూవున్నది.

## నేటి మార్వారు

పైన వివరించిన విషయాలన్నిటివలన మార్వార్ సాంఘి కంగానూ, రాజకీయంగానూ మార్పుచెంది చాల వృద్ధిలో వున్నట్లు తెలుసుకోవచ్చును. దీనికి కారణం గవర్నమెంటు ప్రజల ఉన్నతికోసం పాటుపడటమే. పూర్వం మార్వార్ విద్యలోను, రాజ్యాంగంలోనుకూడ బాగా వెనుకబడివుండేది. కాని 1947, 48, 49 సం॥లలో కాంగ్రెస్ మంత్రివర్గం దేశాన్ని చాలా కూర్పుచేసింది. ప్రభుత్వం మొట్ట మొదట ఫ్యూడలిజమ్ అంతమొందించి రైతుల ఆర్థికస్థితి అభివృద్ధి చేసింది. వాణిజ్యందేశంలో అగ్రస్థానం వహించేలా చూసింది. ప్రజారోగ్యం, విద్యాకూడా వ్యాప్తిచెందాయి. ఈ విధంగా స్వతంత్ర మార్వార్ హిందూ దేశ చరిత్రలో ముఖ్యమైన పాత్ర తీసుకుని, ఇండియా భవిష్యత్ అభివృద్ధికి తప్పక పాటు పడుతుందని పండిట్ నెహ్రూ ప్రభృతు లాసిస్తున్నారు.



# కర్ణాటకసంగీతము

సంగీత విద్వాన్, శ్రీ మంత్రాల గోపాలకృష్ణమూర్తిగారు.

[యీ వ్యాసమునకు కూడా, కర్ణాటక సంగీతమునకు సహాయపడిన రచనలు తెల్పుటయే ముఖ్యకారణం—]

కర్ణాటక సంగీతమునకు అభివృద్ధితేగల రచనలలో శ్రీ ముద్దుస్వామి దీక్షితులు వారివి, శ్యామశాస్త్రిలుగారివి. వీరు యిద్దరు అఖండ వుపాసనపరులు. ముద్దుస్వామి దీక్షితులు వారు వెంకటమఖి సాంప్రదాయము ననుసరించినవారు. శ్యామ శాస్త్రిలుగారన్నో రామామాత్యుని సాంప్రదాయము నను సరించిన వారైవున్నారు. ఎవరు ఏ విధమును అనుసరించిన వారైనను యింతవరకు గాయకులందరు వీరిద్దరి రచనలను గానము చేయుచున్నారు. ముద్దుస్వామి దీక్షితులవారు సుబ్రహ్మణ్య ఉపాసనగల వారగుటచే గురుగుహ ముద్రతో సంస్కృత భాషలో అనేక రాగములలో వందల కొలది కీర్తనలను చెప్పియున్నారు. ఆ కీర్తనలను వ్రాయుటలో అనేక దేవతల మీద స్తుతిరూపముగా వ్రాసియున్నారు. వారి రచన కదళీపాకములో వ్రాసినట్లు కనపడుచున్నది. మరిన్నీ వారు పూర్ణదీక్షాపరులని కూడా తెలియుచున్నది. వారు, నవావరణ కీర్తనలు, నవగ్రహకీర్తనలు, పంచలింగ ముల కీర్తనలు, గణపతిస్వామి వారిమీద అనేక కీర్తనలు శ్రీ మేధా దక్షిణామూర్తి స్వామివారిమీద, బాలా త్రిపుర సుందరీ అమ్మవారిమీద అనేక కీర్తనలు చెప్పి యున్నారు. వీరు ఉత్తరదేశములో చాలా కాలము వుండుటవల్ల ఆ దేశ సాంప్రదాయము కొంతవున్నట్లు గోచరించుచున్నది. ఏది ఎట్లున్నను గాయకులైనవారు వీరి రచనలు పాఠముచేసియే తీరవలెను. వీరు విద్యాపుర సంస్థాన విద్వాంసులై యుంటూ భగవచ్చింతనతో కాలము గడిపి జీవన్ముక్తిని పొందిన మహ నీయులు! తరువాత శ్యామశాస్త్రిలవారు రచనలనుగూర్చి విచారిద్దాము-కంచికామాక్షి అమ్మవారిమీద సుమారు రెండు, లేక మూడువందల కీర్తనలు మాత్రం తెలుగు భాషలో నారి కేళపాకముగా వ్రాసియున్నారు.

శ్రీ సుబ్రమణ్యస్వామివారి అనుగ్రహము పొందిన వారు, శ్యామశాస్త్రిలవారి కీర్తనలలో, లయకు కొంత ఎక్కువ ప్రాధాన్యత యిచ్చినట్లు కనపడుచున్నది. వీరివి యిప్పటికి 30, లేక 40 కీర్తనలు మాత్రం అమలులో వున్నవి. వీరి కీర్త నలు ఎక్కువ మిశ్రచాపులో వ్రాసియున్నారు. కర్ణాటక సంగీత అభ్యాసం చేయువారందరు వీరి రచనలుగల కీర్తనలు పాఠంచేసి గానం చేసినట్లయితే లయలో మంచి బింకము, లయనిలకడ, కర్ణాటక సంగీతముయొక్క రాగభావము మొద లైనవి వచ్చును. శ్యామశాస్త్రిలవారు కామాక్షి అమ్మవారి అనుగ్రహం పొందిన మహనీయులు. కర్ణాటక సంగీతము నకు చేసినసేవ అపారము. యింతవరకు తేలిన విషయమేమిటి అంటే, కర్ణాటక సంగీతమునకు, 200 సంవత్సరములకు యిటీ వల సేవచేసిన వారలలో త్యాగరాజు, క్షేత్రయ్య, దీక్షి తులవారు, శ్యామశాస్త్రి వీరి రచనలు చాలా వుపకరించిన వని తెలుచున్నది.

# "అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారనకపోతే"........!

✻ ఆడబాల వీరాస్వామిరాజా ✻

[సర్వ సాధారణంగా వాడుకలో వుండే లోకోక్తులు నోటి చివర నాలుకపై బొట్టు మోపులుగా వుంటాయి. సమయా సమయాలను చూచి ప్రయోగింప బహుటకు పొంచి చూస్తాయి. వీలున్నకొద్దీ ఆ లోకోక్తులు ఉపయోగించినా అంతగా అంతరార్థము తెలియకపోవచ్చు. అందులోను మిడి మిడి జ్ఞానముగల అల్పవయస్కులు వాటిని ప్రయోగించెనా వాటిలో అర్థమును విడమర్చి చెప్పడం దుర్లభం, దుస్సహము] —రచయిత.

అవి నా చిన్నతనపు రోజులు. నేనంటే మా అన్నకు మహాగారామే! అయినా నేను ఏడిస్తే చూచి నవ్వడానికి వేళాకోళము మాటలు తరచు విసరుతుండే వాడు. వాడనే మాటలకు నేను ఉడుక్కునే వాడిని కాదు కాని అబద్ధాలాడకురా ఆడపిల్లలు పుడతారంటుండే వాడ్ని. వాడికి ముందు మొగపిల్లవాడే పుట్టేడనుకోండి! అబద్ధమనే తప్పుకి పర్యవసానం ఆడపిల్ల పుడుతుందనకపోతే మొగపిల్లవాడు పుడతాడనకూడదూ అనే వివక్షతా తర్కజ్ఞానము అప్పుడు కలగకుండా పోయేది.

రోజులు, నెలలు, సంవత్సరాలు శరవేగంగా నడిచి పోతున్నాయి. విజ్ఞానబీజమునకు తర్కమనే నీటిని పోసే కొలది సమస్యల లోతు పాతు జూజాయిగా తెలుస్తూ వచ్చాయి. అనుభవజ్ఞులకు నావంటి వానికన్న అంతరార్థము మరింత తెలియక పోదు! అయినా సాహసించి వ్రాసిన వ్యాసమిది.

పవిత్ర హిందూ దేశములో రాను రాను దారిద్ర్యము, దుర్బలత్వం ప్రబలింది. దీనికి ముఖ్య కారణం ముమ్మాటికి మతమనే చెప్పాలి! మతమనే పేరు చెప్పితే స్వార్థం తనంతట తాను ఉప్పెనవలె పొంగుతూ వస్తుంది. ఆ కెరటాలలో మూఢ నమ్మకాలనే గులకరాళ్ళు ఒడ్డుకు కొట్టుకు వస్తాయి. అవి ప్రజలనే యిసుక రేణువుల మధ్య నిలచి పోతాయి. సుస్థిరంగా వుండిపోవాలని కాంక్షిస్తాయి. సల సల ఎండ వేడిమికి కాలే యిసుకపై అడుగు తీసుకొంటూ వేసుకొంటూ నడచి కాలుతున్న గులకరాళ్ళను ఏరడమంటే ఎంత దుర్భరమో మనలో పాతుకుపోయిన ఈ మూఢ నమ్మకాలను వ్రేళ్ళతో త్రెంపి పారవేయడం అంత కష్టతమము.

అటువంటి మూఢ నమ్మకాలతో నలిగి పోతూ అభివృద్ధి మార్గము ఆనుపాలు తెలియని మనదేశ సంఘంలో స్త్రీకి సర్వ విధాలా తావులేకుండా పోయింది. నేటి కుక్షితసంఘంలో స్త్రీ ఒకవంటలక్క. కామయంత్రం. పురుషుని అడుగులకు మడుగులెత్తుచు వెట్టి చాకిరికి నియమింపబడిన బానిస క్రింద బానిస. నాలుగు గోడలమధ్య సూర్యుడు చొరరాని చీకటి గదిలో ఒకఖైదీ. ఆమెకు స్వాతంత్రియము సున్నా. యింతేకాదు పురుషుడు సంఘానికి పెద్దయై ఏకచక్రాధిపత్యము వహించుతూ ప్రకృతి సౌందర్యాన్నైనా ఆడది అనుభవింపకుండా త్రుంచి వేసేడు. ఈ మొగవాడు స్త్రీపై హృదయములేని నిరంకుశాధికారియై కూర్చున్నాడు. ఆమెకు బాల్య వివాహంచేసి సౌఖ్యము చేకూరకుండా చేస్తోంది పెత్తందారైన పురుషుడే. బాల వితంతువునైనా మరల వివాహము చేసుకోవీలులేదని, ఆమె జీవితాంతమువరకు ఎండిన కట్టెవలె నిర్జీవమై మ్రగ్గి పోవలసిందేనన్న శాసనముచేసినదీ పురుషుడే. ఆ అమాయిక నోరు నొక్కి మూడునాళ్ళ ముచ్చట కొరకు మురిచే ముదుసలికైనా మెడలువొంచి ముడి వేయించేది ఈతడే. ఈ ఘోర అన్యాయాలను అరికట్టగల దాతలు అవుపించకుండా వున్నారు!

ఒక కుటుంబములో దంపతు లిరువురు పుత్ర సంతానము కొరకే తాపత్రయ పడతారు. ఒహావేళ పుత్రిక కలిగినట్టయితే పెద్దభారము నెత్తిపై పడిందని పరితపిస్తారు. దీనికి కారణం? మూఢనమ్మకాలతో మ్రగ్గి పోతున్న సంఘము!

పుత్రికకు ఈడొచ్చు వరకు తల్లి యింట్లో అడ్డమైన వెట్టిచాకిరి చేయించుకుంటూ పెంచుతుంది. యింటి భారము హెచ్చైనా ఆడపిల్ల నోరు నొక్కుకుని, కిక్కు మనకుండా మోయవలసిందే? అదే పుత్రునికి సంభవిస్తే నా ఆస్తి నాకు పంచి యిచ్చివెయ్యండి, నేను వేరుపడి పోతానని యింట్లో

దభాయిస్తాడు. నోరుపెట్టి తన యిష్టమొచ్చినట్లు మాటలు చెలగాయిస్తాడు. అమ్మాయికి మట్టుకు ఆ హక్కు లేదు.

వయస్సు వచ్చిన వనిత వీధి గుమ్మము త్రొక్కడానికి నోచుకోకుండా పోతుంది. పరాయి పురుగు కంటపడకుండా వంటిట్లో పడివుండవలసి వస్తుంది. రవీంద్రుడన్నట్టు 13, 14, 15 సంవత్సరాల బాలునికి స్వగృహమే స్వర్గమైతే అపుడు బాలికకు స్వగృహము నరకమవుతుంది.

యీడువచ్చిన స్త్రీని యింట్లోవుంచి ఒక యింటి దానిని చేయడానికి కొద్ది నిర్లక్ష్య భావంతో ఆలస్యం చేస్తే ప్రజల నుంచి దెప్పిపొడుపులు, గగ్గోలు బయలు దేరుతుంది. అంచేత తండ్రి ఈ గుదిబండను దింపుకోడానికి విశ్వ ప్రయత్నాలు చేయడం ప్రారంభిస్తాడు. స్త్రీ వివాహ విషయము నేటి సంఘంలో మహాదుర్భరమైన సమస్యైవుంది? కనుక అతని పాట్లు కుక్కలుకూడా పడవనే నమ్మిక!

అమ్మాయి తెలివైనదే. కొద్దోగొప్పో అక్షరజ్ఞానం కూడా వుంది ఆమెకు. అయితేం? తండ్రికి హెచ్చు కట్నాలిచ్చే స్తోమతలేదు. అమ్మాయికి తగ్గవరుడు కావాలంటే 116 తో కూడి వేల సంఖ్యతో నిండిన కట్నాలిచ్చి కొనుక్కోవాలి. తక్కువ స్థితిలో పోవాలంటే అమ్మాయి సంసారాని కన్నీ అవకతవకలు వచ్చి ఆవరించు కొంటాయి. అయితే మట్టుకు ఏం చేస్తాడు? పెద్ద మనిషై పెళ్ళికొచ్చిన పిల్లకు వివాహము చేయకుండా వుంటే ప్రజలు కాకుల్లా పొడుచుకు చంపుతారు. యిన్ని చిక్కు సమస్యలలో యిరుక్కున్న తండ్రికి ఏమిపాలు పోకుండా పోతుంది. ఆఖరకు ఏలాగో భారమువదలి గొట్టుకోవడమే కాదాయని మనస్సును కుదుట పర్చుకొని ఏ రెండవపెళ్ళివాడికో వివాహము నిశ్చయిస్తాడు. లేకపోతే ఏ విద్యాశూన్యుడో చవకగా రావడవమువల్ల పెళ్ళి ఏర్పాట్లు చేసుకొంటాడు. వాళ్ళు మాత్రం వొట్టినే పోతారా? ఆడబడుచు లాంఛనాలు, వెండిచెంబు, వెండి పళ్ళెం, 116లతో కూడ యివ్వగలరనే వాగ్దానమును పెళ్ళి కూతురు తండ్రి దగ్గర తీసుకొని పసుపు కుంకాలు పుచ్చు కొంటారు ఎరువు నగలుతెచ్చి అమ్మాయికి సొంతంగా యిచ్చేస్తున్నట్టు పళ్ళెంలో పెట్టి వరుని తరుపువారు. తిప్పలన్నీ ఆడపెళ్ళివారు పడవలసిందే! మొగపిల్లలకల వాళ్ళు ఖరారుగా మొండిఘటాలై మా అబ్బాయి కావలసిన వాళ్ళే కాళ్ళదగ్గరకు వస్తారని బిర్రబిగిసి కూర్చుంటారు. వివాహము పైపెచ్చు పెళ్ళి కూతురింటివద్ద జరగాల్సిందనే మామూలొకటి ఉన్న దిగదా.

పెళ్ళి రేపనగా బంధువుల్ని, స్నేహితుల్ని దారే పోయేవార్ని ప్రోగుచేసికొని పెండ్లికొడుకు వాళ్ళు గజనీమహమ్మదులా పెండ్లి కూతురింటిపై దండ యాత్రకు వస్తారు. పెళ్ళి రెండు రోజులు వీరందరికి మర్యాదలు జరుపు సరికి వధువు తండ్రికి తల ప్రాణం తోక్కి వస్తుంది. మర్యాదలలో ఏ మాత్రం లోటు పాటు వచ్చినా పెండ్లి కుమారుని తండ్రి పెళ్ళిజరగకుండా లేచిపోతామని బెదిరిస్తాడు. వియ్యంకుడు, పెళ్ళిపెద్దలు మూడవ నేత్రము విప్పివుంచిన ఆ శివుడ్ని ప్రతిమాలి, మూడవకన్ను మూయించే సరికి ప్రాణం సాలివస్తుంది ప్రతిమాలే కొలది బిగియడమువల్ల. కట్నం అంతా రొఖ్ఖంగా యివ్వక కొంత వెనక వేస్తున్నా యిహ పెళ్ళికూతురు అక్కరలేని వాడిలాగ పెళ్ళికొడుకు పెళ్ళి పీటలుమీంచి అమాంతంగా లేచి పోబోతాడు. సరే ఎలాగో ఆ విఘ్నేశ్వరుని బొజ్జసవరించి మంగళసూత్రధారణం చేయిస్తారు. పెళ్ళి పేరు చెప్పి పైవారు కాక పురోహితులు, బట్రాజులు, భాజాభజంత్రీలు, మేళతాళాలు వధువు తండ్రినుంచి నిలబెట్టి అప్పు తెచ్చిందంతా దుల్లగొట్టిస్తారు.

రసాభాసంతో వివాహమైపోతుంది. పెండ్లికొమారుడు అత్తవారింటికి ఒంటరిగా వెళ్తే ఎవరో తంతారన్నట్టుగా ఒక తోడగుడ్డని వెనక వేసుకొని మనుగుడుపుకు వెళ్ళి యిరువురు యిష్టమొచ్చినంతకాలం తిష్టవేసి మిగిలినదేమైనా వుంటే ఊడ్చేస్తారు.

పిల్లకాపరానికి వెళ్ళిపోయిందని చేతులు దులుపుకోడానికి వీలులేదు. పండుగలు, పబ్బాలు వచ్చినప్పుడల్లా అల్లుని కూతురిని తీసుకువస్తూ వుండాలి. పైపెచ్చు పండుగకిరమ్మని అల్లుడికి కబురు పెడితే చాలదు. ఖర్చీలన్నీ భరిస్తూ స్వయంగా మామగారో, బావమరిదో లేక వారిదగ్గర బంధువో వెళ్ళి

తీసుకు తెచ్చుకోవాలి. అక్కడ పండగన్నాళ్ళు పరి శుభ్ర ముగా పంచభక్ష్య పరమాన్నాలతో, పిండి వంటలతో భోజనాలు చేస్తూ కాలం వెళ్ళబుచ్చుతారు, ఆ నూతన దంపతులు. అంతటితో గణపతికిమటుకు సంతృప్తికాదు. పండుగ కానుకగా ర్యాలిసైకిలో, వెస్టెండ్ కో రిస్టు వాచియో అల్లుడిగార్కి మామగారు సమర్పించుకోవాలి. ఇహ యిల్లుకదులుతున్నారనే సరికి యిరువురికి కూడా విలువైన బట్టలుపెట్టి సాగనంపాలి.

అమ్మాయి గర్భిణిదాలుస్తుంది. పురుడుకని సంసారము ఎత్తుపెట్టుకొచ్చి అల్లుడు అత్తవారింటిపై పడతాడు. అక్కడ ఆ నిండు చూలాలికి కావలసిన మందులకి, మాకులకి అమ్మాయి తండ్రే చెల్లిస్తూ వుంటాడు. పురుడయ్యే లోపల పరామర్శకని వచ్చేపోయే బంధువులు యెప్పుడు చూసినా యింట్లో సిటీబస్సులోలా నిండివుంటారు.

ఒకవేళ వెధవ ఆడబడుచు వుందంటే జీవితాంతము వరకు భారము నెత్తిని వుండి పోతుంది నిర్భాగ్యుడైన తండ్రికి.

మన అర్థములేని సంఘ సంస్కరణలో ఆడ పిల్లలు కల తండ్రి వారి జీవితాంతము వరకు ఒకటే యాతన పడవలసి వుంటుంది కనుక 'అసత్యమాడితే ఆడ పిల్లలు పుడతారని' బెదిరింపుగా ఈ లోకోక్తి వాడుకలోనికి వచ్చి వుంటుంది. యిది మనదేశ సరిహద్దులు దాటి పోయివుండదు ?

ఈ లోకోక్తిని, రూపుమాపాలంటే అసలు స్త్రీ సుఖించాలంటే, స్త్రీ ఏనాడైతే చిన్నతనమున తల్లి దండ్రులపై ఆర్థికముగా పూర్తిగా ఆధారపడ నవుసరములేదో, వివాహము జరిగిన తదనంతరము భర్తమీదే ఆశపెట్టుకుని వసియించ నవుసరమువుండదో, వార్ధ్యకములో సంతానముపై భారముగా నుండదో, ఆ నాడే స్త్రీ సుఖించ గలుగుతుంది. ఆ నాడే సంఘం, ఆఖరకు ఆనంద డోలికలలో ఊగిసులాడుతూ ఆ దర్శదేశంగా అలలారుతుంది.





బ్లెయిర్ హౌస్ బాల్కనీనుండి, పండిట్ జీ, అక్కడ చేరిన ప్రజా సమూహాన్ని తిలకిస్తున్నారు.

# వైతాళికులు

రచన : "ఉషాదేవి"

ఆనాడు

ఆంధ్ర సాహితీవనము గారకంపలతోనూ ముండ్ల కంచెలతోడనూ నిండి నిబిడీకృతమై సంకట కంటక శిలా భూయిష్టమై దారి తెన్నులులేక ఉన్న దురవస్థలో, విషమ పరిస్థితులలో, సందిగ్ధ సమయములో, తవ్వుగోల గడ్డపాఱ బుజానినిడుకొని నాగలిచేతబట్టి, తుక్కు దుమారములను తూర్పారబట్టి, చెత్తచెదారములను చేటలకెత్తివైచి, చక్కగా దున్ని సుక్షేత్రఖండముగా జేసి నూత్న రీతుల నవ్య విధానాల వినూత్నపథ నిర్మాణ మొనరించి, ఖులాస విలాస విహారోపవనంగా నిర్మించిన వనమాలి ఆదికవి శ్రీ నన్నయ భట్టారకునికి కైమోడ్పులు—

ఆనాడు

అంధకారబంధురమై కారుమబ్బులలము కొనియున్న ఆంధ్ర సారస్వత విహాయసాన రంగురంగుల రంగవల్లుల నలరించి ప్రాభాత సాంధ్యారుణ స్వర్ణభ ప్రబల వెలయించి ఆశాస్యమ్ములుదీర్చి గైరిక వస్త్రధారియై 'ఉషశ్శ్రీ'ల వెలువరించిన శ్రీ తిక్కన, ఎఱ్ఱన్నలకు నమస్సులు—

మహాభాగతేతిహాసగచనా ప్రసిద్ధసాహితీ ఐతిహాసికులైన కవిత్రయ 'వనమాలు'లచే వినిర్మితమైన దివ్యనందన వనసీమలలో గుమాయింపుల సంపంగులు, గుబాళింపుల గులాబీలు అంటుద్రొక్కి, బోదిచేసిన ఆంధ్ర భాగవత మహా కవీంద్రుడు శ్రీ పోతనామాత్యునకు ప్రాంజలులు—

మందమందమరంద మధురమాధురీ సుగంధ సురభీ పవనాంకురాలను అనవరతము తెలుగు జనతపై విరజిమ్మే పురాణ ఇతిహాస మహాకావ్య వృక్ష శాఖోపశాఖలపై సుందర సౌరభ్య మకరంద సమ్మిళిత కిసలయ ప్రసూనములతో విరాజిల్లే ప్రబంధలతికలను ప్రాకించిన శ్రీ అల్లసానికి మనోల్లాస ప్రణతులు—

ఈనాడు—

నవనవ పరీమళాల్ ప్రవహించే కల్పకవృక్షలతా ప్రసూన విరాజిత పరివేష్ఠితమైన ఆంధ్ర సారస్వతోపవనాంతరాలలో శతావధాన నికుంజపుంజములు మంజుమంజులములుగా విడిది చేయించిన-స్వతంత్ర నవభారతావనీ ఆంధ్రాస్థాన కవీంద్రులు-కింకవీంద్ర ఘటా పంచానన బాలసరస్వతులు శ్రీ తిరుపతి వేంకటకవులకు కరాంజలులు—

పౌరాణిక ఐతిహాసిక కావ్యప్రబంధ సమ్యక్ సమ్మిళిత సాహితీ మహానందనవనంలోని మరంద నిష్యందమాధురీ ఝరులను సామాన్య జనతకు, శ్రామిక జగతికి ప్రసారం చేయటానికి దీక్షా కంకణబద్ధులై, అక్షీణ కృషిసలిపి సజీవ భాషావాహినిని, జనతా సాహితిని సక్రమపథాల నడిపించి కవిని-దుర్భర దుస్సహ దురంత పీడిత తాడితశ్రామిక జనతకు - సన్నిహితుణ్ణిచేసిన విప్లవకారులు శ్రీ గిడుగు "పిడుగు"కు గురజాడకు నమ్రశీర్షములు—

పరుగుపరుగున జోరుజోరుగా ప్రగతిపథాన పురోగమించే ప్రజాస్వామికయుగాన,—చక్రవర్తుల సాన్నిధ్యంలో అందలాలెక్కిన పద్య సాహిత్యానికి భరతవాక్యం పాడుతూ 'వచనరచన'కు నాందీ ప్రస్తావనలుచేసిన సంస్కారిక ధౌరేయులు శ్రీ కందుకూరి, శ్రీ చిలకమర్తి వారలకు సాష్టాంగములు—

క్రొత్తకి భయపడుతూ పాతలోని కీడును విడలలేక సత మతమయ్యే ఆంధ్ర జాతికి వినూత్న వంద్య రచనను అపూర్వ ప్రయత్నాలతో వినిర్మించిన మా ఆంధ్ర 'సాక్షి' 'శ్రీ పానుగంటి'కి జోహార్లు.

పురాతనాన్ని విస్మరించి అధునాతనాన్ని పరిగ్రహించలేని స్థితిగతులలో "చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర" అని ఎలుగెత్తిచాటిన ఆ ఆచార్య రాయ ప్రోలుకు హస్తాంజలులు—

మానవ మనోవైజ్ఞానిక సమగ్ర పరిశోధనా పటిమతో నూతన విధానాలలో వినూత్న రీతులలో క్రొంగ్రొత్త దారులలో నవలా సారసత్వాని 'కదం' త్రొక్కించిన 'కవి సమ్రాట్'కు నమస్సులు—

## వైతాళికులు

కవిత్వాన్ని కళామయం, కళను కవిత్వ మయం చేసి; రెంటికీ అవినాభావ సంబంధాన్ని ఆత్మానుసంధానాన్నీ కూర్చి పేర్చిన కళాతపస్వి, కులపతి శ్రీ అడివికి నమో వాకములు—

సజీవభాషతో జనతా సాహిత్యంతో అపూర్వ భావాలతో తెలుగువాణికి పసిడి మెఱుగులు కరిగిపోసి, వాణి వాకిట రంగవల్లులు దిద్దితీర్చిన ఖండకావ్య కవితావిహారులు, రసోపాసకులు శ్రీ కరుణశ్రీ, జాషువా ప్రభృతులకు సౌహార్దిక శుభాభివాదములు—

గేయ కవితా సోదర సోదరీతిలకములకు సౌహార్దిక శుభాకాంక్షా సమ్మిళిత కరస్పర్శలు—

[సూచన:—ఆశతో, అభిలాషతో, అభిమానంతో, ఆవేశంతో, ఆవేదన పడుతూన్న నాకు కన్నులు తెరచి మన్ను మిన్నుల తెన్నులు జూపిన గురుదేవులు పూజ్యశ్రీ వెంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారిని, శ్రీ నందూరి రామకృష్ణమాచార్యుల వారి, ఆశీస్సుల నర్థిస్తూ మస్తకన్యస్త హస్తుడ—]

— నమస్తే —



# నేటి భారతస్త్రీ కర్తవ్యము

సంఘంలో ఇప్పుడిప్పుడు స్త్రీకూడా ఒక వ్యక్తివలె పరిగణింప బడుచున్నది. పురాణ భారతస్త్రీ ఎంతవున్న తేదశలో తన జీవిత కుసుమాన్ని వాడనీయకుండా, తన పరిమళంవల్ల కుటుంబాన్ని, లోకాన్ని ఆనందింపచేసి, అపూర్వానందభూతిని పొందిందో, యీనాడు సంఘంలో అంత దురపిల్లుచున్నది. ఆమెకూడా ఒక వ్యక్తిత్వం అంటూ వున్నదే! అజ్ఞానంవల్లను, పెద్దల స్వార్ధ పరత్వం వల్లనూ ఒక యంత్రంగా మారిపోయింది. కాని ఒక్కసారిగా జపాను, జర్మనీ మొదలైన దేశాలవలె విజృంభించి, నీతిని కోల్పోయి కొంతవరకు పనికిరాని ఆవేశాన్ని స్త్రీజాతి పొందిందనడంలో పొరపాటు లేదు. ఈ అనర్ధాలకు మూలకారణం చాలా వరకు పురుషుడు. తన స్వార్ధతకొరకు ముందులో ఏండ్ల తరబడి స్త్రీని అణచి వివేకశూన్యనుగా చేసేడు. ఓర్పుగల భారతస్త్రీ భరించింది. చివరకు విసిగి ఒక్కసారిగా వుద్రిక్తురాలయింది. ఆ వుద్రేకంలో వివేక శూన్యయై కర్తవ్య శూన్యయై, ప్రవర్తించుటవల్ల, స్టేజిమీద అనవసరపు వుపన్యాసాలు, భర్తృ తిరస్కారాలు, విపరీత సమస్యలు పాశ్చాత్యదేశపు దురలవాట్లు, మొదలైన అనర్ధకాలు సంభవించినై [సోదరీమణులు క్షమింతురుగాక].

కాని ఆమె ఆదర్శం న్యాయమయింది. న్యాయమైన హక్కుకొరకు చేయవల్సిన క్రియ సక్రమంగా నెరవేర్పలేక పోయింది. దానికెంతో సూక్ష్మజ్ఞానం అవసరం. ఆదర్శం ఎంత వున్నతమైన దయినా, దానిని సాధించేమార్గాలు తెలియకే అనేక సంస్థలు, అనేక వుత్కృష్ట సిద్ధాంతాలు నశించినవి. నేడు స్త్రీ తన న్యాయమైన హక్కుకొరకు స్వేచ్ఛా జీవితం కొరకు, ఏనాడో మూలనుండిపోయి జ్ఞానరశ్మితగలకుండా మురిగిపోయిన దానినుండి విముక్తికొరకు చేయవల్సిన సాధనానికి ఎంతో సూక్ష్మజ్ఞానం కావాలి. అందువల్ల మహిళాలోకమంతా తగిన జ్ఞానం సంపాదించి, గృహ, సంఘజీవితాలలో, ఆనందమయంగా గడుపుటకు సరియైన మార్గం అనుసరించాలి. ఎంతసేపు హక్కులని, పురుషునితో సమాన పదవులని కోరుతూ, ఆవేశం చెందినందువల్ల లాభంలేదు. నా దేశం, నా విధి, నా సంఘం అని తలచి, వాటియొక్క భావి అభ్యుదయాన్ని ఆశించి, దానికి తగ్గ కృషిచేస్తేనే, తమతమ అధికార భాగ్యాల్నందుకొరకు వినియోగిస్తేనే దేశం బాగుపడుతుంది.

—యూన్సి లక్ష్మి.



చిత్ర సమీక్ష :

# భరణీవారి "లైలామజ్ను"

❋ జి. ప్రభ. ❋

49, వ సంవత్సరములో ఇంతవరకు విడుదలైన చిత్రాలలో చెప్పుకోదగ్గ చిత్రము భరణీవారి "లైలా మజ్ను". "లైలా మజ్ను" అరబ్బీ దేశానికి సంబంధించిన ప్రేమ గాథ. నిజామి కవిచే రచించబడ్డ విషాదాంతకథ.

ఇరువురు ప్రేమికులు- లైలా, ఖైస్ చిన్న నాటనుండి స్నేహంగా జీవిస్తూ, ఒక్క బడిలో చదువుకుంటూ తమ స్నేహలతను పెంపొందించు కుంటారు. పిదప ఆ స్నేహం ప్రేమగామారుతుంది, ఆ ప్రేమను సార్థకం చేసుకోవడానికి ప్రయత్నించి, వారు విఫల మనోరథులై, చివరికి ఈ ప్రపంచంలో తమ ప్రేమకు స్థిరమైన స్థానము సంపాదించుకోలేక, స్వర్గ సీమకు ప్రయాణమైరి. ఆ ప్రేమికుల మహత్తర ప్రేమ గాథ కథలో ముఖ్యమైన విషయం.

హిందీలో "లైలా మజ్ను"ను, నజీర్ దర్శకత్వము క్రింద తయారైన చిత్రాన్ని అనుసరించి దీనిని తీశారు. హిందీ చిత్రంలో ముఖ్యంగా చెప్పుకో దగ్గ విషయం, పాత్రలు, సెట్టింగులు, సంగీతము. వారు ఎంతో నేర్పుతో చక్కగా చిత్రాన్ని తీశారు. చిత్రంయొక్క ఘనత, పాత్రల నటనా చాతుర్యత, దర్శకుని గొప్ప "లైలా మజ్ను"ల జీవిత సమాప్తిలో హిందీ చిత్రంలో అత్యద్భుతంగా వుంది.

భరణీవారి 'లైలా మజ్ను'ను విమర్శనా దృష్టితో చూస్తే తన పాత్రను అర్థంచేసుకొని ఇంత వరకు నటించిన చిత్రాల్లో కంటే మజ్నుగా నటించిన నాగేశ్వర రావు చక్కగా నటించాడు. భానుమతి నటనలో చెప్పుకో తగ్గ ప్రత్యేకతలేదు. సి. యస్. ఆర్. షాజాడాగా బాగానటించ కలిగాడు. చిన్న లైలాగా నటించిన బేబీ కృష్ణవేణి ఎంతో నేర్పుతో చురుకుగా నటించింది. ప్రేమ ఘట్టాలలో ఆమె అంత చిన్నతనములో ఆ విధంగా నటించ కలిగిందంటే, చెప్పుకోదగ్గ విషయం.

ముఖ్యంగా చిత్రంలో మనకు కనుపించే లోపాలు చిన్న తనంలో లైలా ఖైస్‌లమధ్య ప్రౌఢ ప్రేమ చూపించటం. ఆ మాయకులగు బాల బాలికల హృదయాలో కామినీ కాముకుల ప్రేమ ఎట్లుండ గలదు? వారిరువురను ప్రేమికుల వలె నటింపజేయుట చాల అసహజము—

"లైలా మజ్ను"లు స్వప్నంలో ఆనందించిన సీనులో సెట్టింగు గొప్పగావుంది కాని దుస్తులతీరు, సంగీతము కేవలము పాశ్చాత్య అనుకరణగా తయారై చిత్రంలో స్వాభావికతను, కథకు తగిన నైసర్గికతను, అతిక్రమించుటచే, పేలవమై పోయినది. చివరికి లైలా మజ్నూలు ఎడారిలో కలసికొని మరణించిన సీను ఎంతో అద్భుతంగా తీయ వలసింది చప్పగా తయారైంది. నాగేశ్వరరావుకు నేపధ్య సంగీతంలో ఘంటసాల చక్కగా పాడాడు. ఆ కంఠంలో గంభీరత ఉంది. అయితే చిత్రంలో పాటలకంటే చెప్పుకో దగ్గవిలేవు.

ఫోటోగ్రాఫ్, సెట్టింగులు, సౌండు విషయములలో దర్శకుడు శ్రమపడ్డట్టే కనపడుతుంది. అయితే యిట్టి గాథలను వెండితెరపై చిత్రింప జూచుట ఒక విధమైన సాహసమేమో! అందునూ, యిదివరలో ఇంకొక భాషలో ఒకమారు తీయబడి, అది చాల పేరుకీర్తులు సంపాదించిన మీదట, దానినే యింకొక భాషలో తీసి పేరు బడయుట చాలా కష్ట సాధ్యమైనపని.

సతీహితసమితి శారదా గ్రంథాలయ నూతన గృహ ప్రవేశ మహోత్సవము, తాడేపల్లిగూడెం.

# 17వ వార్షికోత్సవము, శ్రీ గాంధీజీ జయంత్యుత్సవము

2—10—49వ తేదీన మధ్యాహ్నము 3 గంIIకు శారదా గ్రంథాలయ నూతన గృహప్రవేశ మహోత్సవము, శ్రీ గాంధీజీ జయంత్యుత్సవము, శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారి అధ్యక్షతక్రింద జయప్రదముగా జరిగినది.

పురవీధులలో అధ్యక్షురాలి వూరేగింపు నూతన గృహ ప్రవేశములు ముగిసిన తదుపరి పతాక వందనోత్సవము జరిగెను.

బాలికల ప్రార్థనానంతరము జాతీయ గీతములు పాడబడెను. తరువాత అధ్యక్షురాలిని పుష్ప మాలాలంకృతులను జేసి స్వాగత పత్ర మొసంగిరి. సమితి అధ్యక్షురాలు శ్రీమతి పట్టం రూపావతమ్మగారిచే స్వాగతోపన్యాస ఇవ్వబడెను. కార్యదర్శిని శ్రీమతి దామోజీపురపు లక్ష్మీనరసమ్మగారు సంవత్సర నివేదిక, సంఘ నియమావళి, దానపట్టా, సందేశములను చదివెను. సమితి శ్రేయోభిలాషులు, సంఘ సేవాపరాయణులు అగు శ్రీ డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు, సమితికే కాక గ్రామమునకు చేసిన అమూల్య సేవను కీర్తించుచు అభినందించిరి. పోడూరి మృత్యుంజయరావుగారు ఆంధ్ర దినపత్రికను, వెలగల ధనిరెడ్డిగారు కృష్ణా పత్రికను, పట్టం రూపావతమ్మగారు గృహలక్ష్మి, అచలబుషి వేమన, దివ్యజ్ఞాన దీపికలను ఉచితముగా నొసంగుచున్నందులకు అభినందించడమైనది.

తరువాత శ్రీమతి తేతలి సావిత్రమ్మగారు జమాఖర్చులను చదివిరి. స్వాతంత్ర్య ప్రదాతయైన పూజ్య బాపూజీయొక్క గుణగణములను కీర్తించుచు అధ్యక్షురాలు, కార్యదర్శిని ఉపన్యసించిరి. అధ్యక్షురాలు స్త్రీ సమాజములయొక్క ఆవస్యకత, గ్రంథాలయముల ఉపయోగము, ఆహార సమస్య మొదలగు వివిధ విషయములను గూర్చి గంభీరోపన్యాస మొసంగిరి.

తరువాత అల్పాహారవిందు జరిగెను. సభకు హాజరైన దేవులపల్లి సత్యవతమ్మగారుపన్యసించిరి. గృహప్రవేశోత్సవమునకు ఆహ్వానింపబడిన రామసుబ్బమ్మగారు వీలులేక రానందున, శ్రీ బాపూజీ జయంతుత్సవమునకు ఆహ్వానితులయిన సోదరి వేముగంటి పాపాయమ్మగారే పై కార్యక్రమములను జయప్రదముగా జరిపిరి. పురస్త్రీలు చాలామంది సభలో పాల్గొనిరి.

అధ్యక్షురాలి యంత్యోపన్యాసముతోను, కార్యదర్శిని వందన సమర్పణతోను, బాలికల "జనగణమన" గానముతోను సభ ముగిసెను.

దా. లక్ష్మీనరసమ్మ.



## మన సామెతలు

1. బాధకు ఒకకాలము, భాగ్యానికి ఒక కాలము.

2. మితము తప్పితే అమృతమయినను విషమే.

3. బావమరిది బ్రతుకుకోరును, దాయాది చావుకోరును.

4. మూర్తి కొంచమయినా కీర్తి విస్తారము.

5. లేవలేని అత్తకు ఓపలేని కోడలు.

6. మోసేవానికి తెలుసును కావటి బరువు.

7. లోన వికారము బయట శృంగారము.

8. విందైనా మందైనా మూడు పూటలు.

9. వండవే పెండ్లికూతురా అంటే కుండ తీసుకొని నీళ్లకు వెళ్లుతాను అన్నదట.

10. వేడినీళ్లకు ఓర్వనమ్మ సహగమునము చేస్తానన్నదట.

11. వ్యాధికి మందు వున్నదిగాని, విధికి మందు వున్నదా?

కూర్పు: శ్రీమతి మన్యం కామేశ్వరీదేవిగారు

# నవలలు-నాటకములు-కథలు

నవల అనిన ఒకని జీవితమును రసవంతముగా వర్ణించునది. నాటకమనిన ఒకని జీవితమును చమత్కారముగా చూపించునది. కథ అనిన ఒకని జీవితమునందలి రమ్యమైన ఒక ఘట్టమును విడమర్చి చెప్పునది. సరస్వతీ గ్రంథమండలివారి 45 నవలలు, 11 నాటకములు, 25 కథల పుస్తకములు ఇందుకు పేరుపడినవి.

## ఇవేకాక మా వద్ద ఇవిన్నీ ఉన్నవి

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి గ్రంథాలు, సంపూర్ణ భక్తవిజయము (65 గురు భక్తుల చరిత్రలు)
శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి గ్రంథాలు, వస్తుగుణ ప్రకాశిక (1168 పేజీలు)
శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వైద్యగ్రంథాలు, (524) త్యాగరాజు కీర్తనలు మూలం
శ్రీ పిఠాపురం యువరాజావారి గ్రంథాలు, భగవద్గీతాగర్భిత భావబోధిని (రాయల్ సైజు, 775 పేజీలు)
శ్రీ రాజయోగిగారి ఉపనిషత్సారం (సులభ వచనం) స్త్రీల పాటల పుస్తకాలు

ఎప్పటికప్పుడు క్రొత్తవి తయారవుతున్నవి * * ఇవి అన్ని బుక్కు డిపోలలోను దొరుకును.

## కోరువారికి కేటలాగు పంపెదము

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమండ్రి

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

**RITA**

**HAIR TONIC**



# గ్రంథసమీక్ష



## యోగసూత్ర సిద్ధాంతము

రచన ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు ప్రకాశకులు : మేనేజరు 'శిల్పి' 10 నరసింగపురం వీధి. మౌంటురోడ్డు, మద్రాసు. వెల రూ. 2—4—0 పుటలు 234 ; మొదటి కూర్పు (1948) ; శిల్పి గ్రంథ మాలికలో ద్వితీయ కుసుమము.

గ్రంథస్థ విషయము మహత్తరము ; శైలి సులలితము. ప్రవేశికలో శిల్పి సంపాదకులు శ్రీ గణపతి శాస్త్రిగారు, సాధారణముగ జనులు యోగశాస్త్రమంటే శరీరారోగ్యము నకు సంబంధించిన ఆసనాభ్యాసములు, ప్రాణాయామము లనని పొరబడుచున్నారనియు, కాని "షడ్దర్శనాలలో ముఖ్యమైన యీ యోగసూత్రము ఒక ప్రముఖతాత్విక గ్రంథమని ప్రాచ్య పాశ్చాత్యతాత్విక విజ్ఞానులంతా గౌర విస్తున్నా" రన్నారు.

యోగ సూత్రములలో యిమిడియున్న గొప్ప మానసిక శక్తుల తరచి యుద్ధరించి, తన్మూలముగ దుఃఖరహిత వున్నత స్థితినందుకొనుటయే యోగోద్దేశము. శ్రీ ప్రకాశం పంతులు గారు యిదివరకే భగవద్గీతాది గ్రంథాలకు వ్యాఖ్యలు రచించారు. ఈ యోగసూత్ర సిద్ధాంతంలో రచయిత పతం జలి యోగదర్శనములోని విషయముల జెప్పి, బౌద్ధ జైనాది ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంతములలో నున్న తాత్విక విష యాలు విపులీకరించి, యొండొంటి తారతమ్యముల విశదము జేసియున్నారు.

గ్రంథము నందలి ముఖ్య విషయములు ఆరు. అవి— యోగము, మనస్సు వ్యాపారములు, యోగ సూత్రములు, వల్లభాచార్య మతసిద్ధాంతము, బౌద్ధ సిద్ధాంతము, ఉపనిషత్తుల లోని సిద్ధాంతములు. వీనిని సంఖ్యా నామముల తోనారు ప్రకరణములుగ జెప్పిన బాగుండెడివి. ఒక్కొక్క విషయము హైందవ, పాశ్చాత్య, వేదాంత, మానసిక శాస్త్రజ్ఞుల రచ నల సామ్య, భేదముల దెల్పుచు చక్కగ రచితమైనది. యోగములలో భక్తియోగము శ్రేష్టమైనది. ఈ సందర్భమున అశ్వినీ కుమారుని భక్తియోగము స్మృతికివచ్చుచున్నది. గ్రంథాంతమున రచయిత బౌద్ధము ను హిందూ మతములో భాగముగ గ్రహించవలెననియు ; "యోగ సూత్ర సిద్ధాంతములు మిగిలిన సిద్ధాంతములతో పోల్చుచు సంగ్రహముగ వివరించినాము. ఈ వివరణమును బట్టి యిది యెట్టి యుత్కృష్టగ్రంథమో పాఠకులు తెలిసికొని వుందురు. జన సామాన్యము యోగసూత్ర రహస్యములు తెలిసికొనుటకు యోగ సూత్రము పఠించి చరితార్థులగుదురు గాక" యని హెచ్చరించారు.

గ్రంథముఖపత్రముపై శ్రీ పంతులుగారి వ్యంగ్య చిత్రము గలదు. రెండు పుష్పపత్ర చిత్రములతో శోభితమైన ఖద్దరు వస్త్రములతో చేయబడినది. ముద్రణము రమ్యముగనున్నది. రచయితలు, ప్రకాశకులు యిట్టి యుజ్వల గ్రంథరాజములను ఆంధ్రంలోకానికి అర్పిస్తారని ఆశించుచున్నాము.

—డాక్టరు వారణాశి యశోదాదేవి యం. ఏ. డి. లిట్.

* * *

## అహల్యా గౌతమము (పద్యకావ్యము)

కావ్యకర్త : బులుసు వెంకటేశ్వర్లు బి. ఏ. ప్రతులకు : కాకినాడ వెల రూ. 2—0—0 పేజీలు 126.

అహల్యా గౌతమము ఇది పద్యకావ్యము ఇందు వుత్తమ పతివ్రతలలో ఒక్కతెయై, ద్రౌపది, సీత, తార, మండోదరి, వీరితో గూడి పంచకన్యలలో ప్రథమ గణ్యయైన అహల్యా సాధ్వికిని బ్రహ్మర్షి శేఖరుడగు గౌతమమహర్షికిని నగ్ని సాక్షిగనైన వివాహాది వృత్తాంతము, వారి యాదర్శ సంసా రిక జీవనము, వారు లోకమున కొనర్చిన మహోపకృతులు వర్ణింపబడినవి. ఒకప్పుడు ప్రజలు క్షామంలో ఎచ్చట తిండి లేక బాధపడుచూ చివరకు అహల్యా గౌతముల వద్దకు వచ్చి వేడుకొనిన పిమ్మట అహల్య తన పాతివ్రత్యమహిమచే వారి నందరను ఆదరించి వారికి అన్నపానాదు లొసంగెను.

కవి మాటలలో—

సీ॥ కమనీయదళి కాక్రమపత్త్రింబుల
బూతజలంబుల చేతజల్లి
యాపిమ్మట బవిత్రమైన యాజ్యంబును
నమలినత్వార్థమై యభిఘరించి
షడ్రసోపేత భోజ్యంబు లొక్కొక్కటే
శరవేగమునను విస్తళ్లి బెట్టి
సమధురాహారాది శాల్యన్నములు బెట్టె
సమధికంబైన పచ్చళ్లనుంచి

గీ॥ పిండివంటలు మెండుగా, బెట్టెమరల
నభిఘరించి నివేదనమాచరింపు
డని యెలుంగెత్తి పేర్కొనెనా యహల్య
యొక్కతెయు గోటి యువతులయుద్ది వడసి.

అని అహల్యా సాధ్వియొక్క శక్తి సామర్థ్యాలను వర్ణించాడు. అచ్చు బాగుగనే వున్నది. కాగితములు కూడ బాగున్నవి. శైలి సులభముగ, మృదువుగనున్నది గనుక పిన్నలు పెద్దలు చదువుట కుపకరించును. —రా. లక్ష్మి.

## విప్లవ శ్రీ. (ఖండకావ్యము)

రచన :—కవిరావు, బాలకవి, ఇంకొల్లు వెంకటేశ్వర రావు. ప్రతులు :—ప్రజా సాహిత్య పరిషత్తు తెనాలి. ముద్రణాలయము :—నందాల ప్రెస్ తెనాలి. పేజీలు 51. మొదటి పద్యసంపుటి.

విప్లవ శ్రీ ఖండకావ్యము. దీనిని రచించిన వారు పది సంవత్సరముల బాలురు. ఇంత చిన్న వయస్సున యింత పాండితి యెటులబ్బెనో ఆశ్చర్యము. శైలి, ఎటులున్నను అతను రచించుట గొప్పమాట. అచ్చు తప్పులెక్కుడుగ నున్నవి. ఈ పద్యములు వేరువేరు సమయాల్లో వ్రాసినట్లు అగుపించుచున్నది. అందువలన భావములోనే గాక భావాల్లో కూడ ఒకదానికొకటి పొందలేదు. వ్రాసినదంతా స్వంతము కాక పోయిన యింత అల్పవయస్కులు కవులయారన్న మన ఆంధ్రమాత యెంత అదృష్టవంతురాలో మనమే గర్వపడాలి!

అదీగాక యింత అల్పవయస్సులో ఈ బాలకవి వేదాంతునివలె నున్నాడు. "కర్మభూమి, ఏల మతము, మేలుకో, హరి జనులు" అన్న శీర్షికలలో కవిరావు సాంఘిక ఆశయాలు వెలువడినవి. కర్మభూమి, ఏల, ప్రత్యేక స్థానాన్ని అలంకరించినవి. మార్క్స్ అనే శీర్షిక కవిరావు రాజకీయ ఆశయాల్ని బయలుపరుస్తున్నది. ఆంధ్రుడను శీర్షిక యీ కావ్యంలోకల్లా వుత్తమ రచన. పుస్తకంలోని సారాన్నే గాక, రచయితలోని నిగ్గును కూడా తేల్చి వడకట్టి చూపుతుంది. పుస్తకానికి ఈ శీర్షికయే వెల తెచ్చినది. ఇటువంటి బాలకవులు భారతదేశములో వృద్ధికావాలని మా ఆశయం. —రా. లక్ష్మి.

## ప్రార్థన

కవయిత్రి : స్థానాపతి రుక్మిణమ్మ. ప్రతులకు స్థానాపతి రుక్మిణమ్మ విశాఖపట్టణం.

జీవితంలో మానవుడు తన కష్టసుఖాలను దైవానికి విజ్ఞప్తిచేసుకోవాలంటే ముఖ్యమైన సాధనం ప్రార్థన. వారిరువురికి మధ్య సంబంధబాంధవ్యాలను కలిగించేదే ప్రార్థన. ప్రార్థనవలన మనస్సుకు శాంతి, తృప్తి, ఆనందము కలుగుతవి. ప్రతి జీవి తను దైవాన్ని స్మరించి ప్రార్థన చేసి తన భాధలను మరువ కలుగుతాడు. ప్రార్థన వలన అత్యుత్తమమైన శక్తిని పొందగలడు.

ప్రార్థన విషయమై అనేకవిధాలను అనుసరించవచ్చును. మన హింధూ ధర్మశాస్త్ర ప్రకారం మన సాంప్రదాయమునకు అనుకూలంగా శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు ప్రార్థన అనే చిన్న పుస్తకాన్ని ప్రచురించారు.

ప్రథమంలో 'దేవుడు ఒక్కడే' అనే సిద్ధాంతముతో ప్రారంభించారు. ప్రార్థనలో ఉపనిషత్తులలోని సంస్కృతశ్లోకాలకు అర్థంతో ప్రచురింపబడింది. ఈ ప్రార్థనలో ముఖ్యముగా ప్రతివారు గమనించవలసినవి, ఎన్నో చక్కని వుద్దేశములు కలవు. మానవుడు తన్ను తానుముందు గుర్తించుకొని తనజీవితములో తనకు ప్రాధాన్యత యిచ్చిన దైవాన్ని వుద్దేశించి తన జీవితంలో తన ధర్మములను నెరవేర్చు కొనుటకై

# గ్రంథ సమీక్ష

దైవాన్ని తనకు శక్తిని, బుద్ధిని, ప్రసాదించమని ప్రార్థించుట.

పరమేశ్వర ప్రార్థన ప్రతివారు సులువైనమార్గమున చేసికొనుటకు ఈ 'ప్రార్థన' పుస్తకము ఎంతో అనుకూలముగా వున్నది. ప్రతి శ్లోకములోను, దైవాన్ని వుద్దేశించి మానవుడు, తన బలహీనతను తొలగించి, సమర్థత నిచ్చి తన్ను చక్కని మార్గములో పెట్టుమని ప్రార్థించుటయే. శ్రీ స్థానాపతి రుక్మిణమ్మగారు శ్రమపడి భాష్య గ్రంథాల తోడ్పాటుతో ప్రార్థన పుస్తకాన్ని పూర్తిచేశామని వారు ప్రవేశికలో వ్రాశారు. వచనంలో ఎంతో చక్కగా వ్రాసినందుకు వారు అభినందనీయులు. —జి. ప్రభ.

## ఆంధ్ర జ్యోతి

దీపావళి ప్రత్యేక సంచిక. వెల యెనిమిదణాలు. పేజీలు 120.

ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక మా కార్యాలయానికి చేరింది. ముఖచిత్రం దీపావళి పండుగ, పిన్నలు పెద్దలు, పురుషులు, స్త్రీలు టపాకాయలు కాల్చుట, ముత్తైదువలు కోవెలకు వెళ్లుచున్నట్లు, టపాకాయలు కొనేవారు కొనే సందడిలో, అమ్మేవారు అమ్మే సందడిలో, పంచరంగుల చిత్రాలతో వెలువడింది. ఈ సంచిక చక్కని కథలతోను, ఎక్కువ నాటికలతోను ఒకటి రెండు రాజకీయ వ్యాసములతోను, వెనుక లోపల సినీమా ప్రకటనలతోను, మహాబలిపుర దేవాలయ, కంచి కైలాసనాథ దేవాలయ శిల్ప చిత్తరువుతోను, భావపరిచయ పోటీలు, స్త్రీలను పురుషులను వెక్కిరించు బొమ్మలతోను వెలువడింది.

ఇందు పురుషులేగాక స్త్రీలుకూడ రచించిరి. ముఖ్యముగ శ్రీమతి మాలతీచందూర్ వ్రాసిన "లగ్న బలిమి", మునిమాణిక్యం నరసింహారావుగారి "జానకి విలాసము" బైరాగి వ్రాసిన "పలాయన గీతం" సోమంచి యజ్ఞన్నగారి, రాజకీయ వుపన్యాస నాటిక "యమునా తీరే ఎవరికి వారే" పన్యాల రంగనాథరావుగారి నాటికి "పరిష్కారం" పాలంకి వెంకట రామచంద్ర మూర్తిగారి "అసూయ" మొదలగునవి బాగున్నవి. రాజకీయ, సాంఘిక రచనలు, స్త్రీల సమస్యల మీద రచనలు తక్కువ. ఇది ఒక లోటునక తప్పదు. —రా. లక్ష్మి.

## కలై మగళ్ (దీపావళి ప్రత్యేక సంచిక)

సంపాదకులు శ్రీ ఎన్. రామరత్నం, ఎం. ఏ., బి. ఎల్. 55/56 ముండకన్నియమ్మన్ కోవిల్‌వీధి మైలాపూరు మదరాసు. ప్రచురణాలయము : మదరాసు లాజర్నల్ ప్రెస్.

మాకు "కలై మగల్" అక్టోబరు దీపావళి సంచిక చేరినది. ఈ దీపావళి సంచిక ఆకర్షణీయమైన త్రివర్ణ చిత్రములతోను, సుప్రసిద్ధ తమిళ ఆస్థానకవులు, గౌరవనీయులగు మంత్రులు, యిద్దరు ముగ్గురు స్త్రీ రచయితలు ఇంకా తదితర రచయితల, వ్యాసములు, రచనలతోను వెలువడినది. ఇందు యింపైన కథలు, అనువాదము, సాహిత్యము, సీరియల్ నవల, జీవితకథలు మున్నగునవి కలవు.

ఇందు సర్. సి. పి. రామస్వామి అయ్యర్ గారి "తాయి-మానవర్" అను వ్యాసము, డాక్టర్ రాజన్ గారి "వాళై యడి వాళై" అను వ్యాసము, ఆస్థాన కవి వి రామలింగ పిళ్లైగారి "కట్రదుకై మన్నశివు", దీపాల వరస (చిత్రములు) మున్నగునవి మెచ్చుకోదగినవి. ఇందులో స్త్రీ రచయితలు వ్రాసిన కథలేగాని "స్త్రీల" సమస్యలను గూర్చినవి, స్త్రీ విజ్ఞానమునకు సంబంధించినవిసైన వ్యాసములు లేవు.

"కలై మగళ్" స్త్రీలయొక్క సమస్యలను గురించి చక్కని వ్యాసములు రచయితలచే వ్రాయించి స్త్రీలకు ప్రాముఖ్యత ఇచ్చినచో బాగుండును. —వై. పద్మ.





## లక్ష్మలమ్మ టెక్నికల్ ఇన్స్టిట్యూట్

టైపు, షార్టుహాండు తరగతులు, ప్రతిదినము

10 గం॥ నుండి 6 గం॥ వరకు

జరుగుచున్నవి.

నవంబరునుండి తిరిగి, ఏప్రిల్ పరీక్షలకు శిక్షణ ప్రారంభమగును.

జేరగోరువారు వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను.

మాస రుసుము :- టైపు ... 3-0-0 షార్టుహాండ్ ... 3-0-0

కరెస్పాండెంట్,
లక్ష్మలమ్మ టెక్నికల్ ఇన్స్టిట్యూట్,
ఆంధ్రమహిళాసభ.

## స్త్రీ సేవా మందిరము.

[ బాలోద్యానవనము ]

మైలాపూరు - మదరాసు.

ఇందు స్త్రీలకు, దుస్తులపై రంగుఅద్దకపు పనిలో తరిఫీదు యియ్యబడును. శిక్షణ రుసుము లేదు.

చీరెలు, పావడగుడ్డలు, జాకీట్లకు చీంట్లు మున్నగునవి, అనేకమాదిర్లలో తయారగుచున్నవి. అద్దకపు ధరలు సరసమైనవి.

ఒకసారి - మధ్యాహ్నము 3 గం॥ - 5 గం॥ లోగా వచ్చి చూడండి - మీ ఆర్డరులిచట ఇచ్చి, బీదవారికై ఏర్పడ్డ యీసంస్థను పోషించండి.

నిర్వాహకులు.

# ఆంధ్రమహిళాసభ

## స్త్రీ, శిశువులకు, రోగిసంరక్షణశాల, ఉచితవైద్యశాల.

అడయారులో, రాష్ట్రప్రభుత్వమువారిచ్చిన స్థలములో, ఆంధ్రమహిళాసభవారు, స్త్రీ శిశువులకు రోగిసంరక్షణశాల, ఉచితవైద్యశాల నిర్మింప నుద్యమించిరి. స్థలములో నిర్మాణము కొద్దిగా ప్రారంభమైనది. డిసెంబరునాటికి, శంఖుస్థాపన జరుగవలెనను సంకల్పము. కొంతమంది సోదరీమణులు ధనవిరాళము లిచ్చి ముందంజ వేసిరి. తదితరులుకూడ, తమకు తోచిన విరాళము లొసగి యీ నిర్మాణమునందు ఇతోధిక సేవ జేయవలెననియు, ఇది యొక పుణ్యకార్యముగా తలంచవలెననియు మనవిచేయుచున్నాము.

మీమీ యత్నము సార్థకమగుట కిది యొక మార్గము సుమండీ!

— దుర్గాబాయి.

# తుపాను బాధితుల నిధి

## ఆంధ్రమహిళా సభ

నవంబరు 10-వ తేదీ నుండి, ఆంధ్రమహిళా సభ వారము, ఆంధ్రదేశములో తుపాను బాధితుల సహాయార్థము విరాళములను, వస్త్రములను వసూలు చేయుచున్నాము. సహృదయులు తమంతట తామే తమ ధనవిరాళములను, వస్త్రములను మా కందజేసిరి. ఇప్పటి వరకును వసూలైన మొత్తము రమారమి రూ. 10000/-లు అని చెప్పవచ్చు.

వస్త్రములన్నియు సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీకి, ధన విరాళములన్నియు గవర్నరు తుపానునిధికి అందజేయబడును. డిసెంబరు 10-వ తేదీ నాటికి పూర్తి వివరముల పట్టీ తయారుచేయబడి, దాతలందఱకూ అందజేయబడును.

ఈ వసూళ్లలో సహాయపడినవారు శ్రీమతి అమ్మన్న రాజాగారు, శ్రీమతి గౌరి సుబ్బయ్య నాయుడుగారు, శ్రీమతి మంత్రిప్రగడ రంగనాయకమ్మగారు, శ్రీమతి మ. శాంత గారు, శ్రీమతి టి. విమలగారు, శ్రీ పద్మనాభ రావుగారు, శ్రీ మోరీస్వర్ గారు, ఆంధ్రమహిళా సభ విద్యార్థినీ బృందము.

తాము విరాళములను ప్రోగుజేసి మానిధికి అందజేసిన సంస్థలు:—

అఖిల భారత మహిళా సంఘం మదరాసు శాఖ. ఇంజనియరింగ్ కాలేజీ తెలుగు విద్యార్థి బృందం, మదరాసు న్యాయవాదుల సంఘం, బాలోద్యానవనం, హిందీ ప్రచార సభ, సుభోదయా ప్రెస్, ఆంధ్రా బ్యాంక్, రేడియో అండ్ ఎలెక్ట్రికల్సు, ఆంధ్రప్రభ సబ్స్క్రిప్షన్ శాఖ.

వీరందఱకూ మా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

అ. చన్న ఘంటమ్మ, ఙ. జమునాబాయి.



ఆంధ్రమహిళాసభలో ప్రధాని కుమారస్వామి రాజాగారికి అల్పాహారవిందు.








*SOLE DISTRIBUTORS,*

**THE VAUHINI PICTURES LTD.,**

MADRAS, VIJAYAWADA, TADPATRI.

*For Nizam State*: RAJSHRI PICTURES LTD., SECUNDERABAD.

*For Mysore State*: TALLAM PICTURES CIRCUIT, BANGALORE CITY.

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: డిసెంబరు '49 :: సంచిక 8

ముఖచిత్రం :: ప్రధాని నెహ్రూ.




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,

సహాసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.



ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 6 డిసెంబరు 1949 సంచిక 8

# తుపాను

ఆక్టోబరు ఆఖరులో ఆంధ్ర రాష్ట్రములోని ఆరు జిల్లాలు, ప్రళయ భీభత్సానికి గురియయ్యాయి. ప్రచండ వాయువు, కుంభ వృష్టి, సముద్రపు పొంగు, ఒకేమారు సమాలోచించుకొని, బంగారు పంటను నీట ముంచినవి; పండ్ల తోటలను ధ్వంసము చేసినవి; లక్షలాది ఇండ్లను నేల ద్రోసినవి; వేనవేల పశువులను, వందలాది ప్రజలను పొట్ట పెట్టుకున్నవి. కలియుగాంత మిదికాదుగదా యనే ప్రళయ స్ఫురణ నొకమారు ప్రజా హృదయంలో స్పందింపజేసినవి. భయంకర శాపానుభవమో! ఘోర పాప ప్రక్షాళనమో! ఏమో! విధి నిర్ణయము. లేకున్న— ఇంకనూ ఒక నెలయైన పూర్తిగ నిండనేలేదు, ఆంధ్ర ప్రజ వరదలచే బాధపడి. ఇంకనూ తెగిన గట్లు కట్టలేదు—పడిన గుడిసెలు లేవలేదు—ఇంతలోనే ఇంత విపరీత సంఘటనమా!

రాకపోకలకు, తంతి తపాలాలకు కలిగిన యాటంకముల చేతనేమి, సర్వసామాన్యంగా ఆంధ్రులన్నా, ఆంధ్ర సమస్యలన్నా, ప్రభుత్వము చూపుచున్న చిన్న చూపుచేతనేమి, పీడితులకు తక్షణ సహాయము జరుగవలసినంత జరుగక పోవుటయేగాక, మదరాసు గవర్నరుగారు మినహా, ఉపశమన వాక్కులు పలికిన నాయకుడే లేకపోయె—అగ్రనాయకులందరూ, రాష్ట్రపతిగారితోసహా, గాఢసుషుప్తిలో, యోగనిద్రలో, నున్నట్లు కొంతకాలమువరకు, భారత దేశములోని ఒక భాగపు ప్రజలకు తీరని కష్టము వాటిల్లినదనే చింతనే తమ మనసున పెట్టరాయిరి. ఎవరి కాలిలో ముల్లు విరిగినా తామే బాధపడుచూ, ఎవరి యిక్కట్టునైనా తమదేనని భావిస్తూ, ఇతః పూర్వము లెక్కలేనన్ని ప్రజాహిత కార్యములలో ముందంజవేసి కృషిచేసిన ఆంధ్ర ప్రజ తమ ఆపత్కాలములో ఇతరులు చూపిన ఉపేక్షకు మిక్కిలి నొచ్చుకొనుట అతిసహజమే.

అమెరికానుండి భారత ప్రధాని స్వదేశానికి వచ్చి రావటంతోనే, తన హెచ్చరికచే ఆంధ్ర ప్రజా హృదయాలలో ఆశను తిరిగి రేకెత్తించాడు. నాయకులు కొద్దిగా నిద్రమేల్కొ-

న్నారు. ప్రధాని, రాజాజీల విరాళములను, రాష్ట్రపతిగారి హెచ్చరికను, ఆంధ్ర ప్రజ కృతజ్ఞతతో స్వీకరించారు. సుహృద్భావము ఇంకా పూర్తిగా ప్రజా హృదయాల్లోంచి నిర్గమించలేదని తృప్తినొందారు.

తుపానువలన కలిగిన నష్టములను వివరించుట చర్విత చర్వణమే యగును. నవంబరు 25-వ తేదీని జరిగిన మదరాసు షెరిఫ్ మీటింగులో, ఇప్పటివరకు లెక్కకందిన నష్టము రమారమి 30 కోట్ల రూపాయలని గౌ. సీతారామ రెడ్డిగారు సెలవిచ్చారు. అయితే ఈ అంచనాల కన్న అతిముఖ్యమైనది, ప్రజలు, ప్రభుత్వము, సేవాసంస్థలు, స్థానిక పాలక, ప్రజా సంస్థలు, అంతా ఏకీభవించి, తక్షణము జరుగవలసిన కార్యక్రమాన్నాలోచించి, ఏకదీక్షతో కార్యరంగములో ప్రవేసించాలి. ఆలసించిన, ఇంకనూ విపరీత నష్టము సంభవించుట తథ్యము.

అన్నపూర్ణ భిక్షాపాత్ర చేబట్టినది. ఆహార పదార్థములు దొరికక బీద ప్రజ ఆకలిమంటల కాహుతియగు చున్నారు. నిలువ నీడలేక, కట్ట గుడ్డలేక, ఎండ వానలలో, శీతకాలపు దారుణమైన చలిగాడ్పులో, స్త్రీలు, శిశువులు, వృద్ధులు, బాధపడుచున్నారు. మురుగుడు, తేమలవల్ల, అంటువ్యాధులు ఇట్టే పుట్టి అట్టే వ్యాపించి, ఎందఱినో బలిగొంటాయి. పరిసరములను శుభ్రపరచాలి. పడిన యిండ్లు తిరిగికట్టాలి. ఆహార పదార్థములు, అవసర వస్తువులు, మందులు, వైద్య సహాయము బీద ప్రజలకు సత్వరముగా అందేపైన మాలోచించాలి. అసాధారణమైన పునర్నిర్మాణ కార్యక్రమ బాధ్యత ప్రభుత్వముపైన, ప్రజలపైన గూడ నున్నది. అందఱూ ఏక మనస్సుతో, స్వాపేక్ష రహితమైన సేవకు పూనిననాడుగాని, యీ నిర్మాణ మసంభవమగును.

సేవా రూపంగా, ధనవస్తు విరాళరూపంగా, యీ పీడిత ప్రజను, తక్షణము సహాకరించ వలసినదిగా ప్రభుత్వమునకు, సహృదయులకు, మనవిచేస్తూ వివిధ కష్ట నష్టములపాలైన సోదర సోదరీ బృందమును, ధైర్య సాహసములతోను, ఓర్పుతోను, యీ యిక్కట్టు నెదుర్కొనమని హెచ్చరిస్తున్నాము. వారి యీ కష్టసమయములో మా హృదయ పూర్వక సానుభూతిని వెలిబుచ్చుచూ, సత్వర పునర్నిర్మాణ లబ్ధికి భగవంతుని ప్రార్థిస్తున్నాము.



శ్రీ వేపా రామేశంగారి సతీమణియు, ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ సభ్యురాలును అగు శ్రీమతి వేపా లక్ష్మీ నరసమ్మగారు, అక్టోబరు 31-వ తేదీని దివంగతులైరని ప్రకటించుటకు చింతిల్లుచున్నాము. వారి ఆత్మకు పరిపూర్ణ శాంతిని ప్రసాదించమని భగవంతుని వేడుతూ, వారి కుటుంబమునకు మా హృదయపూర్వక సానుభూతిని అందజేయుచున్నాము.

స.॥



# యుగపురుషుని ఉత్తమ జీవిత గ్రంథంలో అరవై పుటలు

జననం—నవంబరు 14, 1889—అలహాబాదులో, సుప్రసిద్ధ నెహ్రూ కుటుంబములో—తండ్రి మోతీలాల్, తల్లి స్వరూపరాణి. ఆ గర్భ శ్రీమంతుడు—పాశ్చాత్య ఉన్నత విద్యా కౌశలుడు—తండ్రితో న్యాయవాది వృత్తి—కమలతో వివాహము—ఇందిరాకుమారి జననం—ఇది ఒకదశ.

*　　*　　*

గాంధీజీ స్వాతంత్ర్యోద్యమ మీాతని హృదయాన్నాకర్షించిది. ఆయన ఉపదేశ వాక్కులీయన చెవులకు సోకనవి. న్యాయవాది రాజకీయవాదియైనాడు. ముఖమలు దుస్తులను పీకి, ముతక ఖద్దరును—ఆనంద భవనాన్ని వీడి కారాగారాన్ని వరించాడు. అది మొదలు స్వరాజ్య అన్వేషణలో కారా గృహములు యాత్రాస్థానములైనవి. స్వీయచరిత్ర, డిస్కవరీ ఆఫ్ ఇండియా, కారాగారములలో రచించినవే.

*　　*　　*

తండ్రి మోతీలాల్ దే అదృష్టమంటే—తన తోసమ ఉజ్జీనాయకుడయ్యాడు పుత్రుడు జవహర్‌లాల్. అఖిల భారత జాతీయ కాంగ్రెస్ కార్యదర్శిగా పెక్కు వర్షములు పని చేసి, 1929లో రాష్ట్రపతియయ్యెను. సంపూర్ణ స్వరాజ్యమే యీాతని లక్ష్యము. మహాత్ముని శాంతి సమరములో నిలచిపోరిన వీర యువక యోధుడీతడు. సహాయ నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహ శాసనోల్లంఘన ఉద్యమములతో, ఆంగ్లపాలకులను అలజడి పెట్టాడు.—ఆనాటి యువక సముదాయానికొక దివ్యమైన ఆదర్శము.

*　　*　　*

ఈ సమరంలో నితాంత పోరాట మొకప్రక్క—ఇంకోప్రక్క వరుసగా మోతీలాల్, స్వరూపరాణి, కమలా నెహ్రూల నిర్యాణము. దెబ్బపై దెబ్బ—కాని, దేశముయొక్క ఆర్తిలో, తన దుఃఖాన్ని దిగమ్రింగాడు. తీసిపోని కార్య దీక్షతో, సాటిలేని కార్య దక్షతతో సమరాన్ని సాగించాడు. 1942—క్విట్ ఇండియా ఉద్యమంతో, తెల్లదొరలు వెళ్లిపోయారు.

*　　*　　*

1947, ఆగష్టు 15, స్వతంత్ర భారతికి నెహ్రూ ప్రధాని యయ్యాడు—గాంధీజీ సారధ్యంతో పరిపాలనా రథాన్ని నడపాలని ఆశించాడు. మతకలహాలు, రక్తపాతం, కాందిశీకులు హైదరాబాద్, కాశ్మీర్, ఒక్కమారుగా అన్నీ కల్లోలపరచే సమస్యలు—తుదకు బాపూ హత్య! స్వాతంత్ర్య సౌధమీా విషపు మంటల కాహుతి కాదుగదా! ధైర్యస్థైర్యములతో నెహ్రూ యీా మంటలను చల్లార్చాడు.

*　　*　　*

నెహ్రూలేని భారత దేశము తలలేని మొండెము. పరప్రభుత్వ రుగ్మతా పీడినచే దుర్బల

మైన దేశము స్వతంత్ర వాయువులు తాకిడికి తాళలేక ఊగిపోవుచున్నది. కేవలము నెహ్రూ యొక్క మనో నిబ్బరముచే ఇది యింత దనుక నిలచియున్నదనుట నిర్వివాదాంశము. అందుకే అతని నాయకత్వముపై ప్రజలకీ విశ్వాసము. ఈ సిథిల సౌధాన్ని పునర్నిర్మించు బాధ్యత, ఈ ఓటిపాత్రలో అమృతము నింపు బాధ్యత, ఈ నైకైకవ్యక్తి నెహ్రూదే.

* * *

ప్రపంచ ప్రముఖ రాజ్యాలన్నీ నవ్య భారతి నొకమారు క్రీగంట వీక్షించాయి—కల్లోలిత ప్రపంచంలో శాంతి స్థాపించగల వ్యక్తి గాంధీజీ వారసుడయిన నెహ్రూయే అన్నారు. విశ్వసౌధములో భారత భూమియేనట్లైల్లు—భారతనాయకుడు నెహ్రూయే దివ్య కాంతులనీనెడి దివిటీ. ఈతని అంతర్జాతీయ రాజనీతినే ఏక ప్రపంచ వ్యవస్థకు మార్గగామి కాగలదని, ప్రపంచనాయకుల దృఢ విశ్వాసము—ఇటీవల నెహ్రూ యొక్క పశ్చిమఖండ యాత్రలో యీ విశ్వాసమే ఋజువైనది.

* * *

ఈ అసమాన వ్యక్తి జీవిత గ్రంథములో 60 పుటల అపూర్వరచన అయినది. ఇంకా భావి రచన ఇంతకు మించిన కీర్తివంతము గావలెననియు, అందులకై భగవంతుడీతనికి పరిపూర్ణ ఆయురారోగ్య దీక్షా దక్షతలను ప్రసాదించవలెననియు, ఈ నాటి భారత జాతియేగాక, సర్వ ప్రపంచమూ, గతమును అభినందిస్తూ, భావిని ఆశిస్తూ, అతని షష్ఠి పూర్తి శుభ సమయంలో, జోహార్లు చేస్తూఉంది.





1948 జూలైలో నెహ్రూ ఆంధ్ర మహిళా సభకు విచ్చేసినప్పుడు.

# రాష్ట్రపతి - పట్టాభి



రాష్ట్రపతి పట్టాభి
ఆంధ్రులకు మిత్రులో-శత్రులో నిర్ణయించు బాధ్యత
ఆంధ్ర రాష్ట్ర భవిష్యత్ప్రజానీకముపై నున్నది.

ఇటీవలనే వీరి డెబ్బదియవ జన్మదినోత్సవము దేశమంతటా జరిగినది. ధీమంతులని, వక్తలని, రచయితలని, నాయకులని వీరికి పలువురు జోహార్లు చేశారు. పూర్ణాయురారోగ్యవంతులై, వీరు ఇంకనూ, చిరకాలము దేశసేవ యొనరించవలెనని మా 'ఆంధ్ర మహిళ', తద్వారత ప్రజతో పాటు ఆశిస్తూ ఉంది.

అయితే ఆంధ్రులలో వీరి నాయకత్వమును గూర్చిన భిన్నాభిప్రాయములు కలిగినవి. సత్వరాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు యీయనే కారకులని పలువురు అభినందిస్తున్నారు. చెన్నపట్నమును వదలుకొమ్మని సెలవిచ్చుటలో ఆంధ్రులకు తీరని యన్యాయము జరిగినదని మరికొందరు వీరిని నిందిస్తున్నారు. చెన్న నగరమును ఆంధ్రులు తాత్కాలిక రాజధానిగా కూడ వ్యవహరించకూడదని వీరు ఇటీవల చెప్పుటచే, పై పక్షము వారి నిందకు మరింత అవకాశము కలిగినది.

ఇటీవల తుపానుచే ఆంధ్ర దేశమంతా కనివిని యెరుగని నష్టానికి లోనైనది. అప్పుడు రాష్ట్రపతిగారు మదరాసులోనే ఉన్నారు. నష్టపడిన జిల్లాలను దర్శించి గగ్గోలు పడుచున్న ప్రజానీకానికి వీరు స్వయంగా సానుభూతిని తెలియజేసియుండకూడదా యనే సందేహము సామాన్యులలో కలుగుట సహజమే. ఆపత్కాలములో అక్కఱకురాని నాయకత్వము ప్రజా హృదయాల్లో జొచ్చుకొనిపోయి విశ్వాసాన్ని కలిగించ లేదు.

ధీమంతులైన వీరి యీ నడవడికకు మహత్తర కారణము లేవైన ఉండనోపు! ఇటు రాష్ట్ర వైఖరి, అటు తుపానుదెబ్బ—ఈ రెంటిచే ఆంధ్ర ప్రజా హృదయము కృంగి, కృశించి, నిస్పృహాయుతమై యుండుటచే వీరి కార్యక్రమములోని విశిష్టత గ్రహింపలేక పోవచ్చు. అందుచే వీరు ఆంధ్రులకు మిత్రులేనా అనే నిర్ణయము ఈ తరమువారు సమగ్రంగా చేయలేక పోవచ్చు. ఆంధ్ర రాష్ట్రపు భవిష్యత్పరిణామము, భవిష్యత్ప్రజానీకమే ఈ నిర్ణయమును చేయగల సమర్థులగుదురు!

★

# ఆంధ్రరాష్ట్రావతరణ

"సత్య"

ముప్పది ఆరేళ్ళనుండి ముక్కోటి ఆంధ్రులూ ఆశతో ఆవేదనతో ఆకాంక్షిస్తున్న ఆంధ్రరాష్ట్ర భవితవ్యం, నవంబరు 11 న విజయవాడలో సమావేశమయిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశము యొక్క తుది నిర్ణయముపై నాధారపడి ఉన్నది కనుకనే యావదాంధ్రులూ ఆతురతతో, ఆసక్తితో ఆ తుది నిర్ణయం కోసం వేచి యున్నారు. 11 సాయంత్రం రేడియో చూచాయగా తెల్పిన వార్తను మరునాటి దిన పత్రికలు ధృవపర్చాయి. చివరికి ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణానికి దోహదము కూర్చే విధంగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు వారు తీర్మానాన్ని చేశారు.

అందులో జె. వి. పి. రిపోర్టు నంగీకరిస్తూ వివాదరహితమైన 12 జిల్లాలు (1) చిత్తూరు (2) నెల్లూరు (3) కడప (4) కర్నూలు (5) అనంతపురము (6) బళ్ళారి (7) గుంటూరు (8) కృష్ణా (9) తూర్పు గోదావరి (10) పశ్చిమ గోదావరి (11) ఉత్తర విశాఖ (12) దక్షిణ విశాఖలతో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి సుముఖులమని చెప్తూ, మద్రాసును దానిపరిసర ద్విభాషా ప్రాంతముల తో కలిపి ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పాటు చేయబడుటకున్నూ, ఆంధ్ర తమిళ రాజధానులు నిర్ణయించుకొని నిర్మించుకొనే వరకు రెండు రాష్ట్రములకు మద్రాసే ఉమ్మడి రాజధానిగా ఉండుటకు తగిన ఏర్పాట్లు చేయుటకున్నూ, కేంద్రప్రభుత్వమునూ అ. భా. కాంగ్రెసు కార్యవర్గమునూ కోరుచున్నామనీ పేర్కొన బడినది. దీనితో ఉన్న ఒక్క ఆటంకమూ తొలగి "ఆంధ్ర రాష్ట్ర—అవతరణ"కు నాంది జరిగినది.

ఇక ప్రస్తావన—

చిరకాల వాంఛితమైన స్వరాజ్యమును సంపాదించియూ, ఆర్థిక, సాంఘిక దుస్థితులవల్ల నేడు దేశంలో అసంతృప్తి ఏ విధంగా వ్యాపించిందో, అదే విధంగా, నేడు రోషాలతో మీసాలు దువ్వుతూ బుజా లెగరవేస్తూ ఆంధ్ర రాష్ట్రాన్ని సంపాదించామనే ఆనందంలో భావి కర్తవ్యాన్ని స్మరిస్తే, ముప్పది ఆరేళ్ళ కృషి ముప్పునకే వచ్చిందని తరువాత విచారించ వలసి వస్తుంది.

ఆవేశపూరిత హృదయాల్ని త్యజించి, వివేకముతో విజ్ఞతతో విమర్శించి ఆంధ్రరాష్ట్ర సంపాదనలో విజయం సాధించి ఒకే మాటపై నిలిచి ఆంధ్ర గౌరవాన్ని సంఘీభావాన్ని ప్రదర్శించిన ఆంధ్ర మహా నాయకులకూ, "నా రాష్ట్రం వచ్చింద"ని అమందానంద కందళిత మందస్మిత స్మేరవదనులైన ఆంధ్ర సోదరులకు ఒక్క మనవి.

ఆంధ్ర రాష్ట్రావతరణ జరిగినది నేడు కాదు. నవంబరు 11 కానే కాదు. ఆవేదనతో ఆశామయ హృదయంతో, అశ్రుకణ పూరిత నేత్రాలతో ఆంధ్ర రాష్ట్రం గురించి పలవరించి కలవరించి అసువులు బాసిన "దేశ భక్తు"ని సంస్మ

గించి అతని జాడల్లో ఏనాడైతే నడుస్తామో ఆనాడు ఆంధ్ర రాష్ట్రావతరణ జరిగినట్టు— రాయలేలిన రత్నాలసీమ, నేటిరాతిసీమ రూపం నుంచీ రజితసీమ కాగలిగిననాడు - సాంబారుతో సాంబేరులైన ఆంధ్రులయొక్క మత్తు వదలి, ధైర్యోత్సాహాలతో ఉప్పొంగే ఆంధ్రయువరక్తం తాంద్ర పాపయ్య, బొబ్బిలి బెబ్బులను మరిపించ గలిగిన నాడు, తెనుగురైతు నాగలి యాలింగ నము నాశిస్తూ ఘోషిస్తూన్న గౌతమీ మాత ఘోష నడ్డకట్టి ఆంధ్ర మాత గర్భాన పసిడి పంటలు పండించిననాడు, రాయలుతో కూలి పోయిన ఆంధ్ర సాహితీ కల్పతరువు తిరిగి చిగిర్చి మొగ్గతొడిగి కవికోకిల కలకూజితమై విరాజిల్లిన నాడు—వ్యక్తిత్వము నశించి ఆవేదనతో సాం ఘిక పక్షపాతమునకాక్రోశిస్తూ వంటింట్లోమ్రగ్గే ఆంధ్రమహిళ చిరుహాసాలతో తన విజ్ఞాన దీప్తి కను మరొక్కమారు వెలిగించి ఆంధ్ర సామ్రా జ్యమును జ్యోతిర్మయము కావించిన నాడు— ప్రతి తెనుగు ఇంటా సర్వ సంపదలూ సమస్త కళలూ స్థాయినందుకొని తెనుగు హొయలు, తెనుగు హుందా, తెలుగుల పరాక్రమము, తెలుగు వారి విజ్ఞానము దశ దిశలా వ్యాపించి తిరిగి మరొక్క మారు "ఆంధ్రుడు" ఆంధ్రు నిగా జీవించిన నాడు—ఆ నాడు కాని ఆంధ్ర రాష్ట్రావతరణ, ఈనాడు కాదు! ఆంధ్ర శంఖా పూరించేది ఆ నాడుకాని ఈ నాడు కాదు!! తెనుగుల ఆడపడుచులు ఆంధ్ర వీరులకు హారతి పట్టేది నాడుగాని నేడుగాదు!!!



# అత్తగారు

స్త్రీలయొక్క శీల సౌజన్యాలకు సువర్ణవన్నె తెచ్చేదే అత్తగారు. ఇప్పటి రోజులలో అత్తగారంటే ఆడవాళ్లకు అసూయత ఎక్కువ. కాని తన శీల సౌజన్యాలకు ఆ దర్శి ప్రాయురాలై తోడ్పడేదే అత్తగారని గ్రహించలేరు. చిన్న పిల్లలు వచ్చీరాని నడకలో అనేక పర్యాయాలు ఫట్లీలు కొట్టి దెబ్బలు తింటూవుంటారు. ప్రక్కనుండి ఎవరైనా పడ్డావా నాయనా అంటే కుయ్యోమని ఏడుస్తారు. ఎవరూ చూడకుంటే లేచి ఆడుకుంటూరు. అటువంటిదే క్రొత్త కోడలి కాపురము కూడాను.

అత్తగారంటూ వుంటే నేకాని కోడలి యొక్క ఓర్మిని వెలి పరిచే వారెవరు? తనకు తాను చెప్పుకుంటే సరిపోతుందా? ఆడదానికి అత్తగారంటే అగ్నిహోత్ర పరీక్షలాటిది. అగ్ని పరీక్షకు ఆగకపోతే సీతాదేవిని పతివ్రతయని ఎవరు చెప్పుకుం టూరు? శ్రీరాముని హృదయములో శంకపోతుందా? అత్త గారంటే ఆలాటి అగ్నిహోత్రమనే అనుకోవాలి. కిరాతుని బారిలోనుండి కష్టములను సహించి, శీలతను కాపాడు కొనకపోతే, దమయంతిని పతివ్రతయని ఎవరు చెప్పుకుం టూరు? సక్కుబాయిని అత్తగారు సాధించకపోతే యీ నాడు సక్కుబాయి శ్లాఘనీయచరిత ఎక్కెనది?

అత్త కొయ్య కవ్వంలాంటిది, కోడలు కుండలో పెరుగు లాంటిది. కవ్వంతో పెరుగును తరుచుతే, శీల సౌజన్యమనే వెన్న మనకు లభిస్తుంది. మనము అత్తలమయ్యే వరకూ, మనకు అత్తవుంటేనే బాగుంటుంది.

—బదరీ నారాయణశెట్టి



# సర్దార్ పటేల్

శ్రీ పెద్దాడ రామకృష్ణమ్మ, బి.ఏ., బి.ఇడి.

సర్దార్ వల్లభాయ్ పటేలు భారతదేశ సంరక్షకులలో ఒక ముఖ్యుడు. ఇటీవలనే పటేలుకు అక్టోబరు 31తో 74ఏళ్లు నిండాయి. దేశ స్వాతంత్ర్యమును, జాతి నిర్మాణమును కట్టుదిట్టముగా గావించి తదితర మహా గొప్ప రాజకీయ వేత్తలయినటువంటి, బిస్మార్క్, లెనిన్ వారితో సమమయిన ప్రఖ్యాతిని గాంచెను. ఇట్లు పటేల్‌ని స్తుతించుట కొంతవరకు జనానీకానికి యిష్టము లేక పోవచ్చును. కాని పటేల్ కార్యశూరుడనీ ధృఢమైనటువంటి సంకల్పము కలవాడనీ అందరూ ఒప్పుకొందురు. ప్రప్రథమము నుండి యు గాంధీ మహాత్ముని శిష్య కోటిలో అగ్రస్థానము పొంది తాను మహాత్ముని వద్దనుండి గ్రహించి నటువంటి పద్ధతులచే, రాజకీయములందే గాక తదితర అన్ని విషయము లందూ కూడ మహానాయకుడై ప్రజ్వరిల్లు చున్నాడు. భారత దేశమందు కాంగ్రెసును ఒక దిట్టమైనటువంటి సంస్థగా నిర్మించి తన్మూలమున బ్రిటిష్ సామ్రాజ్యమును నాశము చేసినటువంటి వాడు పటేలే. తనయొక్క జీవితమునంతను ధారపోసి, భారత దేశానికి ఒక రాజకీయ స్వరూపమును తెచ్చినవాడు పటేలే. పటేల్‌యందు గొన్ని వర్ణనాతీతమైనటువంటి గుణములున్నవి. ముఖ్యముగా నిశ్చలత, విచక్షణాశక్తి, స్థిర సంకల్పం.

పటేలుయొక్క జీవితగాథను గురించి, కొంత తెలుసుకొనుట మన అందరి కర్తవ్యంకూడాను. కరంసద్ అనే గుజరాత్ గ్రామంలో 1875 లో అక్టోబర్ 31వ తేదీని జన్మించాడు. నదియాద్‌లో విద్య నభ్యసించి గోధ్రాలో కొంతకాలం న్యాయవాదిగా యుండెను. లండన్‌లో బార్ పరీక్షలో ప్రథమస్థాయిలో ఉత్తీర్ణుడయ్యెను



ఇతడు తన అన్నదమ్ములలో నాలుగవ వాడు. గాంధీ మహాత్ముని అహింసా ధర్మమును విని వల్లభాయ్ పటేల్ మొదట మొదట నవ్వేవాడట. కాని దైవ సంకల్పముచే అట్లు నవ్విన పటేలే గాంధీగారి శిష్యుడై కాంగ్రెస్ పార్టీ నిర్మాతలలో ఒకడై పరిపాలనా వ్యవహారముల

లోను, రాజనీతిజ్ఞతలోను కూడ మహత్తర శక్తిని నిరూపించుచున్నాడు.

భారత రాజకీయాలలో నెహ్రూతో సమముగా, పటేల్ కూడ అగ్రస్థానము పొందినాడు. స్వాతంత్ర్యం చేకూరిన రెండు సంవత్సరాలలోనూ, దేశంలో శాంతిని స్థాపించ గలిగాడు. పోలీసు శాఖలో గొప్ప గొప్ప సంస్కరణలు తెచ్చాడు. సంస్థానాల్ని రాజకీయంగా సమైక్య పరచి నిరంకుశ పాలనా విధానాన్ని తొలగించి అంతటా ప్రజాస్వామ్యం నెలకొల్పాడు. దేశ పరిపాలనా విధానంలో కూడా గొప్ప నైపుణ్యం, చమత్కృతి చూపించినాడు. ఎంతటి సమస్యలనైన అతడు క్షణంలో పరిష్కరించగలడు. ఉద్యోగుల్లోనూ, సహచరుల్లోనూ, భయ భక్తులు, ఆదరం గడించాడు. హైదరాబాద్ విషయంలో పటేల్ నిర్ణయంవల్ల విజయం లభించింది. 1948 సెప్టెంబరు 12-వ తేదీని అర్ధరాత్రివేళ పటేల్ వుత్తరువిచ్చాడు. కొన్ని కొన్ని సమయాల్లో శీఘ్ర నిర్ణయ్యం చాల అత్యవసరం. అప్పుడు నిర్ణయించు, నిర్ణయాలు ఒకడుగు అటు లేక ఒక అడుగు యిటు పడినా సర్వనాశనం తప్పదు. అప్పుడే నాయకుల బుద్ధిబలము పరీక్షింపబడును.

పార్లమెంటు వ్యవహారాల్లో పటేల్ మహా నిర్మొగమాటంగా వుంటాడు. ఆతని చర్చలలో గాని ఉపన్యాసలలోగాని అధికార ఠీవి అధికముగా కనిపించును. అతని ఉపన్యాసాలు, సంభాషణలు చాలమంది రేడియో ద్వారా వినుచునే యుందురు. అట్టి వారు యీ విషయమును గ్రహించ గలుగుదురు. సామాన్యంగా పటేల్‌ను అందరూ అనేక విధముల అర్థం చేసుకొందురు. దీనికి కారణం ఆతని కఠోరప్రకృతి. నిజానికి పటేల్ చాల దయార్ద్ర హృదయుడు. పైకి సంభాషణలు సింహ గర్జనలు లాగవున్నా, నవనీతమువంటి హృదయము గలదు.

గాంధీజీ అస్తమించుటచే భారత దేశమంతా అంధకారం వ్యాపించింది. కాని దేశమునకు పెట్టని కోటలువలె పటేల్, నెహ్రూ లిద్దరూ దేశాన్ని కాపాడుచున్నారు. ప్రకృతిచే నెహ్రూ, పటేలు లిద్దరూ వ్యతిరేకులైనప్పటికీ, గాంధీ మహాత్ముని బోధనలచే, మహాత్ముడు లేని కొరతను దేశానికి, ప్రజలకు తెలియకుండునట్లు చేయుచున్నారు. పటేల్ స్వయంగాఅన్నట్లు దేశంలో అధికార వ్యామోహం, అవినీతి, కుతంత్రాలు నిండి వున్నాయి. సత్యం, పాటించవలెననే వారేగాని పాటించేవారు చాల కొద్దిమందే యున్నారు. ప్రజల్లో హింసాప్రవృత్తి చెలరేగుతోంది. ఇటువంటి జాతిని ఉద్ధరించుట కొరకై పటేల్ కంకణము కట్టినాడు. బ్రిటిష్ రాజ్య పాలనక్రింద భారతదేశం అనేక చీలికలు క్రింద చీలిపోయింది. అటువంటి దేశమును ఒక్కటిగా చేసి ఏకదేశమును పటేల్ తన శక్తి సామర్థ్యములచే గావించెను. మరియు పటేల్ దేశైక్యత కొరకేగాక జాతినంతని ఏకము చేయుట కొరకు కూడ తన జీవితమును త్యాగము చేయుచున్నాడు. దేశాన్ని దుర్మార్గులనుండి కాపాడటానికి సర్దార్ పటేల్ ఇంకా అనేక సంవత్సరాలు ఆయురారోగ్యములతో వర్ధిల్లాలని యావద్భారత జాతీ ప్రార్థిస్తోంది.

★

# పిల్లల శిక్షణ - శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిశి సుభద్రమ్మ

ఈ విధంగా, బిడ్డ అభివృద్ధి క్రమంలో ఒక దశను గడిపి మరొక దశలో అడుగుపెట్టుటకు తల్లి విజ్ఞాన దృక్పథంతో, అత్యంత అనురాగంతో బిడ్డకు తోడ్పడాలి. కాని, బిడ్డను మందలించుట, కొట్టుట, తిట్టుట, భయపెట్టుట అనేవి ఎంతమాత్రం పనికిరావు. అవి బిడ్డయొక్క అభివృద్ధికి అపాయకరమైనవి అనికూడ గుర్తించాలి. అలాంటి వాతావరణంలో పెరిగే పిల్లల అభివృద్ధి కుంటుబడుటేగాక, వారి సంఘ జీవితంకూడ కుంటుబడుతుంది. అనురాగ ఆదరణలతో గూడిన వాతావరణంలో పెరిగే పిల్లలవలె వీరు స్వేచ్ఛగా, సంతోషంగా, తోటి పిల్లలతో కలిసి మెలిసి ఆడుకోలేరు. పైగా, వీరి మానసికాభివృద్ధి అరికట్టబడుతుంది. అంటే, వయస్సుకు తగిన తెలివి తేటలు వ్యక్తంకావు. తమకన్న ఎంతో తక్కువ వయస్సులోనున్న శిశువులలాగు ప్రవర్తిస్తారు. ఆకలిగొన్న బిడ్డ ఆహారంకోసం ఏడ్చి ఏడ్చి తుదకు నీరసపడిపోయినట్టే, తల్లి ప్రేమకోసం తహతహలాడిపోతూ మానసికంగాకూడా నీరసపడిపోతుంది. తత్ఫలితంగా, బిడ్డలో వయస్సుకు తగిన బుద్ధి వికాసం కలుగదు. వికాసానికి మారు, పెంకెతనం, కొంటె చేష్టలు పెరిగిపోతూ, చివరకు మూఢత్వం, మూర్ఖత్వం, పట్టుబడుతాయి. ఇంతేగాదు. భయం, కొట్లు, తిట్లుగల అనాగరిక వాతావరణంలో పెరిగే పిల్లలకు అనేక విధములైన మానసిక వ్యాధులు ఏర్పడుతవి అనే విషయాన్ని గుర్తుంచుకోవాలి.

కొంత సంస్కారంగల కుటుంబాల్లో బిడ్డలను కొట్టటం, తిట్టటం కొంత మానివేశారుగాని భయపెట్టటం మాత్రం ఇంకనూ పోలేదనే చెప్పవచ్చును. ఒకవేళ భయపెట్టటం మానివేసినా, తల్లిదండ్రులు తమ బిడ్డల ప్రవర్తనలను ఇతరుల ఎదుట, ఆక్షేపించటం, అపహాస్యం చేయటం, అగౌరవ పరచటం పోలేదు. బిడ్డలు అతిసూక్ష్మగ్రాహులు. వారి హృదయం అతి సున్నితంగా వుంటుంది. అలాంటి వారిని అతి క్రూరంగా ఆక్షేపించుటవల్ల, అపహాస్యం చేయుటవల్ల, అగౌరవ పరచుటవల్ల, బిడ్డలు చాల బాధ పడిపోతారు. అయితే, ఆదిలో వారు అంత బాధపడినా, క్రమేణ వీటికి గమనమివ్వటం మానివేస్తారు. ఇందువల్ల, వీరికి అనేక విధములైన మానసిక వ్యాధులు, దుర్గుణాలు పట్టుబడుతాయి. అంచేతనే తల్లి బిడ్డను ప్రేమతో పెంచటమేగాక, బిడ్డయందు గౌరవం కూడ చూబెట్టాలి. పెద్దలు చూబెట్టే గౌరవంవల్లనే పిల్లలలో ఆత్మగౌరవం అనేది ఏర్పడుతుంది. ఆత్మగౌరవం గల పిల్లలు అందరికీ గౌరవం చూబెట్టుదురు. సభ్యత అనేది నేర్చుకొంటారు.

తల్లి గమనించవలసినకొన్ని ముఖ్యవిషయాలు: కొరికే బిడ్డను గురించి కొంత ఆలోచిద్దాం.

సామాన్యంగా, బిడ్డలు తమ ప్రేమను ప్రదర్శించేటప్పుడుగాని, కోపాన్ని చూపేటప్పుడుగాని చటుక్కున కొరుకుట పరిపాటి. కాని, అంతమాత్రంచేత బిడ్డ చిలిపితనంవల్ల క్రూర స్వభావంవల్ల కొరుకుతుందని అనుకోటం చాల పొరబాటు. కొరకటం అనేది సామాన్యంగా బిడ్డలందరికీ పరిపాటే. నాలుగైదేళ్ల బాలుడుగాని, బాలికగాని కోపంచేత లేక, తమ ఇష్టానికి అడ్డుతగలటమో, కోరిక నెరవేరకపోవటమో సంభవించినప్పుడు కలిగే ఆశాభంగంచేత కొరుకుతుంటారు. కాని, పెరిగి పెద్దవారైన తరువాతకూడ వీళ్లకు కొరికే అలవాటు స్థిరంగా వుండి పోతుందని భయపడనవసరంలేదు. అయితే, నాలుగైదేళ్లు ఈడు వచ్చిన తరువాత కూడ బిడ్డలు తఱచుగా కొఱకటానికి కారణాలు తల్లి పరిశీలించుట అత్యవసరం. ఎందుకంటే, సామాన్యంగా బిడ్డయొక్క అభివృద్ధి క్రమంలో ఏదో లోటు ఏర్పడి వుంటుంది. ఆ లోటునుండి కాపాడుకోటానికి బిడ్డలు, సహజంగా ఈ విధమైన కోపోద్రేకాన్ని వెలిబుచ్చుతారు. తమ కోర్కెలు నెరవేరనప్పుడు, ఆశాభంగం కలిగినపుడు,

# పిల్లల శిక్షణ - శాస్త్రీయ దృక్పథం

ఎంతమాత్రం సహనమనేది బిడ్డకుండదు. ఈ విషయాన్ని తల్లి గుర్తించకుండ ఈ అలవాటును తప్పించటానికని బిడ్డను ఏవిధంగాకాని శిక్షించటం అనేది చాల పొరపాటు. అలా శిక్షించుటవలన, బిడ్డయొక్క అభివృద్ధి అరికట్టబడుతుంది. వయస్సుకు తగినట్టుగా మానసిక ప్రవృత్తులు, అభివృద్ధి చెందవు, బుద్ధి వికసించదు. అంటే, బిడ్డ శారీరకంగా పెరిగినను, మానసికంగా పెరగదు. శైశవావస్థలోని మానసిక ప్రవృత్తులే వ్యక్తమవుతుంటాయి. అయితే, కొరికే బిడ్డ వలన తక్కిన పిల్లలకు హాని సంభవించకుండ తల్లి జాగ్రత్త వహించాలి.

బిడ్డ తోటిపిల్లలతో పోట్లాడి కొరికేటప్పుడుగాని, మనల్నే కొరకటం సంభవించినపుడుగాని తల్లి ఏలా ప్రవర్తించాలి అనే విషయం ఆలోచించుట అవసరం. బిడ్డ ఎవరినైనాసరే అలా కొరికినపుడు, తక్షణమే బిడ్డను తక్కిన పిల్లలనుండి వేరుచేసి "ఆ బిడ్డను కొరకనియ్యను. నన్ను కొరకనియ్యను" (తల్లిని కొరికిన సందర్భంలో), అని చెప్పి నిరోధించాలి. కాని "అబ్బ! నీవెంత చెడ్డవాడవు" అంటూ, ఇతరులను కొరకటం ఎంత దుర్మార్గం, పాపం! అని మందలించుతూ నీతిని బోధించకూడదు. (బిడ్డకు, పాపం పుణ్యం అనే విషయాలు అర్థంకావు.) ఎదుటి బిడ్డను చేరదీసి, బుజ్జగించాలి.

తల్లి, తన బిడ్డ తోటి పిల్లను కొరికిన తరువాతనే చూడటం తటస్థించితే, బాధపడుతున్న పిల్లను దగ్గర తీసుకొని బుజ్జగిస్తూ ఓదార్చుటద్వార తన బిడ్డకు గుణపాఠం నేర్పాలి, కాని కొట్టుట, తిట్టుట ద్వారకాదు. ఆట చెలికాండ్రను తల్లి తన కొరికేబిడ్డనుండి వేరుచేసి, వాళ్లను బుజ్జగించటం, ప్రేమించటంవల్ల ఇకమీదట కొరకకూడదు, అలా కొరికితే తనకు తల్లిప్రేమ లభించదు అనే విషయాన్ని బిడ్డ గ్రహించుకొంటుంది. అలా బిడ్డ గ్రహించినదని తల్లి గుర్తించినవెంటనే ఆమె తన బిడ్డనుకూడ చేరదీసి తన ప్రేమను వెలిబుచ్చాలి. కొన్ని సందర్భాలలో పిల్లలు తమ ఆధిక్యతను, వ్యక్తిత్వాన్ని, వ్యక్తపరచటానికి ఈ విధంగా కొరుకుతారు. ఈ విషయాన్ని గ్రహించుకొని తల్లితోటి పిల్లలకు హాని సంభవించకుండ జాగ్రత్త వహించి తన బిడ్డ వ్యక్తిత్వం అభివృద్ధిచెందుటకు అవసరమైన సన్నివేశ సందర్భాన్ని కల్పించాలి. కాని శిక్షించటం బెదరించుట అనేవి ఎంతమాత్రం కూడదు. తల్లి పాలిళ్లను కొరికే బిడ్డ విషయంలో కూడ ఇంతేను. శిశువు తల్లి పాలిళ్లను కొరికినప్పుడు సామాన్యంగా, తల్లులు బిడ్డను కొట్టుతారు. బెదరించుతారు. ఈలాంటి మోటుతనంవల్ల బిడ్డలో కోప స్వభావం ఎక్కువ అవుతుంది. నెమ్మదిగా, స్తనములను బిడ్డ నోటినుంటి తప్పించాలి. తల్లి బిడ్డకు స్తన్యమిచ్చుట అనేది ఎంతో పవిత్ర కార్యం. ఇందువల్ల, తల్లీ పిల్లలమధ్య సన్నిహిత సంబంధం, పవిత్ర ప్రేమ, ఆత్మీయత అనేవి ఏ విధంగా అభివృద్ధిచెందుతవి అనే విషయాల్ని ఇదివరకే తెలుసుకొని యున్నాముగదా. అయితే మరికొన్ని విషయాల్ని తెలుసుకొనుట అవసరం.

బిడ్డ ఆకలికి ఏడ్చినవెంటనే తల్లి స్తన్యమిచ్చి తృప్తిపరచాలి. వెంటనే స్తన్యమివ్వక బిడ్డను వేచియుండేలాగున చేసినయెడల, బిడ్డ ఆకలిచే బాధపడటమేగాక, బిడ్డ అప్పుడప్పుడు ప్రదర్శించే ప్రేమకు భంగం వాటిల్లుతుంది. అనగా, బిడ్డ ఏడ్వటం అకలికి మాత్రమేగాదు. తల్లి ప్రేమ కోసం గూడ ఏడుస్తుంది. ఆకలికెంత అలమటించిపోతుందో తల్లి ప్రేమకోసం కూడ అంత అలమటించిపోతుంది. తల్లి స్తన్యపానంవల్ల, బిడ్డ శారీరకంగా పెరిగినట్టే తల్లి ప్రేమవల్ల మానసికంగా పెరుగుతుంది. ఈ విషయాన్ని తల్లి చక్కగా గ్రహించాలి.

బిడ్డ, నిర్ణీతకాలంలో (అనగా, ఆకలి వేళల్లో), తల్లిపాలను త్రాగటం, తల్లి తొడమీద పడుకొని తల్లి ప్రేమను గ్రోలటం, చేస్తూ క్రమ క్రమంగా అలవాటు పడిపోతుంది. వేచివుండటం నేర్చుకొంటుంది. తల్లి ప్రేమ లభించకపోతే ఏదో అగాధంలో పడిపోతున్నట్టు భయపడుతుంది. తల్లి ఈ విషయాల్ని గ్రహించి, శిశు మనోవిజ్ఞాన దృష్టిలో బిడ్డ అభివృద్ధికి తోడ్పడినట్లైతే, బిడ్డలో మోటుతనం, కోపం మొదలైనవి పోయి, ప్రేమ, ఓర్పు మొదలైన మనః ప్రవృతులు అభివృద్ధి చెందుతవి.



# ప్రణయ గీతము

శ్రీ వసంతరావు రామకృష్ణ రావు

అల్లదే! చూడుమచట గాయకులు కవులు
పరమ భావప్రభావ సౌభాగ్య కవిత
సంతతానందమున దేలి సౌఖ్యసీమ
విహరణ మొనర్చు చున్నారు వేడ్కతోడ.

కాలపరివాహ సంఘ సంఘటితజగతి
లీలతో నూత్న రూప కల్పితము చేసి
రూప దర్శనమందు నారూఢమైన
నీ స్వరూపము నన్నుసంతృప్తి పఱచు.

ఈశ్వరుడు నిర్గుణుండైన సృష్టి లేదు ;
కళల రూపము చెడి సార్థకత నశించు
ఈశ్వరుని యొక్క రూప సమృద్ధి యందు
పరమ సంతోష జనిత భావంబు గలదు.

ఏ యఖండ విలాస రసైకరూపు
ఏ ప్రపంచము ఈశ్వరు సృజన శక్తి
కానుపించెడు ప్రేమ జగంబునందు
సకల విద్యా కళల ప్రయోజనము వొడము.

కల్పితాఖిల ప్రేమ జగమ్మునందు
కేవలము రూపలాలస కృత్రిమంబు
రమ్య కాల్పనిక జగత్తు రచనలోని
సత్యరూప కవిత్వంబు శాశ్వతంబు.

నన్ను చూడుము ; నీ ప్రసన్న ప్రమోద
నేత్ర యుగమందు రాగ రంజితము చూపి
ప్రణయ భావాలు చిత్రించు కొనగ నిమ్ము
అలతి నాజీవితమున నాశలు ఫలింప.

ప్రేమ బీజాలు నాటిన సీమలందు
ప్రథమ మధురాగ ప్రణయాంకురంబు వొడమె
పూవు పరిమళమును గోలు పోకమున్నె
అనుభవింతము రాగసౌఖ్యంబులంది.

నవ్యక్షోభిత బాష్ప కణాలు నేడు
జాలువాఱిన ప్రియురాలి జాలినీడ
లందు వర్తింతు మిగుల నానందమంది
రాధ! ప్రియురాలు నాదెస రాదదేల ?

రాగ భూషిత హృదయాంతరాళమందు
ప్రేయసీరూప మెపుడు చిత్రించు కొనుచు
శాశ్వతానందమును బొంది సౌఖ్యమంద
చాలు! నాకిక ప్రణయభూషణమె చాలు.

హృదయమే సుందరంబు నమృత మయంబు
రాచమాధుర్యము ఘటించు ప్రాభవము
గలదు దానికి ; ప్రేయసీ కంఠమందు
ప్రణయ సౌందర్య రూపము ప్రతిఫలించు.

రాజరాజేశ్వర విలాస రాజఘటిత
ప్రేమమయమూర్తి ప్రేమ గుర్తించు కొనుచు
వలచి నాడను ప్రణయ జీవనపథంబు
ఏల? రాదేల నాపయి జాలినీకు.

కలిత ప్రణయైక జీవలోకము బ్రతుకు
ఘనము, సౌఖ్యము, సంతోషకరము సుమ్ము
కాని దుర్దమమైన ఏకతముకన్న
పావనము శృంఖలాబద్ధ జీవనమ్ము..

## ప్రణయ గీతము

ప్రణయ ప్రేమమూర్తికి స్వాగతంబు!
రాగ భూషిత జగతికి స్వాగతంబు
పలుకు తేనియ లొలుకగ బలుకరించు
కొనుచు నిరవధికానంద మనుభవింప
నూహ సేయుచు ప్రణయ సంతోషమంది
తృప్తి కనుగొందు కాని కోరికలులేని

నిర్మల ప్రేమసీమలో నిలువలేని
ఈనికృంతన లోక విధానమందు
రాగమనునది ప్రళయన ర్తనముసల్పు
నిందుప్రాణాల బలిగొని నిలుపునవ్వు
నాశనము పెక్కురూపాల నాట్యమాడు
ప్రేమ నాశనమగు వేళ విశ్వమేల.

రాధ! ప్రియురాలు నేడిట రానివేల
మధుర రసమయ జీవన మహిమలేదు!
ఈవియోగాగ్నిలో తపియించిపోదు
నాదు ప్రియురాలి కొఱకు ప్రాణములు విడిచి
ఆత్మ బలిదాన మొనరింప నగును నాకు.



# ఎవరు పతివ్రత?

పేరాల విజయలక్ష్మి.

మారాకారుడు, సద్గుణాన్వితుడు, శుంభద్వైభవోపేతుడున్,
ధీరస్వాంతుడు, వీరుడున్, రసికుడున్, విద్వాంసుడౌ భర్త స
త్కారింపంగ నతండె దైవమని యాత్మన్నిల్పి ప్రేమన్ సతం
బారాధించెడి భార్యయా? అటులగాకందంబు సామాన్యమై
క్రూరాత్ముండు, నిరక్షరాశ్యుడు, దరిద్రుండున్ నిరుద్యోగియున్
జారుండుత్తమ చోరుడౌ పతి తిరస్కారింప శ్రద్ధేహపున్
ద్వారంబున్ విడిపోక నాతనినె దైవంబంచు ప్రేమన్ సతం
బారాధించెడి భార్యయా? అటులగా, కవ్యాజమౌ ప్రేమ సం
సారంబున్ గడు కొద్ది కాలమును తాసాగించి, లోకేశు వ్రాల్
మారన్ నేరక సత్ప్రియుండు మరణింపన్ దేవుడీ జన్మలో
నీరీతిన్ లిఖియించెనంచతనినే హృత్పద్మమందుంచి, యిం
కేరంకున్ దలపోయనట్టి సతియా? ఈ ముచ్చురందెంచ నే
నారీరత్నమునున్ "పతివ్రత" యనన్ న్యాయంబొ సంకోచమౌ!.





# పెళ్ళాడాలా!

* * *

నా టి క

* * *

చా మ ర్తి క న క య్య

---

పా త్ర లు :

| | | | |
|---|---|---|---|
| ప్రకాష్ | —22 సం॥ | వయస్సు. | అధునాతన సంస్కార హృదయుడు. |
| ఉషాదేవి | —18 సం॥ | ,, | ప్రకాష్ యిల్లాలు ముస్లిం యువతి. |
| సూరయ్యశాస్త్రి | —50 సం॥ | ,, | ప్రకాష్‌కు మేనమామ. |
| అవధాన్లు | —60 సం॥ | ,, | కావలసిన మామగారు. |
| దర్వాన్ | —70 సం॥ | ,, | ప్రకాష్ యింటి నౌఖరు. |

[పూర్వకథ : ప్రకాష్ బి. ఏ ప్యాసయ్యేడు చదువుతూండగానే జూనియర్ క్లాస్ ముస్లిం విద్యార్థినితో పరిచయ మౌతుంది. పరిచయం అయినప్పటినుంచి ఆమె అసలు పేరు మార్చేసి 'ఉష'అని పేరు పెట్టాడు. కొంత కాలానికి 'ఉష'కి 'నా'అన్న వారెవరూ లేనట్లు, నమ్మకమైన 'దర్వాన్'వల్లనే ఆమె ఏ అపాయమూ లేకుండా జీవితం సాగిస్తోందని గ్రహించి పరిచయం కొద్దీ, వాళ్ళ యింట్లోనే మకాం పెట్టిస్తాడు. అనంతరం ఇరువురూ ప్రేమ గాంధర్వం నెరపుకుంటారు. ఈ సంగతి ఎవరికీ (అంటే 'ప్రకాష్' తాలూకి వాళ్ళకి) తెలియక పోవటంవల్ల ఏర్పడ్డ 'నాటిక'యిది—]

## ప్రథమరంగము.

స్థలము : డాబాలో డ్రాయింగు రూము. ఒక ఇరువురికి అనుకూలంగా, అలంకరింపబడి వుంటుంది.

సమయం : ఉదయం 7½ గంట లౌతుంది. 'ప్రకాష్' 'ఉష'ల కాఫీకాలం.

ఉష : (కాఫీ కప్పు టేబిల్ మీద పెట్టి) అబ్బ! ఎందుకోసం చెప్పండి ఈ గోల! త్వరగా అసలు సంగతి తేల్చేయరాదూ ?

ప్రకాష్ : (సిగిరెట్టు ముట్టిస్తూ) నీ మొహం! అప్పుడే తేల్చేస్తే మన సూత్రధారిత్వంలో గొప్పేమిటి ? కాస్సేపు ఆడించాలి!

ఉ : మీకు ఆటగానే వుంటుంది. నలుగురాడ పిల్లలుంటే తెలిసేది ఈ ఆట ? (నవ్వు)

ప్ర : నిన్నుకనొద్దనాన్నా ? అదీకాక ఇప్పటినుంచీ ఎందుకు లెద్దూ! సంసారం ఓ స్థాయికిరానీ. అంతగావస్తే పెంచకోవచ్చు.

ఉ : పోదురూ! మరీ చిన్నతనం జాస్తి అవుతోంది...

ప్ర : చిన్నతనంకాక పెద్ద గడ్డం మీసాలూ పెరిగాయా పిల్లలు పుట్టేదాకా చిన్నతనమే. నేను పుట్టిన దశాబ్దదాకా మా మామ్మ, మా నాన్నని 'అబ్బాయ్ 'బుల్లాడా' అనే పిల్చేది.

ఉ: మీతో తర్కించడం మహాచెడ్డకష్టం.

ప్ర: 'మాటలు' కష్టమైతే 'పాట' పాడు. అప్పుడు 'శక్తి' మని నా నోరుకట్టేస్తా...

ఉ: సరే కాని ఈ సారి మాత్రం మీ మామయ్యతో...

ప్ర: (అడ్డంవచ్చి) మా మామయ్య మీ బాబయ్య కాదం టావ్?

ఉ: ఎప్పుడన్నా నాకు కనపడితేగా 'మా' అనుకుందుకి- సరేకాని ఆయన వచ్చినప్పుడు ఖచ్చితంగా చెప్పే యండి.

ప్ర: అసలు నేనాడుతూన్న నాటక మంతా మామయ్యని ఆడించడానికే అంటుంటే అసలు మనిషి దగ్గరే రహస్యం 'ఫటా ఫట్' చేసేయ మంటావ్?

ఉ: మామయ్య నొక్కణ్ణి ఆడిస్తే బాగుండును. 'ఏక్ టికెట్ దో తమాషా'లాగా మీరు తెలీకుండానే ఎందరో ఆడపిల్లల్ని కన్న తల్లి దండ్రుల్ని ఆడించడంతో పాటు, ఏడిపిస్తున్నారు కూడ. వాళ్ళకోసం ఆయన్ని ఆడించొ ద్దంటున్నా.

ప్ర: నాకాపాటి తెలియదంటావా?

ఉ: "తెలిసినదాన్ని ఆచరణలో పెట్టనప్పుడు తెలియనట్టే" అని మీ సిద్ధాంతాన్ని మీరే రాద్ధాంతం చేస్తున్నా రేం?

ప్ర: ఓహో! సరేగాని-ఏదో రెండాటలాడించేసి మూడో ఎత్తులో 'త్రోసిరాజ'ని కట్టేస్తా.

ఉ: అదిగో మళ్ళీ రెండాటలా? రెండాటలపేరు, ఎందరు నలిగిపోతారో...

ప్ర: సరేకానీ, ఇంతవరకూ 'శ్రీ'వారి కొచ్చిన సంబంధా లెన్ని?

ఉ: ఆకోన ... కోన ... అదేమిటండీ! అదే - కొబ్బరి కాయలు...

ప్ర: కోనసీమ...

ఉ: చంపేసింది! కోన సీమనుంచి రెండు...ఇంకా— గోంగూర పచ్చడి సీమనుంచి...

ప్ర: ఛా! గుంటూరుసీమ-పల్నాడు.

ఉ: ఆఁ. ఏదోసీమ-అక్కడనుంచి మూడు. తూర్పు సీమ నుంచి రెండు. ఇప్పటికు నడుస్తూన్నదొకటి మొత్తం...

ప్ర: మొత్తం రెండూ, మూడూ, అయిదు. అయిదూ రెండూ, ఏడు. ఏడూ ఒకటీ-ఎనిమిది! అయితే పాట ఎంత మీదుంది?

ఉ: ఏం పాట?

ప్ర: మరి ఆ పిల్ల నన్ను కొనుక్కోటంలే? అదే ఒకరు రెండు సంచులంటే మరొకరు ఇంకో అర సంచి. యిది పాటకాదూ!

ఉ: అదా! మొత్తం పదహారువేలు రొక్కం, ఇతరత్రా పోను.

ప్ర: ఓఁ. పదహారు వేల రూపాయలు—ఎనమండుగురు రాణులు. ఇహనేం గోపాల కృష్ణుణ్ణి-సెభాష్-ఏదో సిగరెట్టొకటి నోట్లో పెట్టి అగ్గిపుల్ల వెలిగించు.

ఉ: ఎవరన్నా విన్నా, నవ్విపోగలరు—చాల్చాలు.

ప్ర: నిన్నొకర్తెను పెళ్ళాడక పోతే చూచేవా? ఎంత రొక్కం—ఎంతమంది రాణులు. లేస్తే పెళ్ళాం—కూచుంటే పెళ్ళాం—కదిలితే పెళ్ళాం—మెదిలితే పెళ్ళాం—ఒక్క బాధ మాత్రంవుంది—చస్తే మాత్రం పెళ్ళాంలేదు...

ఉ: ఆఁ. ఎందర్నయినా కట్టుకుందురు. 'అయ్యదేవర' వారు యిలాంటి పనులు జరుగుతున్నా యనే బహు భార్యా నిషేధం పెట్టారు?

ప్ర: అయితే 'స్త్రీ' ఎందరు మొగుళ్ళనైనా...

ఉ: మీ భారతదేశం అంతవరకూ రాలేదు.

ప్ర: చచ్చాంరా భగవాన్—ఆఁ. 'అయ్యదేవర' బిల్లు పెడితే అయ్యగార్ల బ్లాక్ మార్కెట్...

ఉ: సరేలెండి. రేపు మామయ్య రాగానే ఉన్న విషయం ఉన్నట్టు చెప్పేసి ఆట కట్టేయక పోతే...ఊఁ... నేను కట్టేస్తా...

ప్ర: ఛా! ఏదో సరదాగానే నాడించేసి కట్టేస్తా. నీదాకా ఎందుకు?

ఉ: సాదాకా ఎందుకనే ఇన్నాళ్ళూ నాటకం తెర మరుగున ఆడించారు. నేను వస్తేకాని బయటపడిందికాదు. మళ్ళీ రంగలోక్కూడా నే వచ్చి ఆట ఆపాలి. ఆఁ. ఏమిటో వాస్కులో టైమ్ పోగయా! (నిష్క్రమణ)

ప్ర: వెర్రిపిల్ల—ఏమీ తెలియదు—ఎంతచెప్పితే అంతే—గట్టిగా మాట్లాడితే కంట నీరు—మీలో ఎవరి పెళ్ళామన్నా ఇలావుంటుందా—సవాల్—

(తెరపడును).

## ద్వితీయ రంగము.

సమయం: సాయంకాలం నాలుగున్నర.

స్థలం: మామూలు డ్రాయింగురూము.

ప్రకాష్: (కుర్చీలో సిగరెట్‌తో) మూడున్నర బండికి మామయ్య వస్తానన్నాడే. అతీగతీ లేదు ఇప్పటి దాకా! (ఆగి) దర్వాన్ బాబా!!

దర్వాన్: (ప్రవేశించి) క్యా బేటా?

ప్ర: బాబా! ప్యాసింజర్ వచ్చిందా?

ద: లేదు బాబయ్యా! అది ఎప్పుడూ లేటే గా!

ప్ర: మామయ్య వస్తానన్నాడోయ్!

ద: ఆయనకెందుకూ నీబాధ; నీ పెళ్ళివిషయంలో ఆయన్ని కలగచేసికోవద్దన్నా వినడేం?

ప్ర: అదంతా 'లౌక్యం'లే.

ద: అంటే...

ప్ర: అంటే—ఆఁ. (ఆగి చప్పుడు విని)ఆఁ. అదిగో మామయ్యేకాబోలు. ఆఁ. అదిగో ఆ కిర్రు జోడు, పొడుం పీల్పు-దగ్గూ-ఆఁ. మామయ్యే...

సూరయ్యశాస్త్రి: (దర్వాన్ వైపుచూచి) ఈ గడ్డం సాయిబ్బేవడ్రా. వీళ్ళమ్మ కడుపు కాలా... (పొడుం పీల్చి చీది) చంపేస్తున్నార్ట...

ప్ర: ఆఁ. కూచో మామయ్యా! రాగానే యిలా ప్రారంభించావేమిటి? దర్వాన్ బాబా! నీ పని చూసుకో! (దర్వాన్ నిష్క్రమణ.)

సూ: (పొడుం పీలుస్తూ): ఏమిట్రా అబ్బాయ్...

ప్ర: ఏమిటి మామయ్యా! అత్తకులాసాయా?

సూ: దానికులాసాకేంగాని ప్రస్తుతం నేను తీసి కొచ్చిన సంబధంవుంది చూశావ్...

ప్ర: ఏదీ-చూడండే (నవ్వు). ఊఁ. చెప్పు.

సూ: పిల్ల బంగారమంటే నమ్ము. ఏమి అందంరా! ఆ కాళిదాసు రతీదేవికూడా యిలా వుండదు...

ప్ర: ఊఁ. ఊఁ. కానియ్యి.

సూ: నువ్వు చదివిన ప్రబంధాల్లో కాని, నువ్వు రాసే కథల్లోకాని అలాంటి పిల్లవుండదు...

ప్ర: అయితే మా 'ఉష' కంటేనా?

సూ: ఆ 'ఉష' ఎవర్రోయి?

ప్ర: నా కథా నాయికలే.

సూ: అంతేగదా! చంపేశావ్—ఒరేయ్ అబ్బాయ్ నే చెపుతున్నా విను. ఈ ప్రపంచంలో నీ శ్రేయస్సు కోరే వాళ్ళల్లో నేను మొదటివాడినంటే ఒప్పుకుంటావా?

ప్ర: ఒప్పుకోక తప్పుతుందా?

సూ: ఊఁ. అలా అను. ఈ సంబంధం ప్రత్యేకంగా నీకు సెటిల్ చేయడంలోవుండే అంతరార్థం విను. ఇప్పుడు నీ కాబోయే—ఛా—కాబోయే ఏమిటి? అవవలసిన...

ప్ర: 'అయిపోయిన' అనూ, కాదనే వాడెవడు?

సూ: ఆడేలే. అవవలసిన అవధానులుగారు అంటే నీ మామగారు—నాలాంటి మామ కాదు—పిల్ల నిచ్చే మామ—ఆయన వయస్సు అరవైయేళ్ళు. ఇద్దరే మగ పిల్లలు—ఆడ పిల్లలు ఎంత మందయినా ఇప్పుడు నీ కివ్వబోయే పిల్ల పెద్దపిల్ల. ఆ పిల్లంటే ఇంట్లో అందరికీ అభిమానం, ముఖ్యంగా తల్లికి. తల్లికి స్వంత ఆస్తి రెండెకరాలుంది. ఆ ఆస్తిమీద సర్వాధికారాలు తల్లివి. అది ఎలాగూ ఈ పిల్లకే ముట్ట చెప్పుతుంది. అంటే అది చీపుళ్ళు పండేదే అనుకో...

ప్ర: అయితేనేంలే. ఇప్పుడు కట్ట బేడకి తక్కువలో లేదు.

సూ: ఊఁ. అదికాస్త ప్రయోజకత్వం నేర్చుకోరా? ఆ ఆస్తి అలావుండగా వివాహ సమయంలో రెండువేల రూపాయలు కిరుకులు అలా గుమ్మరించేస్తారు. సరే వెండి చెంబులు, పట్టుతాపితాలు, ఆడబడుచు, వియ్యపురాలు లాంఛనాలు సరేసరి. అయిదు రోజులూ ఉభయ ఖర్చులు వారివే—చెపితే నమ్మవుకాని ఆ పిల్ల అచ్చు మను చరిత్రలో వర్ణింపబడ్డ వరూధినిలా ఉంటుం దనుకో...

ప్ర: చంపేశావ్! అయితే దాన్ని ఏ పరమ చాదస్త ప్రవరాఖ్యుడికో అంటకట్టు నాకెందుకు?

సూ: ఆగరా! అందంలో వరూధిని—ఇక చాకిరీలోనా ప్రవరాఖ్యుడు అగ్ని సాక్షిగా పెళ్ళాడిన అన్నపూర్ణ అనుకో. చదువు సంధ్యలంటావా? ఈ రోజుల్లో చదువుకున్న ఆడదాన్ని పెళ్ళిచేసికుందుకి ప్రతివాడు భయపడుతున్నాడు.

ప్ర: చాల్చాల్లే—బాగానే వుంది. వారు వచ్చారా? (మాట పూర్తికాకుండానే 'ఉష' ఒక నూతన ఆగంతకునితో ప్రవేశించును. దర్వాన్ వెనకాలే వస్తాడు.)

ఉ: వచ్చిన వారిని చూడ్డంలేదు గాని, వారు వచ్చారా, వీరు వచ్చారా? కూర్చోండి (అని తాను తీసి కొచ్చిన వ్యక్తికి కుర్చీచూపును)

ప్ర: (వింతగా) ఈయనెవరు? (వచ్చిన వ్యక్తి సూరయ్యశాస్త్రి వైపు సాభిప్రాయంగా చూచును)

సూ: ఆఁ. ఈయనే నీ మామగారు.

ఉ: (సూరయ్యశాస్త్రి వైపుచూస్తూ) ఆయనెవరు?

ప్ర: మా మేనమామగారు.

ఉ: చంపేశారు, చెప్పారు కాదేం—నమస్కారమండీ! (అవధాని, సూరయ్యశాస్త్రి ఇదేమీ అర్థంకాక ఒకరి వైపు మరొకరు చూసుకుంటూ పొడుంపట్టు పీలుస్తారు)

దర్వాన్: ఇదిగో బాబూ; నా పొడుం పీల్చి చూడండి. మహా ఘటిగా వుంటుంది. అప్పుడే కాచిన నెయ్యి. కొత్తసున్నం—లంకాకువేసి స్వయంగా చేశానండి.

సూ: మా ఖర్మ కాలిపోతే; ఇంక నువ్వు ముట్టుకున్న...

అవధానులు: ముట్టుకోవడమేమిషి. చేసాడువ—

సూ: ఒరేయ్ అబ్బాయ్! ఇంతకీ ఏమంటావ్?

ప్ర: అయిన వారొచ్చారుగా. అవవలసిన మామగారూ; మంచి తీర్థం పుచ్చుకుంటారూ?

అ: అన్నీ అయాయి నాయనా!

సూ: ఆ అమ్మాయి ఎవర్రా?

ప్ర: అహా—ఈ నాటకానికి నాయిక...

సూ: ఏం నాటకంరోయ్?

ప్ర: అంత గాభరా పడతావేమిటి మామయ్యా? ప్రపంచమంతా నాటకమేకదా! దీనికంతకి జగన్నాటక సూత్రధారి ఒకడున్నాడా! ఆ సూత్రధారినడిపే నాటకంలో యిదోటి. అందులో నాయిక...

సూ: నీ తత్త్వం నాకేం బోధపడలేదు.

ప్ర: బోధపడక పోవడమే మంచిది-పడితే నాటకం రసాభాసయి ఆగిపోతుంది.

సూ: అంతా అగమ్య గోచరంగా ఉంది. నిజంగా అర్థం కాని నాటకంలావుంది. ఏమంటారు అవధానులుగారు?

అ: పెద్దలు! మీ మాటకాదనడానికి నేనెంత?

సూ: సరేకాని! ఒరేయ్ ఇంతకీ ఏమంటావ్?

ప్ర: అనడానికేముందిలే? చూడండి అవవలసిన అవధానులు మామగారూ!

అ: ఓ చూస్తున్నా: చెప్పు నాయనా—అడగ వలసినవన్నీ అడుగు...

ఉ: ఆఁ. బాబయ్యగారూ—ఈ విషయంలో...

ప్ర: ఆగు ఉషా! పెళ్ళి నాయకుడిని నేను కాని నువ్వు కాదు. ఇక్కడ నీ పాత్రకి ఆవశ్యకతలేదు.

ఉ: మరి త్వరగా...

ప్ర: నే చెప్తాగా...

(మళ్లీ పెద్దలిద్దరికీ ఏమీ అర్థంకాని దురవస్థ. కాళీ పొడుం డబ్బీల్లో చేతులు తిరుగుడు).

# పెళ్ళాడాలా

ప్ర: ఆఁ. అవధానులుగారూ—మీ ఆస్తి ఎంతండీ?

సూ: ఓ పుట్టెడు భూమివుంటుంది. అదంతా నీ కెందుకు? పెద్ద వడ్డీ వ్యాపారం. అధమం సంచి రూపాయలు వూళ్ళో తిరుగుతుంటాయి...

ప్ర: మీకు ఆడపిల్ల లెంతమంది—నీ క్కాదు మామయ్యా!

అ: ఉన్నారు నాయనా...

ప్ర: లేరని నేనన్నానా? ఎందరంటున్నాను...

అ: అన్నపూర్ణాదేవి అనుగ్రహంవల్ల ఆరుగురున్నారు.

ప్ర: మగపిల్లలు...

అ: పుట్టబోయేవాడితో ముగ్గురు—(అంతా నవ్వుతారు)

సూ: జ్యోతిషంలో అలావుంది. ఆరుగురు ఆడ పిల్లలు పుట్టిన తరువాత అంటే ఈఁగోగా ఇద్దరు మగపిల్లలుంటే ఆరో ఆడపిల్ల తరువాత కాన్పు మగవాడని శాస్త్రం తెలీదూ. (వెకవెక నవ్వుతారు...)

ప్ర: కోప్పడకు మామయ్యా! వాళ్ళకు తెలియదు! అయితే అవధానులుగారూ, ఇప్పుడు మీరు నాకివ్వ బోయే పిల్ల పెళ్ళికి ఏపాటి ఖర్చుపెట్ట దలచుకున్నారండీ?

సూ: పిల్ల పెళ్ళేమిటీ? నీ పెళ్ళే...

ప్ర: ఆఁ. అదేలే...

సూ: నే చెప్పలేదండీ—ఒప్పుకుంటాడనీ — అందులోనూ బయల్దేరేటప్పుడు మా ఆవిడ శకునం—శకున ఫలం ఊరికేపోతుందా...

ప్ర: కాస్సేపాగు మామయ్యా!

అ: దగ్గిర దగ్గిర అయిదువేలవుతుందయ్యా.

ప్ర: అయిదువేలు ముందుచేయ బోయేవి ఇంకా అయిదు పెళ్ళిళ్లు—మన సాంప్రదాయారీత్యా పెద్ద పిల్లకి పెళ్ళి ఎలా చేస్తే అందరికీ అలానే కావాలి గదా! ఆ పరిస్థితిలో అయిదేసివేలెట్టి ఎంతమందికి పెళ్ళిళ్లు చేస్తారండీ! ఇంకా పుట్టబోయేవాడితో ముగ్గురు మగపిల్లలున్నారాయె. వాళ్ళ కేంగతి చూపిస్తారు? కొంచెం పరిస్థితులాలోచించండి. పెద్దవారు అయినా నా వుద్దేశ్యం కూడా చెప్పద్దండీ! ఈ అయిదువేలూ పెట్టి—అదన్నా ఒక్కసారి కుమ్మరించ నక్కర్లేదు. నెలలవీద సాలీక లోపుగా ఖర్చుపెట్టా సరయిన రీతిలో తర్ఫీదు యిచ్చే స్కూల్లో చేర్పిస్తే ఈ పాట్లుండవు కదాండీ!

(అవధానులు—సూరయ్య తబ్బిబ్బైపోతారు. కథఅడ్డం తిరిగి పోయిందని మొహాలు వేలాడేస్తారు. పాడుం లేక పోవడం మరీ దురవస్థ)

సూ: పెద్ద ధర్మపన్నాలు చెప్పావు కాని ఆ పాటి యిది వుంటే నువ్వే ఏ కట్నంలేకుండా చేసికోరాదూ?

ప్ర: ఔను—అదీసమస్యే—ఇంతకాలం ఆగేవాడిని కాదు నాకు ఖాళీవుంటే...

సూ: మరి...

ప్ర: అదిగో—నా గృహిణి—('ఉష'ని చూపిస్తాడు. (తెల్లబోయి చూస్తారిద్దరూ)

సూ: ఇన్నాళ్ళూ ఈ కపట నాటకం ఆడడంలో నీ అభిప్రాయం...

ప్ర: పెద్ద అభిప్రాయ మేమీ లేదు—ఎప్పటి కప్పుడు నీకు చెప్తూనేవున్నా, నా పెళ్ళి విషయంలో కలగచేసికో వద్దని.

సూ: నువ్వన్నంత మాత్రాన మానేస్తానా?

ప్ర: నువ్వు మానేస్తావని నేననుకున్నానా?

సూ: ఇంతకీ ఈ విషయం నాన్నకి తెలుసా?

ప్ర: తెలుసో — తెలీదో—బి. ఏ., తప్పిందన్నాను. శాబోలనుకున్నాడు. ఇంటిదగ్గర చదువు సాగదన్నాను. సరేనన్నాడు. ఇక్కడ కాలేజిలో ట్యూటర్‌గా పని చేస్తున్నాను. ఇద్దరం కలసి హాయిగా సంసారం సాగిస్తున్నాం...

సూ: మన శాఖేనా?

ప్ర: తురకలకి శాఖలుంటాయా? ఏం ఉషా?

ఉ: ఏమో...

సూ: (గుండెలు బాదుకుంటూ జంధ్యాలు మెలేస్తూ) ఆరి పిడుగా; వంశ నాశనానికి పుట్టావురా. ఎటువంటి కుటుంబంలో ఎలాటివాడు పుట్టాడో చూడండి అవధానులుగారూ! ఒక్క క్షణం నీ యింట్లోవుండను...

ప్ర: ఉండమన్న దెవరు? (ఇరువురు నిష్క్రమిస్తుండగా)

ఉ: అమ్మయ్య—ఇప్పటికి పూర్తయిందీ నాటకం...

ప్ర: ఇంకా పెళ్ళాడాలా—పెళ్ళాడాలా?



# కథలు - కథానికలు

శ్రీ వాడ్రేవు జోగిపంతులుగారు

"సమకాలికులైన మెచ్చరే గదా!" అని వాపోయాడు చామకూర వెంకన్న ఏనాడో! ఆనాడు మెచ్చలేక పోయారు. నేడు మెచ్చక తప్పలేదు. మచ్చు తునకలన్నీ ప్రత్యక్షమౌతూన్నప్పుడు—వాటి ప్రభావానికి తట్టుకోలేక లొంగి పోవాల్సి వచ్చింది. పురాణేతిహాస కావ్యప్రబంధ యుగాలు గతించాయి. తరుముకుంటూ ఖండకావ్య యుగం వచ్చింది. దానితో సమంగానో, కాస్తంత పూర్వంలోనో వచనా వాఙ్మయానిక్కూడా స్థానం లభించింది. కొంత కాలం "వేయి పడగలు" వంటి రచనలు సాగినయి. కాని-రాను రాను ప్రజాభిరుచులు కథలమీదికి వాలినయ్. కథలు కూడా కొంచెం వెనకబడ్డయి. అయినా కథలకి నేటి సాహిత్యంలో స్థానం లేదనటానికి వీల్లేదు.

ఈ రోజున ప్రపంచం మొత్తంమీద కథానికలు పొందే టంతటి ఆదరాభిమానాలు మరే యితర రచనలూ పొందడం లేదు! కొద్ది సంవత్సరాల క్రిందటి పరిస్థితికీ, నేటి పరిస్థితికీ, కథానిక స్థానంలో ఎంతో మార్పు స్పష్టంగా గోచరిస్తూన్నది. దీనికి కారణమేమిటి అని ఆలోచిస్తే, సులభంగా మనం ఒక నిర్ణయానికి రాలేము కాని ఒక్కటి మటుక్కు సత్యం: వర్తమాన జీవితం, వర్తమాన మానవుని దైనందిన సంఘటనల సాధారంగా తీసుకుని-వాటిని కథానికా రూపంలో చక్కగా అందియ్యగలగడమే! ఈ పద్ధతి మటుక్కు ఆదిలో లేదా అని ప్రశ్నించవచ్చు-కాని-దానికి సమాధానం-నేడు వ్రాయబడేటంత విరివిగా ఆదిలో వ్రాయబడలేదు—వ్రాయబడినా—నేటి కథానికల విధానాలు ఆనాడు అవలంబింపబడక పోయివుండొచ్చు — అవలంబింపబడినా పాఠకుని మన్ననల నందలేక పోయినవేమోనని అనుమానించడానికి కూడా ఆస్కారం లేక పోలేదు! ఏది ఏమైనా ఇతః పూర్వంకన్న ప్రపంచ సాహిత్యాలన్నింటిలోనూ కూడా కథానికలకు అత్యున్నత స్థానం సంక్రమించింది.

ప్రఖ్యాత రష్యన్ కథకుడైన ఆంటన్ ఛెకోవ్ కథలు విశ్వ విఖ్యాతములైనవి. లియోటాల్‌స్టాయ్ కథలు వినని ప్రపంచవాసి లేడనడం అతిశయోక్తి కాదు! మాక్సింగోర్కీ "మదర్" చదవని పాఠకుడు లేడు! టర్జినోవ్, పుష్కిన్‌ల కథలు ప్రపంచంలోని దాదాపు అన్ని భాషల్లోకి అనువదింపబడి ఆదరింపబడినయ్. పాత్ర చిత్రణంలోనూ, కథా శిల్పంలోనూ ఆంటన్‌ఛెకోవ్‌ది అందెవేసిన చేయి. ఆతడిది ఏ కథ తీసుకున్నా మచ్చుతునకే! పాఠకుడి హృదయాన్ని, సంతోషంతో, ఉప్పొంగి ఉవ్వెత్తుగా లేచి నాట్యమాడే సముద్రతరంగాల్లాగా—విచారంతో అంతులేని అగాధాలు దూసుకుపోయే కూలిపోయిన కెరటాలలాగా—వూగులాడించి—ఇట్టే తనవశం చేసుకుంటాడు! ఛెకోవ్ కథ మరొకటి దొరకటం సంభవిస్తే తిండయినా మానుకుని చదవడం పూర్తి చేస్తాడు! ఆతని కలంలో అంత బలమూ వుంది! రష్యన్ సాహిత్యంలో—మాక్సిం గోర్కీ, లియోటాల్‌స్టాయ్, టర్జినోవ్‌లు కూడా అత్యున్నత స్థానాన్ని ఆక్రమించారు. గోర్కీ వ్రాసిన "మదర్" అనే ఒక పెద్ద కథ యావత్ ప్రపంచంచేతా సంతోషంతో పఠింపబడి, అనేక భాషల్లోనికి అనువదింపబడింది. మన తెలుగు భాషలోకి కూడా శ్రీ లింగరాజుగారిచే "అమ్మ" అనే పేరున అనువదింపబడ్డది. లియోటాల్‌స్టాయ్ కథలు చదవని వారు మనలో కూడా బహు అరుదు. ప్రాథమిక పాఠశాలా విద్యార్థి లగాయతు పట్టభద్రుడయిన విద్యార్థిదాకా టాల్‌స్టాయ్ కథలు సంతోషంతో చదువుతారు. ఈ కథలను శ్రీ ముద్దా విశ్వనాథంగారు, ఇంకా మరికొందరు తెలుగులో వ్రాశారు. టర్జినోవ్, పుష్కిన్‌ల కథలు ఇప్పుడిప్పుడే బలమైన ప్రచారంలోకి వస్తున్నవి. మనవారు నాలుగు పేజీలలో వ్రాసే కథను రష్యన్ రచయిత పన్నెండు పేజీలు రాస్తాడు. వున్న కొద్దిపాటి విషయాన్నీ, పెద్దగా విస్తరించి, వర్ణనలు గుప్పించి రాస్తాడు. కొన్ని కొన్ని సందర్భాల్లో ఈ మాదిరి

వర్ణనలు మన శరత్ బాబు కూడా సాగించాడు. కొన్ని కొన్ని కథల్లో ఈ మితిమీరిన వర్ణన విసుగు కలిగించినా, సాధారణంగా పాఠకుని ఉత్సాహాన్నీ, ఏకాగ్రతనూ ఏవిధంగానూ ఆటంక పరచదు. రష్యన్ కథలన్నీ కూడా అంటే అతి వాస్తవికతకు సాధ్యమైనంత దూరంలోనే వుంటాయి.

తరువాత—కథా సారస్వతంలో చెప్పుకో దగ్గది—ఫ్రెంచి సాహిత్యం. మొపాసా, తన అత్యద్భుత శిల్పనా చాతుర్యంతోనూ, వినూత్నమైన భావాలతోనూ కూడిన కథల మూలంగా ప్రపంచ ఖ్యాతి నార్జించాడు. సంఘంలో కరడుగట్టుకు పోయిన కుళ్లును కడిగివేయడానికి ఫ్రెంచి రచయితలు చాల మంది నడుం కట్టారు, కాని—నిరంకుశంగా ప్రవర్తించే సంఘం వారిపై అంత్యలు అమలు జరిపింది. చివరకు—వారిని చావ గొట్టించే దుర్భర పరిస్థితికి కూడా దిగజారడాని కాసంఘం వెనుదీయలేదు,

"చాకి కోకలుదికి చీకాకు పడజేసి
మైలదీసి లెస్స మడచినట్లు
బుద్ధి చెప్పువాడు గ్రుద్దితే నేమయా?
విశ్వదాభిరామ వినురవేమా!"

అనే సత్యాన్ని గుర్తించి. సహృదయులైన వివేకవంతులు కొందరు వారి కృషిని హర్షించి, వారికి తమ సాధ్యమైనంత సాహాయ్యమూ చేశారు. ప్రఖ్యాత నాటక రచయిత మొలియర్' మొదట కథలువ్రాసి, ప్రచురించి, తదుపరి వాటిని నాటకరూపంలో వ్రాశేవాడని కొందరు చెబుతారు. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి ద్వారా మోలియర్ యావదాంధ్రులకు చిరపరిచితుడయ్యాడు. శ్రీ పి. వి. యస్. మూర్తిరాజుగారు కూడా మోలియర్ రచనలు కొన్నిటిని తెలుగులో వ్రాశారు. సోమర్ సెట్ మాఘమ్, ఎమెలి జోలా, విక్టర్ హ్యూగో మొదలైన వారు జగద్విఖ్యాతి గాంచిన కథకులు. ఎమిలి జోలా వ్రాసిన "నానా" అనే కథ ఎన్ని సార్లు చదివినా ఇంకా ఇంకా చదవాలనే వుంటుంది.

పోతే-అమెరికా, ఇంగ్లండులలో నాటక కర్తలూ వ్యాస రచయితలూ వున్నారుగాని పేరొందిన కథకులు తక్కువ. అమెరికన్ సాహిత్యంలో ఎంబ్రోస్ బయర్సు వ్రాసిన కథలు బాగా ప్రచారంలోకి వచ్చాయని చెప్పొచ్చు. మన దేశంలోనే ఇంగ్లీషులో చక్కగా కథలు వ్రాసే వారున్నారు. వారిలో డి. యఫ్. కరకా, ఖ్వాజా అహమద్ అబ్బాస్, హుమయూన్ కబీర్, పోతాన్ జోసెఫ్ వగైరాలు. అబ్బాస్ కథలు వ్యంగ్యపూరితాలై ప్రబోధకరములుగా వుంటాయి. సంఘంలోని కుళ్లుకడిగి వేయడానికి అవి చక్కని పనిచేస్తాయి. హుమయూన్ కబీర్ వ్రాసిన 'మెన్ అండ్ రివర్సు' అనే పెద్దకథ చక్కగా వుంటుంది. పాశ్చాత్య సాహిత్యం కొంతమేరకు మథించి, జీర్ణింపు చేసికోవడం చాత, ఆంగ్లభాషలో, ఆ శిల్పనా చాతుర్యమూ-అవీ అబ్బడంచాత వీరికథలుకూడా చక్కగా వుంటున్నవి.

తరువాత-మన బెంగాలి రచయిత—విశ్వకవి రవీంద్రనాథటాగూరు కథలు దాదాపు ప్రపంచమందలి అన్ని భాషల్లోకి అనువదింపబడ్డాయి. దానిని బట్టి ఆ కథలు ఎంతటి భావములూ, స్థాయీకలిగి వుండినవో మనం వూహించుకోవచ్చు. నోబెల్ బహుమానాన్ని పొందిన ప్రఖ్యాత రచయిత టాగూరు. తరువాత మనకి చిరపరిచితుడైన - శరత్ బాబు-ఇతడి పూర్తిపేరు-శరత్ చంద్ర ఛటర్జి. ఈతడి కథలన్ని వాస్తవికంగా వుండి మనసును రంజిప చేస్తాయి. ఈతడు వ్రాసిన 'దేవదాసు' కథ ప్రతిపాఠకుడి కంటతడి పెట్టకుండా విడవదు. ఇతడు వ్రాసిన కథలన్నీ నీలకంఠం, చక్రపాణి, శివరామ కృష్ణగారల ద్వారా ఆంధ్ర పాఠకులకి చిరపరిచితములయ్యాయి. ఇతడు వ్రాసిన కొన్ని కథలు హిందీ ఫిల్మ్ప్రొడ్యూసర్లు చిత్రంగా తీశారు. వాటిల్లో దేవదాసు, కాశీనాథ్ మొదలైనవి వున్నయి. సుదర్శన్, ప్రేమచంద్ మొదలైన హిందీ రచయితల కథలు కూడా బాగా ప్రచారంలోకి వచ్చి, మన తెలుగులోకి కూడా అనువదింపబడ్డాయి. ప్రేమ్చంద్ కథలు హాస్యపూరితాలై వుంటాయి. సుదర్శన్ వ్రాసిన "సైకిల్-కి-సవ్వారీ" అనే కథ చక్కగా వుంటుంది. బెంగాలీ భాషలోనూ, హిందీ భాషలోనూ కథలు వ్రాసేవారు ఇంకావున్నారుగాని-వీరు గడించినంతగా ఖ్యాతి వారు గడించలేక పోయారు. జకీర్ హుస్సేన్ హిందీ సాహిత్యంలో బాల సాహిత్యం బాగా సృష్టించాడు.

ఆఖరుగా-ఆంధ్ర సాహిత్యంలో-నేడు కథలు వ్రాసే వారిలో-కొడవటిగంటి కుటుంబరావు, ధనికొండ హనుమంతరావు, చలం, శారద మొదలైనవారు ప్రచారంలోకి వచ్చారు. వీరికంటె చక్కగా, కొంచెం సౌష్టవమయిన భాషతో - విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, కొనకళ్ల వెంకటరత్నం మొదలైన వారు వ్రాస్తున్నారు. ఇంకా జమదగ్ని, గోపీచంద్, కూడా ప్రచారంలోనికి వచ్చిన వారిలో కొందరు. అడవి బాపిరాజుగారి నారాయణరావు, కోనంగి, విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు, జేబుదొంగలు, ధనికొండ హనుమంతరావుగారి తీర్పు, గోపీచంద్ గారి గీతా పారాయణమనే కథా గుచ్ఛము, చలంగారి హంపీకన్యలు మొదలైన కథలు ప్రతివారూ చదివి తీరవలసిన రచనలు.

ఈ రీతిగా-ప్రపంచ మందలి ప్రతి భాషలోనూ కూడా కథలయితేనేమి, కథానికలైతేనేమి అత్యున్నత స్థానాన్ని ఆక్రమించాయని తేలిపోయింది. పురాణగ్రంథాల అనంతరం ఇతిహాసాలు-తదుపరి కావ్య రచనలూ - కొద్ది కాలానంతరం కావ్య రచనల స్థానాన్ని ప్రబంధం ఆక్రమించింది. తరుము కుంటూ ఖండకావ్యంవచ్చింది. వచన రచన, కథలు, అవతరించి ఖండకావ్యాన్ని దిగద్రొక్కినవి. ఏమయితేనేం— కథలు, కథానికలు నేటి ప్రపంచ సాహిత్యాల్లో అత్యున్నత స్థానాన్ని ఆక్రమించినవి.

కథలు,కథానికలు ఏ రీతిగా ఇతర విధములైన రచనల్ని దిగద్రొక్కి ఈ నాడు ఇంతటిస్థానం ఆక్రమింపగలిగినవో, అదే రీతిగ, మరోవిధమయిన రచన ఏదేనా ముందుకి వచ్చి కథల్ని, కథానికల్ని వాటి స్థానానుంచి దిగ ద్రోయడానికి కాల గర్భంలో దాక్కుని ఎదురు చూస్తుందేమో ?

సెలవు !



# వెన్నెల కన్నె !

కటికి చీకటి రేయి కను విప్పలేదు,
గరళగళు మౌళిపై కాంతి కనరాదు,
నీరవ మహాబ్ధిలో నెల పొడవ లేదు,
నెల పొడవ బోదొ ! వెన్నెల కన్నె రాదొ ? ॥

నెలఁ జూచి నెలత కన్నుల పూలు విరియు,
నెలలేని రేయి కన్నియ కానరాదు !
ఫలమేమొ యీ వ్రత ప్రాశస్త్యమేమో.
నెలలేక తానింత నిలవ లేదేమొ ? ॥

గడుచునో కృష్ణపక్షపు నీలి తెరలు ?
కలుగునో లేత వెన్నెల పులకరింపలు !
నిశి కోసల దాకనే నేకాంతమందె
కృశియింప వలెనొ ! తా గృప చూపరాదొ ? ॥

రాదేమొ రాదేమొ రాకేందు లేఖ !
రాదొకో రాదొకో రమణీ లలామ ?
చెలి చందమామతో చెంగలువ పూవు ?
చలువ వెన్నెల మ్రింగు చక్రవాకమ్మ ? ॥

శ్రీ సూరంపూడి భాస్కరరావు





బాలానందం !

వి. ఎల్. సీతాదేవి.

# ఫిలెన్‌థీస్ కధ

పూర్వము ఒకప్పుడు గ్రీసు పట్టణంలో "ఫిలెన్‌థీస్" అనే బాలుడుండేవాడు ఏథెన్సు నగరంలో "జీనో" అను ప్రసిద్ధ తత్వజ్ఞుని పాఠశాలలో చదువుకొనెడివాడు. పాపం! అతడు చాల బీదవాడు. కట్టుకోటానికి సరియైన బట్టలు వుండేవికావు. ఆ రోజుల్లో, బడి జీతం ఏరోజుది ఆరోజున పంతులుగార్కి ఇచ్చేసేవారు. ఆ నియమం ప్రకారమే ఫిలిన్‌థీస్ కూడా ప్రతి దినము జీతము పంతులుగార్కి ఇచ్చేసేవాడు. ఓ బీదపిల్లవాడు ఈ విధంగా ఏదినం జీతం ఆదినమే చెల్లిస్తుండటం మిగతా విద్యార్థుల్లో ఈర్ష్య గల్గించింది. పైపెచ్చు ఇతడు అందరికంటె చాల తెలివైనవాడు.

విద్యార్థులందరికి ఈ విషయం సందేహంగా ఉండేది. ధరించడానికి సహితం బట్టలైనా లేని, ఇతడు ఎట్లా ప్రతి నిత్యం జీతం ఇస్తున్నాడు? అనే ప్రశ్న బయలుదేరింది. చివరకు, విద్యార్థులందరు ఇతనిని ఓ దొంగగా జమకట్టి వేసారు. కోర్టులో ఫిర్యాదు చేసారు.

ఆ రోజున విచారణ. తన నిర్దోషిత్వాన్ని ప్రకటించుకోడానికి ఫిలిన్‌థీస్ ఇద్దరు సాక్షులను మెజిస్ట్రేటుగారి సమక్షమున హాజరు చేయించాడు. ఆ సాక్షులలో ఒకరు తోటమాలి, రెండవవారు ఒక వృద్ధ స్త్రీ. విచారణ ప్రారంభమయింది. ఒకటవసాక్షి: "ప్రభూ! ఈ కుర్రవాడు దొంగకాదు, సత్యవాది. నా తోటలోనికి ప్రతిరోజు నిర్ణీత సమయములో నీళ్లుతోడి పోస్తున్నాడు. అందులకుగాను ప్రతిరోజు నేను కొంత పైకము ఇస్తున్నాను."

రెండవసాక్షి: "ప్రభూ! నేను ముసలిదాన్ని. గృహకృత్యాలలో రోజూ నాకు ఈ బాలుడు సహాయము చేస్తున్నాడు. అందునకుగాను ప్రతి దినము ఇతనికి కొంత ధనం యిస్తున్నాను. ఈ కుర్రవాడు దొంగకాదు."

కోర్టువారు ఈ సాక్ష్యములువిని ఆశ్చర్య చకితులై ఆ బాలుడు నిర్దోషి యని తీర్పుయిచ్చారు. మెజిస్ట్రేటుగారు మిక్కిలి సంతోషించి ఆ బాలుని విద్యాభ్యాసానికి అవసరమైన పైకాన్ని ఉచితవేతనంగా ఇచ్చెదమని ప్రకటించారు. కాని, ఫిలెన్ థీస్ దీనికి ఎంతమాత్రము అంగీకరించక తన తల్లి కోర్కె నెరవేర్చుటకొరకే పూను కొన్నానని బదులు పల్కెను. చిరునగవు ముద్దు మోమున చలింపగా "ప్రభూ! నేను కృతజ్ఞుణ్ణి నేను శ్రమించి సంపాదించిన ధనముతోనే విద్యాభ్యాసము చేస్తాను. శరీరములో బలమున్నంత వరకు నేను ఎవరికి జేయిజాపను. జీవితమంతా కష్టపడి పనులుచేయ సంకల్పించాను. ఒకరిదయాభిక్షపై ఆధారపడను." అని పల్కగా అందరువిని ఆనందభరితులైరి. చూచారా, తల్లి మాట ప్రకారం మా బాలుడు ఎట్లు సంచరించినాడో!



# ఏం తలచుకున్నా సరే

ఒక సంఖ్య తలచుకోండి.

తలచుకొన్నదానిని రెండు పెట్టి హెచ్చవేయండి.

వచ్చిన లబ్ధానికి ఎనిమిది కలపండి.

కలిపిన మొత్తాన్ని తొమ్మిది పెట్టి గుణించండి.

ఆ వచ్చిన సంఖ్యనుండి డెబ్బైరెండు తీసివేయండి.

ఆ శేషమును మీరు తలచుకొన్న సంఖ్యపెట్టి భాగించండి.

ఎంతొస్తుందో చెప్పేదా ? ఉండండి చెప్తాను.

పద్దెనిమిది—అంతేనా !

చెల్లాయిలూ, తమ్ముళ్లూ, ఇలాంటి యుక్తి లెక్కలూ, ఇంకా కబుర్లూ, కథలూ, గమ్మత్తులూ, మీకు తెలిసినవి ఉంటే, వ్రాసి పంపండి. మీ పేరుతో ప్రచురిస్తాం.



# పడతులయెడ నవీనుల ప్రేమ గౌరవాలు

అంగర సత్యనారాయణాచార్య

[ఛార్లెస్ లాంబ్ ఇంగ్లములో వ్రాసిన " Modern Gallantry " అను వ్యాసమునకు స్వేచ్ఛానువాదం]

ప్రాచీనుల భావాలతో పోల్చుకొని చూచిన, నవీనులమైన మనము స్త్రీల నత్యంత సమాదర ప్రేమ భావములతో గౌరవించుతూ వున్నట్లు సంతృప్తిపడుతూ వుంటాము.

కాని మన నాగరికతకు ప్రారంభ మనుకుంటున్న 19 వ శతాబ్దమునుండి మాత్రమే స్త్రీలను బహిరంగముగ తిరస్కరించుటను విరమింప మొదలిడితిమనే విషయాన్ని కనుక విస్మరించ గలిగితే, మనసమాదరణ సూత్రము, మన ఉన్నతాదర్శాని చాటవచ్చు. నేడుకూడ ఇంగ్లండులో స్త్రీలు ఉరి తీయబడుచుండిరనే విషయాన్ని, నాటక రంగస్థలం మీద స్త్రీలు దూషింప బడుచుండిన నగ్నసత్యాన్ని మరచి పోతే, మనం స్త్రీ గౌరవాన్ని కాపాడుచున్నట్లు నమ్మవచ్చు. ఒకే ట్రాములో ప్రయాణము చేయుచున్న బీదవనిత వర్షముచే తడిచి వణకుచున్నపుడు ఆ ప్రక్కనే కూర్చునియున్న ధనికుడైన వర్తకుడు తనవులెన్ రగ్గుతో నామెను సంరక్షించినపుడే,—జబ్బు పడిన యొక నారీమణీ వీలులేక ప్రదర్శన శాలలో నిలబడినపుడు ఆ చుట్టూ కూర్చుని యున్న యువక బృందం ఆమె నపహాస్యం చేయనపుడే, మన సమాదరణకు అర్థం వుంటుంది. కొందఱు అతి తెలివైన వాళ్ళు " ఆమే కనుక ఏపాటి అందంగానూ, యౌవ్వనంగాను వుంటేనా, తప్పక నా కుర్చీలో స్థానమిచ్చియుండక పోదునా "అంటూ వుంటారు. ఇలాంటి తుచ్ఛ ప్రలాపాలు నశించి నప్పుడే మన మేమి చెప్పినా నమ్మబాటవుతుంది. పైకష్ట నష్టాలు కొంతలకు తొలగేరోజువరకూ, మనం స్త్రీలయెడ నెంతో ఆదర భావము ప్రకటించుచున్నామంటే, అది వాక్చాతుర్యమే కాని నిజమైన ఆ ధర్మసూత్రమని మాత్రం విశ్వసింప జాలను. ఇరువురు స్త్రీ పురుషులు తాము సమవృజ్జీగా నుంటిమని భావించినపుడు, వారిరువురి మధ్యా, ఒక అంతస్థుస్థాయిలో, జీవితములలో ఒక విధమైన మార్పు వచ్చు సందర్భంలో, చూపబడుప్రేమ, వట్టి డంబాచారమేకాని నిజమైన ఆదర్శ సూత్రముగా నమ్మజాలను—

స్త్రీ అందమైనదనిగాని, అదృష్టవంతురాలనిగాని, లేక కీర్తిగలదనిగాని కాకుండా స్త్రీలోని స్త్రీత్వమనే దృష్టిలో పెట్టుకొని, ఉన్నతవర్గముల వారు, వృద్ధులకు,—వయస్కులకు, గృహిణులకు, అందమైన యితర స్త్రీలకు సరిసమానమైన ఆదరణ చూపినప్పుడే మన యాదర్శము ఫలించును. ఒక వ్యక్తి పదిమందిలో పూర్వకాలపు కాముక వ్యాపారముల పద్ధతిని గురించి ప్రలాపించేటప్పుడు, వినే వారందరూ వానిని వెంటనే తీవ్రముగా నిరసించిననే సరియైన స్త్రీ సమాదరణకు విలువ.

స్త్రీ సమాదరణ విషయంలో బ్రెడ్ స్ట్రీట్ హిల్స్‌లో నివసిస్తున్న, జోసెఫ్ పైస్ అనే వర్తకుడు చెప్పుకోతగ్గవాడు. నేను కలుసుకొన్న వారందరిలోనూ ఉన్నతమైన, స్థిరమైన స్త్రీ గౌరవముగల వ్యక్తి అతడొక్కడే. సౌత్ సీ కంపెనీ డైరెక్టర్లలో యీతడొక్కడు. షేక్స్పియర్ వాఖ్యాతయైన ఎడ్వర్డ్సు, యితడ్ని కీర్తిస్తూనే అందమైన ఒక గీతికవ్రాశాడు. చిన్నప్పుడు నన్ను సంరక్షించి, నా కొఱకై చాలా కష్టపడ్డాడు. అయితే ఆ ట్టేకాలం అతని వద్దనేవుండి లాభం పొందలేకపోయానంటే, అందతని తప్పు యేమాత్రమూ లేదు. మతరీత్యా ప్రెస్‌బిటేరియన్ అయినా, వ్యాపార రీత్యా వర్తకుడే అయినా, సమకాలికులందరిలోనూ, జోసెఫ్ మహోన్నత దర్మములుగల అసాధారణవ్యక్తి.

చిత్రశాలలోని స్త్రీలతో నొక విధంగానూ, హోటలులలోని, షాపులలోని స్త్రీలతో వేరొకరీతిగాను జోసెఫ్ మెలగడు. అలా అంటే అతడు విచక్షణలేనివాడని మాత్రం కాదుసుమా! స్త్రీలను వీక్షించకుండా పోవుటగాని, పరిస్థితులు అనుకూలముగా లేవను వంకతో వాళ్ళను తప్పించుకొని పోవుటగాని యాతడెన్నడూ యెఱుగడు. ఒక వీధికి త్రోవచూపిన పేద దాసీకన్యను, వెన్నెల నవ్వులు తొణికిస

లాడిస్తూ తన హాట్‌ను తలనూడతీసి అమితంగా గౌరవించాడు. ఒక రోజున సంతలో అమ్మకమునకై ఒక పేద యిల్లాలు పండ్లగంపను నెత్తిపై నుంచుకొని పోవుచున్నది. జోసెఫ్, ఆమె బీదతనము నేమాత్రమూ సరకు గొనక, ఉన్నత కుటుంబ వనితవలెనే ఆమెను గౌరవించి గంపలోని పండ్లకేమాత్రము నష్టము కలగకుండా తన గొడుగును వాటిపై కప్పి ఆమెకు సాయపడెను. మన యిండ్లలో మన అవ్వలకు మనం చూపే ప్రతీకంటే, వృద్ధ వనితల కాతని యాదర మమోఘము. "వాడిన పూవులందును సువాసనలందిన రమ్య మూర్తి" గా జోసెఫ్ కీర్తినందాడు.

జోసెఫ్ అవివాహితుడే కాని యాతని యౌవన దశలో సూసన్‌విన్‌స్టనీ అనే సుందరిని వలచాడు. వారి వలపు చూపుల ప్రథమదశలోనే ఆమె మరణించడం మూలాన్న శాశ్వత బ్రహ్మచారిగా మిగిలి పోవటానికి అతడు నిశ్చితుడాయెను. సూసన్ ఆత్మ గౌరవంగల నారీమణి. స్వజాతి గౌరవాన్ని తీర్చి దిద్దుటకై దివారాత్రములు శ్రమించిన విదుషీమణి. ధైర్యముగా మాట్లాడగల యదార్థ వాదిని. రోజూ లాగుననే ఒకనాడు జోసెఫ్ ఆమెతో ప్రేమా లాపములు చేయ మొదలిడినపుడు, మామూలుగా ఆమె చూపు ఆసక్తి ఆ రోజున కానరాకుండెను. మరునాడు ఆమె యుత్సాహముగా నున్నతరిలో, గత దినమున నామె నిరుత్సాహముగా నుండుటను గురించి జోసెఫ్ ప్రశ్నింపగా సూసన్ యిట్లా అన్నది. "సంభాషణల యెడ నాకు అయిష్టత ఏమీలేదు. మీ ప్రేమ భాషణలు నాకు బాగానే యున్నవి. నా స్థితిలో వుండే యే కన్యఅయినా అటువంటి గౌరవ ప్రదమైన, ప్రేమపూరితమైన సంభాషణలను అపేక్షించే వాక్కును కలిగివుండడం సహజమే. చాలమంది యౌవ్వన వతులవలె నేనుకూడ కొంత పొగడ్తను, కొంతనిందను భరించగల ననుకుంటాను. కాని నాతో ప్రేమ సంభాషణలు జరుపుటకు కొంతపూర్వం, అనుకున్న టైముకు సరిగ్గా మీ దుస్తులను అందివ్వ జాలక పోయిన స్త్రీని మీరు అతి తేలికగా తూలనాడటాన్ని సందర్భ వశాత్తు పరోక్షంగా విన్నాను. అపుడు, అందానికి, అదృష్టానికి వన్నెకెక్కిన పడుచుదాన్ని గనుక యీ ప్రేమికుని నోటినుండి సరస సంభాషణలను చూరగొంటున్నానే కాని, నేనె కనుక అర్థరాత్రివరకూ ఎంత తంటాలుపడ్డా, అనుకున్న ప్రకారం మీ బట్టల నివ్వలేని యా మేరీనే అయివుంటే యెటువంటి వాక్కులను పరిగ్రహించవలసి వచ్చునోకదా! అని అనుకున్నాను. కాని వెంటనే స్త్రీ సహజమైన అభిమానం స్ఫురణకు వచ్చింది. అప్పుడు నే నిలా ఆలోచించాను. నన్నే కనుక గౌరవించ దలచితే స్త్రీల నయిన నాబోటి దానిని సవ్యమైన భాషణలతో ఆదరించాలి. పురుషులతో సమాధాన పడాలంటే యే విధమైన ఆడంబరోప న్యాసాలనూ అంగీకరించ కూడదని నిశ్చయించు కున్నాను" అని ముగించింది.

తన ప్రేమికున కిచ్చిన సమాధానంలో నామె మర్యాదనూ, న్యాయ మార్గంలో యోచించుటనూ పాటించిందని నానమ్మకం. ఏ విధమైన విచక్షణనూ పాటించకుండా అన్ని తరగతుల స్త్రీలనూ అసమానమైన గౌరవ ప్రేమభావములతో సమాదరించుటకు, ఎవరికోసమయితే యాతడు మిక్కిలిగా వగచాడో ఆ ప్రేమికురాలి పెదవులనుండి సమయోచితముగా వెలువడిన పవిత్రవాక్కులే, జోసెఫ్‌కు పరమ ప్రమాణమైయుండునని నేనప్పుడప్పుడూహిస్తూ వుంటాను.

సూసన్ విన్‌స్టన్లీ చూపిన యీ మార్గాన్ని మహిళాలోకము యావత్తూ అనుసరించ గలదనే నానమ్మకం. అప్పుడే స్థిరమైన సమాదరణోత్సాహాన్ని కొంతవరకూ చూడ గలుగుతాం. ఒకే ఒక పురుషుడు ఒకవంక భార్యను గౌరవించడం, వేరొకవంక నిజసోదరిని నిరాదరించడం అనేది అనతి కాలంలోనే సమసి పోవునని నేను నమ్ముచున్నాను. పురుషుడు తన్ను ప్రేమించునప్పుడుగాని, తదనంతరము గాని స్త్రీ ఆర్థించవలసినది యేమిటీ అంటే—మొదటిది స్త్రీ కనుక తన్నారీతిగా గౌరవించుట,—రెండవది, ఇతర స్త్రీలనుమించి, తన భర్తచే తాను గౌరవము పొందుట. కాని స్వచ్ఛమైన పునాది కట్టుదిట్టముగల స్త్రీత్వమున కామెనిగ్గుతేరి నిలబడవలసి యున్నది. ఈపై ప్రధాన సూత్రాన్ని విడువకుండా, వ్యక్తిగతమైన అవసరాలనుబట్టి, ప్రాముఖ్యతనుబట్టి తమ యభిప్రాయాలను యథేచ్ఛగా వెల్లడించుకోవచ్చు. కాని సూసన్‌వలన ప్రతి నారీమణి నేర్చుకోవలసిన ప్రథమ గుణపాఠము—తన జాతిని గౌరవించుకోగల్గుటయే.



# ప్రమీల

"ఉషారాణి" హిందీమూలం : : అనుసరణ "ఉషాదేవి"

"సాయం సమయం. సంజకాంత త్రివర్ణ సువర్ణపు టంచుల చీరగట్టుకొని హొరంగుమీఱు మెఱుంగుల్లా రంగు రంగుల రంగవల్లరులని అలంకరిస్తోంది. శుకపికాలు స్వేచ్ఛా గీతాల కలకల నినాదాలతో రంగత్తుంగ తరంగ వేగంతో జన్మభూమికి చేరుకుంటున్నాయి. స్వాతంత్ర్య సౌరభసమ్మిళిత సువాసల్ని కన్నె గులాబులనుండి సరఫరా చేస్తున్నాడు చల్లని పిల్లగాలిగాడు. ఏవేవో తెలియరాని కోర్కెలతో బోటన వ్రేలు నోట్లో పెట్టుకుని ఉయ్యాలూగు తున్నాడు పసి పాపడు—అంతా-ప్రకృతి. అర్థంకాని స్వార్థ రహిత ఆనందాన్ని అందజేయుట కోసమే ప్రకృతి—ఈ ప్రకృతిని సృష్టించిన వాడు ఎవరో? అతని మనస్తత్వ మేమిటో?—

మనస్తత్వం—నిజంగా యిదొక అభూత వస్తువు. మనిషిని అర్థంచేసుకోగలం కాని మనస్తత్వం అర్థం.చేసుకోలేం. ఈ మనస్తత్వ సమస్యే నన్ను బాధిస్తోంది. సంవత్సరంమీద ఆర్నెల్లనుంచి ఎంతో ఓపికతో పరిశీలిస్తున్నాను. సమగ్రావలోకన చేస్తున్నాను. కాని నా సహపాఠి, ఒక యువతి మనస్తత్వం ఈషత్తుకూడా అవగాహన కావటంలేదు. అసలు 'ప్రమీల'కు మనస్సేలేదేమో! మనస్సులేందే మనస్తత్వం ఉండదుకా? ఛా! మనస్సు లేక పోవడమేమిటి? అయితే 'ప్రమీల'ది అర్థంకాని మనస్తత్వం అనే నిర్ణయంతో ముగిస్తున్నా."

సరిగ్గాయిదే కాగితం 'ప్రమీల' గదిలో చూసా. ఆమె రోజూ కూర్చొని చదువుకొనే కుర్చీ కెదురుగా ఉన్న "మేజా"మీద ఉంది. ఏమిటి కాగితం ఎలా వచ్చిందిక్కడికి? ఇది కథా? నవలా? ఏదయినా ఈ ఒక్క కాగితం ఉండడంలో అర్థమేమిటి? ఎవరు వ్రాసారు? ఎందుకు వ్రాయవలసి వచ్చింది? ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ మనస్తత్వ వేదాంతంలోకి దిగి దానికి "ప్రమీల"ని ముడి పెట్టాడేమిటి? అసలీ వ్యక్తి స్త్రీయా? పురుషుడా? సజీవుడేనా? కీర్తిశేషుడా? ఇన్ని సమస్యలు తాండవించాయి నాముందు. అసలు 'ప్రమీల' మనస్తత్వ ప్రమేయమే నాకు పట్టలేదు. ఈ సమస్యలు పరిష్కరించాలంటే "ప్రమీల"రావాలి. సరే! కేకవేసాను—వస్తున్నానంటూ వచ్చింది.

ఇక్కడ మాత్రం కొంచెం 'ప్రమీల'ని గూర్చి మీకు చెప్పాలి. చెప్పకుండా ఉండటంవల్ల విషయం విశదంకాదు. అక్కణ్ణుంచి మీరు బాధ పడాల్సి వస్తుంది—ప్రమీలా-నేనూ రెండేళ్ళనుంచి 'క్లాస్ మేట్స్'ము. మే మిద్దరమూ కాలేజిలో చేరి రెండేళ్ళవుతుంది. చేరిన ఏడాదినుంచే పరిచయం. అంతకుముందు మా యిద్దరికి ఉన్న సంబంధం ఒక జిల్లావాళ్ళం మాత్రమే. అయితే మా యిద్దరికి అయిన పరిచయ వివరాలు తెలపాలంటే 'వేయి పడగలంత' గ్రంథమౌతుంది. వచనంలో-గేయాల్లో అయితే 'యెంకిపాటల'న్ని పాట లవుతాయి. విషయం - ఇంక "ప్రమీల" నాజూగ్గా చామన చాయగా, పొడుగాటి జడతో, అయస్కాంత శక్తిగల చక్కనైన చిక్కని కళ్లతో (ఆ 'కళ్ళే' మా పరిచయాని క్కారణం) చూడ ముద్దొస్తూ ఉండే పదునెనిమిదేళ్ళ తరుణ వయస్సులో ఉంది. ప్రాక్ ప్రతీచీ సమ్యక్సమ్మేళనా నాగరికతను ప్రతిఫలిస్తూ ఉంటుంది. చదువంటే మహాశ్రద్ధ-మితభాషిణి. (నాది అతి వాగుడు తత్వంలెండి) మనిషిని చూస్తే అదోరకం అయోమయం వ్యక్తిలా కనపడుతుంది. కొంచెం చిర్రూ, బుస్సూమనే వ్యక్తిలా తడుతుంది. కాని పరిచయంకల వ్యక్తి మాత్రం ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చలేదు. వెలిబుచ్చుదామన్నా అవకాశం లేదు. అంతయిదిగా ఉంటుంది ప్రమీల. (కథలో వ్యక్తిని గూర్చి యింతగొడవ పెంచు తాడేమిటి? కథ సాగనివ్వక అని కొంచెం విసుపుపడుతున్నారు కాదూ? హా ఇది కథ కాదు నిజం-వాస్తవం- అని మనవిచేస్తున్నా) ఎంతో హుషారుగా పసందుగా మాట్లాడుతుంది ప్రమీల (మాట్లాడిన కాస్సేపే) ఒళ్ళు తెలీకుండా మసిలే వ్యక్తుల్ని చూస్తే మాత్రం ఆమె కళ్ళల్లోంచి చింతనిప్పులు రాల్తాయి. కరాళ కాళికా

స్వరూపం ప్రత్యక్షమౌతుంది. అప్పట్లోమాత్రం కోపంకూడా స్త్రీకి సౌందర్యమే అన్న విషయం దెబ్బ తిన్నట్లనిపిస్తుంది నా దృష్టిలో. ఛలాకీ తనం తక్కువగా కనిపిస్తుంది పైకి! 'ఇదే'మని ఆమెనే అడిగితే "ఛలాకీగా ఉంటే తోటి వారికి కొంత చనువివ్వాలి. ఆ చనువుని వారు సక్రమంగా వినియోగించుకో లేరు" అంటూంటుంది—రాయడం ప్రారంభిస్తే ఈ ఒక్క వ్యక్తినే 'పాత్ర'గా తీసికొని ఓ భారతం రాయవచ్చు. కనుక దానికి స్వస్తి చెప్పి అసలు విషయం ఎత్తుకుంటా—"వచ్చింది-అని కాదు ఆపుచేసాం-అం-వస్తూండగానే ఆ కాగితం పైకెత్తి ఆమె వైపుకు త్రిప్పాను. వెనుక వైపున సమాధానాన్న పేక్షించే...నీ..." అని ఉన్న అక్షరాలు కనపడ్డాయి- కాగితం చూడకుండానే "ప్రమీల"వచ్చి నా ప్రక్కన కూచుంది. రెండునిమిషాలు నిశ్శబ్దంగా కూచుంది కాని మౌనం మహా భయానకంగా తోస్తుంది నాకు. అందుచేత నేనే—

"ఏం"ఉషా! (నన్నెరిగిన వాళ్ళందర్నీ ఇలా పిలవడం నాకో అలవాటు) ఏమిటిది?"అన్నాను. కాగితం చేత్తో పట్టుకునే ఒక్క వేడి నిటూర్పు విడిచింది. మా పరిచయంలో నేనప్పుడే చూసాను ఆమె నిట్టూర్పు విడవడం, అందులోను కేడిగా. ఆ నిట్టూర్పు నన్ను చాల కలవరపెట్టింది ఎందుకో మాత్రం ఇప్పటికి తెలీదు. "అదంతా ఓ పెద్దకథ. కథ అంటున్నానని 'కల్పన' అనుకోకు. జీవితమే ఒక కథగా! అందులో ఇదో ఉపకథ. అయినా అసలు కథకన్న పెద్దది. వింటానికి ఓపిక ఉందికదూ" అంది చిరునవ్వుతో, ఆ నిట్టూర్పు—మరుక్షణంలో ఈ చిరునవ్వు నిజంగా నన్ను ఆటంబాంబు మధ్య కుక్కినట్లనిపించాయి-కాని నిరాశ తరువాత ఆశా, దుఃఖం తర్వాత సుఖం రాక మానవనే నమ్మకం గల నేను ఆ 'కుక్క'లోంచి అనంతాకాశ స్వేచ్ఛా విహారంలోకి రాగలిగా. "ఆ చెప్పు. అసలు నువ్వు మాట్లాడటమే అరుదు. అందులో ఎదిరి మనిషిచేత తెగవాగించడమే కాని నీ అభిప్రాయం చెప్పక చంపేసే నువ్వు పెద్దకథ చెపుతానంటే ఓపిక లేక పోయినా వింటాను"అన్నా—"అందుకే నేను 'మితం'గా మాట్లాడుతాను. ఓపిక లేక పోయినా బలవంతాన వినిపించడం నా కిష్టంలేదు" అంది ముఖావంగా ఆ మాటతో జీవాత్మా, పరమాత్మా ఏకమైనట్లనిపించింది. ఏదో తెలీక హుషారు కొద్ది అన్న మాటకే ఇంతైతే ఎల్లాగరా భగవంతుడా అనుకొని—

"ఉషా! నిజంగా నేను అనాలని ఆ మాట అనలేదు. రెండు సంవత్సరాలనుంచి ఎంతో చనువుగా మాట్లాడుకుంటూన్నా, నువ్వు నా తత్త్వం గ్రహించలేదంటే నేను నమ్మను. ఎంతో ఆ దుర్దాలో ఏమన్నానో, ఏమనాలో తెలీకుండా అన్నాను. చెప్పు ఉషా"అన్నాను. "ఇక అబద్ధాన్ని కప్పిపుచ్చటానికి మరికొన్ని అబద్ధాలు. జాతి అలా తయారయింది"అంది ఈసడింపుగా—నిజమే ఆమె చెప్పిన దాంలోమాత్రం అబద్ధంలేదని రూఢిగా చెప్పగలను. కాని ఏం చేసేది? ఆతురత మాత్రం పీడిస్తోంది "చెప్పు ఉషా..."అన్నా, ఇంకేమనీ ప్రయోజనం లేదని తెలిసి—ఒక్క చిరునవ్వు నవ్వింది. గులాబిల్ని కూడా హసిస్తుందా హాసం—

"వట్టి అమాయకుడవు సుమీ-ఎంతో తెలివైన వాణ్ణను కుంటావ్—పీ—విను. ఎన్నాళ్ళనుంచో చెప్పాలనిఉంది. కాని ఒకరు అడగందే వాగటం నా కిష్టంలేదు. ఇవాల్టికి కుదిరింది. ఆ కాగితాన్ని గురించే కాదు నీ సందేహం?" అంది సాభిప్రాయంగా నా వైపు తన అయస్కాంత దృక్కుల్ని బరపుతూ—

"కాగితం విషయం కాదు. అందులోని విషయం విషయం"అన్నా.

"నాకు తెలుసుకా, నీ తత్వమంతా-ఎవరిని పెళ్ళాడతావో కాని...సరేలే శ్రద్ధగావిను—

అవి నేను స్కూలు ఫైనలు చదివే రోజులు. అప్పట్లో నాన్నగారు పట్నంలో పని చేస్తూండే వారు—నేనూ, మా అమ్మా నగరంలోనే ఉండే వాళ్ళం ప్రత్యేకంగా చదువును గురించి. ఆ రోజుల్లో విశృంఖల విహారం అధికంగా వుండేది. అడిగేవారా? అడ్డేవారా? అప్పుడు నేటి "ఉష"గా లేకుండా నాటి "ప్రమీలగా" ఉండేదాన్ని నాకు అందరితోనూ చనువుగా మాట్లాడటమంటే ఎంతో సరదాగా ఉండేది. ఏకాకి జీవితమన్నా, ముంగి ముషాణంలా

ఉండడమన్నా పరమ అసహ్యంగా, నరకంలో ఉన్నట్లుగా ఉండేది. నిజం కూడా అంతే" హైస్కూలు కార్యక్రమాల్లో విద్యార్థులకి సంబంధించినంత వరకూ నేనూ ఒక భాగ స్వామినిగానే ఉండేదాన్ని. నాటికీ నేటికీ సహస్రాంశం తేడా ఉంది. అసలా అంశలే లేవు నేడు నాలో. ఈ నాడు నీతో మాట్లాడుతూన్న చనువుకన్న అత్యధికమైన చనువుగా అందరితోనూ మాట్లాడే దాన్ని-మనసువిప్పి చెప్పుతున్నాను. ఇంతవరకూ నా శీలాన్ని నేను ఈషత్తూ కళంక పరచుకో నందుకు గర్విస్తున్నాను.

అయితే నేనిచ్చిన చనువును, నా మైత్రిని వారు సరిగా అర్థంచేసికోలేక పోయారు. రకరకాలుగా, అతి హేయంగా ప్రవర్తించే వారు. నా యీ ప్రవర్తన వారికి వింతగా కన పడింది. వారి నైతిక శక్తిని నైచ్యంగా చేసేసింది. నా ప్రవర్తనమాత్రం దానికి కారణం అంటే నే నంగీకరించలేను. "అన్నయ్యా"అని నేను పిలుస్తూంటే వారూ నన్ను "చెల్లీ"అని పిలవలేక పోయేవారు. తొలుతలో పేరుపెట్టి పిలిచే వారు. తరువాత 'ప్రమీల రాణీ'అని పిలిచే వారు. అది రాను రాను 'రాణీ'గానూ "హృదయరాణీ"గాను మారింది. ఇంత నైచ్యానికి వాళ్లు సాహసిస్తారనే ఆలోచన ఆ నాటి నా ఊహకు తట్టలేదు. కొంతవరకూ చెప్పిచూసా. కాని లాభంలేక పోయింది. ఎడతెరపి లేకుండా ఇంటికి వస్తూండడం ఏదో అడుగుతూండడం మళ్ళీ అది ఇచ్చేటప్పుడు ఆ పుస్తకంమీదే లేఖలు రాస్తూండడం జరిగింది. "సహన శక్తికికూడా హద్దులుండాలి" అన్నావు నువ్వు జ్ఞాపకం ఉందీ—ఆ నాసహనశక్తి అంతటితో నశించింది. ఆ నాటి నుంచి కఠోరంగా ప్రవర్తించేదాన్ని.

ఒక షావుకారు బిడ్డ నా ఎడమ కాలి జోడు దెబ్బ కూడా తిన్నాడు. తర్వాత చాలా విచారించాను. స్వయం కృతాపరాధానికి వాళ్ళని బలి చెయ్యడమా? అపరాధం ఒకరిదీ శిక్ష మరొకరిదీనా? అని సందేహించే దాన్ని ఆలోచించి చూస్తే అందులో నా తప్పేమీ కనబడదు. చనువుగా సంచరించే సహపాఠులను ఈ విధంగా వాళ్లు చూడటంలో అపరాధం నాదా? ఎంత మాత్రంకాదు. అయితే ఆలోచించి చూస్తే నా బాధ్యత కూడాలేక పోలేదు. కొంత వరకూ నాకూ అందులో "భాగం"ఉందని పిస్తోంది. ఆ 'భాగం'కూడా నాకు లేదు విశాల దృష్ట్యా పరిశీలిస్తే. కాని ప్రస్తుత పరిస్థితుల్ని బట్టి "ఉందీ"అనుకోవలసి వస్తుంది. నా యీ చనువును పొరపాటుగా అర్థం చేసికొని చాలామంది తమ చదువులు నాశనం చేసుకున్నారు. కానీ ఖర్చు పెట్టని స్వార్థ పరులు కూడా (విద్యార్థులే) నేను ఫండ్సు కోసం వెడితే అయి దులూ, పదులూ పారేసేవారు. అప్పట్లో వీళ్ళని "విద్యార్థులు" అందామంటానిక్కూడా నాకు మనసొప్పేదికాదు. ఆ "విద్యార్థి"పద గౌరవం—"విద్యా"పద ఔచిత్యం నాశనమౌతున్నాయనిపించేది. ఇది చూసి నువ్వు నన్నొక "సనాతనురాలు"గా ఊహించుకుంటూ ఉండొచ్చు. ఆ విషయంలో నిజంగా సనాతనుల వైఖరులే ఉత్తమంగా కన పడతాయి. అయితే స్త్రీలకు కూడా వారా గౌరవాన్నియ్య వలసింది అనే 'చేరిక' మాత్రమే నా అభిప్రాయం. ఏదో గొడవలోకి పోతున్నట్టున్నా-ఆఁ-అంచేత వారిని ఆ నీచ పథాన్నుంచి త్రిప్పవలసిన బాధ్యతకూడా నామీదే పడింది. పడేసుకున్నానంటే బాగుంటుంది. ప్రత్యేకంగా వారిని అంటే విద్యార్థులను విద్యార్థులుగా ఉంచటం కోసం నా ప్రవర్తనను మార్చుకోవలసి వచ్చింది. అప్పట్నుంచే నేనిలా మారిపోయాను. నిజంగా నాటి అనుభవాలు నేడు పులక లెత్తిస్తూంటాయ్. విచారాన్నీ, జాలినీగొలువు తూంటాయి. ఇక్కడ ఎలా వుంటుందో అని చూసా. ఇక్కడా అంతే వెనుకటి ఏడాది "జయ"విషయం ఎరుగుదువు కాదూ— పేరుకు మాత్రం కాలేజీ-విజ్ఞానం శూన్యం-జాగ్రత్తగా విను ఆఁ అసలు విషయం కాగితాన్ని గూర్చి కాదూ? ఆ కథ విను-అదో అపూర్వానుభవం.చాలాగమ్మత్తుగా ఉంటుంది— నా అనుభవాలే నాకు నవరసాలు యిస్తూ రసానుభూతి కూడా కలిగిస్తూంటాయి-ఆఁ—

ఈనాడు మన మిద్దరం ఎంత చిర పరిచితులుగా మెలగు తున్నామో ఆనాడు అంటే నేను స్కూల్ ఫైనల్ చదివే రోజుల్లో అతనూ నేనూ అంత చనువుగా మెలిగే వాళ్ళం 'అతను'అంటే మరెవరో కాదు ఈ కాగితం వ్రాసిన వ్యక్తి. నాటి చనువును ఈనాడు మాటల్లో చెప్పడం కష్టం. అదే

నాకప్పుడప్పుడు తోస్తూంటుంది. మానవుడు స్వీయానుభూతిని కాగితం మీద కెక్కించ లేడు. స్వయం రసానుభూతిని అసలే ఎక్కించలేడు. ఏం? అప్పట్లో అతను ప్రతి రోజూ మా యింటికి వస్తూండడం ఇద్దరం కలిసి చదువుకుంటూండడం జరుగుతూండేది. ఏది ఎలా అయినా, చదువు విషయంలో మాత్రం చాలా శ్రద్ధ వహించే వాళ్ళం. చాలా హుషారుగా చదివే వాళ్ళంలే. అతను కొంత కాలం వరకూ చాలా స్నేహంగా కనపడ్డాడు. ఒక్కొక్కప్పుడు రాత్రులు కూడా మా యింట్లోనే ఉండేవాడు. అతనుకూడా ఆ చనువుని కొంతవరకూ అపార్థం చేసికున్నాడు.

మేము రోజూ స్కూలు వదలగానే ఓమైలు దూరం నడచి యింటికి పోవాలి. ఆ రోడ్డున స్కూలుకి సంబంధించినంతవరకూ మా యిద్దరియిళ్ళే ఉన్నాయి. ఆ నాడు శుక్రవారం. ప్రతి శుక్రవారం హైస్కూల్లో డిబేట్ జరుగుతూంటుంది. సర్వ సాధారణంగా అతను ప్రతిదాంట్లోనూ పాల్గొంటాడు. నీలానే కొంచెం అతివాగుడు మనిషి. అ నాడు 'విడాకుల' అవశ్యకతా నవశ్యకతల గూర్చి చర్చ జరుగుతోంది. తప్పని సరిమీద నేనూ ఒకవక్తగా నిలబడ్డాను. ఏదో మాట్లాడాంలే. చాలా పొద్దు పోయింది మీటింగయేటప్పటికి. బయల్దేరి యిద్దరం వచ్చేస్తున్నాం. ఆరోజు అమావాస్య, పైగా వర్షాకాలం, దట్టంగా మబ్బులు కమ్మికుంటున్నాయి. చెట్లుడీకొంటున్నాయ్. నానా అట్టహాసంగాను ఉంది ప్రకృతి. అంతప్రశాంత సౌందర్యంలో ఇంత అశాంతి రౌద్రాలు ఉంటాయని ఊహించలేక పోయాను. నడకసాగిస్తున్నాం నిర్మానుష్యంగా ఉందిరోడ్డు. అంటీ అంటనట్టుగా నడుస్తున్నాం. నిశ్శబ్దంగా పోతున్నాం. చెప్పానుకా అతను అపార్థం చేసుకున్నాడని—

బుజంమీద చేయివేసాడు. పోనీలేఅని సాగిపోతున్నా. ఏమైనా తొందరపడ్డం మంచిదికాదుకా. చెయ్యి కొంచెం కిందకు దింపాడు-మరికా స్త......అంతకన్న నీకు చెప్పక్కర్లేదుకా—అని ఆపింది. ఆమె కళ్ళ వెంబడి నీరు జోటజోట రాల్తోంది. అంతవరకూ శిలా ప్రతిమలా కూమున్న నా ఒడలు కంపించింది. కాని నేను ఎరిగి ఉన్నంతలో ప్రమీల (ఉష) కంట నీరెట్టడం అదే ప్రథమం-కళ్ళ నీళ్లు తుడుచుకుంది.

ఒక్క లెంపకాయ సాచికొడ్దామనిపించింది. కాని హృదయం వెనక్కి లాగేసింది. చెయ్యితీసేసాను. ఎదురుగా నిలబడ్డాను. మనిషి గజగజవణికి పోతున్నాడు-కలవర పడుతున్నాడు-అప్పుడిలా అన్నా.

"అన్నయ్యా, జీవితాల్ని ఈ మార్గలో నడపకు"—అంతకన్నమాట రాలేదు. కొద్దిగా సర్దుకుని మళ్ళీ "నేను నిన్ను ఏ దృష్టితో చూస్తున్నానో నువ్వు నన్ను ఆ దృష్టితోనే చూడు" అన్నా. అంతే. అలా మోకాళ్ళ మీద వాలాడు. "చెల్లీ! అపరాధం చేసా-ఇంక నీ మొహం చూడను-నీయింటికి రాలేను. ఇంక అసలు స్త్రీతోపరిచయానికే బాధపడను..." అని వలవల చంటిపిల్లలా ఏడ్చాడు. ఆ సమయంలో రాయికూడ కరిగి పోవలసిందే. కారుమబ్బులు విడి పోతున్నాయి-నీలాకాశం మీద తెల్ల తెల్లని ముగ్గులుచెక్కే నక్షత్రాలే చంద్రకాంతిని ప్రసరించాయి. ఆ సమయంలో—"అన్నయా! నీ జీవితంలో యిది నీకు మొదటిసారి. అంచేత అలా అనుకుంటున్నావ్. అని కాక అపరాధం చేసింది నువ్వు—శిక్ష విధించ వలసింది నేను. శిక్షగా ఇవాళ రాత్రి మా యింటికి భోజనానికిరా. తప్పదు" అన్నా. సరే అన్నాడు. తరువాత నిజంగా అతను మనిషి మారిపోయాడు. శుద్ధవిరాగిలా తయారయ్యాడు. మొత్తం మీద ఆయేడాది గట్టెకించాడు. ఈ మధ్యనే మా యిరువురి జీవితాలు కలిపి ఒక 'నవల'గా వ్రాస్తున్నాడు. దాని అంతిమ ఘట్టంయిది. ప్రతిఘట్టం పంపాడు. యిది మాత్రం పూర్తిగా మతిలేని స్థితిలో వ్రాసాడు. నా మనస్తత్వం అర్థం కాదంటాడు" అని నిట్టూర్చింది ప్రమీల—







* ఆయపిళ్ల రామారావు *

"అమ్మా నేను వచ్చేంత వరకూ ఆకలితో ఉండకపోతే గేం! నువ్వు తినేసి విశ్రాంతి తీసుకోరాదూ, నీ శరీరంలో కూడ బాగాలేదాయె!" అన్నది మాలతి సుందరమ్మతో.

"అదెట్లా సాధ్యమౌతుం దమ్మాయి. నీ కన్నా నా ప్రాణం హెచ్చా! అయినా నీకెందు కింత శ్రమ? ఇంత అలస్యంచేసుకోటానికి నీకేం అవసరం? నీ ఆరోగ్యము చెడుతూందని నాకేమీ తోచటం లేదు తల్లీ." కళ్లింట నీళ్లు తిరుగుతున్నాయి సుందరమ్మకు.

"నాకేం తక్కువమ్మా! నా ఆరోగ్యం బాగానే వుంది."

"ఆ సంగతిప్పుడు తెలీదమ్మాయి" కళ్ల నీళ్లు తుడుచుకుంటూ అంది సుందరమ్మ.

సుందరమ్మకు తనకడచిన జీవితమంతా స్మరణకు వచ్చింది. మాలతిదింకా లేతహృదయం. పైగా ఇప్పుడే చదువు ముగించి మిస్ట్రెస్‌గా ఒక స్కూల్లో పని చేస్తూంది. క్రొత్త క్రొత్త రుచులకోసం ఆశిస్తూవుంటుంది. తన రుచుల కోసం విలాసాలకోసం వ్యభిచరించటానికి కూడా సంకోచించదు. సుందరమ్మకన్న వ్యభిచారిణులుండరేమో! అయినా ఆమె కడుపు కోసం లేదా ఒక కారణం కోసం వ్యభిచరించింది. సుందరమ్మకు వ్యభిచారమంటే ఎంత రోతో అంత తప్పని సరి అయింది. మాలతికి అది ఎంత అనవసరమో అంత సుఖ వయింది. అది పాశ్చాత్య నాగరికత లక్షణాల్లో ఒకటి. పాశ్చాత్యులు విలాసం కోసం వ్యభిచరిస్తారు. భారత నారి కూటి కోసం లేదా ఒక ప్రత్యేక కారణం కోసం విధిలేక వ్యభిచరిస్తుంది. మన ధర్మాల్లో వ్యభిచారం మహాపాపం. వాళ్లల్లో దానికంత పట్టింపులేదు. మాలతిని అల్లాంటి పనికి గురికాకుండా చేయటానికే సుందరమ్మ తన జీవితాన్ని కష్టాన్ని ధారపోసింది.

ఆమె భర్త పోలీసు కానిస్టేబిల్‌గా వుండేవాడు. అతడు ఏదో విధంగా లంచాలు పుచ్చుకోని రోజేవుండేది కాదు. ఆ డబ్బుమాత్రం మిగిలేదా! దాంతోపాటు జీతంలో సగం వరకుకూడ అతని త్రాగుడు క్రిందనే వ్యయమయ్యేది. అతడు త్రాగకుండా ఇంటికివచ్చిన రోజేదీ? పూర్తి మైకంతో సుందరమ్మను మోదుతూండేవాడు. సుందరమ్మ అభోజనంగా పస్తులుపడిన రోజులు తరచుగావుండేవి. ఆమె కంత కంతకు దినములు దుర్భరమయాయి. ఒక నాడతడు త్రాగి కైపెక్కి ఇంటికివచ్చి భోజనం పెట్టమన్నాడు సుందరమ్మను. "బియ్యం నిండుకున్నాయి, ఎవరూ అప్పియ్యమన్నారు" అందామె. ఒళ్లు తెలియని మత్తుతో ఆమెను చావమోది బయటకు పోయాడు.

ఆమె కంతటితో ఆ బ్రతుకు దుస్సహమనిపించింది. అదిగాక చేతిలో పసికూన మాలతిని బ్రతికించటానికైనా ప్రయత్నించాలని తలచిందామె. ఆ బాధలనుభవించే కన్న ఏ పనిచేసినా మంచిదే అని నిశ్చయించుకుంది. మరు

క్షణంలో మాలతితోకూడ పరారయింది. నా అనే వాళ్లుంటేగా ఎక్కడైనా! ఉన్నా భర్తను విడిచిందని బుగ్గలు నొక్కుకునే వాళ్ళేగాని కారణం విచారించి ఆదరి స్తారా! మొండి ధైర్యంతో ఆమె కలకత్తాలోవున్న షిబ్పూర్ చేరుకుంది.

ప్రపంచంలో నరకం అనుభవించే కర్మ చేసుకున్న వాళ్లంతా అక్కడ కనిపిస్తారు. అక్కడ వుండే వాళ్లంతా కూలివాళ్లే. అందులోను అతిచవకరకం కూలీలు. అందుకే పనికూడ సులువుగా దొరుకుతుంది. మాన మర్యాదలున్న వాళ్లు ఆ పనుల్లో నెగ్గలేరు. సుందరమ్మ ఒక జనపనార మిల్లులో కూలీగా చేరింది. ఆమె కందేరాళ్లు తినటానికేనా సరిపోయేవి కావు. ముఖ్యంగా మాలతిని గురించి దిగులుగా వుండేదామెకు. మాలతి బాగు కోసం ఎల్లాంటి పనేనా చెయ్యటానికి నిశ్చయించుకుందామె. మొదట్లో చిరునవ్వులతో కొద్ది కొద్దిగా డబ్బు అదనంగా సంపాదిస్తూండేది. క్రమంగా మాలతిని విద్యావంతురాల్ని చెయ్యాలన్న సంకల్పంతో కొద్దిగా వ్యభిచారం చేస్తూ డబ్బు సంపాదిస్తూండేది. చివరకు వ్యభిచారం ఆమె వృత్తి అయింది. మాలతిని విశాఖపట్టణం కాన్వెంటు స్కూల్లోవుంచి ఆమె చదువు కొరకై విపరీతంగా ధనాన్ని ఆర్జించి పంపిస్తూండేది. తన రక్తాన్ని జీవితాన్ని కూడ ధారపోసి మాలతికి డబ్బు పంపుతూండేది. మాలతికి వ్యభిచారంగాని బీదరికంగాని అబ్బకూడదనే ఎల్లప్పుడూ సుందరమ్మ కోరుతూండేది. తనవద్దకు మాలతి వస్తే ఏమనుకుంటుందో అని అవకాశం చూసుకొని తనేవెళ్లి చూసి తిరిగి వస్తూఉండేది.

అట్లా సంవత్సరాలు గడచేయి. మాలతి చదువు, ట్రైయినింగు ముగిసేయి. ఉద్యోగంలో కూడ ప్రవేశించింది. ఇక తనకు ఆ నీచవృత్తితో అవసరంలేదని సుందరమ్మ మాలతి వద్దకు వచ్చేసింది. కష్టజీవి, కాని మాలతి సంగతి ఆమెకు మరింత కష్టాన్ని కలిగించింది. మాలతికి విలాసాలంటే సరదా. ఉద్యోగం సంపాదించుకుంది. ఇల్లంతా అందమైన వస్తువులతోటి సోఫాలతోటి నంపేసింది. తృప్తిగా భోజనంచేస్తుంది. విలాసజీవిత కాంక్షలకు తన సౌశీల్యాన్ని ఆహుతి జేసింది. ఒక్కొక్కనాడు సినీమాలకీ పార్కులకి వెళ్ళి చాల ఆలస్యంగా వస్తూంటుంది. సుందరమ్మ కిదంతా మళ్లీ దుఃఖకర సంఘటన. తన కందుతూన్న జీతంతోనే కాలంబుచ్చుచూ, పెళ్ళి చేసుకొని మర్యాదగా ప్రశాంతంగా జీవించకూడదా అని విచారించింది. అయినా గట్టిగా చెప్పటానికి సాహసించ లేదు. తనలో తానే బాధపడి క్రుళ్లుతోంది. పరిస్థితులకి లొంగిపోయిన మాలతికి తల్లి చూచాయగా యిస్తూన్న అభిప్రాయాలు తలకెక్కలేదు.

ఆ మరునాడు మాలతి తనయింట్లో ఒకరికి విందు చేయబోతుంది. పోలీసు సబిన్స్పెక్టరుగారని చెప్పిందామె తల్లితో. అతని సిఫారస్‌తో ఆమెకు ఆరునెలల్లోనే డబుల్ ప్రమోషన్ సంపాదించింది. అందుకు బహుమానంగా అతనిని ఆ నాటిరాత్రి తనయింటికాహ్వానించింది. లంచములు పుచ్చుకొనుటలో మంచి అనుభవశాలి ఆ పోలీసు సబిన్స్పెక్టరు.

సాయంత్రం ఆరుగంటలయింది. గదంతా అలంకరించి అతనికోసం ఎదురు చూస్తోందిమాలతి. ఆయన వచ్చేవేళకు అన్నీ తయారుచేసి పంపాలని ఆదేశించింది సుందరమ్మకు. ఇంతలోనే ఆయన వచ్చేడు. తలపండుతోన్నా పడుచుతో ఆనందించాలని ఆశతో వున్నాడాయన. ఫలహారంతిని కబుర్లలోకి దిగాడు. లోనున్న సుందరమ్మకు కడుపు తరుక్కుపోతోంది. ఈ వ్యాపారం నుంచి మాలతిని ఎల్లా తప్పించాలో ఆలోచిస్తోంది. గదిలోనుంచి పెద్ద నవ్వొకటి విని అదరి పడింది. అది తనకు పరిచితమైన కంఠమల్లె వినిపించింది. ఎవరో అని గదివద్దకువచ్చి లోనికి తొంగిచూచింది

"మాలతీ "అని ఆమె కేకవేసి క్రింద పడింది. మాలతి ఒక్కగంతులో తల్లివద్దకు వచ్చింది. అప్పటికే సుందరమ్మ గుండె ఆగిపోయింది. అతి కష్టంతో "ఆయన మీనాన్న" అని అసువులను బాసింది.





## గోధుమ ఖాజాలు

అరపడి గోధుమ పిండి మెత్తగా జల్లించి దానిలో ½ చెటాకు నెయ్యిమరగబెట్టి పోసి ఆ పిండిని నీటిలో రొట్టెల పిండివలె ముద్దగ కలుపవలెను. ఆ ముద్దను 2 గంటలు నానబెట్టి తరువాత రోటిలో పెట్టి దంచవలెను. ఈ దంచిన పిండిని చిన్న చిన్న వుండలుగ చేయవలెను. ఈ వుండలను పూరీల పీటపై పూరీమాదిరిగవత్తి దానిపై నేయి రాసి ఆ పూరీని మణచి మరలవత్తి అదే విధముగ నేయిరాసి ఈ విధముగ నాలుగు అయిదు సార్లువత్తి ఆ వత్తిన పూరీని మణచి కత్తితో ఒక పూరీని 2, గాని 3 గాని ముక్కల క్రింద కోయవలెను. ఒక పొయ్యిపై బాణలిపెట్టి దానిలో నూనెగాని నేయిగాని మరగకాచి, అది మరిగిన వెంటనే ఈ ముక్కలు వేయించవలెను. ఒక పొయ్యిపై కళాయి పెట్టి దానిలో శేరు గోధుమపిండికి 15 పలముల పంచదార పోసి కొంచెము ముదరపాకము పట్టవలెను. పాకము వచ్చిన తరువాత ఈ వేగిన ముక్కలను దానిలో వేసి బాగా కలుపవలెను. క్రిందకుదించి వేరే పళ్ళెములో ఈ ముక్కలన్ని విడివిడిగ వుంచవలెను. చల్లారిన తరువాత తినిన ఎంతో రుచికరముగ నుండును. గాలిజొరని డబ్బాలోవేసి మూత పెట్టిన ఎన్ని రోజులయినా వుండును.

## గోధుమ హల్వా

ఒక పావుసేరు గోధుమలు తొలి రోజు రాత్రి నీటిలో నానపెట్టి, మరుచటి దినము వాటిని బాగుగా కడిగి మెత్తగ రుబ్బవలెను. ఆ రుబ్బిన పిండిని గుడ్డలోగాని మెత్తని జల్లెడలోగాని పిండిన పాలు వచ్చును. ఆ పాలు వేరే వుంచవలెను. ఒక పొయ్యిపై కళాయి పెట్టి దానిలో 2 పావుసేర్లు పంచదారవేసి ఒక చెటాకు నీరుపోసి ముదర పాకము తీయవలెను. పాకము వచ్చిన తరువాత ఈ పాలు దానిలో పోసి కలుపవలెను. తరువాత 1 పావుశేరు నెయ్యి దానిలో పోసి అడుగు మాడిపోకుండా కలుపవలెను. కొంత సేపయిన ఈ పాలు నెయ్యితో వుడికి ముద్ద మాదిరిగ అగును. అప్పుడు, జీడి, బాదము మొదలగు పప్పులు కిస్‌మిస్‌పళ్ళు, ఎసెన్సు కొంచెము రంగువేసి బాగా కలుపవలెను. గిన్నె కంటుకొనకుండ వుడికిన తరువాత ఒక పళ్ళెమునకు నేయిరాచి దానిలో ఈ ముద్దను పోయవలెను. చల్లారిన వెనుక ముక్కల క్రింద కత్తితో కోయవలెను. ఇది తినుట కెంతో రుచికరముగ నుండును.

## గోధుమ గువ్వలు

గోధుమపిండి ఒకశేరు మెత్తగ జల్లించి, దానికి తగు మాత్రము వుప్పు జీలకర్ర నెయ్యివేసి నీళ్ళతో రొట్టెలపిండి వలె కలుపవలెను. ఆ కలిపిన పిండిని ఒక పూట నానబెట్టి తరువాత రోటిలోవేసి దంచవలెను. ఆ దంచిన పిండిని చిన్నచిన్న వుండల క్రిందచేసి ఆ వుండలను బొటన వేలు గోటితోనొక్కిన గువ్వలవలె నుండును. వాటిని నేతి ఎసరు పెట్టి దానిలో వేయించవలెను. చిన్న పిల్లలకు పెట్టిన జబ్బు చేయదు. గాలిరాని డబ్బాలో పెట్టివుంచిన ఎన్ని దినములయిన వుండును.

## గోధుమ కజ్జికాయలు

గోధుమపిండి మెత్తగ జల్లించి దానిలో 2 చెంచాలు నెయ్యి మరగబెట్టిపోసి, నీటిలో రొట్టెల పిండివలె కలిపి పూరీలువత్తి వుంచవలెను. శేరుపిండికి 2 కొబ్బరి కాయలు చొప్పున కోరి దానిలో ½ వీశె పంచదార కలిపి ఒక

గిన్నెలో నెయ్యి 2 చెంచాలువేసి దానిని పొయ్యిపై పెట్టి మరిగిన వెనుక ఈ కొబ్బరివేసి మూత పెట్టవలెను. 10 నిమిషములయిన వెనుక దానిని కలుపవలెను. అటుల వుండ కట్టేవరకు కలుపవలెను. వుండకట్టిన వెనుక దించి చల్లారిన తరువాత చిన్న చిన్న వుండలు చుట్టి ఈ పూరీలలో పెట్టి పూరీని దగ్గరగ అణచి బొటనవేలితో నొక్కిన వంకీలు వచ్చును. లేదా కజ్జికాయల గొట్టములో పెట్టి నొక్కిన నగిషీ వచ్చును. అప్పుడు నూనెగాని నేయిగాని ఎసరుపెట్టి వేయించవలెను. ఈ కొబ్బరికాక నువ్వుపప్పుకూడ వేసెదరు. శేరు పిండికి $\frac{1}{2}$ శేరు నువ్వులు వేయించి దానిలో $\frac{3}{4}$ శేరు పంచదారపోసి రెండు మెత్తగదంచి ఆగుండ చెంచాడు పూరీలోవేసి పైవిధముగ నొక్కి వేయించవలెను.

### వేరు సెనగపప్పు పాకం

వేరు సెనగలు బాగా వేయించి దాని పొట్టు తీసి వేరే వుంచవలెను. ఒక బాణలి పొయ్యిపైపెట్టి, శేరు పప్పుకి $\frac{1}{2}$ వీశె బెల్లం దానిలో పోసి $\frac{1}{2}$ చెటాకు నీటిని పోసి వుండ పాకము వచ్చునట్లు చూచి అప్పుడు ఈ పప్పును దానిలో పోసి బాగా కలిపి తరువాత క్రిందకుదించి ఒక పళ్ళెములో పోసి అది చల్లారిపోకుండ వుండలు కట్టవలెను, లేదా అచ్చు మాదిరి కావలసిన అటులనే వుంచవలెను. ఈ బెల్లముతో పాకము పట్టినపప్పు తినిన జబ్బుచేయదు.

### వేరు సెనగపప్పు పచ్చడి

వేరు సెనగపప్పును ఎఱ్ఱగా వేయించి పైతోలు తీసి వుంచవలెను. దీనిలో $\frac{1}{2}$ శేరు పప్పుకి చెటాకులో నాలుగో వంతు వుప్పు 10 ఎండు మిరపకాయలు, 5 పచ్చి మిరపకాయలు కొంచెము యింగువ, చింతపండు కొంచెము వేసి, అన్నిటిని మెత్తగ రుబ్బవలెను. ఒక అర చెంచా ఆవాలు, 1 చెంచా మినపపప్పు, 2 ఎండు మిరపకాయ ముక్కలు కరివేపాకు, నూనెలోవేసి వేగుతున్న పోపులో 2 తెల్ల వుల్లిపాయలు, 10 నీరుల్లిపాయలు సన్నగ చెక్కి తరిగి వేయవలెను. ఇవన్నీ వేగిన తరువాత ఆ పచ్చడిలో కలుపవలెను. ఇది అన్ని పప్పుల పచ్చళ్ళవలె రుచికరమైనది.

—రా. లక్ష్మి.



## లోకోక్తులు

1. వచ్చీరాని మాటలు రుచి, ఊరీ ఊరని ఊరగాయ రుచి.
2. వచ్చేకాలము కన్నా, వచ్చిన కాలము మేలు.
3. లక్షణాలుగల బావగారికి రాగిమీసాలు, అవలక్షణాలుగల బావగారికి అవీ లేవు.
4. లేక లేక లోకాయిపుట్టే, లోకాయి కన్ను లొట్టపోయింది.
5. రాజు భార్య మేడ ఎక్కితే, కుమ్మరివాడి కోడలు గుడిసె ఎక్కినది.
6. కొంగు తడిస్తే తడిగాని, కోకంతా తడిస్తే ఏమి చలి ?
7. శంఖులోపోస్తే తీర్థము, పెంకులో పోస్తే నీళ్లు.
8. వ్రాత రాజ్యమేలవలెనని వుంటే, గ్రహచారము గాడిదలు మేపవలెనని ఉన్నదట.
9. వెయ్యి వరహాలుపెట్టి ఏనుగను కొనుక్కొని, అరవీసం అంకుశానికి పాలుమాలునా.
10. విత్తముకొద్దీ విభవము, విద్యకొద్దీ వినయము.
11. వాడి తండ్రీ మా తండ్రీ సయాం మొగవాళ్లు.
12. విన్నవి అన్నీ విశ్వసించవద్దు. విశ్వసించినవన్నీ వెలిబుచ్చవద్దు.

# ఒక రోజు

ఆ రోజు ఆదివారం. కాలేజీ లేదుగదాని నా మిత్రుడు శ్రీనివాసాన్ని కల్సుకుందామని అతని గదికి వెళ్ళాను.

నేను వెళ్ళేటప్పటికి మిత్రుడు శ్రీనివాసన్ చక్కగా డ్రెస్సువేసుకొని, సోఫాలో కూర్చుని, ఆ రోజుటి ఆంధ్రప్రభ చూస్తున్నాడు. పేజీలను త్రిప్పుతూ సిగిరెట్టు పొగ రూమునిండా నింపుతున్నాడు. నన్ను చూడగానే చదువు వదలి, "సినిమాకు వెళదాం పదవోయ్" అంటూ లేచి నిల్చున్నాడు. అంతలోనే నేను మరొక కుర్చీలో కూర్చొని ఆంధ్రప్రభ చదవటం ప్రారంభించాను అతను మరొక సిగిరెట్టు కాల్చి, సోఫాలో కూర్చున్నాడు.

ఆంధ్రప్రభ చదువుతున్నాను. దానిలో చాలవరకు ఒక వైపు ప్రధాని నెహ్రూగారికి విదేశాలలో అఖండ స్వాగతాలు. మరోవైపు ఆంధ్రదేశమంతటా, తుఫాను, ముఖ్యంగా కృష్ణ, గోదావరి జిల్లాలలో ఘోరమరణాలు, గుండెలవిసి పోయేటట్లు కనుపించే పెద్ద పెద్ద చిత్రాలు, వేలకొలది ఆంధ్రప్రజలు అటుతుఫాను, ఇటు వరదలకు గురై, నిలువ నీడలేక, చెట్లక్రింద, గొప్పవారి భవనాల పంచలలో తల దాచుకుంటున్నారు!

బాగున్న రేషన్ రోజుల్లోనే తిండి సరిగా లేదు. ఇక యీ భీభత్సంలో ఎక్కడున్నుండి వస్తుంది? ప్రభుత్వం వారు తమ శక్తివంచన లేకుండా, అన్ని విధాల తోడ్పడుతున్నారు. అసలే తిండిలేక మలమలమాడుతున్న ఈ రోజులలో నవధాన్యాలుపండే ఆంధ్ర ప్రాంతంలో, అందులో ధాన్యం సమృద్ధిగా పండే జిల్లాలలో సర్వనాశనం జరిగింది.

ఎందరు తల్లులు, తమ బిడ్డలను కానక, అల్లాడుతున్నారో! ఎందరు యువతులు, తమ భర్తలకు దూరమై విలపిస్తున్నారో! ఎన్ని వందల నోరులేని పశువులు తమ లేదూడలను కానక తలెత్తి అరుస్తూ కన్నీరు కారుస్తున్నయో!

ఎంతమంది స్వార్థపరులు, అదనుచూచి, తమ యినుప పెట్టెలను నింపుతూ పేదలరక్తాన్ని పెట్టెలకు తిలకమిడుతూ మంగళ హారతులిస్తున్నారో! పాపం, జవసత్వము లుడిగి పోయి వృద్ధజీవులు నోరులేని పసిపాపలు, చలి గాలిలో చెట్లక్రింద ఎంత పెట్టున రోదన చేస్తున్నారో! అనే ఊహలన్నీ నాలో బయలుదేరి, ఏమీ చేయలేని నా హృదయాన్ని దహించివైచి, నా కంటవెంట రెండు నీటి చుక్కల్ని మాత్రం రాల్చ గలిగినాయి.

అది గమనించిన నా మిత్రుడు, విచిత్రంగా నా వైపు చూస్తూ "ఏమిట్రోయి?" అన్నాడు. నేను హీనంగా అతని వైపుచూస్తూ "ఆంధ్రదేశంలో తుఫాన్" అనే పెద్ద అక్షరాల వరుసను చూపించాను. అందుకతను ఏ మాత్రం సానుభూతి చూపలేదు సరి, గదా ఒక విధంగా నవ్వి "అందుకని నీవు విచారించటమెందుకు? నీ బంధువు లెవ్వరైనా...? సరేలే, సినిమాకు వెళదాం" అంటూ లేచి నిలుచున్నాడు. దానికి నాకు అట్టే ఆశ్చర్యం కలగలేదు. ఎందుకంటే అతను పెద్ద ధనవంతుని కుమారుడు, ధనవంతులకు వుండవలసిన సహజ స్వభావము అది గనుక. అందుకే కోటి ఆంధ్రులు అలా బాధలు పడుతుంటే ఎంతైనా సహకరించ గలిగిన అతను నిర్లక్ష్యంగా అలా ఒక నవ్వు నవ్వాడు.

అతను, తన ఆనందం కొరకు ఎంత డబ్బు ఖర్చు చేయటంలేదు? ఎన్ని విధాలుగానో వేలకు వేలు ధనం పాడు చేస్తుండటం లేదు? మొన్న తన సమ ఉజ్జీ అయిన స్నేహితుని గృహప్రవేశానికి వందలకు వందల రూపాయలను వ్యయపరచి కానుకలు పంపలేదు? తుఫాను పీడితులకు ఇతను ఎందుకు సహాయం చేయగూడదు? ఇలాంటి వారందరికి పేద ప్రజలమీద ప్రీతిగలిగితే ఎంతబాగుండేది? అనుకుంటూ అతన్ని చూచి, "ఏ మోయ్ శ్రీను! ఈ సమయంలో నీ వెంతైనా సహాయం చేయగలవు, ఏదో నీకు తోచింది, కొంత ధనంకాని, ధాన్యంగాని, సహకారసంఘానికి అందజేయి!" అని ప్రార్థన పూర్వకంగా చెప్పాను. దానికి తను తన విలువైన కోటుసర్దు కుంటూ,

"మన కెందుకోయి-యీలేని పోని బాధ. ఏదో గవర్నమెంటు తంటాలు పడ్తారులే." అని ఎంతో సులువుగా అన్నాడు.

నువు చేసేది చేయి, నీవు చేస్తానంటే గవర్నమెంటు వద్దంటుందా!

"మనం పిచ్చివాళ్ళం. పెద్దవారుండగా మన కెందు కొచ్చిన శోభ! మా ఫాదర్ ఒప్పుకోడోయ్"

తనకేదో మహాదయ ఇతరులమీద ఉన్నట్లు ఒక వెధవ నవ్వు నవ్వి "కమాన్" అంటూ నన్ను తన చిన్న కారులో కూర్చోపెట్టుకున్నాడు. సినిమాకు టైం అయి పోయిం దంటూ, వెల్లింగ్‌టన్నులో స్ట్రేంజిబ్రదర్సు, మ్యాటినీకి వెళ్దాం అని అక్కడికి దారితీశాడు.

నాకేమీ మతిపోక కారులో కూర్చుని యున్నాను. అప్పుడేకారు సినిమాహాల్ని సమీపించింది. కారు ఆగీ ఆగక మునుపే, ఇరువురు యువతులు, సుమారు మూడు గంటల కాలంలో, ఎర్రని ఎండలో దిగజారిపోయే చెమటతో, ఎండ వేడికి కందిపోయిన లేత ముఖాలతో, మావద్ద కొచ్చి ఒక నోటీసు మా చేతి కిచ్చారు. చూశాను. ఏ సమస్య నన్నంతవరకూ ఎదుర్కొని, ఏమీ చేయలేని నా మనస్సును దహించివైచిందో, అదే సమస్య...ఆ నోటీసులో ఉంది... "ఆంధ్రలో తుఫాన్ పీడితుల సహాయార్థం విరాళం," ఆ వసూలు చేసె బాలికలు, మహిళా సంఘం వారని నాకు వెంటనే అర్థమయింది. నాకు తెలియకుండగానే నా చేయి చొక్కా జేబులోకి పోయి రాగి కానీయైన దొరకక, వెంటనే కిందికి జంచుక పోయింది. కుంగిపోయే ముఖంతో శ్రీనివాసాన్ని చూచాను.—అతని దృష్టి పాపం అమాయికంగా నిల్చొని, మరెవరన్నా ధర్మాత్ములు వస్తారే మోనని నలువైపుల చూస్తున్న చెల్లెంద్ర అంగసౌష్టం మీద కు సోకుతుంది. ఆ దృశ్యానికి, నావల్లు మండిపోయి గభా మని, "ఏమిటోయ్?... ఆ చేసే సహాయమేదో త్వరగా చేయి, పాపం వెళతారు." అన్నా దాని కతడు తృళ్ళిపడి మయికంలోనుండి లేచి, నోటీసు యువతుల కిచ్చి...ఏమీ లేదన్నట్లు పెదవులు విరిచి, వికపు నవ్వొకటి నవ్వి నావైపు చూశాడు. ఆ యువతులు తమ ధర్మ డబ్బాలను నావైపు చూపారు. ఏం చేయను? వారిసహనానికి, అబలలైకూడా శ్రీనివాసన్‌లాంటి విపద్వృష్టుల్ని ఎదుర్కొంటూ, ధైర్యంగా తోటి మానవులకు, పేద ఆంధ్రుల సేవాకార్య దీక్షకు, ఎంతో పొంగిపోతూ, వారికి సహస్ర ధన్యవాదాలన్నట్లు ప్రేమ సూచకంగా తలవంచి, ఒక్క నమస్కారం మాత్రం చేయగలిగాను. ఆ యువతులు నా అసహాయతకు కొంత బాధపడి, చిరు నవ్వుతో, ఉషారుగా, మరొకచోటకు వెళ్ళి ఇలాగే యాచిస్తున్నారు. దానికి నాకు వల్లుపొంగి పోయింది. నాకూ ఒక చెల్లెలుంటే "ఇలాగే" పంపి, నా చెల్లిగూడా, తోటి మానవులకు సహాయం చేయగలుగుతుందని ఎంతో గర్వపడే వాడ్నే! నడిస్తేనే అలసి పోయే అబలలు; తుఫాన్ పీడితుల సహాయార్థం, అలా ధైర్యంగా పదిమంది మగవాళ్ళలోకి వచ్చి తమకార్య దీక్షను కొనసాగిస్తు న్నారు.

వారికి కొంతదూరంలో మరొకజట్టు ఇలాగే ధర్మ డబ్బాలతో వసూళ్లు చేస్తున్నారు. అప్పటి నా స్థితి శ్రీనివాసాన్ని చూచి నవ్వాలో ఏడ్వాలో బోధ పడలేదు. అంతలోనే అతను, తన రిజ్వరు చేసిన టిక్కెట్టు తీసుకొని నాకు ఇంకొక టిక్కెట్టు తీసుకోమని కొంత డబ్బు నా చేతి కిచ్చాడు. తీసుకొన్నాను... ఎంతిచ్చాడో కూడా చూడ లేదు; డబ్బు చేతిలో పడగానే పరమానదంతో నా కాళ్ళు ఆ యువతుల వద్దకు పరుగెత్తాయి. అంత కన్నా వేగంగా నాచేయి, ఆ ధర్మడబ్బా మీదకు పోయింది...రిక్త హస్తా లతో తిరిగివచ్చి శ్రీనివాసన్‌తో "నేను సినిమాకు మాను కున్నానోయ్! నేనుగూడా వచ్చాననుకొని నీవు ఒక్కడవే వెళ్ళ"మని గబగబా ఇవతలకు వచ్చాను. నడుస్తున్నాను. దారి పొడుగునా, అదే ఆలోచన. "నా కంటె, చెల్లెంద్ర యిన ఆ యువతులే కొన్నిరెట్లు మేలు. వాళ్ళందరు వారి వారి శక్తికొలది కష్టజీవులకు సహాయం చేస్తున్నారు...ఎంత సంతోషం ఎంత పట్టుదలతో తమ కార్యాన్ని కొనసాగిస్తు న్నారు? భేష్,..." ఇలాగే అనుకుంటూ, నేను, నాతోటి ఆంధ్రులకు కొంత సహాయం చేయగలిగాను గదాని సగ ర్వంగా, ఆనందిస్తూ, నా రూము చేరాను—

—సోమ్.



# మీ ఆరోగ్యానికి సేవించండి

బోర్న్ వీటా పాలపానీయాల కంటె ఎంతో ఉత్తమమైనది. శక్తిని కలిగించే విటమినులు మరియు క్యాలిషియం కల్గి ఉంటుంది. ఆటగాళ్లకు, దుర్బలులకు కూడా ఆదర్శమైనది. దాని చాకొలేట్ రుచిని పసిబిడ్డలు కోరతారు. ఒక కప్పుడో, గ్లాసుడో వేడి లేక చల్లని పాలలో రెండు టీస్పూనులు పొద్దున్నా సాయంకాలమూ తీసికొనండి.







ఆరోగ్యవృక్షం




కాడ్బరీస్

## బోర్న్ - వీటా

క్యాల్షియం మరియు ఎ, డి విటమినులతో నిండి ఉన్నది.

కాడ్బరీ - ఫ్రై (ఇండియా) లిమిటెడ్

P. B. 1417, బొంబాయి - P. B. 251, కలకత్తా - P. B. 1725, మదరాసు.

# స్త్రీ, స్త్రీశిక్షణ

**శ్రీ కోడే అనసూయ**

స్త్రీ పురుషుని అర్ధాంగియున్ను, సహచారిణియున్ను, ధర్మమునకు, సుఖమునకు మూలాధారము. ప్రతివ్రతయైన స్త్రీ స్వర్గకవాటమునకు తాళపు చెవివంటిది. అనుకూలమైన స్త్రీ ఏకాంత స్థలమున సహచరుడుగాను, వుపదేశమిచ్చుట యందు తండ్రిగాను, ఆపదకాలమున తల్లినిబోలి, జీవిత కారడవిలో విశ్రాంతి స్థలముగాను, వుపయోగపడును.

"మహా భారతము"

స్త్రీకి ఆదరమెక్కడైతేవుందో అక్కడ దేవతలు ప్రసన్నులగుదురు. ఎక్కడవారు నిరాదరణపాలగుదురో, అక్కడ హోమయజ్ఞములు మొదలైనవి నిష్ఫలమగును. ఏ గృహములో స్త్రీకి అవమానవమగునో ఆమె శాపమువల్ల ఆ కుటుంబము నాశన మగును. ఏ ఇంట్లో భార్య, భర్తలు అనుకూలురై తృప్తిగలిగియుందురో, ఆ ఇల్లు ఎల్లప్పుడు సకల భోగ భాగ్యాదులతో నిండియుండును.

భార్య, భర్తలు తంబురయొక్క రెండు తీగలు. ఈ రెండు కలువకుండా మధురమైన స్వరము రానేరదు. కనుక స్త్రీ సహకారముతో పురుషుడు ప్రపంచ సంబంధములైన అనేక కఠిన కార్యములను నెరవేర్చగలడు.

"మను చరిత్ర"

పైనవ్రాసిన విషయములనుబట్టి స్త్రీకి విద్యా బుద్ధులు చాలా అవసరము. వెనుక మన మహాత్ములేగాక నేటి మన పూజ్య బాపూజీకూడ వప్పుకున్నారు.

స్త్రీకి విద్యా బుద్ధులవల్ల, ఇతరులకు మంచి సలహాల నిచ్చుట, ఆపత్కాలములందు ధైర్యము చెప్పుటకు, ఇంకా కోమల హృదయులైన, బిడ్డల శిక్షణ పోషణలలోను, బిడ్డలకు సత్యమునందు రుచి, అసత్యమందు అసహ్యము, చదువు సంధ్యలయందు వుత్సాహముల నిచ్చుటకు, సమర్థురాలగును.

పిల్లలు పెద్దవారైన పిదప, గుణవంతులనుగాను, విద్యగల వార్లనుగాను చేయలేరు.

ఉదా :- ఒక విద్వాంసుని, ఎవరో అడిగారట, పిల్లల శిక్షణ ఎప్పటినుండి ఆరంభము చేయవలయునని.

వాళ్లు పుట్టుటకు ఇరువది సంవత్సరముల ముందని దానికి ఆ విద్వాంసుడు బదులు చెప్పెనట.

అర్థమేమంటే-పిల్లవాని ముందు తల్లి నేర్పరి కావలెనని.

పిల్లలను తల్లితండ్రుల చేతులలో దేవుడు, అప్పగించిన సొమ్ము. పిల్లవాని మనసు, మైనముకంటే మెత్తనైనది. భూమిలో, ఏ విత్తనము నాటినా మొలకయెత్తి, పెరిగి, పెద్దదై పూలు కాయలు కాయుమాదిరి మనము పిల్లలను ఏ విధముగా చేస్తే అదే మాదిరి అగుదురు కనుక చదువు సంధ్యలు చెప్పించుతూ, సమయమున్నప్పుడల్లా, తల్లిదండ్రులు చేయవలసిన విధులు :—

మంచి, చెడ్డ వ్యత్యాసములు వుదాహారముగా చూపించి, పిల్లల హృదయములు, సత్యము, శీలము, క్షమ, సంతోషము, దానము, భగవత్ భక్తి, ఇటువంటి వానిని ఆకర్షించునట్లు చేయవలయును.

ఇంకా, అబద్ధము, క్రోధము, విరోధము, ఆశ, అహంకారము, మొదలైనటువంటివానియందు, అసహ్యత కలిగించవలయును.

ఏ తల్లి దండ్రులైతే, ఈ విధులను నెరవేర్చరో, వారి బిడ్డలు చెడుటకు, వారే బాధ్యులగుదురు ; అందూ ముఖ్యముగా తల్లి.



# తల్లి ప్రేమ

(క థా ని క)

మూలం : ఉషాదేవీమిత్రా :: అనువాదం : చింతగుంట హనుమంతరావు

అది ఒకరమ్యమైన సౌధం. బడలిన దేహాన్ని తన అధీనంలో వుంచుకొని ఆ సౌధ ద్వారం దగ్గరకు వెళ్లి నిలబడ్డది సుశీల. గేట్ దగ్గరే ఓ మోటార్ కారు ఆగివుంది. దాంట్లో నుండి ఆభరణాలంకృతులైన యిద్దరు యువతులు దిగారు. సుశీల నమస్కరిస్తూ, " ప్రొద్దుటనుండి పిల్లలాకలితో మలమలామాడి పోతున్నారు. ఒక పిడికెడు బియ్యం పెట్టించండమ్మా "అంది మాటల్లో దైన్యభావం వుట్టిపడేటట్టు.

" దూరంగా పోవే ముష్టిదానా! తాకకుండా జాగ్రత్తగా చూసిరా ఊర్మిళా. ఈ ముష్టిదాన్ని మెడపట్టి గెంటిద్దామంటే గేట్‌కీపర్ యెక్కడ తగల బడ్డాడు? " కనుబొమలు చిట్లిస్తూ వొకావిడఅంది.

అవమానంతో క్రుంగి పోయింది సుశీల. భిక్షుకురాలయినా అందరిలా ఆమెకు హృదయంలో ప్రేమ, దయ, చింత, ఆత్మాభిమానము, యివిగాక అరిషడ్వర్గాలు అంటూవున్నై. నిరంతరమివే కావు. కొన్నిమార్లామె దీన హృదయంలో ప్రశ్న పరంపర జనించేది—భర్త లేనంత మాత్రాన స్త్రీ ముష్టిదయ్యేట్లైతే దైవమామెపతి నామెనుండి యెందుకు వేరుచేయడం? దారిద్ర్యమే అత్యంతం ద్వేషించ తగ్గదయితే తన ఐశ్వర్యాన్నంతా ఆ యీశ్వరు డెందుకులాక్కోవాలి? సంఘం తన సంతతి కోసం సహాయం చేయక పోగా తన్ను యేవగించుకోడానికి, నిందించడానికి, తన్ను గురించి ఆడిపోసుకోడానికి దానికెలాటి అధికారమువుంది? మానవురాలేయైనా తనెందుకు అస్పృశ్యయైనది? ఈ ప్రశ్నల, కారణంగా ఆమె గంటల తరబడి వ్యాకులంగా వుంటూండేది. బహుశః తన దారిద్ర్యాన్ని గూర్చి వినేవాళ్లీ ప్రపంచంలో యెవరూ లేరేమోనని ఆమె సందేహం. అందువల్లే తన కష్టాలెవరితోను చెప్పుకోకుండా తన భావాలను తనలోనే అణచుకునేది.

సుశీల రూపసి. ఏ ద్వారం వద్దనిలుచున్నా ఆమె సౌందర్యాన్ని ప్రశంసించకుండా యెవరూ సాగిపోయే వారుకారు. కొంతమంది ఆమెతో పరియాచకాలాడజూచేవారు. హస్తాలతో ముఖం కప్పేసుకుని వెనక్కుపరిగెత్తేది. అంతఃకరణలో హాహాకారం ఉద్భవించేది. హృదయం చింతాక్రాంత మయ్యేది. కాని ఆమె ముష్టిది, అందరూ ఆమెను భిక్షుకురాలనే పిలిచే వారు. మాధుకరమే ఆమెవృత్తి.

ఆ యువతియొక్క కఠిన ముఖాన్ని చూసి వెనక్కుతప్పుకుందామనుకుంది సుశీల. రెండవవనిత పరిహాసంగా "ముష్టెత్తుకు జీవిస్తున్నావ్, నీకు పిల్లలుకూడానా "అంది.

ముఖంలో ఆశాతటిల్లత మెఱయగా, " ముగ్గురు పిల్లలున్నారమ్మా "అంది సుశీల.

" తిండిలేకుండా ముగ్గురు పిల్లల తల్లి వెందుకయ్యావ్ ?"

సుశీల మెల్లమెల్లగా వెనక్కి తప్పుకుంది.

*　　*　　*

సుశీలకు ముగ్గురు పిల్లలుతప్ప యీ విశాల ప్రపంచంలో తనవారని చెప్పుకోడాని యెవరూ లేరు. పట్టణంలో ఒక మూల జీర్ణమైన గుడిసె ఆమె గృహం. సుఖ దుఃఖాలకు ఆశ్రయం, దినావశేష ఆనంద విశ్రామమది.

వసంత కాలంలో గుడిసె లోపల ఆగ్నేయ వాయువు విచ్చలవిడిగా సంచరిస్తుంది. శీతాకాలంతో ఆ గుడిసెలో వుండే చల్లదనం హిమాలయ ప్రాంతాన్ని స్మరింప చేస్తుంది. వర్షర్తువులో లోపల విరామం లేకుండా కురిసే వర్షధార ప్రళయాగమనాన్ని స్ఫురింపచేసేది. పిల్లలను తన హృదయానికి హత్తుకుని ప్రభాతంకోసం ప్రతీక్షించేది సుశీల.

రోజులు ఒకే విధంగా గడుపుతోంది సుశీల. జీవితంలో పరివర్తనకాని, నూతనత్వంకాని, ఆమోదంకాని లేదు. పేద

రికంతో పోరాడ్డం, కష్టాలను ధైర్యంతో యెదుర్కోవడం, దారిద్ర్యసమక్షంలో ఆత్మాభిమానాన్ని త్యాగం చేయడం తప్పేవికావు. ఉదయంనుండి సాయంకాలం వరకు ఒక యింటినుండి యింకోయింటికి భిక్షార్థం వెళ్లేది. కొన్నిండ్లలో పిడికెడు గింజలు, మరికొన్ని యిండ్లలో రాగినాణాలు దొరికేవి. కొందరు దయదలచి చినిగి పోయిన బట్టలిచ్చే వారు. కొన్నిమాట్లు సుశీలకు చీవాట్లు పడాల్సివచ్చేది. పిల్లలు పగలంతా వీధులంట ఆడుకునేవాళ్లు. సాయకాలం తల్లి కొఱకు యెదురు చూసేవారు. కొన్నిమాట్లు చిన్న చేతులతో ఒకరినొకరు పెనవేసుకుని యేవంతెనక్రిందో పడుకునే వారు. గుడిసెకు తిరిగి రావడంతోనే కరుణా పూరిత నయనాలతో పిల్లల్నొకమాటు చూసి తన పనిలో తను మగ్న మయ్యేది సుశీల.

* * *

సుశీల యెండుటాకులతో నిప్పు రాజేస్తోంది. విమల పిలుపు విని, విచారగ్రస్తమైన దృష్టిని ఆమెపై బఱపి, "ఏమిటి?" అని ప్రశ్నించింది.

"ఈ బియ్యం నీకోసం పంపేరు రంగనాథంగారు" అంది కోమలంగా విమల.

"తెచ్చిందేదో తీసుకెళ్లు నాకు దాంతో అవసరం లేదు. నన్ను, నా పిల్లలను యిలా యెందుకు మాటి మాటికి వచ్చి అగౌరవ పరుస్తావ్?" అంది సుశీల.

"నువ్వింకా చిన్నదానివి, నేను చెప్పేది గ్రహించుకోలేక పోతున్నావ్-ముష్టి యెత్తుకోడంతో యెన్నాళ్లుగడుస్తుంది? తిండి తిప్పలులేకుండా యెలా జీవిస్తావ్? ముగ్గురు పిల్లల నెలా పోషించుకుంటావ్? అనవసరంగా తిప్పలు పడకు. నా యజమాని మాటలు విని బాగుపడు. నువ్వు మా యజమానురాలవవుతావ్. మేమంతా నిన్ను సేవిస్తాం. నీ బిడ్డలు బాగా చదువుకుని పెద్ద వారవుతారు" అత్యంత హితైషిణిలా సుశీలకు బోధించ సాగింది విమల.

"నువ్వావతలకు నడు, నేను పిల్లలను నిద్రపుచ్చుకోవాలి" విమల తెచ్చిన బియ్యపుగిన్నె నవతలికి నెట్టి గుడిసె తలుపు వేసుకుని గొళ్లెంపెట్టుకుంది సుశీల.

గుసగుసలాడుకుంటూ వెళ్ళిపోయింది విమల.

* * *

"అమ్మా, ఆకలేస్తోందే. ఓ పిడికెడు సెనగలైనా ఇవ్వవే, నీ కాళ్లమీద వ్రాలుతాను"

"అమ్మా, అమ్మా, ఊరికే యెందుకున్నావే. ఒక రొట్టి ముక్కయియ్యవే. లేకపోతే చచ్చిపోతాను వేగమియ్యవే" అంటూ యిద్దరు పిల్లలు మారాం చేయ మొదలెట్టారు. మూడవపిల్ల నిర్జీవంగా గుడిసెలో ఒక మూల పడివుంది. మోకాళ్ళలో ముఖం దాచుకుని మౌనంగా కూచునివుంది సుశీల.

సుశీల యోచించే స్థితిలో కూడ లేదు. ఆమె యేమీ వింటూన్నట్లు కూడా లేదు.

"అమ్మా"

హఠాత్తుగా వులిక్కిపడ్డది సుశీల. ఇంకా ఆ మూడో బాలిక మరణించలేదు. దాని సమీపానికి వెళ్లింది. ఇంకా ఆ పిల్ల శ్వాస విడుస్తోనేవుంది. చెవులు దగ్గరకు పెట్టివిన్నది సుశీల. బిడ్డ నిజంగానే శ్వాసవదులుతోంగి. ఇద్దరు బాలురు ఆమెను పెనవైచుకొన సాగారు వారిని వెనక్కి నెట్టేసి బైటికి పరుగెత్తింది.

రంగనాథం యెదుట ఆమె నించునివుంగి. అతడు నోట మాటదక్కి వున్నాడు. తనంతటతను సుశీల తన దగ్గరకు వస్తుందని అతనెపుడూ భావించలేదు.

"నీవా, నీవా సుశీలా! ఇది నిజమేనా? నేను కల కంటం లేదు కదా?" ఆవేశ కంపిత స్వరంతో అన్నాడు నాథం. "నేను సుశీలనే" అధీర అవుతోంది సుశీల.

రంగనాథం చేయి జాపేడు "నా తట్టుజూడు, కన్నులు పైకి యెత్తు" రెప్ప వాల్చని నయనాలతో ఆమె వైపు చూస్తూచూస్తూ రెండడుగులు వెనక్కి వేశాడు నాథం. అతను తలపైకెత్తాడు. తనెవరిని కామిస్తున్నాడు? తల్లిని. సుశీల కన్నులలో తల్లియొక్క ప్రశాంత సౌందర్యం ప్రకాశిస్తోంది. ఆమె సుందర ముఖం తల్లి ప్రేమతో విరాజిల్లుతోంది. ఆమె అంగ అంగంలోను తల్లి ప్రేమ వుట్టిపడుతోంది తల్లి సమ్ముఖంలో రంగనాథం యొక్క అభిలాష తలవంచుకుంది. రంగనాథం చేతులు జోడిస్తూ నిలబడిపోయాడు.



# గ్రంథసమీక్ష



## శ్రీ నాగ మహాశయుని జీవిత చరిత్రము

అనువాదకులు: శ్రీ యుత గోటేటి సత్యనారాయణమూర్తి గారు. చెన్నపురి శ్రీరామ కృష్ణ మఠాధ్యక్షునిచే ప్రచురింప బడినది. వెల రూ. 1-4-0. ప్రతులకు "శ్రీరామకృష్ణ మఠము మైలాపూరు. చెన్నపురి"

మహాపురుషులయిన క్రీస్తు, మహమ్మద్, బుద్ధుడు, మహావీరుడు, రామకృష్ణ పరమహంస, వివేకానంద మొదలైన వారు తమ జీవితంలో ప్రజల జ్ఞానాభి వృద్ధికి, వారి ముక్తి మార్గానికి అపూర్వమైన సందేశాల ద్వారా తోడ్పడ్డారు. వారిలోని మూఢత్వం, అధర్మం, అశాంతిని పోగొట్టారు. ఒక్కొక్క యుగానికి ఒక యుగ పురుషుడు ఉద్భవించి, ఆ యా యుగధర్మములను అనుసరించి తమ సందేశాలతో ప్రజలకు జ్ఞానోదయం కలుగ జేశారు. ఐహిక సుఖములను త్యజించి వారు మహత్తర కార్యములను సాధించుట కొరకు తమ జీవితములను ధారపోసిరి. వీరందరు ఒక మహత్తర లక్ష్యముతో తమ భావములను, ఆదర్శములను ప్రజలకు బోధించి, వాస్తవిక జీవితమును జీవించి ధన్యత గాంచిరి.

శ్రీ నాగమహాశయుడు శ్రీరామకృష్ణ పరమహంసయొక్క శిష్యులలో అగ్రగణ్యుడు. వంగరాష్ట్రమున దియోబొగను చిన్న గ్రామమున జన్మించెను. ఎనిమిదవ యేటను మాతృ విహీనుడాయెను. మేనత్తభగవతిచే అత్యంత ప్రేమతో పెంచ బడెను. చిన్ననాటినుండి పవిత్రముగ జీవించుట అలవరచు కొనెను. మహాశయునకు వివాహము జరిగినది. కాని, కొలది కాలములోనే భార్య స్వర్గస్థురాలాయెను. ఇతను హోమియోపతి వైద్యము నభ్యసించి పేద ప్రజలకు ఉచిత వైద్యము చేసెను. తన జీవితమున ముఖ్యముగ కలవరపెట్టినది తనను పెంచిన మేనత్త భగవతి మరణము. ఆమె మరణాంతము విరాగియై సంచరించెను. ఇది దీన దయాళునికి భయము గలిగించెను. మహాశయుని తండ్రి ఏదో ఒక విధముగ తన కుమారుని సంసారమున తిరిగి ప్రవేశ పెట్టుటకై పునర్వివాహ ప్రయత్నము చేయ తొడగెను. మహాశయుడు మొదట విముఖత తెలియజేసెను కాని తండ్రి మనస్సును బాధ పెట్టుటకు ఇష్టము లేనివాడై పునర్వివాహము చేసి కొనెను. ఇతని ద్వితీయ కళత్రము శరత్కుమారి. ద్వితీయ వివాహానంతరము కూడ, అతను విరాగిగా నుండెను. మహాత్ముడైన రామ కృష్ణుని సందర్శించిన పిదప, అతను ప్రపంచమునకు సంపూర్ణ విముఖు డయ్యెను. ఆ జన్మాంతము భక్తియుత జీవితమును గడిపి, అనేకమంది శిష్యులకు తత్వ బోధకుడాయెను. నాగమహాశయుని జీవిత చరిత్ర అందరు చదువ వలసినది. ద్వితీయ ముద్రణమైకూడ అచ్చు తప్పులు పెక్కు కలవు. శ్రీరామ కృష్ణ మఠము వారు ఇదే విధముగా ఇతర మహాత్ముల జీవిత చరిత్రలను అన్ని భాషలలోను ప్రచురించి ప్రజలకు అందజేసిన బాగుండును.

—జి. ప్రభ.




# అమృతాంజనము

గాని,

" యథాయథా................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్లఁజేయు పూసికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లఁబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!! .

సౌందర్యోపయోగమైన

# ఖటావ్ వాయిల్



ది ఖటావ్ మకన్జీ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెనీ, లిమిటెడ్
మిల్లులు: ఫయ్కళా, బొంబాయి. ఆఫీసు: లక్ష్మీ బిల్డింగ్, బల్లార్డుపియర్, ఫోర్టు, బొంబాయి
బట్టల షాపు: మూల్జీ జేతా మార్కెట్, గోవింద్ చౌక్, బొంబాయి, 2.

SISTA'S KM(S)3 TEL.